# కొంపెల్ల జనార్దనరావు
# జీవితం - సాహిత్యం

సంపాదకుడు

ఏటుకూరి ప్రసాద్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం. 1280
ప్రతులు : 1000

ముఖపత్రరచన :
కె. నాగేశ్వరరావు

సమాచారం సేకరణ :
శ్రీశ్రీ స్మారకసంస్థ,
హైదరాబాద్

వెల : జనప్రతి రు. 25-00
గ్రంథాలయ ప్రతి రు. 35-00

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం, విజయవాడ,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

ముద్రణ
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్
1-1-694/2/ఎ, గాంధీనగర్
హైదరాబాద్ - 500 380

# తీరనిదాహం

మహా ప్రస్థానం అంకితం పుచ్చుకున్న సాహితీ పరుడిగా తప్ప, కొంపెల్ల జనార్దనరావును గురించి, ఆధునికులకు దాదాపు ఏమీ తెలీదు.

శ్రీశ్రీ చే అంతటి గౌరవం పొందిన మిత్రుడు తప్పని సరిగా ఏదో ఒక ప్రత్యేకతను కలిగి ఉండాలి.

1906 లో జన్మించి, 31 వ ఏటనే జీర్ణకోశ క్షయ వ్యాధితో మరణించిన జనార్దనరావు జీవిత విశేషాలు, రచనలు, ఉత్తరాలు, వారు నడిపిన ఉదయిని పత్రికా ఉల్లేఖనలు, మీ ముందుంచటానికి ఎంతో సంతోషిస్తున్నాము.

కవిత్వ మొక తీరని దాహం అన్నారు. కవిత్వం అనే చోట సాహిత్యం అని చేరిస్తే ఆ మాటకు సాకార చిత్రణ జనార్దనరావు.

ప్రాచీన సాహిత్యంలో నిష్ణాతుడై ఆంగ్ల భాషతో పరిచయం పొంది నవ్య సాహిత్య పరిషత్తులో భాగస్వామియై, భారతి పత్రికలో పనిచేసి, అత్యుత్తమ సాహితీ పత్రిక స్థాపన అనే దుస్సాధ్యమైన కర్తవ్య నిర్వహణను భుజాన వేసుకుని ఆ కృషిలోనే అకాల మరణం పొందిన వాడు జనార్దనరావు.

సిద్ధాంత రీత్యా వ్యావహారిక వాది. వచన రచనమాత్రం గ్రాంధికం కంటె గడ్డు. భావ కవిత్వ పరిధి నుండి అభ్యుదయం అనే భావన వైపు కన్నెత్తిన వాడే. ఏ అర్థంలో ఆ మాటను వాడాడో, మాత్రం చెప్పలేము. సామాజిక శ్రేయో భావన, ఆధునిక శాస్త్రీయ దృష్టి లేకపోలేదు. కాని భావాల కంటె రసపోషణకు, పరిశీలనకు ప్రాధాన్య మిచ్చిన సాహితీ విమర్శకుడు.

మల్లంపల్లి, శివశంకరశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి - లాంటి సమకాలీన సాహితీ పరుల అభిమానాన్ని, ఆశీర్వచనాన్ని పొందిన వాడు - జీవించి ఉంటే ఇంకా ఎంతో సాహిత్య సేవ చేసి ఉండేవాడని నాటి రచయిత లందరూ, జనార్దనరావు మృతికి కన్నీరు కార్చారు.

అడుగున పడిన కథలన్నిటినీ తీసిన తర్వాత గాని ఆంధ్ర సాహిత్య పురోగమనం లోని జటిలత్వం, లోతు పాతులు అర్థం కావు.

అట్టి జనార్దనరావు కథను తవ్వి, శ్రమించి, సేకరించి పుస్తక రూపంలో కూర్చిన శ్రీశ్రీ స్మారక సంస్థ కన్వీనర్ శ్రీ ఏటుకూరు ప్రసాద్ ఈ సంకలనం ద్వారా గొప్ప సాహిత్య సేవ చేసిన వారైనారు.

ఈ గ్రంథాన్ని ప్రచురించే అవకాశం మాకు కల్పించినందుకు వారికి, ధన్యవాదాలు.

వై. బలరామ మూర్తి
ఎడిటర్

20-5-87

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
హైద్రాబాద్

# సంపాదకుడి

## పొట్లు - ప్లాట్లు - లోట్లు

ఆ మధ్య కొందరు మిత్రులం మాట్లాడుకొంటుంటే ఓ సాహితీ మూర్తి! "మహా ప్రస్థానం" - ఎంత చెత్త పుస్తకమంటే .... సాహిత్యంలో తలాతోకా లేని ఓ అనామకుడికి అంకిత మిచ్చాడంటేనే దాని స్థానం తెలుస్తుంది" అంటూ అయాచిత విమర్శ పారేశాడు. మేం కంగుతిన్నాం!

అప్పట్నుంచి నా తల్లో పురుగు తొలుస్తోంది. కొంపెల్ల జనార్దనరావ్‌కు సాహిత్యంలో ఏ స్థానం ఉందీ - ఎంత ఉందీ - అని. వాళ్ళనూ - వీళ్ళనూ అడుగుతూంటే "ఏం రాశాడయ్యా!! శ్రీ శ్రీకి మిత్రుడు కనుక అంకిత మిచ్చాడు. మహా ప్రస్థానాన్ని అంకిత మివ్వకపోతే కొంపెల్లను తల్చుకొనే వాడుండే వాడు కాదని" - అంటూ అరంభించారు. ఏదో ఒక ప్రక్రియలో నిష్ణాతుడు కాకపోతే - ఏదో ఒక ఉద్యమంలో ప్రముఖుడు కాకపోతే - ఏదో ఒక సాహిత్య తాత్విక చింతనలో, తనదైన అలోచనను పంచినవాడు కాకపోతే - శ్రీశ్రీ ఎందుకు 'మహా ప్రస్థానం' లాంటి దాన్ని అంకిత మిస్తాడు. అది గ్రంథ రూపం తీసుకొన్న కాలానికి సాహిత్య రంగం - రాజకీయ రంగం - తాత్విక రంగాలు - బాగా పదునుతేలే ఉన్నాయి. శ్రీశ్రీ ఈ అన్ని రంగాలనూ బాగా అధ్యయనం చేసి తన దారిని - నిర్దిష్టంగా - నిర్దుష్టంగా స్పష్టపర్చుకొన్నాడు. ఇలాంటి పరిస్థితిలో అంకిత మిచ్చాడంటే కొంపెల్ల రచనలను వెలికితీసి - అధ్యయనం చెయ్యంది కొంపెల్ల అర్థంకాడు.

### పొట్లు :

ఎందుకో గాని ఇటీవలే కొంపెల్లను మళ్ళీ గుర్తు చేసుకోడం అరంభ మైంది తెలుగునాట. ఆంధ్రప్రభ (వార)లో శ్రీ అబ్బూరి వరద రాజేశ్వర్రావ్ ఒక్కంత రాశారు. ధ్వానా శాస్త్రి ఆంధ్రప్రభ (దిన) పత్రికలో ఓ వ్యాసం రాశారు, ఓ కవిత్వం సంచికలో కొంపెల్ల కవితా శకలాలు పడ్డాయి. విశాలాంధ్రలో నేనూ

ఓటి రాశాను. ఆకాశవాణిలో ఓ సంచికా కార్యక్రమం జరిగింది. కొంపెల్ల రచనలను సేకరించే కార్యక్రమం - నాడు శ్రీశ్రీ నుండి అడపా దడపా కొందరు చేపట్టినట్టు తెలుస్తోంది. 1979 ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఓ ప్రకటనా - జనార్ధనరావ్ మరణించినప్పుడు శ్రీ పాద సుబ్రమణ్య శాస్త్రిగారు - నాటి ఆంధ్ర శేషగిరి రావు గారి ఆంధ్రభూమిలో రాసిన వ్యాసంలో కొంత భాగం అచ్చేశారు. అయితే ఎవరీ పని చేశారో అందులో లేదు. మొత్తానికి సంచలనం అయింది. అందులో భాగం ఈ ప్రయత్నం. ప్రస్తుతం లబ్ధ ప్రతిష్ఠులైన సాహితీ వేత్త లందరికీ కొంపెల్ల - పేరు తెలుసే తప్ప రచనల వివరాలూ - జీవిత విశేషాలూ తెలియవు. కలిసి ఆంధ్రపత్రికలో - భారతిలో పనిచేసిన వాళ్ళలో శ్రీ నీలంరాజు వెంకట శేషయ్య, శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య గార్లే మనకిప్పుడు సాక్షులు.

శ్రీశ్రీ అంకితంలో రాసిన అంశాల ఆధారంగా లాగిన తీగకే కదిలిందీ డొంక. క్షణ క్షణం ఇదే ఆలోచిస్తూ - కనబడ్డ ప్రతివాణ్నీ ఇదే అడిగేస్తుంటే వీడికి "కొంపెల్ల జ్వరం'' పట్టుకుందన్నారుమిత్రులు. నిన్నగాక మొన్న సాహితీ లోకాన్నుండి నిష్క్రమించినవాడి అజా పజా తెలుసుకోడానికే ఇంత హైరానా పడాల్సొస్తుంటే .... శతాబ్దాల సాహితీ చరిత్రను తవ్వి తలకెత్తిన వాళ్ళ కృషి వెనక ఉన్న దీక్షా - త్యాగం - నిజాయితీలకు 'జోహార్' అనడం తప్ప మరేం చెయ్యలేం.

## ప్లాట్లు :

జనార్ధనరావ్ జీవిత విశేషాలు - వ్యక్తిత్వం 'ఉదయని' పత్రిక - నాటి పత్రికల్లో పొందిన స్థానం - కొంపెల్ల వచన రచనల్లో - కవిత్వంలో ప్రత్యేకత; లేఖావళి; ఈ నాలుగు విభాగాల ద్వారా సమకాలికుల్లో....సమకాలిక సాహిత్యంలో, అతడి ప్రత్యేకతను వివరించే ప్రయత్నం చేశాను. ఆయా అంశాలను నేను సేకరించిన విషయాల ద్వారా, నేనే విశదీకరించడం కన్నా, నిష్ణాతులైన ఇతరులు అవే అంశాల ఆధారంగా - చేసిన అంచనాలను మీ ముందుంచితే బావుంటుందని ఆ ప్రయత్నమూ చేశా. సంపాదకుడు పాఠకులను ముక్కుతాడేసి తన ఆలోచనా పరిధిలోకి తీసికెళ్ళడం - ఇలాంటి పుస్తకాల విషయంలో మంచిది కాదని నా భావం.

## లోట్లు :

అచ్చు తప్పులు లేకుండా చూట్టం సాధ్య పళ్లేదు. అప్పటికీ ప్రెస్ మిత్రులు చాలా శ్రద్ధగా ఉన్నా "గంగా భగీరథీ" లాంటివి, 'కొంపల్లె', 'సరస్వతీ గ్రంధాలయం వేటపాలెం' లాంటివీ, 213 పేజీలో అచ్చైన కీ॥ శే॥ జనమంచి వెంకటరామయ్యగారి మీది వ్యాసం కాలక్రమానుసారంగా అప్పారావు బసవరాజు వ్యాసం తర్వాత రావాల్సింది. ఇవి కళ్ళుకప్పి చేరాయి. గురజాడ, బసవరాజుల మీద వ్యాసాలు కొమర్రాజు లక్ష్మణరావుగారి విజ్ఞాన సర్వస్వం రెండో ముద్రణకోవి. దీన్ని కాశీనాథుని నాగేశ్వరరావుగారు ప్రచురించారు. ఈ అంశం అక్కడే ప్రస్తావించి ఉంటే బావుండేది. తంపోతం కంపోతల్లో (లేఖావళి) ఏ ఉత్తరం ఎవరికి రాసిందీ అక్కడే రాసి ఉంచాల్సింది. పేజీ 332లోని ఉత్తరంలో విరాళ దాతల జాబితా అంటూ ఇలా రాశారు. శ్రీ కోకా శివనాథ శాస్త్రిగారు. దివాన్‌జీ బంగ్లా, పిఠాపురం, 2, 3, 4, సంచికలు; శ్రీ ఆకొండి రాజారావుగారు, పిఠాపురం, 2, 3, 4, సంచికలు; డా॥ టి సత్యనారాయణమూర్తి గారు, పిఠాపురం, 2, 3, 4 సంచికలు; శ్రీమతి వి. మందార మాల, పిఠాపురం 2, 3, 4 సంచికలు; శ్రీ రాజా బులుసు ప్రభాకర పట్టాభి రామారావుగారు. గాంధీనగర్ కోకనాడ, 4 సంచిక మాత్రం పంపమన్నారు మల్లంపల్లి వారిని. ఈ భోగట్టా అక్కడే ఇవ్వాల్సింది. ఆ రోజుల్లో సమీక్షకులు "బ్లాక్స్" ఇచ్చిన వాళ్ళకీ కృతజ్ఞతలు చెప్పే ఆచారానికి సాక్ష్యంగా "రాఘవా చార్యుల" మీది వ్యాసం అధోజ్ఞాపికలో ''దిమ్మెల'' ప్రస్తావననుంచడం జరిగింది. 'మల్లికపెళ్లి' యిప్పటికీ దొరకనేలేదు.

ఈ చిన్న ప్రణాళిక ఈ రూపం తీసుకోడంలో అనేకులు అనేక విధాల సాయపడ్డారు. సలహాలిచ్చారు. ముఖ్యంగా శ్రీ జడ్. వి. సుబ్బారావు, (వేటపాలెం), శ్రీ అత్తలూరి నరిసింహారావు (విశాఖపట్నం), శ్రీజనమంచి కామేశ్వరరావు (రాజమండ్రి) గార్లు అందించిన సాయం మరవలేంది. కొంపెల్ల రచనలను సేకరించి సంకలనంగా తేవాలన్నది శ్రీశ్రీ ఆశయం. దాన్ని అందిన మేరకు శ్రీశ్రీ స్మారక సంస్థ సేకరించింది.

శ్రీశ్రీ స్మారక సంస్థ సలహా మండలి వెన్నుతట్టకపోతే ముందుకుపోయే వాణ్ని కాదు. ప్రధానంగా డా॥ బూదరాజు రాధాకృష్ణ, డా॥ కేతు విశ్వనాథ రెడ్డి, విశాలాంధ్ర ప్రచురణాలయం ముందుకు రాకపోతే ఈ గ్రంధం - ఇంత త్వరలో

ఈ రూపంలో - మీ చేతుల్లో ఉండేది కాదు. అందరికీ కృతజ్ఞతలు. ఇక దీని మంచి చెడ్డలు చూడాల్సింది - సూచనలివ్వాల్సింది మీరు.

ఏటుకూరి ప్రసాద్

అక్టోబరు 87 సంపాదకుడు.

## శ్రీశ్రీ బాధ్యత :

"అతని సంపూర్ణ సాహిత్యాన్ని ముద్రించే బాధ్యత, వీళ్లన్నయ్య కొంపెల్ల సూర్యారావు నామీద ఉంచాడు. దీన్ని నెరవేర్చే బాధ్యత నన్ను తరచూ బాధిస్తూ ఉంటుంది. కనీసం అతని కావ్య సంపుటి నైనా ప్రచురించ గలిగితే బాగుండును. జనార్దనరావ్ కాగితాలన్నీ నా దగ్గిరే ఉన్నాయి. కాని అందులో కవితలు రాసిన కాగితాలు కానీ, నోటు బుక్కు గానీ కనిపించటం లేదు. "మల్లిక పెళ్ళి" — అని ఒక నాటకం ఉంది. కాని ప్రాచీన లిపి పరిశోధకులు మాత్రమే దాన్ని డెసిఫర్ చెయ్యాలి.

శ్రీశ్రీ

వీణ 1938 సెప్టెంబరు,

# ఇలా ఉన్నాయ్....

## ఉదయిని సంపాదకీయాలు

## వ్యాసాలు



## నాటికలు



## కథ

## కవితలు

## తలపోతల కలపోతలు (లేఖావళి)

అంకితం



మహాప్రస్థానం

క్రొంపెల్ల జనార్దనరావ్ కోసం



సాహిత్యపద్మవ్యూహాభిమన్యుడి

జీవితం - సాహిత్యం

శ్రీరంగం శ్రీనివాసరావ్ కోసం

అంకితం



కొంపెల్ల జనార్దనరావ్

15-4-1906 * 23-7-1937

దస్తూరి



కీ. శే. చావలి బంగారమ్మ
(జనార్దనరావ్ అక్కగారు)



కీ॥ శే. కొంపెల్ల సూర్యారావు
(జనార్దనరావ్ అన్నగారు)

# కొంపెల్ల జనార్ధనరావు కోసం*

## శ్రీ శ్రీ

తలవంచుకు వెళిపోయావా, నేస్తం !
సెలవంటూ ఈ లోకాన్ని వదలి....
తలపోసిన వేపీ కొనసాగకపోగా,
పగివేదన బరువు బరువు కాగా,
అటు చూస్తే, ఇటు చూస్తే ఎవరూ
చిరునవ్వూ, చేయూతా ఇవ్వక—
మురికితనం, కరుకుతనం నీ
సుకుమారపు హృదయానకు గాయంచేస్తే—
అటుపోతే, ఇటుపోతే అంతా—
అనాదరణతో, అలక్ష్యంతో చూసి,
ఒక్కణ్ణిచేసి వేధించారని, బాధించారని
వెక్కి వెక్కి ఏడుస్తూ వెళిపోయావా నేస్తం!
తలవంచుకు వెళిపోయావా, నేస్తం!

దొంగలంజకొడుకు లసలే మెసలే ఈ
ధూర్తలోకంలో నిలబడజాలక
తలవంచుకునే వెళిపోయావా, నేస్తం !
చిరునవ్వులనే పరిషేచన చేస్తూ....

అడుగడుగునా పొడచూపే
అనేకానేక శత్రువులతో,
పొంచి చీకట్లో కరవజూచే

*మహాప్రస్థానాన్ని శ్రీశ్రీ కొంపెల్ల జనార్ధనరావుకు అంకిత మిచ్చాడు. ఆ సందర్భంలో రాసిన కవిత ఇది. ఆధునిక తెలుగు సాహిత్యంలో వచన కవితలో రాసిన ఎలిజీల్లో ఇది గోపురప్రాయం. 1937 లో దీన్ని రాశాడు.

కొంపెల్ల జనార్దనరావు

వంచకాల ఈ లోకంతో పొసగక
అంచితానంద శాంత సామ్రాజ్యం
దేన్ని వెదుక్కుంటూ వెళ్ళావోయ్, నేస్తం !
ఎంత అన్యాయం చేశావోయ్, నేస్తం !
ఎన్ని ఆశలు నీ మీద పెట్టుకొని,
ఎన్ని కలలు నీ చుట్టూ పోగు చేసుకొని....
అన్నీ తన్ని వేశావా నేస్తం !
ఎంత దారుణం చేశావయ్యా, నేస్తం !
బరంపురంలో మనం ఇంకా
నిన్నగాక మొన్న మాట్లాడుకున్నట్లే ఉంది!
కాకినాడ నవ్యసాహిత్య పరిషత్తును
కలకలలాడించిన నీ నవ్వు
కనబడకుండా కరగిపోయిందా ఇంతట్లోనే ?
విశాఖపట్టణం వీధుల్లో మనం
ఉదయిని సంచికలు పట్టుకు తిరగడం
జ్ఞాపకం ఉందా ?
చెన్నపట్టణపు సముద్రతీరంలో మనం
అన్ని పిచికగూళ్ళేనా కట్టిం ?
సాహిత్యమే సమస్తమూ అనుకొని,
ఆకలీ నిద్రా లేక,
ఎక్కడ ఉన్నామో, ఎక్కడకు పోతామో తెలియని
ఆవేశంతో,
చుక్కలలో ఆదర్శాలను లెక్కిస్తూ
ఎక్కడకో పోతున్న మనల్ని
రెక్కపట్టి నిలబెట్టి లోకం
ఎన్నెన్ని దుస్సహ దృశ్యాలు చూపించి,
ఎన్నెన్ని దుస్తర విఘ్నాలు కల్పించి,
కలలకు పొగలనూ, కాటుకలనూ కప్పి,
శపించిందో, శరించిందో మనల్ని !

తుదకు నిన్ను విషవాగురలలోనికి లాగి,
ఊపిరి తిత్తులను కొలిమితిత్తులుగా చేసి,
మా కళ్ళల్లో గంధక జ్వాలలు,
గుండెలలో గుగ్గిలపు ధూమంవేసి,
మా దారిలో ప్రశ్నార్థ చిహ్నల
బ్రహ్మజెముడు డొంకలు కప్పి,
తలచుకున్నప్పుడల్లా
తనువులో, అణువణువులో
సంవర్త భయంకర
ఝంఝాపవనం రేగిస్తూ
ఎక్కడకు విసిరిందయ్యా నిన్ను !
ఎంత మోసగించిందయ్యా మమ్మ !

ఎవరు దుఃఖించారులే, నేస్తం ! నువ్వు చనిపోతే,
ఏదో నేనూ, ఆరుగురు స్నేహితులూ తప్ప.
ఆకాశం పడిపోకుండానే ఉంది !
ఆఫీసులకు సెలవు లేదు !
సారాదుకాణాల వ్యవహారం
సజావుగానే సాగింది !
సానుభూతి సభలలో ఎవరూ
సాశ్రునేత్రాలు ప్రదర్శించలేదులే నీకోసం !
ఎవరి పనులలో వాళ్ళు !
ఎవరి తొందరలో వాళ్ళు
ఎవరికి కావాలి, నేస్తం !
ఏమయిపోతేనేం నువ్వు
ఎవ్వరూ నిన్ను స్మరించడం లేదులే !
ఎవరికి కావాలి, నేస్తం ! నువ్వు
కాగితంమీద ఒక మాటకు బలి అయితే,
కనబడని ఊహ నిన్ను కబళిస్తే,

కొంపెల్ల జనార్దనరావు

అందని రెక్క నిన్ను మంత్రిస్తే ! నిమంత్రిస్తే !
ఎవరికి కావాలి నీ నేస్తం !
ఏమయిపోతేనేం నువ్వు ?
మా బురద రోజూ హాజరు,
మా బురఖా మేము తగిలించుకున్నాం !
మా కాళ్ళకు డెక్కలు మొలిచాయి.
మా నెత్తికి కొమ్ములలాగే !
మమ్మల్ని నువ్వు పోల్చుకోలేవు !

లేదు, నేస్తం ! లేదు....
నీ ప్రాభవం మమ్మల్ని వదలలేదు !
నిరుత్సాహాన్ని జయించడం
నీవల్లనే నేర్చుకుంటున్నాము !
ప్రతికూల శక్తుల బలం మాకు తెలుసు,
భయంలేదులే అయినప్పటికీ !
నీ సాహసం ఒక ఉదాహరణ !
నీ జీవితమే ఒరవడి !
నిన్ను వదలిన పోరాటం
నేడు అందుకొనక తప్పదు !

కావున ఈ నిరాశామయ లోకంలో
కదనశంఖం పూరిస్తున్నాను !
ఇక్కడ నిలబడి నిన్ను
ఇవాళ ఆవాహనం చేస్తున్నాను !
అందుకో ఈ చాచిన హస్తం ?
ఆవేశించు నాలో !
ఇలా చూడు నీ కోసం
ఇదే నా మహాప్రస్థానం !

---

## ప్రశ్న: అగస్త్యభ్రాతా ? !

"జనార్దనరావు లోకం అంతా శ్లాఘింపదగిన మహామనీషా ? అన్న ప్రశ్న జనిస్తుంది. అయితే ఆచార్య నరసింహంగారన్నట్టు శ్రీశ్రీకి కొంపెల్లకు గల గాఢ మైత్రి గుణ దోష విచారణకు తావు ఇవ్వదు. అది సహజం".

ద్వానాశాస్త్రి, పే. 24.
సాహిత్యం - సాహిత్యం, 1985.

## శ్రీశ్రీ జవాబు :

"మన ప్రసిద్ధ విమర్శకుల సత్తువ నాకు తెలుసు. ఎవ్వరికీ జనార్దనరావు తాహతులు లేవు. ఎప్పటికప్పుడే జ్ఞాన సంపద హెచ్చించుకొంటూ అతడు సారస్వత రంగంలో అనన్య సామాన్య స్థానానికి చేయి చాచాడు .... విమర్శకుడుగా జనార్దనరావుది మహోన్నత స్థానం. ఆధునిక వాఙ్మయాన్ని సరిగా అర్థం చేసుకున్న కొద్దిమందిలో ముఖ్యుడు. అతని జీవితమంతా విజ్ఞాన సముపార్జనకైన ఎడతెగని యాత్ర".

శ్రీశ్రీ
వీణ, సెప్టెంబర్, 1938.

# కొంపెల్ల జనార్దనరావు జీవితం

జనమంచి కామేశ్వరరావ్ ఏటుకూరి ప్రసాద్

శ్రీశ్రీ కనక తన మహాప్రస్థానాన్ని అంకితమివ్వకపోతే కొంపెల్ల జనార్దనరావ్ తెలుగు సాహితీ లోకానికి కనుమరుగయ్యేవాడా?! తలవంచుకు సెలవంటూ వెళిపోవడానికి కారణాలేమిగుటి! ఇవన్నీ 80వ దశకంలో తెలు సాహితీవేత్తల ముందున్న సమస్యలు కావు. అయితే నేడు సాహితీ రంగానికి తెలిసింది శ్రీశ్రీ లేంది జనార్దనరావ్ లేడని. మహాప్రస్థానం తెలీని వాడికి జనార్దనరావ్ అంటే పిట్టపేరో - పుట్టపేరో అనే అనుమానమని. ఇది నిజమేనా అంటే నిజమనీ అనాలి - కాదనీ అనాలి. ఏమిటి కారణం. జనార్దనరావ్‌గారి రచనలు సంకలనంగా రాకపోవడం సాహిత్యంలో ఉన్నత పథాల కెగరబోయే దశలో మృత్యువు మ్రింగేయడం. సాహిత్యాభ్యుదయానికి అతడుపడ్డ తపనను అందుకొని ముందుకు తీసికెళ్ళేవాళ్ళు జనార్దనరావ్ కన్నుమూయంగానే కనుమరుగవడం. వీటన్నిటినీ మించి సమకాలిక సాహితీవేత్తలపై ఇతడు ఝుళిపించిన విమర్శనా ఖడ్గం - కనిపించని లోతుల్లో వాళ్ళకు తగలడం. శ్రీశ్రీ మాటల్లో చెప్పాలంటే "పాపం జనార్దనరావ్ జీవితం ప్రారంభించక ముందే మరణించాడు".

జనార్దనరావ్ తండ్రి కొంపెల్ల వసంతంగారు. సంస్కృతంలో మంచి పండితులు. చివరిదశలో ఆయుర్వేదం కూడా జీవనోపాధికి ఉపయోగపడ్తుండేది. వసంతంగారు మొదట్లో తూర్పుగోదావరి జిల్లా మోడేకుర్రులో ఉంటూ కొంత కాలానికి అమలాపురం తాలూకా గంగలకుర్రు కొచ్చారు. జనార్దనరావ్ మోడేకుర్రులోనే 15 ఏప్రిల్ 1906న జన్మించాడు. జనార్దనరావ్‌కు సోమేశ్వరరావ్, సూర్యప్రకాశం, సూర్యారావ్‌లు అన్నలు. ప్రఖ్యాత రచయిత్రి, చావలి బంగారమ్మగారు అక్క. వీరూ సోమేశ్వరరావ్ మినహా మిగిలిన సోదరులంతా అవివాహితులుగానే మరణించారు. సోమేశ్వరరావ్‌గారు సికింద్రాబాద్ మహబూబ్ కాలేజీలో 1928 ప్రాంతాల్లో లెక్చరర్‌గా పని చేశారు. వీరికి ఇద్దరు కుమారులు, ముగ్గురు కొమార్తెలు. ప్రస్తుతం శకుంతల - సుబ్బలక్ష్మిగారలు మద్రాసులో ఉంటున్నారు.

జనార్దనరావ్ తండ్రిగారిది పండిత వంశం. జనార్దనరావ్ సోదరి బంగారమ్మా - సోదరుడు సూర్యారావ్‌గారలు సాహితీ వ్యవసాయం చేసినవాళ్ళు. వీరందరికీ కొద్దో గొప్పో సంగీత జ్ఞానం కూడా ఉండేది. జనార్దనరావ్‌కు నాటకాలంటే చాలా అభిమానం. ఇతడు భారతిలో పన్జేసే రోజుల్లో నీలంరాజు వెంకట శేషయ్యగారి ఆధ్వర్యంలో మద్రాసులో నడుస్తుండే నాటక సమాజానికి తరుచు వెళ్తూండడం అప్పుడప్పుడు కొద్దిపాటి ప్రసంగాలు చేస్తూండడం పరిపాటి.

జనార్దనరావ్ తండ్రిగారి దగ్గరే బాగా సంస్కృతం నేర్చాడు. జ్యోతిషంలో ప్రవేశం సంపాదించాడు. రాజమండ్రి వీరేశలింగాస్తికోన్నత పాఠశాలలో చదివి 1921లో యస్.యస్.యల్.సి పరీక్ష పాసయ్యాడు. జనార్దనరావ్ పెత్తండ్రి సుబ్బరాయశాస్త్రి గారికీ - తండ్రి వసంతంగారికీ మోడేకుర్రులో మొదట్లో బాగా ఆస్తి ఉండేది. ఊళ్ళో వాళ్ళకు వీళ్ళు దొరలు. ఆఫాయిదాలో జీవించడంతో క్రమంగా ఆస్తి వసంతంగారి కాలానికే హారతికర్పూరమైంది.

## ప్రపంచమంతా పాడడిపోదూ?

– కొంపెల్ల సూర్యారావు

భజనలుచేస్తాం
బహుమతులిస్తాం
పాదాలకి సాష్టాంగాలిడతాం
గొప్పలు యెరగడు కోపం యెరగడు
కోరిక లెరగడు గౌరవ మెరగడు
తులం పత్తి పిల్చిటు ప్పదానొక
'దొరే'యని పిలిస్తే 'ఓ'యంటాడే,
ప్రజల సొమ్ములే జీతాలుచ్చుకు
ప్రజలకి నౌకరి చేస్తామంటూ
చేరి అధికారం చెలాయించే
పోలీసునుంచి గవణరుదాకా
దేశ్ళదిలాగే తేలికపడితే
ప్రపంచమంతా పాడడిపోదూ? ౦ 16-9-35

మంచి వితరణశీలురూ గృహమేధులూ కావడంకూడా ఒక కారణమవచ్చు. అప్పుడే రాజమండ్రికి మకాం మార్చి ఇన్నీసుపేటలో ఉంటూ జనార్దనరావ్‌ను చదివించారు.

జనార్దనరావ్ చిన్నతనం పిల్లజమీందారుగా గడిచింది. హైస్కూలు విద్య పూర్తిగావడంతో ఆర్థిక బాధలధ్దుకున్నాయి. చదువుకు ఆటంకం వచ్చింది. ఇల్లు గడపడానికి కొద్దికాలం అక్కడ చిన్నాచితకా ఉద్యోగాలు చెయ్యాల్సి వచ్చింది. వీరి కుటుంబానికీ, హోతా వీర భద్రయ్య, బులుసు పాపయ్య గారి కుటుంబాలకూ చాలా సాన్నిహిత్యం ఉండేది. వసంతం గారికీ బులుసు వారికీ మేనత్త మేన మామల సంబంధం. ఇదే తర్వాత జనార్దనరావ్ భారతిలో ప్రవేశించడానికి సాయపడింది. జాతీయ భావాలున్న గాంధేయ వాది అతడు. సహాయ నిరాకరణలో కూడా పాలుపంచుకున్నాడు అందుకే బులుసు సాంబమూర్తి గారు ఇతణ్ణి తీసికెళ్ళి అప్పుడే పెట్టిన భారతి పత్రికలో సహాయ సంపాదకుడుగా పెట్టాడు. అప్పటికక్కడ ˙న్నవరపు సుబ్బరామయ్యగారు, ప్రతివాది భయంకర రంగాచార్యులు గారూ పనిచేస్తున్నారు. వీరు మూడో వారు. జనార్దనరావ్‌కు హిందీ, సంస్కృతం బాగా వచ్చు. తెలుగు సాహిత్యం విషయం సరే సరి. ఆ రోజుల్లోనే మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్యాసాలు రాసి భారతి - ఆంధ్ర పత్రికల్లో ప్రకటించడాని కివ్వడాని కక్కొగకొస్తూండేవారు. జనార్దనరావ్‌తో పరిచయం కల్గింది. ఇతడు సోమేశ్వర్రావ్ సోదరుడని తెలియడం శర్మగారిని వీరికి మరింత సన్నిహితులు కావడానికి దోహదం చేసింది. ఎందుకంటే జనార్దనరావ్ అన్న సోమేశ్వరరావ్ మల్లంపల్లి శర్మగారు రాజమండ్రిలో సహాధ్యాయులు. సోమేశ్వరరావ్ గారు కూడా కొద్దిగా ఇంగ్లీషులో పద్యాలు రాసి శర్మగారికి చదివి వినిపిస్తూండే వారు. ఇదే క్రమంగా జనార్దనరావు శర్మగారింట్లోనే ఉండేలా చేసింది. ఆ రోజుల్లో శర్మగారిల్లో సాహితీ కూటం. విశ్వనాథ సత్యనారాయణ గారు చాలా కాలం ఉండేవారు. తెలుగు ప్రాంతం నుండి వెళ్ళిన ప్రతి సాహితీ వేత్త - కవీ - రచయితా మల్లంపల్లి వారి ఆతిథ్యం స్వీకరించాల్సిందే! కొన్నాళ్ళు వాళ్ళింట్లో ఉండాల్సిందే. అచంట జానకిరాం శ్రీశ్రీలు జనార్దనరావ్‌తో తమ పరిచయాలను మరింత పెంచుకొందీకూటంలోనే! విశ్వనాథ రచనల మీద జనార్దనరావ్ అభిమానం పెంచుకొందీ ఈ ఇంట్లో కలిగిన అవకాశంతోనే. బసవరాజు - నండూరి - కృష్ణశాస్త్రి - మల్లవరపు విశ్వేశ్వర్రావ్‌లు తమ తమ కొత్త

కవితలకు తొలి శ్రోతల నీయింట్లోనే వెతుక్కొనే వారు. శ్రీపాద సుబ్రమణ్య శాస్త్రిగారు తమ పత్రికకు చందాల యాత్రలో బస ఇక్కడే!

జనార్దనరావ్ పండిత కుటుంబంలో పుట్టడం - సంప్రదాయ సాహిత్యం ఔపోసన పట్టడం ఆధునిక సాహితీ వైతాళికుల కావ్య గానాల, చర్చోపచర్చల మధ్య 1926 నుండీ గడపడం వల్లే భారతిలో తన ఉద్యోగానికి వన్నె తేగలిగాడు. భావ కవిత్వం తెలుగునాడును ఉర్రూతలూగిస్తున్న కాలం అది. అందుకే జనార్దనరావ్ తన కవిత్వాన్ని ఆ దిశలోనే సాగించాడు. వచన రచనలో అతడి మీద విశ్వనాథ వారి ప్రభావం కనిపిస్తుంది. మల్లంపల్లి సోమశేఖర శర్మ గారి సాన్నిహిత్యం వల్ల - చారిత్రికాధారాంతో ఖండితంగా విషయ వివేచన చేసే శక్తి అబ్బి, పుస్తక సమీక్షల్లో ఆ నిర్మొహమాటం - నిజాయితీ మనకు కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. గ్రంథ రచయితల నొసళ్లు ముడిపడేలా చేస్తుంది.

భారతి మాస పత్రికలో 1926 నుండి 1934లో తాను ఉదయిని పత్రిక పెట్టేటంతవరకూ పని చేశాడు. జనార్దనరావ్. జనార్దనరావ్ కన్నా ముందు చేరి 1940 దాకా ఆంధ్ర పత్రికలో పని చేసిన నీలంరాజు వెంకటశేషయ్య గారి మాటల్లో "జనార్దనరావ్ ముభావంగా ఉండేవాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూండే వాడు. ఎదుటి వాళ్ళ అంతరంగాల్లోకి దూసుకు చూస్తున్నాడనిపించేది. మెల్లిగా స్పష్టంగా సూటిగా నిక్కచ్చిగా మాట్లాడేవాడు. మాటలు ఆచి తూచి వాడుతుండే వాడు." - ఇంత గంభీర స్వభావం ఉన్నవాడు కనుకనే గ్రంథ విమర్శనల్లో అప్పటికి కొత్త దైంటీ - సూటిగా ఉండేదీ అయిన ఓ శైలిని ఏర్పాటు చేసు

---

ప్రముఖ జర్నలిస్టు పత్రికా సంపాదకులు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య గారు భారతిలో జనార్దనరావ్ పని చేసినంతకాలం ఆంధ్ర పత్రికలో పని చేశారు. జనార్దనరావ్ చనిపోయిం తర్వాతా కొన్నేళ్ళు అక్కడే సంపాదక వర్గ సభ్యులుగా ఉండే వారు. వారి మాటల్లో "జనార్దనరావ్ నిజాయితీ పరుడు. పబ్లిసిటీ కోరేవాడుకాడు. ఓ రకంగా "షైబాయ్", పొట్టిగా సన్నగా ఉంటూ నెమ్మదిగా మాట్లాడేవాడు. ఎప్పుడూ అనారోగ్యంగా ఉన్నట్టుండే వాడు నిరంతరం ఆలోచిస్తూండేవాడు. ఆఫీసులోనే సంధ్య వారుస్తూండే సంప్రదాయవాది. నాటకాలంటే అభిరుచి ఉండేది.

శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారితో ముఖాముఖి

హైదరాబాద్,

కున్నాడు జనార్దనరావ్. సాహిత్య విమర్శలో సహృదయుని లోతులు పైకి తేలి ఉబికిస్తాయి ఉబికించి ఊరుకోవు - వాటి నుండి సాహిత్య సృష్టి జరుగుతుంది. విమర్శ కూడా కళా సృష్టే సాహిత్యంమల్లే !

విమర్శ చదువు తూంటే ఒక "*Creative delight*" పొంద గలగాలి. రసానుభూతిలో త్వరత పొందగలగాలి - అనేవాడు జనార్దనరావు. నేడు మనం చూస్తున్న కొన్ని గ్రంథ సమీక్షలు ఎత్తితే ఆకాశానికి తొక్కితే పాతాళానికి- తెలిసిన రచయిత అయితే నెత్తిన పూలూ - కానప్పుడు బండరాలూ. కొంపెల్ల సుమారు ఇరవై వరకూ పుస్తక సమీక్షలు చేశాడు. వివరంగా విశ్లేషిస్తూ చేసిన సమీక్షలకు; బసవరాజు అప్పారావుగారు రాసిన ఆంధ్ర కవిత్వ చరిత్రం సమీక్ష- కృష్ణ శాస్త్రి ఊర్వసి - ప్రవాసం సమీక్ష; విశ్వనాథ వారి "వేనరాజు" మీది విమర్శలు చాలు.

కవిమిత్రుల సాహచర్యమే జనార్దనరావ్‌ను కవితా సమితిలో సభ్యుడుగా చేసింది. భారతీ సంపాదక వర్గంలో ఉన్నా సాహితీ సమావేశాలకోసం ఊరూ వాడా తిరిగేవాడు. అఖిలాంధ్ర కవి పండిత సభలు జరిగిన బరంపురం - రాజ మండ్రిలకు వెళ్ళాడు. కాకినాడలో జరిగిన నాటక కళాపరిషత్ సభలకెళ్ళాడు. నవ్యసాహిత్య పరిషత్ సమావేశాలకు హాజరౌతూ కవుల పోకడలూ - రచనల వైఖరులూ నిశ్శబ్దంగా ఉంటూనే ఆకళించుకొనేవాడు. ఈ సంఘాల్లో సభ్యులు సిగపట్లు పట్టుకోడం ఈర్ష్యా ద్వేషాలకు లోను గావడం చూసి ఓ సందర్భంలో "అహంకారాలూ - కృత్రిమాలూ అలాటి సంస్థలలో మొలకెత్తే అవకాశం చాలా ఉన్నప్పటికీ సంస్థ యేర్పడకుండా వుండే దౌర్బల్యం కంటే ఆ లోపా లయినా నయయే - అవి మానుష స్వభావానికి లక్షణం కూడా" అంటూ సర్దు కోగల వ్యక్తిత్వం జనార్దనరావుది. బరంపురంలో జరిగిన కవి పండిత సభల్లో జనార్దనరావ్ సంపాదకత్వంలో ఓ సాహితీ పత్రిక నడపాలని తీర్మానం చేశారు. కాని, సంఘంలో రాజకీయాలు అటంకమయ్యాయి. 'ఉదయిని' పత్రిక నడపక తప్పలేదు. జనార్దనరావ్‌కు, పోటీగానే వచ్చింది ప్రతిభ. అర్థబలం అంగబలం ప్రతిభ కుండడమే అది నాలుక్కాలాలపాటు రావడామేనికీ, అవి లేక పోవడ జనార్దనరావూ, ఉదయిని 6వ సంచికతో చనిపోడానికి కారణాలు.

ఉదయిని పత్రిక పెట్టడానికి ముందే అంటే 1934 డిశంబరు నాటికే ద్విజేంద్రలాల్ నవల ఛత్రసాత్ ను జనార్దనరావ్ - రంగాచార్యులు గారూ కలిసి

అనువదించారు. దాన్ని పాఠ్య గ్రంథంగా పెట్టాలని కొందరు తర్వాత సిఫార్సు చేశారు కూడా. 1928 నుండీ చిన్న చిన్న పద్యాలూ-వచన రచనలూ అచ్చవడం చూస్తాం. 4 నాటికలు రాశాడు. ప్రేమచంద్ కథను అనువాదం చేశాడు. కొంపెల్ల జనార్దనరావ్ అనీ - 'కొం జ' అనీ - 'రావు' అనీ రచనలు చేస్తుండే వాడు. భారతి ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక - సుభాషి - వైశాఖి పత్రికల్లో ఎక్కువగా రచనలు చేశాడు. ముత్యాలు అనే కావ్యానికి పీఠిక రాశాడనీ మల్లిక పెళ్లి లేక పరువు కోసం అన్న నాటికలు రాశాడనీ దాఖలాలు కనిపిస్తున్నాయి కానీ రచనలు దొరకడం లేదు.

పద్యరచనలన్నీ భావకవిత్వపు తొలిదశను సూచిస్తుంటాయి. శ్రీశ్రీయే అన్నట్లు - తానూ - మల్లవరపు విశ్వేశ్వర్రావూ - జనార్దనరావ్‌లు మద్రాసు బీచిలో కూచోని తమతమ పద్యాలు ఎవరెవరికి అనుసరణలో చర్చించు కొంటూండేవాళ్ళట. అలాగే వచనంలో జనార్దనరావ్‌ది కఠినమైన శైలి. చివరి దశల్లో అంటే 'ఉదయిని' కాలానికి కాస్త సారళ్యం పొందింది. "అతడు బతికున్నంతకాలం అతని రాత లెవరికీ అర్థంకావని ఒకటే గోల. పద్యాలమాట సరేసరి. వచనంకూడా అందరికి కొరకరాని కొయ్యే"- ఇదీ శ్రీశ్రీ అభిప్రాయం. అలాగే కృష్ణశాస్త్రిగారి పద్యసంకలనంమీద 'వైశాఖి' సంవత్సర సంచికలో జనార్దనరావ్ ఓ వ్యాసం రాస్తే కృష్ణశాస్త్రిగారు చదివి "ఆఖరుకి .. అయితే ఏమిటయ్యా ఇతనంటాడు? ఇందులో నన్ను పొగడినట్టా, తిట్టినట్టా?" అన్నాడట. ఇవన్నీచూసే కృష్ణాపత్రిక జనార్దనరావ్‌కు "చండప్రచండ గండశిలాభినవ కొక్కొండ" అన్న బిరుదాన్నిచ్చింది. అదే శ్రీశ్రీని "కవిమహోత్యణావర్త" - అనీ సంభావించింది. తానే ఓ ఉత్తరంలో "నాశైలికి నన్ను అందరూ తిట్టి పోస్తున్నారు"- అంటాడు కొంపెల్ల.

జనార్దనరావ్ జీవిత చరమాంకంలో ఉదయిని ఉదయించింది. ద్వైమాసికంగా 1934 డిశంబరులో మొదలై 1936 అక్టోబరువరకూ వచ్చింది. అక్టోబరు సంచికనుండే మాసపత్రిక చేద్దామనుకున్నాడు. ఓ మిత్రుడికి అక్టోబరు ప్రస్తున రాసిన ఉత్తరంలో "ఒకటో అక్టోబరు వచ్చింది. ఉదయిని మొదటి ప్రూపు వచ్చింది"- అంటూ రాశాడు. అయితే 1932 నుండీ 'ఇంటెస్టైనల్‌టిబీ' పట్టుకు రాపాడుతోంది. అయినా 'ఉదయిని'ని నిజానికి డబ్బు విషయంలోకంటే కూడా స్టాండర్డ్ కంట్రిబ్యూషన్ వచ్చే అవకాశం విషయంలో ఎక్కువ తలపు పెట్టాం

మొదటినుంచీనూ. పత్రిక ఉన్నతవీధులలో నడపటానికి సర్వశః ప్రయత్నిద్దాం"- అంటూ ఆదర్శాన్ని ఉత్తరాల్లో మిత్రులకు వివరిస్తూండేవాడు. తనకు వరవడి "లండన్ మెర్క్యురీ" పత్రిక. నడిపితే ఆ స్థాయిలోనే నడపాలన్నది అతడి ఆశయం. చందాలకోసం ఆచంట జానకిరాం- శ్రీశ్రీ - మల్లంపల్లివారూ పలువురు కవి మిత్రులూ ఎన్నో గడపలెక్కి దిగారు.

ఉదయినిలో 'కిరణాల'ని సంపాదకీయాలు అనేక సాహిత్యాంశాలమీద విపులంగానూ, నిష్కర్షగానూ ఉండేవి. 'శృంగాటకం' - శీర్షికకింద సంపాదకులకు నచ్చిన పలుఅంశాలమీద వ్యాఖ్యలుండేవి. చింతా దీక్షితులు - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి - బంగారమ్మ - విశ్వనాథ - చలం - జనార్ధనరావ్ - స్వామీశివశంకరులు - శ్రీశ్రీ - అడవి బాపిరాజు - మల్లవరపు విశ్వేశ్వరరావ్ - నేలటూరి వెంకటరమణయ్య గార్ల రచనలుంటూండేవి. పాకాల రాజమన్నారు - జనమంచి కామేశ్వరరావ్, ఆచంట జానకిరాం, జనార్ధనరావ్ ఇంకా అనేకులు పుస్తకాలను సమీక్షిస్తూండేవారు.

మల్లంపల్లివారన్నట్టు 'సారస్వతసేవ' - పత్రిక - సర్వసౌభాగ్య సంయుతమైన సుందరాంధ్ర వాఙ్మయము - ఇవి అతనికి నిత్యకలలయిపోయినవి. నరాలు-నరాలా....రక్తము అణువణువునా పత్రిక పట్టిపోయింది. జనార్ధనరావ్‌ను పిలిస్తే పలికేది అతనిలోనుంచి పత్రికే - ఇలా 'ఉదయిని' కోసం తపించాడు.

జనార్ధనరావ్‌కు ఆర్థికంగా సాయం చేసిన వ్యక్తి కె. వి. రత్నాజీరావ్. వాణిజ్యవేత్త. వీరికి మంచిమిత్రుడు. 'జెన్నీ' అంటూ పిలుస్తూండేవాడు. వీరి కుమారుడు కృష్ణారావ్ - జనార్ధనరావ్ అన్నగారి మనుమరాలును పెళ్ళాడి బంధువుగా మారాడు. మిత్రత్వం, బాంధవ్యంగా రూపొందింది. అయినా పత్రిక అప్పులకొండలా పెరగడం - కడుపులో క్షయ మృత్యువుగా పెరగడం జనార్ధనరావ్ కళ్ళముందే జరుగుతోంది. చందాలకోసం ఎవరిళ్ళకెళ్ళినా కొన్నాళ్లు మంచాన పడ్తుండేవాడు.

త్రికాల సంధ్యానుష్ఠానాలు చేసేవాడు. దైవభక్తి - హరనాథబాబా భక్తి కలగలిపి సేవిస్తూండేవాడు. బాధలెక్కువైనకొద్దీ దైవభక్తి ఎక్కువకావడం ఆరంభమైంది. తాత్త్వికచింతన కొనలుదేరింది రచనల్లో మార్మికత- ఉత్తరాల్లో నిస్పృహ మొదలైంది. మద్రాసొచిలి బంగారమ్మగారి దగ్గర కొన్నాళ్ళూ - కాకినాడలో కొన్నాళ్ళూ ఉండి వైద్యంచాలక- డబ్బులేక - గంగలకుర్రు విధిలేక

చేరి 1937 జూన్ 23వ తేదీన తుదిశ్వాస వదిలాడు. త్రిదశత్వంలో పంచత్వం పొందాడు. ఆశలు నక్షత్రాల్లా వెలిగాయే కాని దగ్గరకాలేదు. "జనార్దనరావ్ ఆత్మకు శాంతికలగాలని నేనుకోరను. అతడు మళ్ళీ పుట్టాలని కోరుకొంటాను" - అంటూ శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రిగారు సమర్పించిన స్మృత్యంజలి నిజంగా వాంఛింప దగింది. "ఒక సాధకుడు సాహిత్యానికి బలైనాడు"-అన్న మల్లంపల్లివారి వ్యాఖ్య నిజానికి అద్దంపట్టింది. జనార్దనరావ్ - సాహిత్యంలో అర్థంతరంగా ఆరిన వెలుగు.

## ధీవిశాలు*

### చే.సు. శర్మ

ఆకట కొంపెల్ల కులరత్నమయిన ఘనుఁడు
ఆంధ్రకవి సోదరుఁడు జనార్దనుండు
ఆంధ్రయువకుఁడు ఉదయిని నన్ని దిశల
కీర్తికేతువుగను జేసి కీర్తిశేషుఁ
డయ్యె నీశ్వరాబ్దమునందు నమరు రీతి
జ్యేష్ఠపూర్ణిమ బుధవారసిద్ధిఁ గనిన
అభినవకవికులాభరణాధికారి
చిత్తశాంతికి దేవుని జేతులార
పూజసేయుచు మ్రొక్కుఁడీ పూజ్యులార
ముందు వెనుకల మాటకు నిందులోటు
గలిగె పుట్టుట చచ్చుట కాలమహిమ
కాన దుఃఖమ్ము వలదయ్య; కాని వాని
కాత్మతృప్తికిఁ దర్పణాలర్పణమ్ము
సేయఁ గలములు కాల్వలై చేతులల్ల
నావలై వైతరణిదాట నవ్యపద్య
ములను కోలలవేయుచు ముక్తిపురము
దింపిరండోయి కవులార ! ధీవిశాలు
మన జనార్దనుఁ గీర్తిశేషు మహాత్ము.

ఆంధ్రపత్రిక వారపత్రిక
1937 జూన్ 30

ఆంధ్రపత్రిక 1937 జూన్ 25 దినపత్రిక

సంపా॥

# సాధకుడు: భక్తుడు:
# సోదరుడు జనార్దనరావు
## సాహిత్యరంగానికి బలి అయినాడు

### శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

ఆకస్మికంగా తెలిసింది సోదరుడు కొంపెల్ల జనార్దనరావు జూన్ 28వ తేదీ బుధవారం సాయంకాలం స్వర్గస్థుడయినాడని; నిశ్చేష్టితుణ్ణయినాను. మా జనార్దనరావుమాట ఎన్నటిమాటో అయినదా అని కన్నీరు నించినాను.

గతమప్పుడే ఓ కలఅయిపోయినది. అతను చెన్నపట్టణం రావడం, భారతీ కార్య స్థానంలో ఉద్యోగానికి కుదరడం, మా యిద్దరికీ మైత్రి కలవడం, మేమిద్దరమూ ఆంధ్రసాహిత్యరంగంలో స్వప్నసౌధాలు నిర్మించడం, కలిసి జీవితం గడపడం, అతడు 'ఉదయిని' పత్రిక పెట్టడం-అంతా పెద్దకల. భావనా ప్రపంచంలో నిలిచిపోవలసిన కల మాత్రమే అయిపోయింది. కాలం ఎంత చిత్రమయినది, ఎంత క్రూరమయినది! ఎంతలా మమ్మల్ని ఇద్దరినీ కలిపి, ఎంతలో విడదీసి వేసినది.

భారతీ కార్యస్థానంలో పన్నెండేళ్ళ క్రితం అనుకొంటా, మా జనార్దనరావును మొదటిసారి చూడడం, చూచినప్పటి నుంచీ మా యిద్దరికీ ఏదో తెలియరాని, వెల్లడింపలేని ఒక అనుబంధం చుట్టుకొంది. అతని అన్నగారు సోమేశ్వరరావుగారిని నే నెరుగుదును. రాజమహేంద్రవరంలో మేమిద్దరమూ ఒక్క పాఠశాలలోనే చదివినాము. ఆయన వ్రాసిన ఇంగ్లీషు పద్యాలు తరచు నాకు చదివి వినిపిస్తూ వచ్చాడు. ఆయన సాహిత్య రంగంలో ఎంతో కృషిచేయాలని పెద్ద ఆశలు పెట్టుకొని తుదకు అకాలమృత్యువు వాతపడ్డాడు. సోమేశ్వరరావుగారి తమ్ముడని తెలిసిన తరువాత, జనార్దనరావు నాకు మరీ సన్నిహితుడైనాడు. సోమేశ్వరరావుగారంటే జనార్దనరావు కమిత గౌరవం. జనార్దనరావుకు సాహిత్యసేవాభిరతి హెచ్చినది ఆయన మూలంగానే.

సోమేశ్వరరావుగారి తరువాత వారే ననుకొంటా కవయిత్రి చావలి బంగా రమ్మగారు. అప్పగారిలోగల కవితా శక్తిని గుర్తించినవాడు జనార్దనరావు. నాటి నుండి ఆవిడకమిత ప్రోత్సాహమిచ్చాడు. అతని ప్రయత్నం మూలకంగానే ఆవిడ నవ్యభక్తిని చాలా పాటలు వ్రాసి ఆధునిక కవిలోకంలో కొంతపేరు ప్రతిష్ఠ లార్జించింది. కవితా రహస్యాలెరిగించి ఆవిడకింకా ప్రోత్సాహమిచ్చి ఆవిడనింకా పైకి తీసుకురావలెననే ప్రయత్నంలో ఉండగానే సోదరుడు జనార్దనరావుకు నూరేళ్ళూ నిండినవి.

జనార్దనరావు రెండవ అన్నగారు సూర్యారావుగారు సంభాషణలో కడు చమత్కారి; సంగీత విద్యాకుశలుడు. ఆయన రంగం సంగీత మయ్యుండీ కూడా తమ్ముడు జనార్దనరావు ప్రభావంవల్ల తానుకూడా ఆంధ్రసాహిత్యరంగంలో ఉన్నా ననిపించగలనన్నాడు. జనార్దనరావు ప్రోత్సాహంవల్ల ఈయన అనేక సామాన విషయాలను గూర్చి భావార్థ చమత్కృతులతో వినోదకరములయిన వ్యాసాలు వ్రాసాడు; వినోదిని, ఉదయిని పత్రికలలో పడినవవి. ఇంకా అన్నగారిని ప్రోత్సాహపెట్టుతూ ఆయన్నుకూడా సాహిత్యపరుణ్ణిగా దిద్దవలెననుకొంటూ ఉండగానే జనార్దనరావుకు నూకలు చెల్లిపోయినవి.

ఈ విధంగా ఆ యింటినంతనూ సాహిత్యసేవాసదనంగా మార్చిన సుధీ మణి జనార్దనరావు. ఆ యింటికి మణిదీపము జనార్దనరావు. భావాలెప్పుడూ అతి ఉన్నతములైనవి. ఆశయాలు ఉదారమయినవి. సాహిత్య రంగంలో చాలా కృషిచేయాలని అతడు దీక్షవహించాడు. చిన్నతనం నుంచే ఇట్టి దీక్ష కలగడం నిజంగా సుకృతం. ఈ కృషికై శక్తిసేకరించుకోవడానికి జపమూ, తపమూ కూడా మొదలుపెట్టాడు. ఉపాసనకూడా ఉండేది. ఇట్టి ఉన్నత భావాలతో మనసు తొణుకుతున్నకాలంలోనే పూజా ద్రవ్యాలు సేకరించుకొని సరస్వతీ పీఠం భారతీ కార్యస్థానంలో అతడు సాహిత్యారాధకుడుగా అడుగుపెట్టాడు

1920 నాటి సహాయనిరాకరణోద్యమం నాటి నుంచీకూడా అతనికేవేవో ఆశయాలూ, అభిప్రాయాలూ ఉన్నా భారతీ కార్యస్థానానికి వచ్చిన తరువాతనే అతని భావాలకు రూపురేఖలూ, కృషికి తీవ్రతా అబ్బినవి. అంతటి నుంచి ఆవేదన- సాహిత్యరంగంలో తీవ్రంగా కృషిచేయవలెననే ఆవేదన, దేశంలో నవ్య ఆంధ్రవాఙ్మయం సృష్టించాలనే ఆవేదన, కొత్తదారులు తొక్కి, కొత్తపోకడలు పోయి సాహిత్య విషయంలో ఆంధ్రులకు కొత్తరుచులు చూపాలనే ఆవేదన

బలమయినది. తన సంకల్పం నెరవేర్చుకోవడానికి ఆంగ్ల సాహిత్యం బాగా మథించడం మొదలు పెట్టాడు. ఇంగ్లాండు రష్యా మొదలయిన యూరోపియను దేశాలలో ప్రపంచ విఖ్యాతిగడించిన ఆధునిక రచయితలవి - కవుల కావ్యాలు-నాటకకర్తల నాటకాలు, విమర్శకుల విమర్శన గ్రంథాలు - అతడొక మత విశ్వాసంగా, ఆచారంగా పెట్టుకొని అధ్యయనంచేస్తూ వచ్చాడు.

చదవడము, విషయమును గురించి ఆలోచన, తర్జన భర్జన, భారతీయ వాఙ్మయానికీ, విదేశీయ వాఙ్మయానికీ రచనలలోను, పోకడలలోను,పద్ధతులలోను గల పోలికలు వ్యత్యాసములు తర్కించడము, ఇవన్నీచేసి నోట్సు తీసుకోవడము ఇదే అతని పద్ధతి. ఇందువల్ల అతన్ని ఎప్పుడు చూచినా ఏదో ఆలోచిస్తూనే ఉండేవాడు. ఎప్పుడూ పరధ్యానముగానే ఉండేవాడు. 'థింకింగ్'అన్నా, 'థిన్‌కర్స్' అన్నా అతనికి ప్రాణము. ఏవేవో ఎప్పుడూ వ్రాస్తూనే ఉండేవాడు. ఎప్పుడూ చదువుతూనే ఉండేవాడు. వ్రాసినదానికి ఇంకా పరిపూర్ణతలేదని వ్రాసినవి కొన్ని ప్రకటించడం మానుతూ వచ్చాడు. రానురాను రాయడం తగ్గించి చదవడం హెచ్చించాడు. ఈ విధంగా అతనొక సాధకుడయి, ఒక సాధనకు లోబడ్డాడు.

పరిపూర్ణత ఉండేటట్టు వ్రాయలేకపోవడానికి కారణం తనలో ఇంకా తపన చాలదనీ, తపస్సు చాలదనీ యెంచి, నియమమూ, నిష్ఠా హెచ్చిస్తూ వచ్చాడు. ఆధునిక ఆంధ్రకవిత్వం ఇంకా పరిణతికి రాలేదనీ, అది ఇంకా ఉన్నతస్థితికి రావడానికి తగినకృషి చేయవలెననీ ఆశించాడు. ఇంగ్లీషు సాహిత్యం తరిచినకొద్దీ ఆంధ్ర సాహిత్య దీనస్థితి మరింత దుర్భరంగా కనిపించి అతనికి ఆవేదన ఎక్కువయి దాని నుద్ధరించాలనే ఉబలాటమూ, అభినివేశమూ హెచ్చుతూవచ్చినవి.

ప్రపంచం మొత్తంమీద విఖ్యాతి గడించిన ఆధునిక సాహిత్యంలోని సొంపులూ, ఇంపులూ, ఒరుపులూ, మెరుపులూ, అందమూ, చందమూ, రచనా చమత్కారమూ, భావసౌందర్యమూ, కొత్తపోకడలూ, ఇవన్నీ తెలుగువారికి నివేదించాలనీ, తెలుగు సాహిత్యంలోని కవతరింపజేయాలనీ అతనికి ఒకటే ఆవేదనయిపోయింది. అదివరకే దేశీయ సంప్రదాయము బాగా ఎరిగినవాడు. సంస్కృత వాఙ్మయము కొంత తరచినవాడు. పశ్చిమగోదావరి జిల్లా గణపవర మనుకొంటా, అక్కడి సంస్కృత పాఠశాలలో నైష్ఠిక బ్రహ్మచారియై సంస్కృతము నభ్యసించి కావ్యనాటకాదులు పూర్తిచేశాడు. దేశీయ సంప్రదాయాన్ని పోనాడకుండా విదేశీయ సాహిత్య సౌందర్యాలతో ఆంధ్రవాణిని మెరిపించాలని

పూన్కి వహించాడు. దీనికి భారతీ కార్యస్థానములోని ఉద్యోగము ఆటంక మను కొన్నాడు. ఉద్యోగానికి రాజీనామా ఇవ్వడమా ఇవ్వక పోవడమా అని ఎన్ని రోజులు, ఎన్ని మాసాలు తీవ్రముగా ఆలోచించాడో చెప్పలేను. రాత్రీ పగలూ ఒకటే ఆలోచన, ఒకటే ఆవేదన. పత్రిక ద్వారా తన సంకల్పము నెరవేర్చు కోవాలను కొన్నాడు. దేశములో ఉపజ్ఞ కల యువకుల నందరినీ కట్టుకొని పని చేయవలెనని ఉద్దేశించినాడు.

సారస్వత సేవ, పత్రిక సర్వ సౌభాగ్య సరియుతమయిన సుందరాంధ్ర వాఙ్మయము - ఇవి అతనికి నిత్య కలలయి పోయినవి. వీటిమీది కోర్కి బల మయిన కొద్దీ కార్య నిర్వహణానికి గల అవరోధాలు ఎక్కువగా కనిపిస్తూ వచ్చి నవి, భూతాలలాగ హృదయ వీధిని ప్రత్యక్షమవుతూ వచ్చినవి. పత్రికను వెలయింప జేయడమెట్లా అని నాలుగేళ్ళు తపన పడ్డాడు. అర్థరాత్రి అనక, అప రాత్రి అనక లేచి కూర్చోడమూ, ఆలోచించడమూను మార్గాలు. ఈరీతి నొక విధంగా భావోన్మాదం అతిశయించింది. భారతీ కార్య స్థానానికి వెళ్ళినా, ఎక్క డికి వెళ్ళినా పని ఉన్న కాస్సేపు ఏమో తక్క మిగత వేళల ఎప్పుడూ ఇదే ఆలోచన.

అతనికి సాహిత్య పత్రికకు వరవడి 'లండన్ మెర్క్యూరీ'! పెడితే అట్టిదే పెట్టాలి. దేశంలో మాసిపోయిన కళాభిరుచిని మళ్ళీ దీపింపజేయాలి. ఆ పత్రికా నిర్వహణంలో అందము, చందమూ, కళా, అన్నీ గోచరించాలి. ఎన్నడో రహస్యంగా అతని హృదయసీమను మొలకెత్తిన ఈ కోరిక నానాటికి వేరుతన్ని బలమయింది; నరాలు నరాలా, రక్తము అణువణువునా పట్టిపోయింది. జనార్దన రావును పిలిస్తే, పలికేది అతనిలోనుంచి పత్రిక. అతన్ని ఆ విషయంలో నిరు త్సాహ పరిచినా కార్యం లేకపోయింది, విరుపులు చెప్పినా కార్యం లేకపోయింది, ఆటంకాలు చూపించినా కార్యం లేకపోయింది.

ఈ యాటంకాలూ, అవరోధాలూ, ఎప్పటికీ ఉండేవే, వీటిని దాటడమెట్లా, కార్యం సాధించడమెట్లా, అనే అతని ప్రశ్న. ఈ సంకల్పంతో మిత్రులను, బంధువులనూ సమీపించాడు; వారి సాయ మర్థించాడు; తన తపన చెప్పుకొన్నాడు. కొందరు సాయం చేస్తామన్నారు. కొందరు చూదామన్నారు. తాడూ బొంగరమూ లేని పరిస్థితి, శక్తికి మించిన సాము. అయితేనేమి, అతనిది వీర హృదయము. వీరులతోవ అతనితోవ. కడగండ్లకు వెనుదీయలేదు; అంతరాయా లున్నవని అడలలేదు.

మిత్రులు మొదలైన వారి సాయంతో కృషి ప్రారంభం చేయవచ్చునను కొన్నాడు. అయితే అతని మిత్రులు, అతనిలో ఈ ఆవేదనా, ఈ అభినివేశమూ ఎంత గాఢముగ, ఎంత లోతుగా నాటుకొనిపోయి ఉన్నదో గుర్తింపలేదు. కాని అతడు మాత్రం వారి మాటలకు శిలాక్షరాల విలువా, వేద ప్రామాణ్యమూ కట్టుకొన్నాడు. "ఎవరో కొందరు నావంటి వారు సాహసించి బలి కావలసిందే సర్వాంగ సుందరమైన సాహిత్య సౌధం నిర్మించడానికి. కానీ ఆ సౌధానికీ నేనొక సోపానాన్ని అవుతానని సాహిత్య రంగంలోకి ఉరికినాడు. విడీతను పడ్డాడు.

పవిత్రుడైన తైర్థికుడిలాగ భక్తి భావ బంధురమైన పవిత్ర హృదయంతో ఈకాశీ కావడి ఈ "ఉదయిని" పత్రిక నెత్తుకొన్నాడు. వెనుకచూపు లేదు ముందు చూపే కాని. అంతా పవిత్రమయిన రంగం; చేపట్టినది పవిత్రమయిన కార్యం. ఉదయినీ పత్రికా ప్రకటనంతో అతని హృదయం తేలికపడింది. కార్యోత్సాహం ఇనుమడించింది. యాత్ర సాగించాడు. వచ్చాయి ఉదయిని సంచికలు 1, 2, 3, .... జనార్దనరావు హృదయం ఆనంద తరంగితమయింది. అతని సంతోషానికి, ఆ బ్రహ్మానందానికి అవధే లేక పోయింది.

కాలం గడచిన కొద్దీ సహాయం అనుకొన్నంతగా రాలేదు. పత్రిక బాగున్న దనే పేరుకు తక్కువ లేక పోయింది. పొగడ్తలకు కొరత లేక పోయింది. కాని నిర్వహణ భారం మాత్రం తగ్గలేదు. యాత్ర దీర్ఘమూ, కఠోరమూ అయింది. తన సత్తువమీదనే ఆధారపడి అతను యాత్ర సాగింపవలసి వచ్చింది. అక్కడికీ అక్కడక్కడ కొంత సదావర్తి దొరుకుతూనే వచ్చింది; అనుకోని చోటుల నుంచి ఏ కొద్దిగానో, ఏ గొప్పగానో సాయం లభిస్తూనే వచ్చింది. అయి నప్పటికీ కావడి బరువు హెచ్చింది. భుజం మార్చుకొనేటందుకు ఆసరా యియ్యే దగ్గవారు ముందుకు వచ్చినవారు లేక పోయినారు.

ఈ విశాల ప్రపంచంలో ఎవరి లక్ష్యం వారిది; ఎవరి కార్యభారం వారిది. ఎవరు ఎవరి కాదుకోగలరు ? నేడాంధ్ర దేశంలో ఏ కార్యమూ ఎవరికీ అక్కర లేదు. ఏదైనా ఎవరైనా తలపెడితే తల పెట్టిన వారిదే తప్పు; వారే వహించాలి సర్వభారమూను. అక్కడకూ ఉదారాశయులు కొందరు ఊత ఇచ్చినా అది అత నికి చాలకపోయింది. పిల మనిషి, అర్భకుడు, తలకు తగని ఆలోచన, మోయ లేని బరువు అయిపోయినది - మొత్తముమీద, క్రమక్రమంగా, సంచిక బయలు పడడమే కష్టమవుతూ వచ్చింది. లోర్ధ ముద్రాలయాధిపతులు అచ్చు ఖర్చులు

చెల్లించే విషయంలో ఆలస్యమయినా చాలా ఓర్పు చూపి అతన్ని అభిమానిస్తూ వచ్చారు. కాని ఎవరే అభిమానం చూపినా ఆరోగ్యం కూడా చూచుకోకుండా, నిద్రాహారాలు కూడా చూచుకోకుండా పడ్డపాటువల్ల యాత్రా ప్రయాస అధిక మయింది. అభినివేశం హెచ్చి అభిమతార్థ సిద్ధి కోసం లాభనష్టాలేమీ పాటించిన వాడుకాదు. తుదకు శక్తి సన్నగిల్లి వ్యాధిలోపడ్డాడు. కడచిన నవంబరుకు వ్యాధి గుర్తుకు వచ్చినది. ఆ వ్యాధి క్షయ అన్నారు కొందరు. కాదన్నారు మరి కొందరు. పేరేదయితే యేమిటి ప్రాణం తీసింది వ్యాధి.

మంచం మీద పడ్డప్పటి నుంచీ కూడా అతనికి ఉదయిని, ఉదయిని అని పలవరింపే ఉదయిని విషయం కొన్నాళ్ళు మరిచిపోతేనేకాని వీలులేదని డాక్టర్లు చెప్పినప్పటికీ అతనికది సాధ్యంకాలేదు. పత్రికే అతను, అతనే పత్రిక అయి పోయినాడు. తుదకు ఉదార హృదయులు శ్రీ శీలం సెట్టి గోవర్ధనరావు గారు ముందుకు వచ్చి నేను సంచాలకుణ్ణిగా ఉండి ఉదయినికి నేను చేయగలిగినది చేస్తాను, దాని విషయంలో మీరు వ్యథ పడవద్దని చెప్పితేనే కాని అతనికి హృదయ శాంతి లేక పోయింది.

రెండవ సంపుటి మొదటి సంచిక అచ్చయి లోధ్ర ముద్రణాలయంలో సిద్ధంగా ఉన్నది. అచ్చయిన పత్రిక విడి ఫారాలు మాత్రం చూచుకొన్నాడు. కళ్ళు మూశాడు జనార్దనరావు.

ఆరోగ్యం బాగుపడుతుంది; ఇంకా వస్తాడు; ఉదయినిని సాగిస్తాడు అని ఆశతో ఉన్న నాకు అతడు స్వర్గస్థుడయినాడన్న దుర్వార్త పిడుగుపాటయింది. అతని అభినివేశమూ, అభిరుచీ, ఉదారమయిన ఆశయాలూ, ఆదర్శమూ నన్ను ఆకర్షించాయి. పైకిరాదగ్గవాడనుకొంటూ ఉన్నాను. ఇంతలో చక్కగా ఎదుగు తున్న వనస్పతి నేల కొరిగింది - విధి విలాసం!

ఇక ఉదయిని గతి? - ఉదయిని, ఉదయిని అని పలవరిస్తూ ప్రాణాలు విడిచిన ఆ సాధకుడి, ఆ భక్తుడి ఆత్మకు శాంతి?

అందరికంటె కష్టం అతని తల్లిగారిది. ఆశలన్నీ అతని మీద పెట్టుకొని జీవిస్తున్న ఆవిడ దుఃఖం తీరేదెట్లా?

జనార్దనరావు లక్ష్యం అమోఘమయినది; దీక్ష అకుంఠితమయినది; సాధన ఉగ్రమయినది; వ్రతము కఠోరమయినది; దృష్టి విశాలమయినది. అతడు చేసిన

పని స్వల్పమయినా, సాధించిన కార్యం ఎక్కువది కాకపోయినా అతడు వీరుడు. వీర మార్గాను సారి జనార్దనరావు, అతడు మృతజీవికాదూ ?

ఆంధ్ర పత్రిక వార పత్రిక
1987 జూలై 7

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సర్వశ్రీ రాయప్రోలు సుబ్రహ్మణ్యం, ఎన్. రామేశం గార్ల సంపాదకత్వంలో మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి స్మారక సంచిక నొకదాన్ని 1976 లో వెలువర్చారు. చరిత్ర మీదా, మల్లంపల్లి వారి కృషి మీదా ఆసక్తి ఉన్న వాళ్ళందరూ శ్రద్ధ పర్చు కోవాల్సిన గ్రంథం అది. అందులో ప్రముఖ చరిత్రకారులు శ్రీ నేలటూరి వెంకట రమణయ్య గారి వ్యాసం రాస్తూ మల్లంపల్లివారిల్లు మద్రాసులో ఓ చరిత్ర అకాడమీ అంటారు. పలువురు చరిత్ర పరిశోధకులు, కవులు, రచయితలు, సాహితీ వేత్తలు నెలల తరబడి వారింట్లో మకాం వేసేవాళ్ళు. కొంపెల్ల జనార్దనరావ్ దయితే ఇల్లూ - ఉదయిని ఆఫీసూ అన్నీ అదే. సాయంకాలాలు కవి సమ్మేళనాలూ - చర్చోపచర్చలూ సాగుతూండేవి ఆ యింట్లో.

మోదేకుర్రు / గంగులకుర్రు వాస్తవ్యులు

కొంపెల్ల వసంతం, సుబ్బమ్మ

- సోమేశ్వరరావు (లెక్చరర్)
  - గోపాలకృష్ణ (కాంగ్రెస్‌వాది) 1910-60
  - వసంతరావు (తబలిస్టు) 1916-72
  - కొల్లూరి శకుంతల (గృహిణి) 1920-
  - కొంతి సుబ్బలక్ష్మి (గృహిణి) 1922-
  - ధూళిపాళ దమయంతి (గృహిణి) 1924-84
- వెంకటసూరి (16వ ఏటనేపోయారు)
- చావలి బంగారమ్మ (రచయిత్రి)
- సూర్యారావు (రచయిత)
- జనార్ధనరావు (రచయిత)

[*K. V. V.* కృష్ణారావ్‌గారిచ్చింది]

# స్వర్గీయ
# కొంపెల్ల
# జనార్దనరావుగారు

వీరు కొన్ని సంవత్సరములపాటు ఆంధ్రపత్రికా కార్యాలయమున భారతీ పత్రికా వర్గమునందు పనిచేసిరి. పిమ్మట ఉదయిని యను ఉత్తమాంధ్ర మాసపత్రికను ప్రారంభించి నిర్వహించుచుండిరి. వీరికి ముప్పదేండ్లలోపు వయసుననే అకాలమరణము తటస్థించినందులకు మేము మిక్కిలి చింతించుచు వీరి కుటుంబమునకు మనఃపూర్వకమగు సానుభూతిని తెలుపుచున్నాము. వీరు చిన్నప్పటి నుండియును అత్యధికమగు నాసక్తితో ఆంధ్ర భాషాసేవ యొనరించుచుండిరి. వీరి ఆత్మకు భగవంతుడు శాంతి యొసగుగాక.

సంపాదకీయము

25-6-1937

ఆంధ్రపత్రిక (దినపత్రిక)

ప్రశుతులు

# జనార్ధనరావు

కొంపెల్ల జనార్ధనరావు స్వర్గస్థుడైనాడు. తెలుగు సాహిత్యపరులలో ఒక ఉత్తముడు మరణించాడు జనార్ధనరావు తెలుగు భాషకు చేసిన సేవ కొద్దియే అయినా గొప్పది. ఖండాంతర సారస్వత పథాలను అవగాహన చేసుకొని తెలుగులో ఆ మార్గాలను ఏర్పరచాలని తహతహ పడ్డాడు. సరికొత్త దృష్టితో తెలుగు సాహిత్య వికాసం ప్రదర్శించడానికి తపస్సుచేసి ఉదయిని వెలయించాడు. ఉదయిని దేశానికి కావలసిన పత్రిక.... దేశం కావాలన్నది కాదు. కనకనే వడిదుడుకైన హ్రస్వజీవితం ఉదయినికి అనివార్యమయింది. సొగసైన ఆకారం, విశాలమైన దృఢ గంభీరమైన అంతస్సు - ఇవి దేశం గ్రహించలేక పోయింది.

జనార్ధనరావు లేతవయస్సులోనే రాలిపోయినాడు. అయితే సాహిత్య ప్రియులైన సాహసిక యువకులకు ఆదర్శం నిర్మించి మరీ పోయినాడు. పలచని, దుర్బలశరీరం, తెలివి తొణికే ముఖం - పసికట్టగలవారికి జనార్ధనరావు ప్రతిపలుకులోనూ పట్టుదల గోచరిస్తుంది. పూర్తిగా జీర్ణంకాని దూరాదర్శాల కోసం పెనుగులాడాడు. సాధించినకొద్దిలో సంపన్నమయిన భవిష్యత్తును కనపర చాడు. సాహితీసేవ - దానికి సాధనమయిన ఉదయిని అతనికి జీవిత సర్వస్వం అయిపోయినవి. "ఉదయిని, ఉదయిని" అంటూ ప్రాణం విడిచాడట !

జనార్ధనరావు సాధువు, శాంతుడు, గంభీరుడు, కళాశీలి, సంస్కారి, దీక్షాపరుడు, వినీతుడు, ఉత్సాహి...సర్వథా జనార్ధనరావు ఉత్తముడు. అతను రోగవశుడైన నాటినుంచీ కొందరు మిత్రులు ఉదయినిని నడుపుతామని అంటు న్నారు. అది అతని మనశ్శాంతి కోసమా ? లేక నిజమేనా ? ఏదైనా అతని ఆత్మ దేనికోసం సహస్రధా తపించినదో ఆ ఉదయినిని ఏ మిత్రుడైనా చేపట్టి ఉద్ధరిస్తే అతని ఆత్మ శాంతిస్తుంది. ఇక కంటికి కనబడని జనార్ధనరావు మా అశ్రుతర్పణం అందుకుంటాడు.

"వీణ" (సంపుటి 8, సంచిక 1) 1937.

# జనార్దనరావుగారు

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

మిత్రులు కొంపెల్ల జనార్దనరావుగారు చనిపోయినందుకు చాలా విచారిస్తున్నాను.

బతకవలసినట్టిన్నీ, బతకతగినట్టిన్నీ కాలం యెంతో వున్నది. చెయ్యవలసినట్టిన్నీ, చెయ్యతగినట్టిన్నీ పని కూడా యెంతో వున్నది.

వాటికి తగిన సంకల్పమూ, ప్రయత్నమూ, ప్రారంభమూ కూడా జటిలంగానే వున్నవి.

కాని హఠాత్తుగా మరణం సంభవించింది.

ఇది అకాలమృత్యువు గాని కాలమృత్యువుకాదు. పైగా యిది చేతులారా ఆంధ్రజాతే తెచ్చిపెట్టినది.

జనార్దనరావుగారు ప్రతిష్ఠకోసం ఆశించలేదు. డబ్బుకోసం చేతులుచాపలేదు. వైభవమున్నూ వాంఛించలేదు.

వారు పని చేస్తామన్నారు. నడుముకట్టుకొని కార్యక్షేత్రంలో ప్రవేశించారు. కాని విశాలమైన ఆంధ్రదేశంలో— హిందూదేశం మొత్తంమీద మూడో స్థానం ఆక్రమించిన ఆంధ్రజాతిలో ఆయనచేత పని చేయించగల మొనగాడు లేకపోయాడు.

*   *   *

గుప్పెడు తాటాకులూ వొక గంటమూ పుచ్చుకుంటే పూర్వకాలంలో కవుల పని తీరిపోయేది.

అప్పటి వారికి తమ కవితాధోరణికి రూపం కల్పించుకోవడమూ, తమ పాండిత్యం ప్రకటించుకోవడమూ—ఇదే పరమావధి.

ఇప్పుడలా కాదు కవులు అలా తృప్తిపడడానికిప్పుడు వీలులేదు.

కవిత్వమూ, తదంగమైన విమర్శనా యిప్పుడు జాతీయతా నిర్మాణానికి ప్రధానసాధనాలుగా గుర్తించబడ్డవి. అంచేత కవికైనా విమర్శకుడికైనా యిప్పుడు

వొక జపాన్ నోటుబుక్కూ, బ్లాకుబర్డు ఫౌంటెన్‌కలమూ పుచ్చుకుని రాసేసి వూరుకుంటే చాలదు.

ఆ రచన అచ్చువేయించాలి. దేశంమీద విర జిమ్మాలి. నలుగురిచేతా చదివించాలి. జాతి పురికొల్పేటట్టు చెయ్యాలి.

ఇది కబుర్లతో కాదు. పుష్కలమైన ధనం కావాలి.

జనార్దనరావుగారు కొంగుచాపి యాచించారు.

తమ సొంతానికా? కాదు. ఇందుకోసం. ఇంతపని చెయ్యడానికి.

ఆయన బండికోసం యెదురుచూడలేదు. నడిచి వెళ్లారు. పంచభక్ష్య పరమాన్నాలు తలుచుకుని ఉవ్విళ్ళూరలేదు. చారూ అన్నమూ వీటితో తృప్తి పడ్డారు. ఉజ్జ్వలమైన వేషంకోసం అవస్థపడలేదు. అభిజనులతో కలిసి తిరగ డానికి ఎంత సామాన్యదుస్తులు ఆర్హమైనవో అంతవాటితోటే తృప్తి పడ్డారు.

అయితే: కాగితాలు కావాలి. అచ్చు పడాలి. పోస్టేజి కావాలి. ఇందులో వొకటిన్నీ వూరికే వచ్చేది లేదు.

ఇందుకోసం జనార్దనరావుగారు డబ్బు కోరారు.

జనార్దనరావుగారు ఇందుకోసం తమ జీవితమే ధారపొయ్యడానికి సిద్ధ పడగా, సంవత్సరానికి నాలుగేసి రూపాయలు దారపొయ్యడానికి సిద్ధపడగల వారు రెండు కోట్ల అరవై మూడు లక్షల ఆంధ్రులలో రెండు వందలైనా లేక పోయారు.

అయినా వారు నిరుత్సాహపడలేదు. తమ ప్రయత్నం చాలకపోయిందేమో అనుకున్నారు వారు.

కద్దరు కట్టేన్నీ, లాఠీదెబ్బలు తిన్నేన్నీ, గాంధిగారి పేరూ, స్వరాజ్యం పేరూ వుదహరిస్తూ పెద్ద కబుర్లు చెప్పేన్నీ పద్యాలు కట్టే వుత్సాహం వుటికినప్పుడు దాన్ని, అమ్మాయిలమీదికి తిప్పే రకంవారు కారు వారు.

జనార్దనరావు గారు నైష్ఠిక బ్రహ్మచారులు. రమారమీ పాతికయేళ్ళ వయస్సులో వుండిన్నీ వారు వివాహవాంఛ పెట్టుకోలేదు. బహుశా, వారు, శాశ్వత బ్రహ్మచర్యదీక్ష పూనినా రేమో ?

ఏమయితేనేం ?

తమ అయత్నం చాలకపోయిం దేమో అనుకున్నారు వారు.

ఇలా అనుకుని వారు నిరుత్సాహపడలేదు. దీక్ష దృఢపరుచుకున్నారు.

ఉత్సాహం పెంచుకున్నారు. నిద్రాహారాల విషయంలో అశ్రద్ధ చూపించారు. ఏటి కెదురీత ప్రారంభించారు.

కాని ఎంతచేసినా, యేం చేసినా ఒక్క సంవత్సర మేనా సాఫీగా వెళ్ళ లేదు. ఊరూరూ తిరిగినా—రాత్రిపగలూ తిరిగినా ఉదయిని విలువ గ్రహించ గలిగిన రసికులు వారికి కనపడలేదు. దేశంలో వెంటనే నెరవేరవలసిన మొదటి పని యేమిటో గుర్తించినవారు కనపడలేదు. ఆ దృష్టి వున్నవారు సైతం కనపడలేదు.

భారతి ఆఫీసులో వున్నప్పుడు గుబురుగా చిగిరించి, ముమ్మరంగా మొగ్గతొడిగి, విరగబూసి వున్నట్టు కనపడిన ఆంధ్రదేశం, ఉదయినికి సంచిక తరవాత సంచిక తయారైన కొద్దీ మోడై మాడిపోయి వుండడం వారికి బాగా తెలిసివచ్చింది.

ఒకనాడు, ఉదయం, చింతాద్రి పేటనుంచి ప్రబుద్ధాంధ్ర, పరశువాకంనుంచి ఉదయినీ తాళ్ళేడ్చుకుంటూ బయలుదేరినవి. ఎగ్మూరుస్టేషను వతలి వంతెనమీద కలుసుకున్నవి.

ఇంకిపోతూ వున్న జీవనదీ, ఎండిపోతూవున్న కల్పవృక్షమూ, సమావేశం అయినట్టున్నగి ఆ సమయం.

సూర్యుణ్ణి అస్తగిరి దాచివెయ్యగా చంద్రుణ్ణి కారుమబ్బు కమ్ముకున్న ట్టున్నది ఆ సమయం.

ఆయినా సమానధర్ముల సమావేశం కనక దుర్భరురాలై వుండినా హృదయాలు ఉప్పొంగిపోయినవి. ఏమి టేమిటో కబుర్లు వెళ్ళినవి.

ఉన్నట్టుండి "ఆంధ్రజాతి యిప్పు డెక్కడ వున్నదీ?" అని ప్రబుద్ధాంధ్ర ప్రశ్నించినది. "నరకంకంటె అధమాధమ మైన లోకంలో—హిందూస్థానీవాడి కాలికింద" అని ఉదయిని జవాబు చెప్పినది.

ఉదయినిలో ఝుమాయించి రాయలేకపోయారు; కాని—కాంగ్రెస్సు మొగం చూచి కొంచెం తటపటాయించారు గాని జనార్దనరావుగారు, హిందీ దురాక్రమణం పూర్తిగా గ్రహించారు.

"ఇంగ్లీషు నేర్చుకోవడం మనం బాగుపడడానికి. హిందీ నేర్చుకోవడం మన భాషని చంపుకుని, హిందీని బాగుచెయ్యడానికి" అని వా రన్నప్పుడు సుక్కివుండినా, గంభీరంగానే వుండిన ఆ మొగం మీద వీరతేజస్సు మెరిసి "ఆంధ్ర వాఙ్మయానికి ఉజ్జీవనం కలిగించగల వ్యక్తి" అని అనిపించినది.

కాని, వారుండగానే ఉదయిని యెత్తు పడిపోయింది.

ఒకమూల, అడుగడుగునా ఆర్థికాఘాతాలు కదుములు కట్టిస్తూవుండగా— ఇంకోమూల నిరుత్సాహం పేగులు తోడేస్తూవుండగా వారిని దారుణమైన వ్యాధి అలుముకున్నది.

దినదిన గండంగా అయినా పత్రిక నడుస్తూవుంటే, వారు, ఋణపడిపోయి వుందురు; గాని జబ్బుపడి, చివరికి చనిపోయి వుండకపోవుదురు.

మళ్ళీ జనవరి మొదటి వారంలో కలుసుకున్నప్పుడు రోగం మళ్ళిం దనుకున్నాము. అపాయం తప్పిం దనుకున్నాము.

ఆ వేళ సాయంత్రం, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కాల్చి యిచ్చిన బ్రౌన్ రొట్టెముక్కలు తింటూ, నవ్యసాహిత్యపరిషత్తును గురించి చెబుతూ, వారు కనబరచిన ఆవేదన యింకా స్ఫుటంగా స్ఫురిస్తూనే వున్నది. వారప్పుడు పలికిన మాట లింకా చెవులలో ప్రతిధ్వనిస్తూనే వున్నవి.

అయితే, మొదట మొదట ఆ మాటలు బోధపడలేదు; కాని వెళ్ళినకొద్దీ— ఏమి ధోరణి అదీ? నవ్యసాహిత్యపరిషత్తు విషయంలో కూడా జనార్దనరావుగారు సమానధర్మ లేనా ?

చాలా ఆశ్చర్యం కలిగింది.

* * *

ఇక యిప్పుడే మనుకున్నా యేమీ లాభం లేదు.

నవ్యాంధ్ర సాహిత్యరథాన్ని విశిష్టపంథాలో నడిపించగల ప్రముఖులలో వొకరైన జనార్దనరావు గారు అకాలమృత్యువు వాత పడ్డారు.

అయితే, వారి ఆత్మకి మేము శాంతి కోరము.

ఆంధ్ర సాహిత్యాన్ని గురించి, అది, అనేక విధాల మథనపడి పోయింది.

జనార్దనరావుగారు తమ కార్యక్రమం పూర్తిగా కాకపోతే కొంతవరకైనా సాగించడానికి తగిన సందర్భాలు లేకపోయాయి.

అంచేత యెవరెన్ని విధాల యెందరెందర్ని ప్రార్థించినా వారి ఆత్మకి శాంతి కలగదు.

కనక నేను జనార్దనరావు గారు మళ్ళీ - వెంటనే తెనుగు దేశంలో పుట్టాలని కోరుతున్నాను.

ఆంధ్రభూమి, ఆగస్టు, 1937.

# అశ్రు తర్పణం

## శ్రీ శివశంకరశాస్త్రి

కొంపెల్ల జనార్దనరావు ది....వం....గ....తు....డ....య్యా....డు !

1927 సం॥రంలో భారతి ఆఫీసుకు వెళ్ళి ఇవతలికి వచ్చినాక పెద్ద జుట్టు, ఎఱ్ఱటి ముఖం, సన్నటి శరీరంతో ఒక కుఱ్ఱవాడు కనబడ్డాడు. మామూలు మర్యాదలు అయిన తర్వాత తాను వ్రాసిన పద్యాలు వినిపించి అభిప్రాయం అడిగితే 'బాగున్నవి' అన్నాను. "నా కెవ్వరూ ఉత్సాహం యివ్వడం లేదు. మీరైనా ప్రోత్సహించాలి" అన్నాడా యువకుడు. అప్పటి నుంచీ నాకు జనార్దన రావు మీద అనురాగం ఏర్పడ్డది.

అతని పేర అచ్చుపడ్డ రచనలు తప్పకుండా చదువుతూ వుండేవాడిని. పద్యంలోగాని, వచనంలోగాని ఆయనది మామూలు పద్ధతి కాదు. దంతక్షతం వలె కొంత బాధ, కొంత ఆనందం కలుగుతుంది. మేము చాలా పర్యాయములు కలుసుకున్నాము. 1929లో నా "ఆవేదన" మీద అతను వ్రాసిన విమర్శకు నవ్వుకున్నాను. నా మీద అతనికి ఎంత ఆదరం ఉన్నా అప్రియమైన సంగతులు వ్రాయడానికి అతను జంకలేదు. ఈ మధ్య జనవాణి సంపాదకీయంలో 'తల్లావజ్ఝలవారి మీద నిర్మొహమాటంగా వ్రాసిన విమర్శకు దుమారం బయలు దేరింది' అన్నారు నాకు అటువంటిదేమీ కనపడ లేదు. అతను చెప్పిన వాటిలో రెండు న్యాయమయిన విషయాలు లేకపోలేదు. మా మైత్రికి ఏలోపమూ రాలేదు.

జనార్దనరావుకి పాండిత్యం లేకపోయినప్పటికీ సారస్వత విషయాల్లో మంచి అభినివేశం ఉండేది. అందుచేతనే ఏ గ్రంథమైనా, ఏ కవి రచన అయినా సూక్ష్మంగా ఖండశః పరిశీలన చెయ్యడానికి ప్రయత్నించేవాడు. అతనికి సమ్యగ్దర్శనం అంకురించలేదు. కాని అందుకోసం సాధనచేస్తూ వుండేవాడు. ఇంగ్లీషు భాషలో విమర్శ గ్రంథాలు—అతి నవీనమైనవి- చదువుతుండేవాడు. మన భాషలో తగిన విమర్శ గ్రంథాలు ఇప్పటికిన్నీ లేవు. సమ్యగ్దర్శనం గల రసికులు లేరు. జనార్దనరావు దీర్ఘాయువైతే ఎలా తయారయే వాడో !

కృష్ణశాస్త్రి "ప్రవాసము – ఊర్వశి" మీదా, బసవరాజు అప్పారావు "ఆంధ్రకవిత్వ చరిత్రము" మీదా వ్రాసిన విమర్శలు బాగున్నవి. విధానం

విపరీతంగా ఉండడంచేత తత్వం చప్పున గోచరించడంలేదు. కృష్ణశాస్త్రి తన పుస్తకం మీది విమర్శ విని "అయితే చివరికి ఏమన్నట్టు?" అన్నాడని ప్రతీతి.

భారతిలోను, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలోను ఇతని రచనలు, విమర్శలో కొంత నిపుణతను వ్యక్తపరుస్తున్నవి. ఉదయినిలో 'తృతీయః పరిధిః' — అలా వ్రాసేవాడు యిప్పుడప్పుడే ఎవరూ కనబడరు. అందుకనే కృష్ణా పత్రిక చమత్కారంగా "చండప్రచండ గండశిలాభినవ కొక్కొండ" అని బిరుదు ఉంచింది. జనార్దనరావు కూడా ఖులాసాగా తీసుకుని నవ్వుతూ ఉండేవాడు.

ఉదయిని పత్రిక పెడతానంటే వద్దని సలహాయిచ్చాను. పత్రికా నిర్వహణంలో ఉండే బాధలు నాకు బాగా తెలియడంచేతను, అతనికి అంగబలం చాలా తక్కువ కావడం చేతను ఎంతో చెప్పాను చాలా చిక్కుపడి పోతావని. తర్వాత నేను ఎక్కువ సాయం చెయ్యలేకపోయినప్పటికీ అతనిమీదా, అతని పత్రికమీదా అభిమానం గాఢంగా ఉండేది. 1933 లో లండన్ మెర్క్యూరీ సంచికల కట్ట అతనికి యిచ్చి ఇలాంటి పత్రిక తెలుగులో ఉంటే ఎంతో బాగుండు నన్నాను. తర్వాత జనార్దనరావు ఆ పంపిణీమీదే ఉదయిని నడిపాడు.

నాకు గాఢాభిమానపాత్రములయిన పత్రికలు మూడు అని బహిరంగసభల్లో చాలా సార్లు చెప్పాను - ప్రతిభ, ఉదయిని, వీణ. ఈ మూడు పత్రికల మీదా నాకు గాఢానురాగం. జనార్దనరావు యిహలీల చాలించి నప్పటికినీ మిత్రులు మల్లంపల్లి సోమశేఖరశర్మ, శీలంశెట్టి గోవర్ధనరావుగార్లు ఉదయినిని నడపడానికి పూనుకోవడం చాలా శ్లాఘనీయం.

జనార్దనరావు కొన్ని సభలలో ఉపన్యసించడం నేను చూచాను. వాక్ప్రవాహం అట్టే లేకపోయినా విషయం బాగా అవలోడనం చేసి సభ్యుల ఎదుటఉంచే వాడు. జనార్దనరావుకి సంగీతంతో గూడా మంచి అభిరుచి ఉండేది. పద్యాన్ని మంచి ఒడుపుగా చక్కగా చదివేవాడు.

నాకు ఒకందుకు అతన్ని చూస్తే ముచ్చటగా వుండేది. అతనికి బ్రాహ్మణ ధర్మంమీద మహాభక్తి. సంధ్యావందనం చెయ్యంది భోజనము చేసేవాడు కాడు. ఆకార ప్రకారాలను బట్టి నిష్ఠాపరుడని కనుక్కోలేముగాని నిత్యం అనుష్ఠానం జరుపుకునేవాడు. సాహిత్యంలో కొంత పంపిణీతీసినా ఆచార వ్యవహారాల్లో ఆర్ష ధర్మాలను అనుసరించేవాడు. సాంప్రదాయమైన వైదిక కుటుంబంలోనివాడు.

జాతక కథల్లో ఒకటి కావ్యంగా చెయ్యడం ప్రారంభించాడు. నాకు విని పించిన ఎనిమిది పద్యాలూ దుర్భేద్యంగా ఉన్నా కావ్యం గాఢ పాకంలో ఉండి అస్మదాదులకు ఆనందం కలిగించేదేమో!

జనార్దనరావు స్నేహపాత్రుడు, వినమ్రశీలి, మితభాషి, సద్బ్రాహ్మణుడు. త్వరపడి వివాహం చేసుకోక నిష్ఠగా జీవితం గడుపుతున్నవాడు. వైద్యులు జీవి తాశ విడిచినప్పుడే నేను కన్నీరు విడిచాను. యోగ్యుడగు జనార్దనరావుకు ఊర్ధ్వ లోక ప్రాప్తియగు గాక!

శివశంకరశాస్త్రి
నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు.

ఉదయిని ప్రారంభించి నప్పటినుంచీ ఆయనతో నాకు లేఖల ద్వారా పరి చయమున్నా, ఆయనతో ముఖపరిచయం కలిగింది ప్రథమములో ౧౯౩౬ ఫిబ్ర వరిలోనే అయితే మాకు శీఘ్రంగా మైత్రి ఏర్పడ్డది. అందువల్ల అతని అకాల మృత్యువుకు నాకు కలిగిన విచారము వేరే చెప్పనక్కరలేదు.

అతనికి సంస్కృతాంధ్రములో చక్కని వ్యుత్పత్తి ఉన్నది. ఆంగ్లభాషా జ్ఞానమువల్ల దానికి మెరుగువచ్చి అతను చక్కని రసజ్ఞతను అలవరుచుకున్నాడు. మితభాషి. అన్ని అర్థములలోనూ అతనొక మౌని. సారస్వత సేవకు మహా తపస్సు చేస్తూ ఈ జన్మలో సిద్ధిపొందకుండా గతించినాడు. మన సాంప్రదాయ ప్రకారము తపస్సు వృథాపోదు. అతని వ్రాతలన్నిటిలో ఆ తపస్సే ప్రతిఫలిస్తున్నది.

రేపల్లె.
నోరి నరసింహశాస్త్రి

౧౯-౨-౩౭
వీణ [సంపుటి ౪ సంచిక 2]

# కన్నీరు

## శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య

ఇంచుమించు ఇరవయి అయిదేండ్ల లేప్రాయంలో జీవిత సౌఖ్యాన్ని ఏమాత్రమూ అనుభవించడానికి నోచుకోకుండానే ఏడెనిమిది నెలలపాటు క్షయతో నవిసి నవిసి కృశించి, అసలే దుర్బలమూ, కృశమూ అయిన శరీరం శిథిలం కాగా సహృదయుడు జనార్దనరావు అపమృత్యువు పాలయి పోయినాడు. కొని తెచ్చుకున్నాడు ప్రాణాంతకమయిన పాడు జాడ్యాన్ని ఆలోచన లేకుండా. తన పనే అది అన్నట్లుగా ఆ జాడ్యం జనార్దనరావును మింగివేసింది.

జనార్దనరావు వయసులోనూ, అనుభవంలోనూ చిన్నవాడే కాని వ్యక్తిగత గుణాల్లో ఎంతో పెద్దవాడు. ఆంధ్ర సాహిత్య సంస్కార విషయంలో అతనికి ఎన్నో భావాలు! ఎన్నో ఊహలు! కొన్నయినా రూపు కట్టుకుంటేనా? ఏవేవో ఆశలు! కొన్నయినా తీరడమంటూ ఉంటేనా? ఎంతో విజ్ఞానం! అది బయట పడడానికి తగిన అవకాశం లభిస్తేనా? ఏమిటేమిటో ప్రయత్నాలు! సాయం దొరికి ఏపాటయినా సఫలం అయితేనా అవి? ఏదీలేదు. అన్నీ అరకొరలే. అహోరాత్రాలు నిద్రాహారాలు లేకుండా శ్రమపడ్డాడు. అంతా నిష్ప్రయోజనమే; అంతటా ఆశాభంగమే. ఆ పాట్లన్నీ ప్రాణానికే ఎసరుపెట్టినవి. అతని జీవన జ్యోతి కాస్తా ఆరిపోయింది. ఇంక జనార్దనరావు లోకం కండ్లకు కనుపడడు. మనస్సులో మాత్రం పరిచితులకు అతని చిన్ని నవ్వు ముఖమూ, మెరుగులు చిమ్మే కండ్లూ, అమాయకతను ప్రకటించే పొందికా, వీటితో అతని ఆకృతి పొడగట్టుతూ ఉంటుంది ఎల్లప్పుడున్నూ.

ఎనిమిదేండ్లకు పూర్వం 'భారతి' సంపాదకవర్గంలో ఒకడుగా ప్రవేశించాడు. ఐదారేండ్లపాటు తనకని ఏర్పడిన, ఏర్పరిచిన పనులను జవాబుదారితో నిపుణతతో నిర్వహించాడు. అతని ప్రవర్తనలో కలుపుగోలుతనం ఉంది. కాని ఆత్మగౌరవానికి ముందు దానికి చోటులేదు. అలాటిదే యుక్తమయిన ప్రవర్తన; మిక్కిలి మెప్పును పొందే ప్రవర్తన.

జనార్దనరావు పాండిత్యంలో అంత పెద్ద కాడు; కాని సంస్కారంలో పెద్ద. అందులో పెద్ద పండితులనబడే పలువురెంతో చిన్న లతనికి. ఇటీవల అతడు, పాపం, పెద్దపాండిత్యంకోసం ప్రాచీ ప్రతీచీ సాహిత్యక్షేత్రాల్లో నిరంతరం కృషి

చేయడానికి పూనుకున్నాడు. బతికే ఉంటేనా, కొలదికాలంలోనే ఉభయ క్షేత్రాల్లోనూ గొప్ప పాండిత్యాన్ని పండించుకోగలిగేవాడే. ప్రాచీన నవీన విజ్ఞానాలు రెంటిలోనూ మేలువాటిని ఏరుకోగల శక్తి అతనికుంది; వాటిని ఉపయోగించుకొనే శక్తికూడ ఉంది. అన్నింటికి కొత్తదనాన్ని తేవాలనేది అతని సంకల్పం. అందుకనే కొత్తపక్కి రచనలో తన భావాలను కొత్తమార్గంలో వ్యక్తీకరించేవాడు. అందులో ప్రత్యేక వ్యక్తిత్వం ఆయనదే.

అతని హృదయంలోవలెనే అతని రచనల్లో భావాలు చాలా లోతులో ఉంటవి. రచనలో బిరువు ఆ భావాలని పైకి తేలనీయకుండా తొక్కిపెడుతూ ఉంటుంది. అందుచేతనే ఆ లోతుల్లో ఉండే భావ విశేషాలు సామాన్యంగా అందవు. అందజేసుకోడానికి ప్రయత్నం చేద్దామన్న బుద్ధికూడ పట్టదు ఆరచనను చూస్తే చాలామందికి.

జనార్దనరావు బుద్ధి చాలా చురుకయింది; స్వభావము స్వతంత్రమయింది. మోమోటం అంటే ఏమాత్రమూ గిట్టదు; చెప్పవలసింది చెప్పేటప్పుడు వెనక ముందులు చూడడమనేది లేదు. కాని సౌహార్ద్రానికి మాత్రం భంగం కలగదు.

అతను విమర్శనలు చాల సున్నితంగాను, ఉదారంగాను నడిపిస్తాడు. అందులో పక్షపాతం ఉండదు. గుణదోషపరిశీలనం సప్రమాణంగా, తిరుగులేకుండా ఉంటుంది.

అతని రచనలన్నింటిలోనూ అతని భావి ప్రయోజకత్వాన్ని స్ఫురింపజేసే ఒక విలక్షణత ఉంది. కాని అతనే లేకుండా పోయినాడు.

అతనిలో చిరకాలాన్నుండి ననలు సాగుతూ ఉండిన ఊహలు పండి ఉదయిని పుట్టుటకు బీజాన్ని తయారుచేశాయి. దానికోసమని మూడేండ్లనాడు భారతిని వదలుకున్నాడు. ఒక్క ఏడాదిపాటు దానిని ఎలాగో సాగించాడు. అవతల సాగుదలకు ధనాభావం అడ్డుతగిలింది. పెట్టుబడికి తనవద్ద పైసాలేదు. పైవాళ్ల దయాదాక్షిణ్యాలమీద ఆశపెట్టుకొని ఎంతకాలం సాగించవచ్చు 'ఉదయిని' లాంటి పత్రికను! వెనుకకు పడిపోయింది పత్రిక. ఎట్లా దాన్ని ముందుకు తేవడం అనే బెంగ పట్టుకుంది అతణ్ణి. ఉపాయాలు ఆలోచించడంలో, ప్రయత్నాలు చేయడంలో ఎంతో శ్రమపడి క్షీణిస్తూ ఉండే అతణ్ణి సులువుగా క్షయ ఆక్రమించింది. దాంతో క్షయించి రూపుమాసిపోయినాడు తాహత్తు తెలియని జనార్దనరావు. ఉదయిని, దాని గొప్పతనం ఏమయిన నగుగాక, సహృదయుణ్ణి జనార్దన

రావును తుదముట్టించడానికి ఉదయించింది! లేకుంటే ఎంతకాలం బతికేవాడో, ఎంత ప్రయోజకుడయ్యేవాడో. స్వస్థంగా జీవితం గడుపుకుంటూ ఉంటే, అంతా మూణ్ణాళ్ళ ముచ్చటయిపోయింది. నవ్యాంధ్ర సాహిత్యచరిత్రలో అతని చరిత్ర ఒక పెద్ద అధ్యాయం కావలసింది. ఆ అధ్యాయం ఈవిధంగా, ఇంతలోనే, ఇట్టే ముగిసిపోయింది.

భారతి 1937 జులై

"భారతి ఆఫీసులో గన్నవరపువారేగాక ఇతరులు ఉండేవారు. కొంపెల్ల జనార్దనరావుగారనే యువకుడు పనిచేసేవాడు. సంస్కృతం కూడా ఎరిగినవాడు. హరనాథ్‌బాబా భక్తుడు. భగవంతుడు చిన్నచూపు చూసేడు. చిన్నతనంలోనే పరమాత్మను చేరుకొన్నాడు. టి. వి. రంగాచార్యులుగారు కొత్తగా చేరేరు."

వేకుమళ్ళ కామేశ్వరరావు

నా వాఙ్మయ మిత్రులు

1966, పే. 22



మా "జన్ని" మమ్మలని దుఃఖ సముద్రంలో ముంచి ఇహ యాత్ర ముగించాడు. తన నిష్కళంకమైన ప్రవర్తనతో మాకు ఆదర్శం చూపించాడు. తన అపారమైన ప్రేమతో మమ్మల్ని బంధించాడు. స్నేహితుల ప్రేమతో తన ఆత్మకి శాంతి నెలకొల్పుకొన్నాడు.

మమ్ములను దుఃఖ సముద్రంలో ముంచి యీ యాత్ర చాలించాడు మాజన్ని".

కె. రత్నాజీరావు

28. 6. 1937 ఆంధ్రపత్రిక (దినపత్రిక.)

క్రీ॥శే॥ కొంపెల్ల జనార్దనరావుగారు

# సానుభూతి

ఆంధ్రసారస్వతమందభిమానముగల రేపల్లె పౌరులు నేటి బహిరంగ సభలో ఈ క్రింది తీర్మానమును ఏకగ్రీవముగా ఆమోదించారు.

ఆధునిక ఆంధ్ర సారస్వతానికి విశేష సేవ చేసిన కీర్తిశేషులైన కొంపెల్ల జనార్దనరావుగారి అకాల మరణమునకు ఈ సభవారు చింతిల్లుచు వారి కుటుంబమునకు సానుభూతిని తెలుపుచున్నారు.

వారి ఆత్మకు పరమేశ్వరుడు శాంతిని ఇచ్చుగాక.

నోరి నరసింహశాస్త్రి

దేశిరాజు

1-7-1937. ఆంధ్రపత్రిక (దినపత్రిక)



"కొంపెల్ల జనార్దనరావు మంచి పండిత వంశంలో పుట్టిన స్ఫురద్రూపైన యువకుడు. కొంతకాలము 'ఉదయిని' అనే పత్రికను కూడ నడిపి భాషాసేవ చేసినాడు. కాని యితడు ఒక విధమైన సులభముగా అర్థముకాని భాషను అలవాటు చేసుకున్నాడు. 'స్వర్ణయోగి', 'వెలుగు' మొదలైన ఏకాంకి నాటకకర్త కూడాను. జనార్దనరావు చాలా అభివృద్ధికి రాదగినవాడు! మంచి అభివృద్ధికి వచ్చేదినాలలో దేవుడు సన్నిధికి లాక్కున్నాడు.

కురుగంటి సీతారామభట్టాచార్యులు

పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు

# జనార్దనరాయ సంస్మృతి

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు

ఓ కవిమౌనీ ! అదృశ్య
లోకాశ్రిత సత్త్వాణీ
ఓ జితమృత్యూ ! స్మృతిగత
పూజితచారిత్ర ! మిత్ర !

నీసుతీక్ష్ణరుద్రవీణ
నిశితసూక్ష్మ నిస్వనమ్ము
నాహృదార్ద్ర రక్తనాళ
నాళాగ్రకణాల మ్రోగు !

నేటి సందె చీకటి తెర
మాటున ఏ సడి రేపని
గాటపు నిట్టూరుపు లే
బాట రొదలో దరిసి యాగు !
ఓ కవిమౌనీ !

అది చీకటి నిశీథమో ?
అరుణోదయ ముహూర్తమో ?
శీతల మృత్యునిమంత్రణ
శిరసావహించువేళ !

బెదదిల్లక, తడవొల్లక,
కదకోరిక నెదనిల్పక

కొంపెల్ల జనార్ధనరావు

వెడలితివో - జడలినావో
అడవిదారి, కదలిమీరి !

పెనుచీకటి పరపారమె
వరియించితివో, పరమే
శ్వరవాణికి నొదబడి, న
శ్వరధారుణి చెరయని విడి !
ఓ కవిమౌనీ !

ఆర్జించిన మన సౌహృది
వర్జించితివేలో ? త
న్నిర్జరసాంగత్యాప్తత
నిరసింతువొ నరసంగతి ?

నవ వాసంతవిలాసము,
భువనానందోల్లాసము,
సురసీమా పరవాసము
సరి రావో మోక్షరాగి ?

నరజీవిత సరసాత్మక
పరిణామ మ్మిల గాదో ?
పరివంచిత వరయౌవన !
విరసాత్మా ! మృత్యుభోగి !
ఓ కవిమౌనీ !

ప్రతిభ 1938 జనవరి.

# కొంపెల్ల జనార్దనరావు

## శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

కొంపెల్ల జనార్దనరావుతో నాకు మొట్టమొదటిసారి ౧౯౨౮వ సంవత్సరం మద్రాసులో తంబుచెట్టి వీధిలో పరిచయమైంది. ఆయేడే కొత్తగా నేను చదువు కోసం మద్రాసులో అడుగు పెట్టాను. మా నాన్న క్రిష్టియన్ కాలేజీలో నాకు బి. ఏ., జూనియర్ తరగతిలో సీటు సంపాదించి తంబుచెట్టి వీధిలోని ఫస్ట్ స్టూడెంట్సు హోమ్‌లో నన్ను ప్రవేశ పెట్టి విశాఖపట్నం వెళ్ళి పోయాడు. హాస్టలులో అందరూ నాకు కొత్త. అసలు మద్రాసు నగరమే ఒక మహా సముద్రంలాగ కనిపించేది. అప్పుడు నా వయస్సు ౧౮ ఏళ్ళు, నా కంటె జనార్దన రావు ఒకటో, రెండో ఏళ్ళు పెద్ద. తంబుడు కాదు అన్నే కాబోలు అని ఒక ఉత్తరం ముగించి సంతకం చేశాడు. వస్తున్నా అప్పటికింకా జనార్దనరావుని ముఖస్థంగా కలుసుకోలేదు. అంతకుముందు ఒకటి రెండుసార్లతని పద్యాలు చదివాను. ఇప్పటికీ తంబుచెట్టివీధిలో ఉంటున్న ఒక సుప్రసిద్ధ మాసపత్రికలో అప్పుడే పేరుతో నా కొకానొక భావ బాంధవ్యం ఏర్పడింది. జనార్దనరావు నాకన్న బాగా పద్యాలు రాయగలడని; నాలో నేనే రహస్యంగా అంగీకరించాను. కాని నేను కూడా అతనికేమీ తీసిపోనని నాలోని స్వాతిశయం నన్ను హెచ్చరించేది. అవి భావకవిత్వపు రోజులు. సాహిత్య లోకంలో సాహితీ సమితి నాయకత్వమూ, అందులో మళ్లీ చీలికలూ, తిరుగుబాట్లూ, కొంతమంది తప్పుకోవడమూ ఇవీ ఆనాటి హెడ్‌లైన్ న్యూస్.

అందే సాహిత్యం కోసమే ప్రత్యేకించిన దిన పత్రికలుంటేమాట : ఆనాటి సాహిత్య ధోరణులన్నింటికీ స్థానం ఇస్తున్న ఒకే ఒక పత్రిక ఇందాకా నేను చెప్పిన పత్రిక. అందులో నీ పద్యం పడిందంటే కవిగా నీకు సాహిత్య లోకంలో జాగా దొరికిందన్నమాట. కథ పడిందంటే కథకుడుగా నిన్ను లోకం గుర్తించిందన్న మాట విమర్శ వ్యాసం రాశావంటే, నీ అభిప్రాయాలు విలువయినవన్నమాట. నీ పుస్తకాన్ని ఆ పత్రిక మెచ్చుకున్నదంటే, నువ్వు గొప్ప రచయితవి, అటు

వంటి ఆ పత్రికలోనే జనార్ధనరావు సబ్ ఎడిటరుగా పనిచేస్తున్నాడు. ఉండండి. ఆ సంగతి నాకప్పుడే తెలియడంలేదు. ఎలా తెలిసిందో ఇప్పుడే చెప్పబోతున్నాను.

నేనూ ఈ మాసపత్రికా ఒకే వీథిలో ఉన్నాం కాబట్టి మద్రాసు రాగానే నేను చేసిన మొదటి పనుల్లో మొదటిది ఈ పత్రికా కార్యాలయంలో అడుగు పెట్టడం. అక్కడ గన్నవరపు సుబ్బరామయ్య గారిని కలుసుకున్నాను. ఎడంగా ఒక కుర్చీమీద ఇంకో కుర్రాడు కూర్చున్నాడు. గంటో గంటన్నరో ఉన్నాను. అవీ ఇవీ మాట్లాడాను సుబ్బరామయ్య గారితో. నా పద్యాలు కూడ ప్రచురణార్థం ఇచ్చానేమో ఇప్పుడు సరిగా జ్ఞాపకం లేదు. తర్వాత నడుచుకుంటూ వచ్చేశాను ఇవతలికి. వీథికొసకి వచ్చేదాకా వెనక్కి తిరిగి చూడలేదు. నా వెనకాతలే వచ్చాడు ఇందాకటి కుర్రాడు. శ్రీనివాసరావు గారూ అని పలకరించాడు. ఒకసారి అతణ్ణి ఎగాదిగా చూశాను. బక్క పలచగా ఉన్నాడు. ఖద్దరు లుంగీ, ఖద్దరు చొక్కా వేసుకున్నాడు. ఎర్రటి వొళ్లు, సూది ముక్కు, సూదుల్లాంటి కళ్లు. పత్రికా కార్యాలయంలో చూసిందితణ్ణే. మనకెందు కులే అని అప్పుడు మాట్లాడలేదు. కాని ఎందుకో ఇప్పుడితనే కొంపెల్ల జనార్ధన రావయి ఉంటాడనిపించింది. మీరు కొంపెల్ల జనార్ధనరావుగా రనుకుంటాను.... అని పుస్తకంలో అచ్చయిన పూర్తి పేరు చదువుతున్నట్లు అనేశాను....ఔను అతనే. అతని రచనల్లోని....గానము విపంచికను మీటే....పద్య పాదాలు మనస్సులో సందడిచేశాయి. ప్రథమ పరిచయం. పక్కనే లింగిచెట్టి వీధిలో ఉంటున్నానని అడ్రెస్ ఇచ్చాడు. తర్వాత ఎన్నోసార్లు అతణ్ణి ఇంటివద్దా పత్రికా కార్యాలయంలోనూ చూశాను. ఎప్పుడూ అతను మా హాస్టలుకి వచ్చినట్లు జ్ఞాపకం లేదు. నేను ఆహ్వానించకపోవడంవల్లనో ఏమో అనిపించుతుందిప్పుడు. అటువంటి సాంఘిక మర్యాదలను పాటించడం అప్పుడూ ఇప్పుడూ కూడా నాకు తెలియదు. నేను పిలిచి ఉంటే వచ్చేవాడేమో....పిలవకపోవడం నా తప్పేమో? ఎందుకూ ఎక్కడైతేనేం విధిగా ప్రతిరోజూ మేం కలుసుకుంటూనే ఉండేవాళ్ళం. రెండేళ్ళు ఇలా గడిచాయి. మళ్ళీ మేము దూరం అయిపోయాం. తరచు ఉత్తర ప్రత్యుత్తరాలు మాత్రం సాగించేవాళ్ళం. ప్రపంచాన్ని భయానక బీభత్స రసాల్లో ముంచెత్తిన ౧౯౩౦ల దశాబ్దపు రోజులు. దరిద్రపు రోజులు. ఆ పది సంవత్సరాలూ నేను బంతిలాగ ఉన్నచోట ఉండకుండా గెంతాను. ఆ పదేళ్లలోనే నా మహాప్రస్థానం గీతాలన్నీ - అన్నీ కాకపోయినా ఆల్మోస్టు అన్నీ రాశాను. ఆ పదేళ్ళు అంతం కాకముందే జనార్ధనరావు మరణించాడు. అతనికే నా మహాప్రస్థానం అంకితం ఇచ్చాను. అది వేరే సంగతి.

ఒక మనిషికి ముప్ఫయి యేళ్ళు వచ్చాయంటే మనిషిగా అతని జీవితం ప్రారంభం అవుతోందన్నమాట. పాపం జనార్ధనరావు జీవితం ప్రారంభించక ముందే మరణించాడు. ఎంతోమంది కాతని పేరు తెలియదు. ఎలా తెలుస్తుంది.

ఎందుకు తెలియాలి : అతను బతికున్నంతకాలం అతని రాత లెవరికీ అర్థం కావని ఒకటేగోల. పద్యాలమాట సరేసరి. వచనం కూడ అందరికీ కొరకరాని కొయ్యే. ఒక ఉదాహరణ. వైశాఖి సంచికలో జనార్ధనరావు తన కవిత్వంమీద వ్రాసిన వ్యాసాన్ని కృష్ణశాస్త్రి గారు ఆసాంతం చదివి, ఆఖరుకి....అయితే ఏమిటయ్యా ఇతనంటాడు ? ఇందులో నన్ను పొగడినట్టా, తిట్టినట్టా? అన్నాడు. ఒక ప్రముఖ వారపత్రిక ఆనాటి సాహిత్యకులందరికీ సరదా బిరుదులిస్తూ ఉండేది. జనార్ధన రావుని చండ ప్రచండగండ శిలాభినవకొక్కొండ....అని అభివర్ణించింది. మరి నన్నో....కవిమహాతృణావర్త....అని కాబోలు అంది. కాబోలేమిటి....ఔను. జనార్ధనరావు మాత్రం తన బిరుదులోని శబ్దగమనం అనుకరిస్తూ నన్ను, దండి పద పదండి మండితాభి నవదండి....అన్నాడు. సరదాగానే ఉందిగాని ఈవర్ణన నాకు సరిపోయిందని ఆనాడు అనుకోనూ లేదు. ఈనాడు అంగీకరింపనూ లేదు. జనార్ధనరావూ నేనూ ఎప్పుడూ వాదించుకొనేవాళ్ళం కాం కాబట్టి, అతని వర్ణనని నేను చిరునవ్వుతో స్వీకరించాను. నాకిచ్చిన బిరుదును జనార్ధనరావు తమాషాగా వ్యాఖ్యానించాడు. తొలిదండి తెలుగు పదమనీ, చివరిదండి సంస్కృత పదమనీ వివరించేవాడు. చెప్పొద్దూ. జనార్ధనరావులో ఉన్న ఒక గొప్ప సుగుణం ఏమి టంటే, తన అభిప్రాయాలను ఎవరిమీదా బలవంతంగా రుద్దేవాడు కాదు. ఎన్నో పర్యాయాలు మేం ఎన్నో విషయాలమీద మాట్లాడుకునేవాళ్లం. ఎప్పుడూ మాట మీద మాట అనుకున్నట్లుగాని ఎన్నడూ గొంతు హెచ్చించి కొట్లాడుకున్నట్టుగాని నాకు జ్ఞాపకం లేదు. జనార్ధనరావు మొగంమీద నే నెప్పుడూ కోపం అనేది చూడ లేదు. నిస్పృహ చూశాను. నిరాశ చూశాను. అందులోనే ఒక అజేయమైన పట్టు దలకూడా చూశాను. బాధపడడం చూశాను. ఆఖరాఖరి రోజుల్లో ఒక మూడు రోజులు జనార్ధనరావు కాబోలు మా యింట మంచంపట్టాడు. ఎంత బాధ పడ్డాడని. నేను నిస్సహాయంగా అతనితో అన్నాను....జనార్ధనరావు గారూ, ఆరోగ్యంగా ఉండి కూడా నేను మీరెంత బాధపడుతున్నారో అంత బాధాపడుతున్నానంటే నమ్మండి... అని. కేథలిక్కు ప్రేమనుగురించి చెబుతారులెండి. నువ్వు ప్రేమించిన వ్యక్తికి కుడికాలు నొప్పిగాఉంటే నీ కుడికాలికి కూడ ఆ నొప్పి ఉంటుందని, జనార్ధనరావు విషయంలో సరిగా అనుభవం నాకు కలిగింది....ప్రపంచ బాధ శ్రీశ్రీ బాధ....అని నా గురించి చలంగారు రాసిన అభిమానంతో కూడిన అతిశయోక్తికి ఇ అర్థం అనుకుంటాను. ఎంచేతంటే, ప్రపంచంలో ఎంత బాధ ఉందో ఎవ్వరూ కొలవలేరు అదంతా ఏ ఒక్క మనిషీ తన ఒక్కడిలోనే అనుభవించగలగడం అసాధ్యం. బుద్ధుడైనాసరే, జీసస్ అయినాసరే, గాంధీ అయినాసరే,....మన కంటే మరికొన్ని రెట్లు ఎక్కువ అనుభవిస్తారు. అంతే మనిషికంటే ప్రపంచం గొప్పది. మనిషి కంటె మనుషులు గొప్పవారు అంతే. సరే ఈ వేదాంతాలకేంకాని జనార్ధనరావు

గురించి చెప్పుకుందాం మళ్ళీ. జనార్దనరావంటే ఉదయిని. ఉదయిని అంటే సాహిత్య స్వరూపాన్ని తీర్చి దిద్దడానికి ప్రతిజ్ఞ పట్టిన పత్రిక. ఆ పత్రిక కోసమే బలైపోయాడు జనార్దనరావు.

....ఎవరికి కావాలి నేస్తం నువ్వు
కాగితం మీద ఒక ఊహకు బలి అయితే
కనబడని ఊహ నిన్ను కబళిస్తే
అందని రెక్క నిన్ను మంత్రిస్తే, నిమంత్రిస్తే....

అని జనార్దనరావుకి నా...మహాప్రస్థానం...అంకితంచేసిన గీతంలో రాశాను.

....ఉదయిని....పత్రిక ప్రారంభించడానికి తహ తహ పడుతున్న రోజుల్లో జనార్దనరావు నాకు చాలా ఉత్తరాలు రాశాడు. అందులో ఒకటి పూర్తిగా చదువుతాను. కొంచెం దీర్ఘమైన ఉత్తరమే. కాస్త ఓపికగా వినండని ప్రార్థన.

మద్రాసు, 26-6-33

డియర్ శ్రీ శ్రీ

మీ జాబువల్ల నాకు కలిగిన ధైర్యము ఇంతా అంతా కాదు. నాకు సహజముగా అధీరత ఉంది. దానికి సాయము బాహ్య పరిసరాలు జడిపిస్తే మరీ ఇదిగా ఉంటుంది. ఒకవేళ ఆ సున్నితమైన మనస్థితి చేతనే కొంచెము అనుకూలమైన వాయువు వీచినా ఎక్కువ పారవశ్యముపొందే వెర్రి ఉంటే ఉండవచ్చును. కాని ఇట్టి నేను ఒక కేంద్రములో నాతపోమయమైన వాతావృతి చుట్టుకొని సర్వమూ పరికిస్తూ ఉంటానన్నది నాకు తెలిసిన సత్యము. దానినిబట్టి నాలో మిగిలిన మూలగతములైన సంకల్ప వికల్పాలు నన్ను బోధించుతాయి. అక్కడ తాకింది మీ అనుకూల్యము, నా సంకల్పములో ఒక మెరుగు చొచ్చింది. అయితే అది మళ్ళీ మీరు అనే ఒక మూర్తిలో నిలుపుకొని నాకు సాయము చేయండి....నాకు వ్యాసము పంపండి అని ఉద్భావించుకుంటూనే ఉంటాను.

నా మనసులో మీరు రేపిన తేజము వికసించిన రేకులు నేను చూచినంతగా మీకు చూపలేక పోతున్నాను. నేనట పత్రిక నడుపుతానట. ఏమోమరి నడుపుతానటకూడాను. ఎల్లాగో చూచుకొందాములే. నా తేజము నేను చూచుకోవడముతోనే అందరికీ చూపుతాను కాబోలు. నేడు ఉపవసిస్తున్నాను నేనంటే జనార్దనరావు అవకాస్యపావత్సార స్సైంధ్రువత్రయమున ప్రవరాన్వితుడని మాత్రం గ్రుద్దుకతూ........ మనస్సులో. సరే ఈ వేదాంతాలకేంలెండి. నేను మీకు సమాధానము వ్రాద్దామనుకుంటుంటే అప్పలస్వామిగారి ఉత్తరము వచ్చింది. ఇప్పుడే ఉత్సవ ప్రయత్నాలకు ఉత్సవం పాటించారు. మీరు ఇక్కడకు వచ్చే ఏర్పాటుమాట వెంటనే తెలియజేయండి. మీరు ఇక్కడుంటే చాలా బాగుండును. కాని ఇక్కడ

వున్నా ఇక్కడ ఉన్నట్లే వర్తించాలి. ఊరుకుంటే వల్లకాదు. ప్రార్థిస్తే కోప పడుతారని నేనే కోపపడుతున్నాను. వెంటనే ఒక సహాయం - వ్యాసాలు ఉత్కృష్ట మైనవి పంపించేయండి. నేను చూచుకొని పొంగుతూ ఉంటాను. స్టాండర్డు విషయంలో చాలా శ్రద్ధ తీసుకుందాము. నాకూ అదే పెద్ద తాత్పర్యము. నిజానికి డబ్బు విషయంలో కంటె కూడా స్టాండర్డు కంట్రిబ్యూషన్సు వచ్చే అవకాశం విషయంలో ఎక్కువ తలంపు నిల బెట్టాము మొదటి నుంచీని. పత్రిక ఉన్నత వీధులలో నడపడానికి సర్వశః ప్రయత్నిద్దాము. నడపగలమని నాకు ధైర్యము కల్గుతూంది. ఈ పత్రిక మనయువలోకమునకు ప్రతినిధులముగా మన కను బంధించి ఒక దివ్యమైన సాధన అని అనుకుందామని ఉంది నాకు. ఇది నెగ్గిందంటే సారస్వత చరిత్ర మెరుగు తిరిగిందన్న మాట అని మనలను మనమైనా మనస్సులో పొగడుకుందామని ఉంది. ఆహవిస్సు ఆరగించి నా సిగ్గు తొలగిస్తూంది. కాని నా మానమూ నిలుపుతుంది, స్తుతిపాఠమంతా సిగ్గులు మూటకట్టిస్తూ.

ఎంతెంత రహస్యాలు చెప్పాననుకొన్నారు మీకు? ఆస్థానములో వైరుద్ధ్యము కోటలుకట్టే బలశాలులు ఇవి. ఇది మీకు ప్రశంసగా ఇస్తున్నాను. మీ మానవత్వానికిన్ని! మీరు చాలా గొప్పవారు అని నా నమ్మిక. నిజముగా భాషాదేవి సేవచేయడానికీ, దేవలోకమంతా కదిలిపోయే వినీత దీక్ష ప్రజ్వరిల్లిన మానసము మీది మీకు తెలుసునా?

మన సోదరులకు నమస్సులివ్వండి. పత్రిక విషయమై సలహాలు ఇవ్వండి. చాలామంది యువమిత్రులు అభయము చూపుతున్నారు. వారంతట వారే నన్ను పత్రిక పెట్టమన్నవారు కూడా ఉన్నారు

అయితే నా ప్రజ్ఞ విషయములో నాకు చాలా భయము వేస్తున్నమాట వాస్తవము. నేనే గొప్ప రచనలు వ్రాసిపెట్టుకోవలసి ఉన్నది. ఇంకా తగినంత సిద్ధముకాలేదు. ప్రయత్నములో ఉన్నాను. నాకు నేనుగాకూడా ఎంతో సలహాలు ఇవ్వండి.

తంబుదు, కాదు,
అన్నె కాబోలు
జనార్దనరావు.

ఇప్పుడు చదవండి జనార్దనరావు గీతాలు. ఎందుకు అర్థం కావో చూదాం. కాని అవన్నీ ఎక్కడున్నాయి? గ్రంథరూపంలో ఎప్పుడు బయట పడతాయి? ఈ లోపున నాకు వచ్చిన, నాకు కంఠస్థంగా వచ్చిన ఒకటి రెండు గీతాలు చదువుతాను ఒక గీతం....

## అవాహము (మహోదయం సంకలనం)

నాభావి పథము పంచల నెందు నొదుగుచు
వేచియుందువొ కాలవిభు చోదనము లెంచి
అవతరింపుమి దేవి ఆవహింపుమి నను
నాగుండె విరియు ఈనాడె ఆ శుభవేళ

ఓ విజయలక్ష్మి.

ఆకశింతలు మెలగి ఆవేశమయి పొంగి
నీ క్రమపద తపోనిరతి పెంపు వెలింగి
ఏననంత పథాలకే దాగికొని నిల్చి
అల దివ్యవాణి ఆజ్ఞలు మీటుకున్నాను

అవతరింపుమి.

వింతయౌ నొక స్వప్న వీథి విహాయస
ప్రాభవశ్రీలో శంపలు లోన నిలబోసి
ఇటు మేలుకొల్పి జాగృతినే హరింపవు
విశ్వమ్మె నాస్వప్నవిజయమే వరియించు

అవతరింపుమి.

విశ్వయాత్రకు లాత్మవిభు స్వప్న కలశముల్
నీ తేజమున కడంగిరి జ్యోతిషాకృతుల్
నామాధురీ ధురీణము భావజగతిని
పోహణింపుమి నీప్రభూత లావణ్యముల్

అవతరింపుమి.

నా మహేచ్ఛా ప్రభావము నాకె ఐక్యమై
విశ్వవారిజము స్వావృతమహా సౌందర్య
పరిధి అంచులు తాక విరిసి భౌతిక భూతి
విరిసిపో, నాలోన విస్మృతి గుణించుకో

అవతరింపుమి.

నే రవిత్వము వెలింగిన రాపిశుల్ వడి
ప్రకృతి హృత్ప్రణయ వైభవము నెద కుంచించి
పరిమితుల్ వలదు తత్పరవృత్తి తెరవిచ్చి
ప్రళయగర్వ పథాన కరదృష్టి మలచుకో

అవతరింపుమి దేవి ఆవహింపుమి నను
నా గుండెలవియు ఈనాడె ఆ శుభవేళ

ఓ విజయలక్ష్మి

ఇంకొక గీతి, ఉపేక్షితము.

## ఉపేక్షితము

ఒక ముసలి దోనె యిది పడియున్న దిచట
ఊడిగముసేఁత సత్తుపలుడిగి యుడిగి
తనకు దా మృతస్మృతులు కల్పనము సేసి
కొనుచు తనపయిఁదా జాలిగొనుచు నిట్లు.

అఖిల జనవాత్సల్య సహార్థియగుట
తలపడు స్వకీయ సౌఖ్యసంధాయి యగుటె
అరయడు నరుఁడు - కట్టికొన్నాడు, తరువు
నరికి, కంకాళమయ మొకనావ తనకు.

కుపిత జలరాశి ప్రకృతి సంకులవిఘట్ట
నముల దనకంగరక్షగా నవయజేసె
స్వార్థసంపాదనములకై యడచిదీని
చూచి యొర్వడు చూడనే చూడడిపుడు.

నిరతయాత్రామిళత్కాల చరణబహుళ
చిహ్నజీర్ణిత సత్వమీ సికతరేణు
సముదయమున గాయార్థ దఘ్నముగ నిలిచి
నేర్చుచున్నది యిది ధ్యాన నిరతి తాల్చి.

వాయువులు దీనగుప్త భావములు చదువ
గొనగుచున్నవి చెడిన గూడిసొదలు
పోసికొని యేడ్చుచున్నదీ పులుగు జలము
లశ్రువులు బిందుకెలన చిరానురక్తి.

గతకథా గళసారి గాద్గదిక మాధు
రీగరిమలో నడచుకొన్న పృథులకాంతి
అణువణువునందు నాల్కు విప్పారి, స్వాగ
తము విరాలించియడుగు, దైన్యమువరించి.

జనార్దనరావు బతికుంటే యెలా పరిణమించే వాడని ఊహాగానాలు చెయ్యడం వ్యర్థమైన పని. కాని ఒకటి మాత్రం నిశ్చయం. అతడు కమ్యూనిజాన్ని హర్షించలేడు. అర్థం చేసుకోగలడు. కాని ఆచరణలో ఆతణ్ణి అనుష్ఠించనీయ కుండా ఆటంకపరిచే ఒక ఎరిస్టోక్రాటిక్ తత్వం అతనిలో ఆనాడే నేను పసికట్టాను. కరడుకట్టిన కాన్సర్వేటివ్‌గా పరిణమించేవాడా ? అదీ సందేహం. ఎంచేతనంటే ఛాందసంలోని చాదస్తాలన్నిటినీ అతను అవహేళన జేసేవాడు, విశాలంగా విప్పారిన మనస్సతనిది. సంకుచితత్వాని కక్కడ తావుగాలేదు.

మా యిద్దరిమధ్యా సమానధర్మా లేమిటి ఒక్కొక్కటే చెప్పుకొస్తాను.

౧. ఇద్దరం యించుమించు సమవయస్కులం.

౨. ఇద్దరికీ ఆడంబరం అంటే ఇష్టంలేదు.

౩. ఆ రోజుల్లో ఇద్దరం సాహిత్యం అంటే పడిచచ్చేవాళ్లం.

౪. విశ్వనాథ సత్యనారాయణ కవిత్వం అంటే ఇద్దరికీ ఎడతెగని మోజు.

౫. సాహిత్యానికొక సాధికారమైనవేదిక ఉండాలనీ, అది పత్రికారూపంలో ఉండాలనీ ఇద్దరం దృఢంగా విశ్వసించాం.

౬. పత్రికల నిర్వహణలో పెట్టుబడిదారీ విధానం ప్రత్యక్షంగా పనిచేస్తోందని అతను లోపలనుంచీ, నేను పైనుంచీ (ఆ రోజుల్లో) గ్రహించాం.

౭. డబ్బులేని పత్రికలు బతకవని ఇద్దరికీ తెలుసు కాని ఆ డబ్బు ఎలా ఆర్జించాలో ఇద్దరికీ తెలియదు. (ఇరవైయేళ్ళ తర్వాత ఇప్పుడిప్పుడే నాకు ఈ టెక్నిక్ తెలుస్తోంది.)

౮. ఇద్దరి జీవితాలనీ సాహిత్యానికే అంకితం చెయ్యాలని అనుకున్నాం.

౯. ఇద్దరిలోను మితవాదతత్వం లేదు. ఏ యెండకాగొడుగు పట్టడం అంటే ఇద్దరికీ అసహ్యం.

మరి వైరుధ్యాలమాట.

౧. అతనికున్నంత క్లాసికల్ లెర్నింగ్ నాకు లేదని నా దిగులు. నాకున్న కాలేజి ఎడ్యుకేషన్ తనకు లేదని బెంగ. కాని స్వయం కృషితో అతను ఆంగ్ల సాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. సంస్కృతంతో సరాసరి పరిచయం లేకపోయినా మన సంస్కృతిని నేను ఒంటపట్టించుకున్నాను.

౨. అతను చచ్చిపోయీ బతికున్నాడు. నేను బతికుండీ చచ్చినట్టు పడి ఉన్నాను. అతను చెయ్యదలచుకున్నంతా చెయ్యలేకపోయాడు. నేను కొంతలో కొంతైనా చేశాను. ఇంకా చేస్తాననే ధైర్యమూ ఉంది. ఈ ధైర్యమే ఇంకా నేను బ్రతికుండడానికి కారణం.

జనార్దనరావు గురించి నేను చెప్పిందీ చెప్పగలిగిందీ ఇంకేముంది. ఈ ప్రసంగం ఎలా ముగించడం? ఏమీ తోచలేదు. కీట్సు చనిపోయినప్పుడు షెల్లీ మూల్గిన మూల్గుతో ముగిస్తా....

ఐ లిప్ ఫర్ ఎడొనిస్....

## భాషా సేవకుని మరణం

జూన్ 23వ తేదీ బుధవారంనాడు ఉదయిని పత్రికా వ్యవస్థాపకులగు శ్రీ కొంపెల్ల జనార్దనరావు గారు కాలధర్మము నొందిరని తెల్పుటకు చింతిల్లు చున్నాము. వీరు కొంత కాలము ఆంధ్ర పత్రికా కార్యాలయమున భారతీ పత్రికా వర్గమునందు పని చేసిరి.

కృష్ణా పత్రిక
1937 జులై 3వ తేదీ సంచిక
పే.20

# కొంపెల్లకు పర్యాయపదం 'ఉదయిని'

## శ్రీ ఆచంట జానకిరామ్

శ్రీశ్రీని నేను మొదట కలుసుకొనినది మద్రాసులో అన్నగారు మల్లంపల్లి సోమశేఖరశర్మ ఇంట్లో. వారింట్లో డాబాపైన ఎవరితోనో ఎంతో ఆవేశంతో మాట్లాడుతున్న శ్రీశ్రీని చూపుతూ అన్నగారిని నేను ప్రశ్నించాను. "ఆయన ఎవర"ని. సోమశేఖర శర్మ అన్నారు : "అతన్నెరుగరా ? శ్రీశ్రీ" అని. "అలాగా! అతని కవిత్వం నాకు అంతగా నచ్చదు. ఆరిపోయిన కుంపటి కుక్కలు కొరుకుతూన్న ఎముకలూ ఇవా కవితా వస్తువులు ? రక్తపుసరస్సు- ఎంత భయానకము !" అన్నాను నేను.

అన్నగారన్నారు: "మీరు పొరబడుతున్నారు. అతని రచనలో సత్యాన్వేషణ ఉన్నది, ఉద్వేగమున్నది, అపరిమితమైన విప్లవశక్తులున్నాయి. తర తరాలుగా ప్రబంధపు సంకెళ్ళతో, ఆదీ నికృష్టపు ప్రబంధశైలి సంకెళ్ళతో, బంధింపబడిన మన కవిత్వానికి స్వేచ్ఛనిచ్చి, అద్భుతమైన నవజీవనము కలిగిస్తుంది శ్రీ శ్రీ రచన. అతను నవకవితా మార్గదర్శకుడవుతాడు।" అని.

సోమశేఖరశర్మ మాట నాకు శిలాక్షరమైనా, ఆ నిమిషమున నేను ఊహించు కోలేకపోయాను శ్రీ శ్రీ కవితలో ఎంతటి వింత ప్రభావమున్నదో !

శ్రీశ్రీని కాబోయే మహాకవిగా గుర్తించాడు మరొకతను, నాఆప్తమిత్రుడు. అప్పుడే, 'ఉదయిని' స్థాపకుడూ, సంపాదకుడూ అయిన కొంపెల్ల జనార్దనరావు. "అతని ద్వారా ఎంతో కొత్తతేజము కలుగుతుంది మన కవనానికి. విపరీతమైన భావ స్ఫూరణ ఉన్నది అతని రచనలో. నేటి సాహిత్యపు విలువలు వింతగా మారి పోతాయి అతను తీసుకువస్తూన్న విప్లవంద్వారా" అన్నాడు జనార్దనరావు. ఇది ఋషి వాక్యంగా ఫలించింది.

నిజంగా, బాలఋషి*వంటి వాడు జనార్దనరావు. అతనిని మొట్టమొదటిసారి చూచినప్పుడే అనుకున్నాను అతను ఈ లోకపువాడు కాడని. ఎంతటి సౌమ్యము అతనిలో ! ఎంతటి వర్చస్సు అతని కన్నులలో ! ఎంత ప్రేమమయము అతని చిరునవ్వు !!!

ఉదయిని ఉత్తమ శ్రేణికి చెందిన పత్రిక. మొదటి సంచికను చూచీ చూడడంతోనే ముగ్ధుడనైపోయాను. పాశ్చాత్య సంచికలలో మరీ గొప్పదని పేరు పొందిన 'లండన్ మెర్క్యురీ'లా కనిపించింది నాకు ఉదయిని. ఎన్నాళ్ళనుంచో అనుకున్నాను నేను ఇటువంటి పత్రికే నెలకొల్పాలని. వెంటనే జనార్దనరావుతో అన్నాను : "ఉదయిని నాది ! శాయశక్తులా తోడ్పడతాను పత్రిక అభివృద్ధికి" అని. పత్రిక నాల్గవ సంచిక నుంచి కాబోలు, నా పేరు సహాయ సంపాదకునిగా ప్రకటించారు. ఈ గౌరవము మహా ఘనతగా భావిస్తున్నా ఇప్పటికీని.

జనార్దనరావూ నేనూ కలసి చాలా చోట్లకు వెళ్ళాము ఉదయిని విషయమై కృషిచేస్తూ. అప్పుడు బెజవాడలో నాకు ఆప్తమిత్రుడు శీలంశెట్టి గోవర్ధనరావు. మేమిద్దరమూ రోజుకు రెండు మూడు పర్యాయాలైనా కలుసుకోనకపోతే అన్నం సహించేది కాదు నాకుగాని, అతనికిగాని ! అంత స్నేహం మా ఇద్దరికీ. గోవర్ధన రావును గురించి ఎంతైనా చెప్పవచ్చును. స్నేహశీలి. దానంలో కర్ణునివంటివాడు. పురుషోత్తముడు. అతనికీ ఉదయిని నచ్చింది. తన కార్ నిచ్చి పంపాడు జనార్ధన రావునీ, నన్నూ, శ్రీ ముక్త్యాలరాజావారిని దర్శించి వారి విరాళం అర్థించడానికి.

జగ్గయ్యపేటజేరి, తిన్నగా గురుభాగవతుల వెంకట సుబ్బారావుగారి వద్ద వెళ్ళాము. ఆయన అప్పుడు సబ్ రిజిస్ట్రార్‌గా ఉన్నారు. మమ్మల్ని చూడడంతోనే ఆయన ఆరోజుకు ఆఫీస్‌పని మానివేసి మమ్మల్ని తమ ఇంటికి తీసుకువెళ్ళారు. ఆ రాత్రి తెల్లవార్లూ, సాహిత్య గోష్ఠి ! గు. వెం. సు. సాహిత్యప్రియుడు, మంచి విమర్శకుడు. ఉదయినికి ఎంతైనా సహాయం చేస్తానన్నారు, ఆయన.

తెల్లవారాక, అక్కడకు మూడు క్రోసుల లోపున ఉన్న చిరుమామిళ్ళ శివరామకృష్ణ ప్రసాద్ వారి ఊరు వెళ్ళాము. ప్రసాద్ తెలికిచర్ల వెంకటరత్నం

---

**'చలం - లోకం' శ్రీశ్రీ**

* "భవిష్యత్తును చూడాలని బుద్ధిపుట్టి నప్పుడల్లా చలం మహర్షి ఆశ్రమానికి వెళ్ళాలనుకుంటూ ఉంటాను. భవిష్యత్తు ఎక్కడో సుదూరంలో లేదని, మనమధ్యనే మన అందుబాటులోనే ఉందనీ చెప్పడానికి రమణాస్థాన్‌లో చలం గారు ఉండడమే కారణం. చలంగారికి నేనెప్పుడు ఉత్తరం రాసినా "చలం మహర్షి" అనే సంబోధిస్తూ ఉంటాను. ఈ ఋషిత్వం ఒకప్పుడు నేను కొంపెల్ల జనార్దనరావులో చూశాను" శ్రీశ్రీ

"చలం-లోకం" 18 - 10 - 72 ఆకాశవాణి ప్రసంగం

శిష్యులు. వెంకటరత్నం శిష్యునికి ఉండవలసిన సాహిత్య ఆసక్తి, విమర్శనా పటిమ విపరీతంగా ఉన్నాయి, వారిలో. మనిషి రూపసి, సౌజన్యశీలుడు. ఆయనతో ఉన్నంత సేపూ నేను, నా మనస్సులో ఊహించుకున్న, పురూరవుని సమక్షాన ఉన్నట్టు అనిపించింది నాకు;

శివరామకృష్ణ ప్రసాద్ శ్రీ ముక్త్యాల రాజావారి మేనల్లుళ్ళు. మాతో కూడా, ఆయనా ముక్త్యాల వచ్చారు రాచమర్యాదలనుబట్టి సాధారణంగా అంత సులభంగా లభింపని రాజదర్శనం ప్రసాద్ స్నేహంవల్ల మాకు వెంటనే లభించడమేగాక, శ్రీ చంద్రమౌళీశ్వర ప్రభువు మమ్మల్ని ఎంతగానో ఆదరించారు. వారికీ నాన్నగారికీ చాలా స్నేహము. అందువల్ల కూడా. వారిని దర్శించడం మాకు అత్యంత ప్రియకరమైనది. రాజావారు ఉదయినిని గ్రహించి చాలా ప్రశంశిస్తూ, తమకు తోచిన సహాయము చేయగలమని సెలవిచ్చారు.

ఆ తరువాత కొన్నాళ్ళకు జనార్దనరావూ నేనూ, రాజమహేంద్రవరమునకు సమీపాన ఉన్న కడియము వెళ్ళాము. కడియము అద్భుతమైన గులాబీ పువ్వులకు ప్రసిద్ధి. రకరకాల గులాబీ పువ్వులు-అరచెయ్యంత ఉంటుంది ఒక్కొక్క పువ్వు. ఎంతో సువాసన. రెండుదోసిళ్ళ పువ్వులు తీసుకొని, ఆ పువ్వుల మధ్య ఉదయినిని ఉంచి, పూజ్యులు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రికి సమర్పించాము జనార్దనరావూ, నేనూ. ఆ సన్నివేశము ఇప్పటికీ కన్నులకు కట్టినట్లు ఉంటుంది.

పూలతో సమర్పించిన పుస్తకాన్ని అందుకుంటూ ఆయన ఒక చక్కని శ్లోకం చెప్పారు. భావగర్భితమైన శ్లోకము. "భేష్ ! చక్కని కృషి చేస్తున్నారు. మిమ్మలను మనస్సార ఆశీర్వదిస్తున్నాను" అన్నారు. ఉదయినిలోని ఒక గేయాన్ని చూచి గేయకవిత మనకు క్రొత్తకాదు. ఇదివరకూ ఉండేది అంటూ ప్రాచీన గేయ కవితను గూర్చి ఎంతో చక్కగా చెప్పారు. ఒక ప్రస్తావనలోంచి ఇంకో ప్రస్తావనకు వచ్చి ఎంతోసేపు ఏకధాటిగా మాట్లాడారు మాతో శత వృద్ధులు, ఆయన. ఆ రోజులలో వారు కృష్ణాపత్రికలో "నా కాశీయాత్ర" అనే శీర్షికను తమ అనుభవాలు వ్రాస్తున్నారు, ముద్దులొలికే శిష్టవ్యవహార భాషలో. ఇన్నేళ్లూ ప్రబంధధోరణినే ఒకప్పుడు నారికేళపాకంగానూ, ఒకప్పుడు ద్రాక్షా పాకంగానూ కవిత్వం చెబుతూ వచ్చిన ఆయన ఈనాడు ఆబాలగోపాలమునకూ అతి సులువుగా అర్థమయ్యే వాడుక భాషలో వ్రాస్తున్న ఈ వ్యాసాలు నన్ను ఎంతో ఆకర్షించాయి. మా ఉదయినికిన్నీ అటువంటి వ్యాసాలే వ్రాసి ప్రసాదించమని అర్థించాను వారిని.

సమకాలికసాహిత్య రీతులను గురించిన్నీ ఎంతో చెప్పారు ఆయన. వారితో మాట్లాడుతూంటే, అంటే, వారి మాటలు వింటూంటే, ఒక్క నిమిషంలా గడిచిపోయింది రెండు గంటలసేపు. ఒక్క ప్రస్తావనా ? ఒక్క విషయమా ?

ఎన్ని కబుర్లు ! ఎన్నెన్ని పూర్వ స్మృతులు ! ఎంత నిశితమైన విమర్శ! ఎంతటి అపార జ్ఞాన సముద్రము ! ఎటువంటి వాగ్ధోరణి - వారికి వారే సాటి !! ఇంకా ఎక్కువసేపుఉంటే వారిని ఆయాస పెట్టిన వారమవుతామని, కొంత అయిష్టంగానే, వారి వద్ద సెలవు తీసుకున్నాము. ఒక దేవాలయమునుంచి ఇవతలకు వచ్చిన భక్తులులాగా వచ్చివేశాము జనార్దనరావూ, నేనూ, భక్తిపూరితమైన హృదయాలతో.

జనార్దనరావుతోటి నాస్నేహము జన్మ తరియింప జేసేటటువంటి స్నేహము మా దేహాలు వేరైనా, మా ఆత్మలు ఒకటేనన్నంత, సన్నిహితంగా ఉండేది మా స్నేహం. మరి, ఇంత అందమైన ఆపేక్షను విధి సహిస్తుందా? ఎలా వచ్చి దాపరించిందో అతనికి భయంకరమైన వ్యాధి వచ్చింది. ఆ జబ్బుతోనే మనఇంటికి వచ్చాడు ఒకరోజు, నా స్నేహితుడు. పదిహేను, ఇరవై రోజులు వైద్యం చేయించాము నిపుణులచేతనే. అప్పటికి ఆ జబ్బు ఉపశమించినా పరీక్షచేసిన వైద్యులు అన్నారు అతనిలో జీర్ణమైపోయిన క్షయవ్యాధి ఉన్నదనీ, ఆ వ్యాధికి తగిన చికిత్స చేయాలనీ. మమ్మల్ని శ్రమపెట్టడం ఇష్టంలేక అతను తన సహోదరి చావలి బంగారమ్మ వద్దకు వెళ్ళాడు, కొణితివాడ.

కొణితివాడలోనే నేను కొంపెల్ల జనార్దనరావును ఆఖరిపర్యాయం కలిసికొంట. మనుష్యమాత్రులు చేయగలిగిన వైద్యమంతా చేయుస్తున్నారు వారు. జబ్బు నయమౌతుందని అతనికీ ధైర్యంగానే ఉన్నది. నాకు బాగా జ్ఞాపకం: రాత్రివేళ అక్కడకు జేరిన నాకు ఉదయాననే పళ్లు తోముకొనటానికి కచిక పనికిరాదని, ఆరుమైళ్ళ దూరానఉన్న భీమవరం పంపిస్తున్నాడు మేనల్లుణ్ణి సైకిల్‌పైన టూత్ పేస్టుకోసం !

---

చలం: అప్పను రచనలకోసం అందరు రచయితల దగ్గరకూ కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరిగేవాడతను. ఒకసారి విశ్వనాథ దగ్గరకు రచనలకోసం వెళితే, పాత 'ఉదయిని' పుచ్చుకొని "ఇందులో ఈ చలంగాడి పేజీలు చించేస్తేనే నీకు రాస్తాను" అన్నాట్ట. ఎలాగో బతిమాలి బామాలి అతని రచన పట్టుకుని జనార్దనరావు నాదగ్గరకొచ్చాడు. అవన్నీ నాతో చెప్పాడు. నేను లైటుగానే తీసుకున్నా.

కొంపెల్ల సాహిత్యంకోసమే బతికాడు, అందుకోసమే చనిపోయాడు. నిజంగా అతను మనిషి. ఉత్తమ రచనలకోసం, ప్రమాణాలకోసం తనసర్వస్వం అర్పించేశాడు. ఒకసారి నేను కనిగిరి ట్రాన్సఫరయా. నానా అవస్థాపడి సరిగ్గా భోజనాలవేళ జనార్దనరావు నాదగ్గరకొచ్చాడు. "మీరు బ్రాహ్మలా? ఇక్కడ వెజిటేరియన్ దొరకదు" అన్నా. యెలాగో అవస్థపడి వెజిటేరియన్ యెక్కడినుండో

(మిగతా 50వ పేజీలో)

అతనూ విశ్వసిస్తున్నాడు ఈ జబ్బు నిమ్మళిస్తుందనీ, తన ఉదయిని మళ్ళా తలయెత్తుతుందనీ. అంత జబ్బులో ఉన్నా అతని ప్రసక్తి అంతా ఉదయినిని గురించీ, నన్ను గురించీ. నన్ను అతను ముఖాముఖిని 'మీరు' అనినా, ఉత్తరాలలో 'న్మీరు'అనేవాడు. ఆప్యాయంవల్ల 'నీవు'అనాలని ఉన్నదనిన్నీ, ఆచారాన్ని అనుసరించి, 'మీరు' అనాలి కాబట్టి, ఈ రెండింటికీ రాజీగా 'న్మీరు' అని వాడేవాడు. ఈసారి, చిరునవ్వునవ్వుతూ 'న్మీరు' అని, నన్ను సంబోధిస్తూ నా కుటుంబ విషయాలు అడిగాడు. అప్పుడే నా జీవితాకాశంలో కారుమేఘాలు కమ్ముకు వస్తున్నాయి. ఈ విపత్తు గురించి అతనికీ చూచాయిగా తెలిసింది. కాని, నన్ను వివరంగా ప్రశ్నింపలేదు. నావలన ఆ స్థితిలో అతనికి బాధ కలిగించడం ఇష్టము లేక నేనూ అంత వివరంగా చెప్పలేదు. కాని, సూక్ష్మబుద్ధి, అతను గ్రహించాడు.

"ధైర్యంగా ఉండాలి. ప్రతిదీ ఏదో నిమిత్తం వల్లనే జరుగుతుంది. ఇది మీకు పరీక్షాసమయం!" అన్నాడు జనార్దనరావు.

ఆ పరీక్షలో నేను ఓడిపోయాను.

కొద్దిరోజులలో నాస్నేహితుడూ పోయాడు.

అమ్ముడుపోని, అతివిలువగల, ఉదయిని కాపీలు ఇన్ని మిగిలాయి.

---

(49వ పేజీ తరువాయి)

తెప్పించా. నేను చేపలు, మాంసం, రొయ్యలు తెగతింటూంటే, నా యెదురుగా కూర్చుని యేమీ యెబ్బెట్టులేకుండా వెజిటేరియన్ తిన్నాడు.

ఆ తర్వాత బెజవాడలో వోసారి మాయింటి కొచ్చాడు కొంపెల్ల. అతని ముఖంలో గొప్ప రేడియన్స్ కనిపించింది. యెంత వెలుగు! కానీ, తర్వాత తెలిసింది. టీబీ కాజ్‌డ్ దట్ రేడియన్స్ అని. మెడ్రాస్ వెళ్ళినప్పుడు మంచం పట్టాడనితెల్సి, మల్లంపల్లి యింటికెళ్ళాను. 'మల్లంపల్లి' యింటిల్లిపాదీ అతనికి సపర్యలు చేశారు. శ్రీశ్రీ సరేసరి అతని కాళ్ళదగ్గరే కూర్చొనేవాడు. ఆరోజుల్లో టీబీ అంటే ఆమడదూరం పరిగెత్తేవాళ్లు అలాంటిది మల్లంపల్లియింట్లో యెంత ప్రేమగా చూశారు.

నేను వెంటనే బెజవాడవచ్చి ఒక పెద్ద తోటకొని, అందులో ఒక పాకవేసి కొంపెల్లకు సేవలు చేద్దామనకున్నా. ముఖ్యంగా అతన్ని మల్లంపల్లి యింట్లో నుంచి బయటకుతేవాలి- వాళ్ళింట్లో అందరూ టీబీ వాతపడకుండా, ఓతోట బేరం కూడా చేశా. కానీ యింతలో కొంపెల్ల పోయాడు.

18-5-79 ఈనాడు సృజన 92 సంచిక జూన్ 1979
((శ్రీ చలసాని ప్రసాద్ చేసిన చలంతో ఇంటర్వ్యూ)

శ్రీశ్రీ కవితలో మార్దవం తక్కువంటారు. అతను చాలావరకు 'సినిక్' అని, అంటే మనమందరమూ ఆప్యాయంతోనమ్మే విషయాలలో అతనికి నమ్మకం లేదనీ, చిరకాలానుభవంవల్ల, నేటి జీవితపుపట్ల అతనికి అసహ్యం కలిగిందనీ, విమర్శకులంటారు. కాని, తన మహాప్రస్థానానికి అంకితంగా శ్రీశ్రీ రచించిన 'కొంపెల్ల జనార్దనరావుకోసం' అనే విలాసం చదువుతూఉంటే నాకేకాదు, ఎటువంటి ధీరస్వభావులకైనాసరే, కన్నులు చెమ్మగిల్లకమానవు. అంతటి ఆర్ద్రితఉన్నది, ఆతని మాటలలో. శ్రీశ్రీ అంతవాడు, జనార్దనరావును ఎంతగా పూజించేవాడో, పూజిస్తున్నాడో, ఈ పంక్తులు చెపుతాయి:

లేదు, నేస్తం! లేదు....
నీ ప్రభావం మమ్మల్ని వదలలేదు!
నిరుత్సాహాన్ని జయించడం
నీ వల్లనే నేర్చుకుంటున్నాము!

ప్రతికూల శక్తుల బలం మాకు తెలుసు,
భయంలేదులే అయినప్పటికీ !
నీ సాహసం ఒక ఉదాహరణ !
నీ జీవితమే ఒరవడి !

నిన్న వదలిన పోరాటం
నేడు అందుకొనక తప్పదు !
కావున ఈ నిరాశామయ లోకంలో
కదనశంఖం పూరిస్తున్నాను !

ఇక్కడ నిలబడి నిన్ను
ఇవాళ ఆవాహనం చేస్తున్నాను !
అందుకో ఈ చాచిన హస్తం !
ఆవేశించు నాలో !

ఇలా చూడు నీకోసం
ఇదే నా మహాప్రస్థానం !

ఎటువంటి అంకితము !!

ఆ మధ్య ఒక రోజున అబ్బాయి సత్యవోలు కామేశ్వరరావు-అతనిప్పుడు ఉత్కళ దేశంలో ఫైనాన్స్ డిప్టీ సెక్రటరీగా ఉంటున్నాడు - బ్రౌన్ పేపర్ అట్టతో

కుట్టిన చిన్నపుస్తకం నా చేతిలో ఉంచాడు "ఇదుగో! మీకొకతాయిలం తెచ్చాను" అంటూ, చిరునవ్వు నవ్వుతూ.

ఏమిటా ఈ తాయిలం అనే ఉత్సుకతతో, కవర్ త్రిప్పగానే కనుపించినవి సువర్ణాక్షరాలు, మా జనార్దనరావు స్వహస్తంతో లిఖించినవి :

కొమర్రాజు వినాయకరావునకు, ప్రేమతో, కొంపెల్ల జనార్దనరావు. అని ఉన్నది.

అతను వినాయకరావునకు కానుకగా ఇచ్చారు, కృష్ణశాస్త్రి కవితను గురించి తాను వ్రాసిన విమర్శా గ్రంథము, ఏదో పత్రికలో అచ్చైన వ్యాసము అది. మద్రాస్ నుండి విజయవాడ తరలి వెళ్ళిపోతున్న కొమర్రాజువారి ఇంటిలోని కొన్ని పాత పుస్తకాలతోపాటు, ఎలా కలిసిపోయిందో వానిలో, ఈ చిన్ని పుస్తకమున్నూ మూర్‌మార్కెట్ చేరి, అక్కడ సెకండ్‌హాండ్ బుక్‌షాపులో పదేళ్లు కనిపెట్టుకుంది సత్యవోలు కామేశ్వరరావు రాకకోసం. ఆ రోజులలో చారిత్రాత్మక పరిశోధనలో నిమగ్నుడైన మా కామేశ్వరరావు పురాతన శాసనపు పుస్తకాలకోసం వెతుక్కుంటూ ఉండగా ఆ గ్రంథం అతని కంటబడింది, నా అదృష్టంవల్ల.

కామేశ్వరరావు చిన్నవాడు; ఈ తరము వాడు. అతనికి కొంపెల్ల జనార్దనరావుతో ప్రత్యక్ష పరిచయం లేదు. కాని, నా ఆప్తమిత్రుడైన అతనితో నేను లక్షసార్లు చెప్పి ఉంటాను పూర్వస్మృతులను నెమరువేస్తూ, జనార్దనరావును గురించి. ఆ చేతనే చూచీ చూడడంతోనే ఆ చిన్ని పుస్తకాన్ని కొనివేసి, వెంటనే నా కది కానుకగా ఇచ్చాడు కామేశ్వరరావు, నా మీది ప్రేమచేత.

అంతులేని ఆపేక్షకు ఆనవాళ్లుఅనవసరం. జ్ఞాపకానికి వేరేవస్తువు కావాలా? హృదయంలోనే ఉండిపోతాయి ఆనాటి అపురూపమైన అనుభవాలు. కానీ, అప్పు డప్పుడు, నిస్పృహ నిండిన నిమిషాలలో, ఈపుస్తకము నా కెంతో ధైర్యమిస్తుంది. ఈ పుస్తకమూ, నేను జాగ్రత్తతో పదిలపరచుకొన్న, మా జనార్దనరావు మన కిచ్చి వెళ్ళిపోయిన, 'సృష్టి' అనే పద్యమూ :

'సాగుతున్నయాత్ర' నుంచి



# శ్రీ జనార్దనరాయలకు

## శ్రీ పిలకా గణపతిశాస్త్రి

పోయితివీవు కార్తికపు బున్నమరేయి విభాతచంద్రికా
చ్ఛాయల దివ్యశోభవలె శాంతమనోజ్ఞ నిమేషమూర్తివై;
నాయెద శూన్యమై చను ననారతముంబడి మొత్తు వానలో
'హో'యని మ్రోయు నంధ నిశి నొక్కవిశీర్ణ వృషోథయానమై.

హృదయము విప్పికోనిక మరెవ్వరు నాకిట! జీవితమ్ములో
నదయత త్రవ్విపోయితి వనంత గభీరము నీ యభావమున్
బ్రదుకు భరింపరాని యెదో భారమునంబడి క్రుంగు, దీనమై
కదలగబోయి కూలబడు కన్నులు చిల్లులువోవు తామసిన్.

శ్రావణసంధ్యవేళ వికసన్మృదుచంద్రిక జంద్రకాంతముల్
బూవులగుల్కు; వీధికడ మ్రోయును బాలుర ఖేలనధ్వనుల్
నీవు గతించినావుగద! నిల్వదు జీవితమో నిమేషముం
బోవు మహాప్రవాహగతి; బోయిన నీకయి యాగిచూడకే.

పోవును ధూళిలో గలిసిపోవు మనోహర సౌహృదమ్ము; లీ
జీవనదాత్ర దీపికలు చిన్నియెడందల నూత్నయౌవనా
భావహ రాగలాస్యములు నట్టులె వెల్వెలబారునంతలో;
నేవి నశింప పీకనుల నిట్టుల బాష్పజలమ్ము నింపకే.

భోరను వర్షధారల నభోంగణమెల్ల వినిద్రవాయు గం
భీర మహార్త రోదనల భీకర సంహతి మ్రోయురేలలో,
ద్వారముజేరి, యీ కఠిన ధారల నీవెటనిద్రగొందువో,
నీరవమూర్తివై యెచట నిల్చెదవో, యని తల్లడిల్లెదన్.

ఎఱుగుదు నేను మృత్యుని గృహీతు లమేయ మహాంధకార సా
గరమున మున్గి, యింక మరి కానగరారని, కాని యేలనో
మఱియొకమారు వచ్చి, యిట మమ్ముల నందర నూరడింపకే
యరుగవటంచు నాహృదయ మాశాలతో బరువెత్తు నూరకే.

బ్రతికిన కొన్నినాళులు నపారకవిత్వ కళామహత్తపో
వ్రతమున బద్ధకంకణతవర్తిలి, వాఙ్మయయజ్ఞవేది నా
హుతి యయిపోయినావెటొ మహోన్నతమూర్తివి మేముమాత్రమో
అతుకులబొంత పీబ్రతుకులట్టులె యీడ్తుము శుష్కవీథులన్.

ఏలవచింతు మేమిటు గతించితి వీవని సంతతార్తి నీ
లీల పదేపదే మృతియెలేదు రసాల్బణమూర్తి నీకికం
గాల మహాపగ్రశుజల కశ్మల పూరము నీ సుధాస్మృతిన్
గోలున నేడ్చు; దత్తటిన గోచరమూర్తిని వెల్గునీకునై.

మెల్ల దురాయి లేజివురు మేలిమిబంగరు సంజవెల్గులం
దల్లలనాడువేళ, కుసుమారుణ శయ్యలనో శయింతు నీ
వల్లన దాళ్ళనాడు చివురాకుల మ్రోతల నాలకించుచుం
జల్లని పిల్ల వీవలుల చాయలనో విహరింతు నిత్యమున్.

ఎన్నడు బోని యీవిధి ఘటించిన మృత్యు కఠోర సేతువే
భిన్నముసేసి, కాలమయ భీకరవార్ధి గభీరవారిలో
ఛిన్నవిశీర్ణమైన మన చిన్నియెడందల ప్రేమహార మిం
కెన్నియుగాలకో! మరల నిర్వ్వరముంగని విశ్వసించుటల్

(ప్రతిభ 1938 జులై)



# 'ఉదయిని'
# అభిప్రాయాలు, సమీక్షలు

మీ యాధిపత్యమున ప్రకటితమగుచున్న 'ఉదయిని' సార్థక నామ ధేయగా వెలయుచుండుఁగాక యని యాశాసించుచు అందలి రచనలఁగూర్చి యించుక నాయామోదము దెలుపుచున్నాను.

శ్రీమతి బంగారమ్మ, బాపిరాజు, దీక్షితులు, వెంకటరావు, కామేశ్వరరావు, సూర్యారావు, పురుషోత్తమశర్మ, నో.న.శా. గార్ల రచనలు అర్థవ్యక్తి ప్రసాదాది సుగుణములు గలవై సుకుమార సుందరములుగా ఉన్నవి. చలం, రాజ మన్నారు, సత్యనారాయణమూర్తి, సత్యనారాయణశాస్త్రి, శ్రీనివాసరావు, నరసింగరావు, నారాయణబాబుగార్ల రచనలు ప్రౌఢార్థములు. ముద్దుకృష్ణ, జనార్దనరావుగార్ల రచనములు నాకర్థముకాలేదు. అర్థవ్యక్తి ప్రసాదము కలవై సౌశబ్దముతో మీరు రచించునవి ప్రకటించునవి రచనలు ఉండునుగాక యని కోరుచున్నాను.

మీ పత్రికకు మీకు అభ్యుదయము కోరు మిత్రుడు,

**వేటూరి ప్రభాకరశాస్త్రి**

ఉదయిని సంపుటి 1 - సంచిక 2



'ఉదయిని' చివర సంచిక చేరినది. మీరు పద్యాలు పంపించమన్న ఉత్తరం కూడా చూచినాను. పత్రిక చూచినతర్వాత నాకు చాలా ఉత్సాహం కలిగింది........

మీరు పట్టుదల వదలక 'ఉదయిని'కి ఇంకా చక్కని పద్యాలూ, కథలూ, వ్యాసాలూ సంపాదించమని ప్రార్థన. విమర్శనలు ఇంకా విపులంగా వ్రాయించ వలెనని నా కోరిక. 'ఉదయిని' శ్రేయస్సు కోరే వారిలో నన్ను కూడా ఒకణ్ణిగా లెక్క వేసుకోండి.

**నోరి నరసింహశాస్త్రి**

ఉదయిని. సంపు 1 సంచిక 3.

నేటి తెలుగు కావ్యవాణికి మీ 'ఉదయిని' నాట్యరంగమని మొదటి సంచిక చదివినప్పుడు తోచింది. నేటి కావ్యకర్తల ఉత్సాహము బహుముఖములుగా కావ్యస్వరూపము పొందుతున్నది. అందు ఔచిత్యము పోగొట్టుకోని వానికే 'ఉదయిని' ఆదరణ కద్దని తెలిపింది. పండితులకు, పామరులకు, స్త్రీలకు, పిల్లలకు, తెలుగువారందరికీ 'ఉదయిని' జ్ఞానతేజస్సు ప్రసాదించకలుగుతుందని ఆశిస్తున్నాను.

మీ 'ఉదయిని' నవ్యసాహిత్య పరిషత్పత్రిక నెరవేర్చదగిన ఆశయములనే నెరవేరుస్తోంది. ధనాభావముచేత ఇట్టి పత్రిక నిలిచిపోయిందనేమాట ఎన్నటికీ తెలుగువారిని సిగ్గుపరచకుండా ఉండునుగాక.

బాపిరాజుగారి కథ చాలా మనోహరముగా ఉన్నది. చదివి ఆనందించాను. బంగారమ్మగారి పద్యాలు ఎక్కడ కనిపించినా నేను మొదట చదువుతూ ఉంటాను. 'పుంతలో ముసలమ్మ' చాలా బాగున్నది. తెలుగు మాటలసొంపు ఆమె బాగా గ్రహించినారని నా ఊహ. మీ కిరణాలు లేతగా, స్వాదుగా ఉన్నవి. ఉన్నత భావగర్భితములు. 'ఉదయిని' సర్వాంగ సుందరముగా, ఉన్నత భావాలతో ఒప్పుతూ ఉంది.

చింతా దీక్షితులు

ఉదయిని సంపు. 1 సంచిక 2



తాము దయతో పంపిన 'ఉదయిని' చేరింది. చాలా సంతోషంలో చేకొన్నాను. ధీరమతులు నడువజాలని మార్గము లుండునా? నవ్యసాహిత్య గగనరంగమున మీ 'ఉదయిని' చల్లని జ్యోతిస్సులను విరియుగాక, సహృదయ చకోరముల కానంద జ్యోత్స్నలను వర్షించుగాక. కాలవశమున నత్యుగ్రోష్ణ తాపమునకు గుఱియైన రసపిపాసువులకు అకాల జలదోదయమై హాయిని స్థాయిని చేకూర్చుగాక.

'కిరణాలు' అనే సంపాదకీయం గౌరవ పురస్సరమగు అధికారిక లక్ష్యాన్ని చాటింది. చదువుకొన్నవారు చదివే పత్రికగా మాత్రమే ఉండడం కంటే, చదువురానివారిని చదువు వచ్చినవారినిగా చేసే పత్రికగా 'ఉదయిని' వుండాలెనని ఆశిస్తాను. కనుకనే సాధారణ జనాన్ని కూడా మనమానవుల్లోనే పరిగణించి, ఉత్తమోత్తమమైన సాహిత్యసౌరభము వారికికూడా అందుబాటయ్యేట్టు పత్రికాధిపతులూ వ్యాసరచయితలూ కొంత ఔదార్యం ప్రదర్శించాలెనని ప్రార్థిస్తాను. మీ 'ఉదయిని' ఈ మాటను ఆదటపుచ్చదు కదూ! - సర్వథా - సహ నావవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై తేజస్వినా వధీత

మస్తు, మావిద్విషావహై - అనే ప్రాచ్యప్రతితో, వెలివఱచజాలని భావనతో, నా ఆవేదన తెలిపాను.

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

ఉదయిని సంపు. 1 - సంచిక 2



'ఉదయిని'లో ప్రకటింపబడిన వ్యాసములందు, కావ్యములందు ఆధునికాంధ్రవాఙ్మయ పరిణామము ఫలించుచున్నది. స్వరూపం సర్వాంగసుందరమై ఇంగ్లీషులో రామకోటీశ్వరరావు గారి 'త్రివేణి' వలె తెలుగులో మీ 'ఉదయిని' ఉత్తమ పత్రికా ప్రకటనమునకు మార్గదర్శకమై యలరారుచున్నది.

ఉత్తమ పత్రికా నిర్వహణ ప్రయత్నము శ్లాఘ్యమే కాని, ఆర్థికంగా కొన్ని యిబ్బందులకు లోబడవలసి ఉంటుంది. ఈ కాలంలో....కాగితం ఖరాబ్ వాఙ్మయాలకే వ్యాపకం యెక్కువుగా కనబడుతుంది. అయినప్పటికి పరవాలేదు. తెలుగుదేశంలో కళాప్రియత్వం బొత్తిగా నశింపలేదు. మీ ప్రయత్నం విజయంగా కొనసాగుతుంది.

దువ్వూరి రామిరెడ్డి

1935 మే - జూన్

ఉదయిని సంపుటి 1. సంచిక - 3.



ప్రియసంపాదక మహాశయా,

వందనములు.

ముద్దుబా మూటగట్టుచు వెలువడుచున్న తమ 'ఉదయిని'కి అభినందములు. అభినందనార్హముగ దానిని 'సంపాదించి' ఆంధ్రలోకమున కొసగుచున్న తమకును అభినందనములు. ఉద్దిష్టార్థమగు నవ్యసాహిత్య నిర్మాణమున కావశ్యకములగు సుందరపరికరములను 'ఉదయిని' క్రమముగ సేకరించుకొనుచున్నది. విశేషించి నాలుగవ సంచిక సంతరించు కొనిన యాపరికరములు సుందరతరములు.

నాలుగవ సంచిక యందలి వ్యాసములు—ముఖ్యముగ గద్యరూపములు—అందును ప్రధానముగ 'సీత-కుందమాల', 'ప్రాకృతము : నన్నయకు పూర్వపు సాహిత్యము', 'శ్రీ దీక్షితులు గారి నాటికలు' 'ఆరనిజ్యోతి' 'శైలబాల'—ఉజ్జ్వలములు, ఉన్నతభావ సమంచితములు. అవి రచయితల ప్రతిభకు, పాండిత్యమునకు, పరిశీలనశక్తికి, భావోన్నతికి, రచనా సామర్థ్యమునకు, సంపాధకుని సంస్కార సంపదకు నుత్తమ నిదర్శనములు. నిక్కముగ నవి

నవ్యాంధ్రవాణి కమూల్యాలంకారములు. అజ్ఞాతపూర్వమగు నవ్యాంధ్ర శక్తి వాని యందు ప్రత్యక్షమగు చున్నది.

మహాశయా, తమ కృషికారణముగ నిట్లు నేటి ఆంధ్ర హృదయమున నెలకొనిన బీజముల వలన మొలకెత్తి, చిగిరించి, వివిధ ప్రపంచ సారస్వత సంస్కారబలమున ననలుసాగుచు, విజ్ఞానవల్లరులు నవ్యాంధ్ర సాహిత్యరంగమున కెగబ్రాకుచున్నవి. అవి ఆంధ్రవాణికి పుష్టిని తుష్టిని చేకూర్చి, స్వాస్థ్యమును సంతరించి యామెను నవ్యభావరమణీయనుగ నొనరింపగల అమృతమయఫలములను ఫలింపగలవను విశ్వాసము గలుగుచున్నది. ఈ విశ్వాసము నిశ్చయార్థమగు గాక! ఉదయిని చిరంజీవియై నిరంతరము నవ్యవాఙ్మయాభివృద్ధిని గావించు చుండుగాక! ఇదియే పరమాభిలాషము.

చిత్తగింపుడు.

గ. సుబ్బరామయ్య

ఉదయిని సంపు 1

చెన్నపురి.... సంచిక 5

'భారతి' సంపాదకుడు



'ఉదయిని'...సారస్వతలోకమున నొక నూతనాధ్యాయమును ప్రారంభించి నది. దీనికొక ప్రయోజన మున్నది. అది సంపాదకుని రచనలందును ప్రతి ఫలించుచున్నది. పాఠకుని దిమ్మెసగొట్టక వానియందు ఆలోచనాభాగమును ప్రజ్వరిల్ల జేయుచున్నది. ఏ పద్యము జదివినను, వ్యాసము జూచినను అచట ఆగు మనునట్లుండును....శ్రీయుత గిడుగు వెంకటరామమూర్తిగారు ఆశీస్సును బంపుచు నిటుల వ్రాసిరి :—

"నేటి తెలుగు భాషలో నేటి భూలోకము ప్రతిఫలించేటట్టు చేయగల తెలుగు రేఖకులున్ను, తెలుగు కవులున్ను అన్యదేశీయులతో తులదూగ గలవారు తయారవు తున్నారని ఈ పత్రికలు విశదఃము చేస్తూ ఉన్నవి."

ఈ అభిప్రాయముతో నేకీభవించుచు నీ పత్రికను ఆంధ్రలోకము అభిమానించి పోషించునని నమ్మెదము.

—ఆంధ్రపత్రిక

ఉదయిని సంపు 1

సంచిక 5

పత్రిక ఆకారము, సంకలనము చక్కగా ఉన్నవి. వర్తమానజీవనమును ప్రత్యక్షీకరించుచు అభ్యున్నతికై ఆంధ్రులు చూపుచున్న ఉద్గమనాభిలాష కుదాహృతియై ముఖపత్రము మీది అర్కోదయచిత్రము భావబంధురముగా నున్నది.

\- ప్రజామిత్ర

ఉదయిని సంపుటి 1 - సంచిక 2

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'జయంతి' ఆగిపోయిన తరువాత ఇట్టి సుందర పత్రిక తెలుగునాట బయలుదేరలేదని చేయెత్తి చెప్పవచ్చును. ఆకారము ననే కాక ప్రచురిత విషయములందును ఈ పత్రిక ముగ్ధమోహనముగ నున్నది. ఉత్తమపత్రిక. ఉత్కృష్ట వాఙ్మయ సృష్టి నాశించు కళాప్రియులు ఆదరింప దగిన పత్రిక.

\- ఆంధ్రభూమి

ఉదయిని సంపుటి 1 - సంచిక 2



స్తబ్ధతను విదలించి ఆంధ్రహృదయములను సానబట్టుటకు బుట్టిన సాహితి ....సఖి....జయంతి....భస్మీపటలమైన బూదినుండియే 'ఉదయిని'....వెలువడినది. అందమగు అమరిక, అమూల్య రామణీయకము.

\- గృహలక్ష్మి

ఉదయిని సంపుటి 1 - సంచిక 2



ముద్దులొల్కుచున్నది. ఇందుగల పద్య గద్య వ్యాసములన్నియు సుప్రసిద్ధులచే రచింపబడినవి. ఈ పత్రిక నవ్యసాహిత్య లోకమునకొక మకుటము వంటి దనియే చెప్పనగును.

\- వినోదిని

ఉదయిని సంపుటి 1 - సంచిక 2

సామాన్యదృష్టికి తేరిచూడరాని తన 'కిరణాల'తో నవ్యసారస్వత ప్రపంచము నుద్దీపింప జేయుచు నిది యుదయించినది. అన్ని రచనలు 'నవ్య సాహిత్య' మను పేరును చెల్లించుకొనునవి. సంచిక స్వరూపము లోపల, వెలుపలకూడ రమణీయమయి నవ్యవాసనల నీనుచున్నది. నవ్యసాహిత్యాభ్యుదయము నాశించు ఉత్తమపథము పత్రిక.

- భారతి

ఉదయిని సంపుటి 1 - సంచిక 2



Since the ill-starred *Jayanti* ceased publication, we have not come across any Telugu journal fit to take its place as the interpreter of the progressive tendencies in Telugu literature. A host of cheap periodicals have come up, which have vulgarised the public taste and dream journalism into the mire. *Udayini*, Edited by Mr. Kompella Janardana Rao, seems almost like the *Jayanti* reborn under happier auspices. As a reviewer in the *Krishna Patrika* it, the *Udayini* inherits the 'unfulfilled renown' of *Sahiti Sakhi* and *Jayanti*. It already enlisted the co-operation of nearly all the leading writers in prose and verse. Beautiful in form, and rich in its contents, *Udayini* is an ornament to Telugu Journalism. Besides poems and stories, the first two numbers give us some valuable literary criticism. We are unable, however, to reconcile ourselves to the prose style of the Editor.

ఉదయిని సంపుటి 1.
సంచిక 3.

TRIVENI, (K.R.)
1936 మే
సంపు 1 సంచిక 5



Not without some amount of hesitation has Mr. Janardana Rao launched this new Telugu literary journal; for similar enterprises in the past have had an undeservedly

brief career. But the need for such a journal is obvious. There are new tendencies in Telugu literature which are demanding their right to exist and be treated with the same respect as the old, as for instance "Bhavakavithvam" and "Colloquialism." They need a platform where they can vindicate their claims. 'Udayini,' one is glad to note, offers full scope for doing so. The Editor is all for the modern, as is apparent from the contributions appearing in the first (December) issue of the jonural.

... ... ... ...

The journal is of a distinctly high order and is well fitted to serve as the organ of Andhra literary renascence. We hope every sincere well-wisher of the Telugu language will extend his or her hearty support to this new journal.

*The Hindu (Literary Supplement)*

ఉదయిని సంపుటి 1 - సంచిక 2

1935 ఫిబ్రవరి సంపుటి 1 - సంచిక 2



సాహితీ గగనరంగాన, 'ఉదయిని' ఉదయిస్తూనే చండకిరణముల ప్రసరించింది. సామాన్యులకు దుర్నిరీక్ష్యమైన యీ తేజము "రసపిపాసువులకు అకాం జలదోదయమై హాయిని స్థాయిని చేకూర్చినది. రెండు సంచికలయందలి రచనలును నవసరస్వతికి నీరాజనములే....

సాహితి, సఖి, జయంతుల దివ్యాంశల దక్కించుకొన్న 'త్రివేణి' ఈ ఉదయిని....

ఆకారము, సంకలనము సాహిత్యదర్శాకు తగినట్లే ఉన్నవి. ఉత్తమోత్తమ మైన నవ్యసాహితీ సౌరభమున, సాధారణజన ప్రపంచమునుగూడ, 'ఉదయిని' అనుగ్రహించునని ఆశయము.

- కృష్ణాపత్రిక (పిం.నా)

ఉదయిని సంపు 1.

సంచిక 3



# ఉదయినికి స్వాగతం

ఉదయిని వొక కొత్త పత్రిక. సంపాదకులు కొంపెల్ల జనార్దనరావుగారు. రెండు మాసాల కొకసంచిక చొప్పున ప్రకటించబడుతుంది. మొన్నటి డిసెంబరులో మొదటిదీ, యీ ఫిబ్రవరిలో రెండోదీ - అప్పుడే రెండు సంచికలు వచ్చాయి.

జనార్దనరావు గారు తమ సహజ విజ్ఞానానికి సాయంగా, మొన్నటి దాకా భారతి ఆఫీసులో నిర్వహణానుభవం గడించి వున్నారు.

ఉదయిని ఉన్నత శ్రేణికి చెందిన పత్రిక. "చదువుకొన్నవారు" చదివే పత్రికగా సంపాదకులు దీన్ని నిర్దేశిస్తున్నారు. ఈ ప్రతిజ్ఞ నెరవేరుతుందని సూచనలు కనపడుతున్నాయి.

రచనల విషయంలో మంచి శ్రద్ధ కనపడుతోంది.

కాని సంపాదకుల "కిరణాలు" చదువుకొన్న వారికైనా కొరుకుడు పడతాయా అని సందేహం.

ఉదయిని నవ్యాంధ్ర సాహిత్యానికి మంచి పుష్టికలిగిస్తుందని ఆశిస్తున్నాము.

ప్రబుద్ధాంధ్ర, 10-4-1935

## ఉదయిని

ఉదయిని సం॥ శ్రీయుత కొంపెల్ల జనార్దనరావు గారు, 15 ఆదియప్ప మొదలివీధి, వేపేరి. మదరాజు.

ఇది నూతనాంధ్ర సాహిత్య పత్రిక. రెండు నెలలకొక సంచిక వెలువడును. మొదటి సంచిక యీ నెలలో వెలువడినది. సాలు చందా నాలుగు రూపాయిలు. విడి సంచిక 12 అణాలు. ఇది మాడరనురివ్యూ, త్రివేణి పత్రికల వలె క్రొత్త పద్ధతుల పైని ప్రకటింపబడినది. ఒక సంచికను చూచినచో దీని ప్రత్యేకతను గ్రహింప వీలగును. ఈ సంచికలో 74 పుటలున్నవి. 22 వ్యాసములున్నవి. వీనిలో పాటలు, కథలు మున్నగునవి గూడ కలవు. కిరణాలు అను ప్రధాన వ్యాసము ముఖ్యముగా చదువదగును. వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు రచించిన శరదుత్సవము, యాత్ర, కృతజ్ఞత; నో. స. శాస్త్రిగారు రచించిన అవరోధము, శ్రీరంగం శ్రీనివాసరావు గారు రచించిన జయభేరి, సంపాదక

విరచితమగు అన్వయము, శ్రీమతి చావలి బంగారమ్మగారు వ్రాసిన పుంతలో ముసలమ్మ, చింతా దీక్షితులుగారు వ్రాసిన చిన్న, జనమంచి కామేశ్వరరావు గారు వ్రాసిన ఆకొండ, కాశూరి వేకంట నరసింగరావు గారు వ్రాసిన ప్రబోధము, వనవాసి, శ్రీరంగం నారాయణబాబుగారు వ్రాసిన మిణుగురుమీటు అను గేయము లిందు కలవు. కవికొండల వేంకటరావు గారు వ్రాసిన ప్రేమతత్త్వం, అడవి బాపిరాజు గారు వ్రాసిన వీణ, కొంపెల్ల సూర్యరావుగారు వ్రాసిన దొంగతనం అను కథలు దీనిలో నున్నవి. మంగిపూడి పురుషోత్తమ శర్మగారు వ్రాసిన ముక్తిపేను, ఆనందం, పి. వి. రాజమన్నారుగారు వ్రాసిన దుఃఖాంత నాటిక (ట్రాజడీ) విమర్శ, జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి గారు వ్రాసిన మాతృభాష అను వ్యాసములు చదువదగినవి. నోరి నరసింహశాస్త్రి గారు (సాహితీ సమితి, గుంటూరు) వ్రాసిన 'భాగవతరణ' మను పద్య నాటికను గూర్చి నీ సంపాదకీయ విమర్శయను యితర విమర్శలు గూడ దీనిలో నున్నవి. వ్యాసకర్తలందరును విఖ్యాతులు.

ఆం. పత్రిక (దిన)
24-12-1934



## ఉదయిని

సాహిత్యపత్రిక. రెండునెలలకొక సంచిక. సాలుసరి చందా 4. రు. మద్రాసు.

"నవసాహితీ గగనరంగాన, 'ఉదయిని' ఉదయిస్తూనే చండకిరణముల ప్రసరించింది. సామాన్యులకు దుర్నిరీక్ష్యమైన యీ తేజము" రసపిపాసువులకు అకాల జలదోదయమై హాయిని స్థాయిని చేకూర్చినది. "రెండు సంచికలయందలి రచనలును నవసరస్వతికి నీరాజనములే. చలంగారి 'ప్రేమపర్యవసానం' ప్రేమ యొక్క నిమ్న, ఉన్నత, వక్ర, సమఘట్టాల నన్నిటిని కబళించుకొని కామ పర్యవసానంగా తేలి, కామప్రదులకు అర్థనారీశ్వర బంధనమమోఘమనిపించింది.

---

1935లో అప్పటికి అచ్చై బయటకొస్తున్న తెలుగు పత్రికల జాబితానొక దాన్ని తయారు చేశారు. ఇందులో వివిధ మాస, త్రైమాసిక, అర్ధ సంవత్సర, సాంవత్సరిక పత్రికలుగ 108 ఉన్నాయి. ఈ పట్టిక ఆంధ్ర పత్రికతో ఆరంభమైంది. పదో స్థానంలో కొంపెల్ల జనార్దనరావ్ 'ఉదయిని' - ఉంది. ఇది 6-7-1935 కృష్ణా పత్రిక సంచికలో ఉంది,

ఆచంట జానకిరామ్‌గారి 'ఈవియోగజలధి' నేటి కళాభాయీల మధురరసానుభవ సుకుమార శీలాన్ని రూపించింది. శ్రీమతి చావలి బంగారమ్మగారి 'ఫొటోలోపాలు నేటి తెలుగుతల్లి' మురిపెమును ముచ్చటించింది. 'ముత్యాలసరం - ఒకకృషి' నిజముగా అది ఒకకృషియే. సంపాదకులు శ్రీయుత కొంపెల్ల జనార్దనరావుగారి సృష్టి' గీతము 'ఉదయిని' భావిసౌభాగ్యమునకు జయ ఢంకాయే.

"౧౮

జయముతేగల ముదమె

మెచ్చు తేజడి వీచి

మనసు కదిలించి నా

నాచంచువదిపదును

చూచుకో నేమరదు."

"మబ్బులందము చల్లదనము పులకించేటి

నాకల స్వాదురేఖకు బొమ్మ చెదరుట

అనుచు లేనేలేదు."

"మనసె తాపాయ విచ్చినచోట, నాకలము

మనసె, సర్వమె, ఊతగా వ్రాసికొంటుంది"-

అందుచే "కిరణముల" ప్రతాపం కుంటువడుతుందనే శంక లేదు. సాహితి, సఖి, జయంతుల దివ్యాంశల దక్కించుకొన్న 'త్రివేణి' ఈ ఉదయిని; ఏ ప్రశంసలకు నభివందనములకు, విజయానందమున మందగమనమునకాదు.

ఆకారము, సంకలనము సాహిత్య దర్జాకు తగినట్లే ఉన్నవి. ఉత్తమోత్తమమైన నవ్య సాహిత్య సౌరభమున, సాధారణ జనప్రపంచమును గూడ, ఉదయిని, అనుగ్రహించునని ఆశయము

పింగళి నాగేంద్రరావు

కృష్ణాపత్రిక

30-3-1935

'ఉదయిని' ముఖచిత్రం. 1935




వెలువడ్డ ఆరు సంచికలకూ ఇదే ముఖచిత్రం ఉంది.
దీన్ని అడవి బాపిరాజుగారు వేశారు.

మిత్రులతో 1935.



ఎడమనుండి కుడికి : పైవరస—1. అయ్యగారి వీరభద్రరావు

మధ్యవరస—1. కీ॥ శే॥ కొంపెల్ల సూర్యారావు 3. కొంపెల్ల జనార్దనరావు.

కింది వరస—1. ఇవటూరి కామేశ్వరరావు (మల్లంపల్లి మేనల్లుడు)

(ఇవటూరి కామేశ్వర్రావు గుర్తించింది)

## క్రొత్త తెలుగు పత్రికలు

విజ్ఞానసాహిత్యములు మహోవాహినులు, విశ్వమానవ ప్రపంచము వానికి సంచారభూమి. అవియు, వానినుండి చీలిన చిరుకాలువలు మానవ హృదయక్షేత్రముల ప్రవహించి అచట సహజముగ నెలకొనియుండు భావాంకురములను ప్రోది చేసి వివిధ విశ్వకల్యాణములను కొల్లలుగ పండించును. ఆపంటలకు వాఙ్మయ మహోదధి కణజము. వాహినులు గ్రంథముల ద్వారమునను చిరుకాలువలు పత్రికలద్వారమునను ప్రవహించును. విజ్ఞాన సాహిత్యముల పరిచయమును, వానియెడ నభిరుచిని కలిగించునవి పత్రికలు; వానియందు మంచి ప్రవేశమును గలిగించునవి గ్రంథములు. ఒక పత్రిక అనేక విషయములను అనేక విధముల నావిష్కరించును. ఒక గ్రంథ మొక్కవిషయమును, సామాన్యముగ నొక్కవిధముననే వివరించును. కావున విజ్ఞానసాహిత్యముల సులభ వ్యాప్తికి, అభివృద్ధికి గ్రంథములకంటె పత్రికలే ఉత్తమములగు సాధనములగుట సత్యము. ప్రపంచమునందలి నాగరకదేశముల నన్నింటను వేలకొలది పత్రికలు వెలువడి విజ్ఞానచంద్రికల వెదచల్లుచుండుట నొకింత పరికించిన నీవిషయమును స్పష్టముకాగలదు.

మనదేశమున నెన్నియోపత్రికలు పుట్టినవి; పుట్టుచున్నవి. అంతస్సారము లేక, బాహ్యపుష్టిని సమకూర్చుకొనజాలక కొన్ని గిట్టినవి; అరకొరయూపిరితో నిక కొన్ని యూగులాడుచున్నవి. అవియన్నియు నిర్వాహకులశక్తికి; సంస్కారమునకు ననురూపముగ విజ్ఞాన సాహిత్యముల యభివృద్ధికి సాయపడినవి. కాని ఆ యభివృద్ధి చాలతక్కువ. అసలు పత్రికలకే కాలూని నిలువరానిదేశమున వాని వలన విజ్ఞాన సాహిత్యముల విశేషాభివృద్ధి నాకాంక్షించుట వెఱ్ఱితనము. అయినను మరలమరల తదభివృద్ధికయి ప్రయత్నముల నొనరించుచుండుట దేశాభ్యుదయాకాంక్షులకు సహజశీలము. ఇట్టి సహజశీలమును పురస్కరించుకొనియే నేడు తెలుగు దేశమున, క్రొత్తరూపమున క్రొత్తరుచుల నీనుపత్రికలు రెండు క్రొంగొత్తగా పుట్టినవి. అందొక్కటి 'ఉదయిని'; రెండవది 'నాట్యకళ'. రెండును కళాత్మక దృష్టిగలవి. వీనికి స్వాగతము.

## ఉదయిని*

'నేటివరకూ సాహిత్యము గతులు నిరూపిస్తూ తత్పరిణామమునకు తోడ్పడుతూ దానికోసమై ప్రత్యేకము నిలిచి బ్రదికిన పత్రిక' లేకపోయిన తెలుగునాట ఆలేమిని పోగొట్టుటకయి నేడు పుట్టిన 'సాహిత్యపత్రిక' 'ఉదయిని'. "'చదువుకున్నవారు' చదివేపత్రిక" ఈ 'ఉదయిని'. సామాన్యదృష్టికి తెరిచూడరాని తన 'కిరణాల'తో నవ్యసారస్వత ప్రపంచము నుద్దీపింపజేయుచు నిది యుదయించినది.

'నవ్యసాహిత్యమహోదయమున వెలువడ్డ కావ్యధోరణుల అనుకరణములూ ప్రతిధ్వనులూసహా మ్రోయకమానని యీగడియలలో నవ్యరీతుల ఒరవళ్లుచూపే పాశ్చాత్త్య సాహిత్యవీథిని పదనుపడ్డ ఆశయములూ, ఆదర్శములూ, సాంప్రదాయకములైన ప్రాచ్యలకలాస్వప్నాలతో బాంధవించి అదనైన మెరుగులు దిద్దుతూ, ప్రతిభావికాసక్రమమును పరిశీలించి వివరించగల విమర్శమూ, నలిగిన దారులనూ, తప్పక కొత్తదారులనూ చింపుకపడే సద్రచనలూ ఏకత్రపరుస్తూ సర్వవిధాల ఉత్తేజనం సంపాదించడంకోసమై' యీపత్రిక 'చేయిచేసుకున్నది.' కావున 'రసాస్వాదనముబట్టి మనస్సుకు సంస్కృతి ప్రసాదించే ఉత్కృష్ట సాహితీకలాభ్యుదయానికి ఈ 'ఉదయిని' సంతతము తూర్పుదిక్కయి ద్వారము తెరుస్తుంది. 'మొదటి తరగతు వారి కౌశలాలు సేకరించుకొన్న మాత్రాన మురిసి ఆగక, పెరుగుదలచూపే చక్కని చేతుల విన్యాసాలకు తగినంతగా ఆహ్వానమీయడం' 'కర్తవ్యేతరము కాదచేస గతి' మరువదు.

సంపాదకుడు 'చదువుకున్న' వాడు; ఆరేడేడ్లపాటు భారతిపంచను నలిగి పలికురికిన 'సాహిత్య వీరుడు'; 'భావగతిలోను, రచనలోను, నవ్యత మెరుగులు దిద్దగల 'సిద్ధహస్తుడు.' అతని 'సహజమయిన ప్రతిభ, ఉత్కటమయిన ఆశా', తొలిప్రాయము తానికించు 'ఉత్సాహమూ' పట్టుకొన్నరూపు ఈ 'ఉదయిని'

ఈ తొలి సంచిక నింపుకొన్న గద్యపద్య ఖండకావ్యములను రచియించిన వారు నవ్యసాహిత్య ప్రియులగు భావకులు; ఆంగ్ల సాహిత్యాధ్యయనమువలన హృదయము పొంగినవారు. ఆ పొంగు వారి రచనములయం దొలికియున్నది. అన్నిరచనములు 'నవ్యసాహిత్య' మను పేరును చెల్లించుకొనునవి. రచనములయం దచ్చటచ్చట భావములకుగల ప్రాధాన్యము భాషకు లేకుండుట కనుపట్టుచున్నది. ఇది 'నవ్యసాహిత్యము'న కుపలక్షణము.

---

* ఉదయిని (సాహిత్యపత్రిక). రెండు నెలల కొకసంచికవంతున వెలువడును. ౧౯౩౪ డిసెంబరున ప్రారంభము. సాలుసరిచందా: రు. ౪ విడిప్రతి అ. ౧౨ సంపాదకుడు, ప్రకాశకుడు: శ్రీ కొంపెల్ల జనార్దనరావు, ౧౫, ఆదెప్ప మొదలివీధి, వేపేరి, మద్రాసు.

పద్యరచనము లన్నింటిలో శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి రచనము లగ్రస్థానము నలంకరించినవి. ఆయన ప్రాచీన సాహిత్య పారమును దెలిసినవాడు; నవీన సాహిత్యము సౌందర్యమును గుర్తించినవాడు రెండింటి మిశ్రణమున హృద్యములయిన రచనలయం దాయనచేయి బాగుగా తిరిగినది. ఆయన రచనముల యందు పలుకులచేతను, భావములచేతను మదికి చల్లదనమును గూర్చు హాయి గలదు.

గద్యరచనములలో శ్రీ కవికొండల వెంకటరావుగారి 'ప్రేమతత్వం' అను కథ అగ్రస్థానమున నిలిచినది. అది ప్రేమతత్త్వమును సొగసుగ పట్టియిచ్చుచున్నది.

ఈ రెండింటికి తగినస్థానము నిచ్చి సంపాదకుడు సవిమర్శకమగు గుణగ్రహణశక్తిని ప్రకటించుకొనినాడు.

'వాఙ్మయవీథి' యందు సాహిత్య విమర్శ సరసముగ నడచినది.

'శృంగాటకము' సంపాదకుని వివిధ నిపుణ సమాలోచనములకు నెలవు.

సంచికస్వరూపము లోపల, వెలుపలకూడ రమణీయమయి నవ్యవాసనల నీనుచున్నది.

'లోక ప్రవృత్తినంతనూ కలవరపరిచే ఆర్థిక మాంద్యమురోజులలో' 'సద్గ్రంథము'తో పత్రికను 'నింపుకొనడమే చేయనిండిన పని' అయియున్నను నవ్యసాహిత్యాభ్యుదయము నాశించి యిట్లుత్తమపథమున నీపత్రికను ప్రకటించుటకు దొరకొనిన ఈ సాహసిక సంపాదకునికి భావకులగు 'చదువుకున్నవారు', ఆ 'చదువుకున్న వారి'యెడ,'చదువు'నెడ నభిమానము గలవారు సాయము 'నందిచ్చి బుజాలు కలిపినచో వారికి అబ్బురపాటుతో కృతజ్ఞత వందించడంకంటె మించి, వారి మనస్సులో శబలించిన సౌందర్యముచూచి ముగ్ధమాంగల్యములు'వేరుకొనును 'ఉదయిని.'

భారతి 1935 సంపుటి 12 సంచిక 1



ఉ ద యి ని

(ముఖచిత్రం చూచినపుడు కలిగిన భావాలు)

ఆగండి చుక్కలూ ఆగిచూడండి
ఇదిగో నాపసికూన అగపడద మీకంటికాగండి॥

పాకుచూ నాబాల
పైడికాంతులు జల్లి

పలుతెరంగులపూలు
పరిమళించుచునుండె - ఆగండి॥

బడుగైన నాకడుపు
భావాలు విరబోయ
భయమేల "నుతయిని"తో
భాస్కరుని చూడగా
ఆగండి చుక్కలూ
ఆగిచూడండి.

శ్రీమతి చావలి బంగారమ్మ
'కాంచనవిపంచి' - నుండి



## ఛత్రపాలుడు 1, 2 భాగములు

అనువాదకులు: శ్రీ ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు, కొంపెల్ల జనార్దనరావు గారు. డెమ్మిసైజు పు. ౨౨౪-౨౨౨ విలాసము: ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల. పిఠాపురము. వెల: ఒక్కొక భాగము౧-౮-౦

ఈ నవల తొలుత మహారాష్ట్రభాషయందు జనన మందినది. కర్త: శ్రీయుత బాలచంద్ నానాచందషాహా వకీలుగారు. దాని హిందీ అనువాదమున కిది తెలుగుచేత. ఇందలిగాథ ఔరంగజీబు శివాజీచక్రవర్తులున్న కాలము నాటిది.

కథానాయకుడు ఛత్రపాలుడు; శివాజీ మహోపదేశమును బొంది తన దేశమగు బుందేలు ఖండమును ఔరంగజీబు అధికారమునుండి తొలగించి యచట స్వాతంత్ర్యపతాకమును నెలకొల్పిన మహావీరుడు. ఒకవంక కథానాయకుడు, అతని తండ్రి చంపతరాయలు స్వార్థమునకు స్వస్తిచెప్పి, దేశకల్యాణమును కాంక్షించి స్వాతంత్ర్యమును బడయుటకై విశ్వప్రయత్నము గావించుచుందురు. ఇంకొకవంక వారిబంధువులు ఇరుగు పొరుగు రాజ్యముల ప్రభువులు నగువారు వ్యక్తిద్వేషము, స్వార్థము కారణములు కాగా దేశీయులలో కలహములను బెంచి దేశమును నిరంతరదాస్యబంధమున నుంప ప్రయత్నించుచున్నారు. రెండవ పక్షమువారి దుష్ప్రయత్నములన్నియు హీరాదేవి యను నొకస్త్రీయొక్క దురాశ చేతను, దుస్తంత్రములచేతను నయినవి. తుదకు స్వాతంత్ర్యపక్షమే గెలిచినది. రెండుపక్షములను గ్రంథకర్త సమంజసముగా నిర్వహించినాడు.

వీరరసప్రధానమయిన ఈ నవల శృంగారరసమును కూడ నింత చవి చూపును. ఎడనెడగల ప్రకృతివర్ణన మపూర్వమే యైనను చాల క్లిష్టముగనున్నది. దేశ స్వాతంత్ర్యము పరమార్థముగనెంచి శత్రువులతో పోరిపోరి ప్రాణముల నర్పించిన చంపతరాయలు, శివాజీచక్రవర్తి ఛత్రపాలునకు బోధించిన రాజనీతి చాల విలువగలది. దేశ స్వాతంత్ర్య ప్రాప్తికి ప్రజల యన్యోన్యానుకూల్యమే మూలసూత్రమని యీనవల గట్టిగా చెప్పుచున్నది.

మూలగ్రంథమున పదియవ ప్రకరణమునకు తర్వాత కథ కొంత లోపించునట్లుండెననియు, దానిని అనువాదకులు తాము కల్పించి పూరించితిమనియు దానిని ఉపోద్ఘాతమున జెప్పియున్నారు. కల్పితభాగము కథలో కథగా హత్తుకొనిపోయియుండుట అబ్బురమును గొలుపకపోదు. ఇది అనువాదకుల కల్పనాశక్తికి నిదర్శనము, తెలుగుచేత నిర్దుష్టము; కాని సంస్కృతపదబహుళముగ, ప్రౌఢముగ నున్నది. హిందీమూలమునకు ప్రత్యక్షానువాదమగుటచేతను, క్లిష్ట కల్పనములకు ఆకరమగుటచేతను శైలి కటువుగా నున్నను సజీవముగానున్నది. ఇట్టి శైలి వినోదముకొఱకు నవలలను చదివి యావల పడవైచువారికి రుచింపదు. కాని ఓపికపట్టి చదివినచో కథతోపాటు కొంత భాషాపరిచయము నిది గలిగించుట సత్యము. కావున ప్రాచీన ప్రబంధ ప్రపంచమున నాముక్తమాల్యదకు గల స్థానము నేటి నవలా ప్రపంచమున నీనవలకు గలదనిన నతిశయోక్తి కాజాలదు. ఈనవల పాఠశాలలయందు - హైస్కూళ్లు, కాలేజీలు - అవశ్యముగ చదువవలసిన గ్రంథము (*detailed text*)గా నిర్ణయింపదగినది.*

---

* ఇపుడు పాఠశాలలలో చదువబడుచున్న పుస్తకములు చాలవరకు శబ్దదోషములు, వాక్యదోషములు, అసంగతవిషయములు మొదలగువానితో నిండి బాలురకు భాషానభిజ్ఞతాజాడ్యము నాపాదింపజేయుచున్నవి. ఈ జాడ్యమునకు పాఠ్యగ్రంథ నిర్ణయసంఘము(*Text book Committee*)వారు బాధ్యులగుదురు. ఆ సంఘమునందలి సభ్యులు భాషాపాండిత్యము, లోకజ్ఞతగలిగి, బాలుర బుద్ధి స్వభావము, పరిణామక్రమమును దెలియగలవారుగ నుండదగుదురు. అట్టివారును తామునిర్ణయించు గ్రంథములను గ్రంథకర్తలయు, ప్రకాశకులయు ప్రోత్సాహ, ప్రార్థనములకు లోనుగాక సవిమర్శనముగా పఠించి, వాని మంచిసెబ్బరలను గుర్తించి మంచివానినే నిర్ణయించుట శ్రేయము. ప్రస్తుతమున్న పుస్తకములనుచూడ సంఘము, తత్కార్యనిర్వాహవిధానము తృప్తికరముగ నున్నట్లు చూపట్టదు. ముందయినను ఇట్టి లోపములు తొలగుట పరమావశ్యకము, దీనికయి ప్రజలు తీవ్రముగ ప్రయత్నింప దగుదురు.

పాఠ్యగ్రంథనిర్ణయ సంఘమువారు గుణభూయిష్ఠమయిన యీనవలను పాఠ్య గ్రంథములలో జేర్చిన విద్యార్థులకు కొంత మేలు చేసిన వారగుదురు. అనువాదకుల రచనమున జీవకళ నిండారియున్నది. అయ్యది క్రమముగ పుష్టిని జెంది ఇతోధిక సుందరగ్రంథ రచనాదక్షము గాగలదు. అనువాదకు లక్షణమును గుర్తించి అభిజ్ఞతను, రచనాసౌష్ఠవమును, అవకాశమును పెంపొందించు కొనుచు సముచితరీతిని భాషాసేవను, తన్మూలమున దేశసేవను గావించుచు చిరజీవులయి వెలయుదురు గాక! —భారతి.

శుక్లచైత్రం

# భావుకుడైన నిర్భీక విమర్శకుడు

డా॥ కేతు విశ్వనాథరెడ్డి

కొంపెల్ల జనార్దనరావు జీవించింది 31 సంవత్సరాలు. 1927 నుండి పదేళ్ళపాటు ఆయన చేసిన రచనలు ఆనాటి సాహిత్య పత్రికల్లో ఉన్నాయి. జనార్దనరావు సంపూర్ణ సాహిత్యాన్ని ముద్రింపించే బాధ్యతను వాళ్ళ అన్నయ్య కొంపెల్ల సూర్యారావు శ్రీశ్రీ మీద ఉంచారు. శ్రీశ్రీ నెరవేర్చలేకపోయాడు. అయితేనేం మహాప్రస్థానంలోని 'కొంపెల్ల జనార్దనరావు కోసం' అనే అంకిత స్మృతి గీతంద్వారా, ఆత్మచరిత్రాత్మ చరిత్రాత్మక నవల అనంతంద్వారా కొంపెల్లను మనకు శ్రీశ్రీ పరిచయం చేసిపోయాడు. కొంపెల్ల జనార్దనరావు కవిత్వాన్నీ, ఆయన సంపాదకత్వం వహించిన సాహిత్య పత్రిక ఉదయినినీ, ఉదయిని సంపాదక ప్రమాణాలనూ, సాహిత్యాదర్శాలనూ, విమర్శకుడుగా ఆయన మహోన్నతస్థానాన్నీ, తాము కలసి కన్న కలలనూ శ్రీశ్రీ మనకు అందించి పోయాడు. ఇప్పుడు శ్రీశ్రీ స్మారకసంస్థ శ్రీశ్రీ బాధ్యతను నెరవేరుస్తోంది - కొంపెల్ల జనార్దనరావు సాహిత్యాన్ని అందినమేరకు అచ్చువేస్తూ.

కవితలు మినహాయిస్తే జనార్దనరావు వచన రచనలు మూడు వందల పేజీల లోపే ఉంటాయి. ఆయన పుస్తక సమీక్షలూ, ఉదయిని సంపాదకీయాలూ, వ్యాఖ్యలూ, విమర్శ వ్యాసాలూ, నాటికలూ, మిత్రులకు సాహిత్యపరమైన ఉత్తరాలూ, అనువాదాలూ- ఇవీ ఆయన వచన రచనలు. పుస్తక సమీక్షలు 20 లోపు. ఉదయిని సంపాదకీయాలు 'కిరణాలు' పేరుతో ఆరు, ఉదయినిలోని 'శృంగాటకం'లో కన్పించే వ్యాఖ్యలు కొన్ని. చెప్పుకోతగ్గ విమర్శవ్యాసాలు పది లోపే. కృష్ణశాస్త్రిగారి ప్రవాసము, ఊర్వశి, ఆంధ్రకవిత్వచరిత్రము, వైతాళికులు, స్థానం నరసింహారావుగారు - సత్యభామ, కావ్యకళ, ఆశయ వైశిష్ట్యములు, గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, వేనరాజు - ఇవే మనకు దొరికే వ్యాసాలు. వేనరాజు అసంపూర్తి వ్యాసం. వెలుగు, తాన్సేన, స్వర్ణయోగి నాటికలు మూడు.

ఈ ప్రసంగంలో జనార్దనరావు పుస్తక సమీక్షలనూ, ఉదయిని సంపాదకీయాలనూ, సాహిత్య విమర్శ వ్యాసాలనూ, నాటికలనూ ప్రస్తావించుకొని, ఆయన సాహిత్య మూర్తిమత్వాన్ని విశ్లేషించుకుందాం. వీటిని మనం వస్తుపరంగానూ, నిర్మాణపరంగానూ, శైలిపరంగానూ విశ్లేషించుకోవచ్చు.

వస్తుపరంగా అంటే, సాహిత్యవిమర్శలో ఆయన ప్రకటించిన భావాలు, నిర్మాణపరంగా అంటే, ఆ భావాలను ఆయన కూర్చిన పద్ధతి, శైలీపరంగా అంటే, ఆ భావాలను మనకు అందించడానికి ఆయన వాడిన భాషా నిర్మాణం.

బసవరాజు అప్పారావుమీద రాసిన ఒక చిన్న వ్యాసంలో 'విమర్శకుని తాటస్థ్యము' అనే మాట ఒకటి కన్పిస్తుంది. ఉదయిని మొదటి సంచిక సంపాద కీయంలో "పాశ్చాత్య సాహిత్య వీధిన, పదనుపడ్డ ఆశయములూ, ఆదర్శములూ సాంప్రదాయికములైన ప్రాచ్యుల కలా స్వప్నాలతో బాంధవించి మెరుగులు దిద్దుతూ ప్రతిభా వికాస క్రమమును పరిశీలించి వివరించగల విమర్శము" కావాలంటారు. "నలిగిన దారులనూ, తప్పక కొత్తదారులనూ చింపుకపడే సద్ర చనలూ ఏకత్రపరుస్తూ సర్వవిధాలా ఉత్తేజనము సంపాదించడం కోసమై యింకా ఒక పత్రిక - ఒక పత్రికలో కొందరు - చేయి చేసుకోవలసే ఉన్నది" అంటారు. ఉదయిని మూడవ సంచిక సంపాదకీయంలో "భావభరమూ, కళా నిర్వహణమూ కూడా - సారస్వత ప్రయోజనమూ, తత్సౌందర్యమూ కూడా - పరీక్షలో నిగా పొందదగి ఉంటవి" అంటారు. వేరువేరు జీవిత దృక్పథాలు ఉండే రచయితల అభిప్రాయాల పరిచయంతో ఆగకుండా, వారి రచనల్లోని లాక్షణిక సౌందర్యాలు ప్రత్యేకంగా పరిశీలించే పద్ధతినీ, "ఒక కవి ఆశయాలతో ఏకీభవించనక్కరలేకుండానే అతని కవితను కవితగా ఆస్వాదించే పద్ధతినీ" కొంపెల్ల సమర్థిస్తారు.

జాతీయోద్యమ కాలంలో గాంధీ ఉద్యమ నిర్మాణంలోని సామరస్య ధోరణే స్థూలంగా కొంపెల్ల జనార్దనరావు సాహిత్యతత్వం, పత్రికోద్యమ తత్వంకూడా. జనార్దనరావుకు ప్రాచీనాధునిక తెలుగు సాహిత్యాలతో ప్రగాఢమైన పరిచయం ఉంది. ఛందోవ్యాకరణాల్లో, సంస్కృత అలంకారశాస్త్రాల్లో వైదుష్యం ఉంది. ఇంగ్లీషుద్వారా అంతర్జాతీయ కళల్లోనూ, సాహిత్యంలోనూ, విమర్శ పద్ధతుల్లోనూ అభినివేశం ఉంది. జాతీయవాదపు స్ఫూర్తీ, ప్రాంతీయ భాషాసాహిత్యాలపట్ల అభిమానమూ ఉన్నాయి. ఇవి ఆయనను విమర్శలో ఒక సామరస్యధోరణినీ, ఒక సమన్వయమార్గాన్నీ, ఒక ఉదారవైఖరినీ అవలంబించే విమర్శకునిగా దిద్ది ఉంటాయి; అందువల్లనే గురజాడను మెచ్చిన కళ్ళతో కృష్ణశాస్త్రినీ, చలాన్ని మెచ్చిన కళ్ళతో విశ్వనాథనూ, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులును మెచ్చిన కళ్ళతో నోరినరసింహశాస్త్రినీ మెచ్చుకున్నారు. సాంప్రదాయిక కవిత్వాన్ని మెచ్చి సమర్థించిన కళ్ళతో భావకవిత్వాన్ని మెచ్చుకున్నారు. శ్రీశ్రీ కవిత్వాన్ని ఆహ్వానించారు.

ఎవరిని మెచ్చుకున్నా, ఏ కొత్త సాహిత్యోద్యమాన్ని ఆహ్వానించినా చిత్తశుద్ధిలేని పొగడ్తలం సమీక్షకుల్లా విమర్శకుల్లా; మెచ్చుకోలేదు; ఆహ్వానించలేదు.

ఇందుకు ప్రధానమైన కారణాలు జనార్దనరావుకు విమర్శకుడిగా ఉండే నిర్భీక స్వభావమూ, కళాసూత్రాల స్పృహా, సాహిత్యరచనల నిర్మాణ అవగాహనా. ఇవే ఆయన విమర్శ వ్యాసాలలో తన భావాలను కూర్చే పద్ధతికి తోడ్పడ్డాయి.

నిర్భీక స్వభావమే లేకపోతే శివశంకరశాస్త్రి ఆవేదనలోని కావ్యఖండికల "కవితలో కదిపి కుదిపే ఆవేదన లేదు. స్వప్నసంధాయి అయిన విలాసమూ లేదు. అనుభవశుద్ధి ఉన్నది; కాని భావనలో లోతు, విస్తృతి లేవు" అని అనలేరు. కృష్ణశాస్త్రి 'ప్రవాసము, ఊర్వశి'ని గురించి రాస్తూ "రసభావానుభవాధికము నందు కంటే శిల్పమునందు ఈ రచనా దీక్షితుని విహారము ఎక్కువ చేతనాన్వితమై విలసిల్లింది" అని అనలేరు. బసవరాజు అప్పారావు 'ఆంధ్ర కవిత్వ చరిత్రము'ను నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తూ, అలంకార సంప్రదాయ పరిజ్ఞానం లేదనీ, తాళానికీ గణాలకూ తేడా తెలియదనీ, కొన్ని సందర్భాల్లో పదాలను తప్పుటర్థం చేసుకున్నారనీ నిరూపించలేరు.

కొం. జ అనే పొడి అక్షరాలతో జనార్దనరావు ఆనాటి పత్రికల్లో రివ్యూలూ, వ్యాసాలూ రాసేవాడు. శ్రీశ్రీ మాటల్లో చెప్పాలంటే "ఈ పొడి అక్షరాలు కొందరికి సింహస్వప్నం అనడంలో అతిశయోక్తి లేదు. బసవరాజు అప్పారావంత కవికి ఇవే చిత్తచాంచల్యాన్ని కలిగించాయి". బసవరాజు అప్పారావు రాసిన 'ఆంధ్ర కవిత్వచరిత్రము'లో జనార్దనరావు పట్టిన ఒక తప్పును ఉదహరించుకుందాం:

"ఒతెల్లో నాటకమున, వివిధ విభ్రమముల వర్తింప వచ్చిన హత్యకు ప్రధాన పాత్రములు దాదాపు అన్నియు తలలొగ్గగా, కాషియో మాత్రము మిగుల గలిగెను. దుండగీడగు ఆయోగో కత్తిపోటును, నేర్పరియగు షేక్స్పియరుకవి కలము పోటును తప్పించుకొన్న కాషియోను శ్రీ అప్పారావుగారు రెండు మూడు సారులు చంపిరి. "ఒతెల్లో....కాషియోను జంపి...భార్యను....ఘోరముగ తల దిండులతో జావమోది చంపె" నట. కాషియో చావలేదు సరిగదా, అతనిని పొడిచినదైనను అయోగా కాని ఒతెల్లో కాదు. డెస్టెమోనాను ఒతెల్లో కుత్తుక పిసికి, ఊపిరాడనీయక చంపివాడు. *Stifle* అనుధాతువునకు తలదిండులతో చావమోదుట యని ఆంగ్ల సాహిత్యము తరిచిన వీరు తప్పుటర్థము చేసికొన్నారని శంకించుట కంటే ఆక్రియాపదమును గుర్తించి వ్రాయునంతటి శ్రద్ధ వీరు వహింపలేదన్నది సత్యమగును. ఈ అశ్రద్ధవలననే కాబోలు, అన్వయ దోషములును ఇందు విహారములు సలుపుచు వచ్చినవి" - ఇదీ జనార్దనరావు దోషఖండన పద్ధతి.

జనార్దనరావు ఈ రకం సాహిత్య రచనా దోషాలనే కాకుండా, స్థానం నరసింహారావు వంటి ఒక గొప్పనటుని సత్యభామ నటనలోని లోపాలను కూడా ఎత్తి చూపారు.

సాహిత్యరచనలు, నటన, చిత్రలేఖనం, శిల్పం వంటి వాటిని పరామర్శించే సందర్భాల్లో జనార్ధనరావు విమర్శ ధోరణిలో రెండు అంశాలు ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. మొదటిది కళాకారునికి తన భావాలను కళగా మలిచేశక్తి ఉందా లేదా, ఉంటే ఏ రకంగా ఉంది అని పరిశీలించడం. అంటే సాహిత్య చారిత్రక నేపధ్యానికీ, సాహిత్య ప్రయోజనానికీ తగిన ప్రాముఖ్యం కూడా ఇవ్వకుండా సాహిత్య సౌందర్యానికి ప్రాధాన్యం ఇచ్చే పద్ధతి ఇదన్నమాట. సాహిత్య సౌందర్యం అంటే జనార్ధనరావు దృష్టిలో సాహిత్య రూప శ్రద్ధ; సాహిత్య రూప శ్రద్ధ ద్వారా రచయిత తన అనుభవాలనూ, అనుభూతులనూ, లిప్సనూ, విలాసాన్నీ శిల్పం ద్వారా అందించే పద్ధతి. జనార్ధనరావు సాహిత్య విమర్శలో శిల్పపరామర్శ ప్రధానం. అయితే చాలామంది మన ఎకడిక్ పండితుల్లాగా, పరిశోధకుల్లాగా కాకుండా, కళలపట్ల ఒక భావుకుడి రసనా, ఒక ఆలోచకుడి మేధస్సూ, తర్కదృష్టీ ఈ శిల్ప పరామర్శలో కన్పిస్తాయి.

ఈ శిల్ప పరామర్శ శ్రీశ్రీ అనంతంలో అన్నట్లు 'సహజ భయంకరమైన శైలి'లో సాగుతుంది. 'వక్రోక్తి'లో సాగుతుంది. ఏమిటా సహజభయంకరమైన శైలి? వక్రోక్తి? ఆలోచిద్దాం. జనార్ధనరావు ఏదీ సాఫీగా, సూటిగా సరళ వాక్యాల్లో చెప్పడు. వాక్యాలు ఒక తర్కక్రమంలో సాగుతూనే ఉంటాయి. అయితే అవి ఎక్కువగా సంయుక్త వాక్యాలుగా, సంశ్లిష్ట వాక్యాలుగా, డొంక తిరుగుడు వాక్యాలుగా కన్పిస్తాయి. టోన్‌లో వ్యంగ్యం, పరిహాసం, మర్యాద కలగలిపి ఉంటాయి. ఒక వాక్యంలో విషయాన్ని చెప్పటం, ఆమీద వ్యాఖ్యను జోడించటం ఉంటాయి. చెప్పదలచుకున్న విషయంలో భాగంగా చెప్పిన వాక్యంలో మరచిపోయినట్లు మధ్యలోనో చివరనో అడ్డగీతలు పెట్టి ఉపవాక్యాలు చేర్చే పద్ధతి కన్పిస్తుంది. వాడుకలో లేని సంస్కృత పదాలనూ తెలుగు మాటలనూ ఉపయోగిస్తాడు. ప్రాచీన కావ్యభాషా శైలికి సన్నిహితంగా ఉండే వ్యాకరణ రూపాలను వాడతాడు. అతని సంపాదకీయ శీర్షికలు 'కిరణాలు.' వ్యాఖ్యల శీర్షిక 'శృంగాటకం.' ఈ సంస్కృత పదాల వాడకంలో ఆయన కాల్పనిక దృష్టీ, ప్రాబంధిక ధోరణీ కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి. అందుకే జనార్ధనరావు "బతికున్నంతకాలం అతని రాతలెవరికీ అర్థం కావని ఒకటేగోల" పెట్టారనీ; "వచనం కూడా కొరకరాని కొయ్యేనని" శ్రీశ్రీ ఉదాహరణ పూర్వకంగా చెప్పాడు. వైశాఖ సంచికలో జనార్ధనరావు తన కవిత్వం మీద రాసిన వ్యాసాన్ని కృష్ణశాస్త్రిగారు ఆసాంతం చదివి ఆఖరుకి...."అయితే ఏమిటయ్యా ఇతనంటాడు? ఇందులో నన్ను పొగిడినట్టా? తిట్టినట్టా అన్నాడు" అని శ్రీశ్రీ రాశాడు. జనార్ధనరావుని 'చండప్రచండ గండశిలాభినవ కొక్కొండ' అని ఒక ప్రముఖ వారపత్రిక ఆ రోజుల్లో అభివర్ణించినట్లు శ్రీశ్రీ పేర్కొన్నాడు. అయితే

తనకు నచ్చిన శైలి జనార్దనరావుది అని కూడా శ్రీశ్రీ అన్నాడు. కవిత్వ శైలికి సన్నిహితమైన శైలిని జనార్దనరావు కొన్ని సందర్భాల్లో అనుసరించినందువల్లనే శ్రీశ్రీకి ఆశైలి నచ్చింది ?

జనార్దనరావు విమర్శవ్యాసాల్లో కన్పించే భావాల్లోనూ, శైలిలోనూ ఎన్ని పరిమితులున్నా శ్రీశ్రీ చెప్పినట్లే "ఎప్పటికప్పుడే జ్ఞానసంపద హెచ్చించుకుంటూ అతడు సారస్వత రంగంలో అనన్య సామాన్యమైన స్థానానికి చేయి చాచాడు.... నవీన సాహిత్య రీతులకు రుచిమంతమైన అధ్యయనాలు చూపించడానికి సమర్థుడు.*

జనార్దనరావు నాటికల్లో అన్యార్థ ప్రతిపాదక ధోరణి మనకు కన్పిస్తుంది. ఒక రకమైన మార్మికధోరణి వెలుగు నాటికలోనూ, తాన్సేను నాటికలో కన్పిస్తే, స్వర్ణయోగి నాటికలో "జనం కోసం బ్రతికి లాభము లేదు" అనే నిరాశా ధోరణి కన్పిస్తుంది. దృశ్యనాటికలుగా కంటే శ్రవ్యనాటికలుగా చదువుకునే నాటికలుగా అవి రాణిస్తాయి. ఏమైనా కొంపెల్ల జనార్దనరావు వచన రచనలు పరిశీలించి నప్పుడు అతని సృజనాత్మకశక్తీ, భావుకత్వమూ, బుద్ధినైశిత్యమూ నాటికల్లో కంటే విమర్శల్లోనే కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి. ఈనాటి సాహిత్య సమీక్షకులు విమర్శకులూ, పరిశోధకులూ జనార్దనరావు నుంచి నేర్చుకోవలసినవి ఆయన చిత్తశుద్ధీ, నిర్భీకతా, విషయ పరిజ్ఞానమూ, శిల్పదృష్టీ. ఆయనకు సాహిత్యం ఒక అనుభవ సాధనం మాత్రమే; సామాజిక సంస్కార పరిణామ సాధనం కాదు.

*ఈయన (జనార్దనరావు) శైలి ముందు నగ్నమైన మా అజ్ఞానాన్ని విన్న వించుకోవడం తప్ప వేరే చెయ్యగలిగిందేదీ లేదు"

- వేలూరి శివరామశాస్త్రి.

# ఉదయిని

## సంపాదకీయాలు

## 1

[సంపాదకీయాలను జనార్దనరావ్ కిరణాలన్న శీర్షిక కింద 'ఉదయిని'లో రాస్తుండేవాడు. ఇందులో ఆయా సమకాలిక సాహిత్యాంశాలపై పత్రికాభిప్రాయాలను వెల్లడించాడు.]

లోకప్రవృత్తి నంతనూ కలవరపరిచే నేటి ఆర్థిక మాంద్యమురోజులలో సహా తెలుగు నాట వెలువడుతున్న కొత్త పత్రికలకు లెక్కలేదు. నిత్యజీవనమే యింత దుశ్శకముగా ఉండగా పదిమందిడబ్బు అభిలషించడం కాని, ఆ డబ్బు సమకూడదనే భయము గమనించకుండా జేబు దులుపుకో సిద్ధపడడం కాని పూచీ తెలియని చిన్నతనమని నిందించబోతే అనింద్యులు ఎంతోమంది మిగలరు సంస్కారులు, —క్రియావశముచేత కాకపోతే పక్షపాత వశముచేత నయినానూ. డబ్బుమాటలు, సౌఖ్యముమాటలు గమనించనీయని ఒక భావోద్రేకం పత్రికనుడిగా వ్యక్తి ఓమ్మకో చూచింది కాబోలు; ఆ వేడి దేశమంతటా రగలకపోదనే ఆశ ఒక ధైర్యమూ ఇస్తున్నది కాబోలు, పూచీ గమనించినప్పుడూ కూడా. మరి యీ ఉన్న పత్రికలు చాలక కొత్త పత్రికలు వచ్చి చేయగలిగిన విశేష మేమిటని ప్రశ్న విసరుతున్నారు జనం: భావము పొల్లుకు కొత్తగా పత్రికలు వచ్చి గొంతు విచ్చుతున్నది యేపాటి అని అనుభవము లెక్కిస్తున్నారు. ఆశయ తతులుమాత్రం ప్రజాచిత్తములో వ్యవసాయమునెడ తృషితములై ఉన్నమాట వాస్తవం.

ఈ అన్నిటనూ ముఖ్యముగా చిందులుతొక్కుతూ కానవచ్చేది సాహిత్య ప్రవృత్తి ఒకటి. దేశములో తరుచై జరుగుతున్న సాహిత్యోత్సవములు కూడా ఈ ఉద్రేకమును నిదర్శిస్తున్నవి. ఇందులకు సాహిత్యపరమైనది ప్రత్యేకము పత్రిక కావలె నన్నది ఒక లక్ష్యముగా పేరుకున్నది. సాహిత్యనిర్మాణము అపరిమితముగా జరుగుతున్నదని కాదు. నిజానికి, ప్రశస్తమైన సాహిత్యం తనివి తీరా రావడంలేదనే అసంతుష్టి భావుకలోకములో వ్యాప్తమై ఉన్నది. ఒకరు

కొన్న గ్రంథము కాని, పత్రిక కాని, పదిమంది (శక్తులైనా తాము కొనక) ఉపయోగించుకొని, కాక అసలే చూడక, సాహిత్యమునూ సంస్కృతినీ ఉపేక్షపాలు చేసే అలవాటు దేశములో పాకిఉండడంవల్లనూ, నీచతరములైన ఆశయాభి రుచులు రగిల్చి జనాదరము లాగుకొనే పూనికలు జయము కాంచడంవల్లనూ, ప్రదర్శనార్థమై మాత్రమే నిలిపిన ఆత్మగౌరవముతోపాటు మహదాశయ కల్యాణమును కోలుపుచ్చే కొందరు సారస్వతుల శోచనీయములైన ప్రయత్నాల వల్లనూ పెక్కురు సమర్థులైన సాహిత్యవీరులు గ్రంథరచనమునకు గాని, సిద్ధ గ్రంథముల ప్రకటనమునకు గాని, పత్రికాది నిర్వహణమునకు గాని, కొంత ఉపసంహృతి పట్టి ఉన్నారు. ఇన్ని పత్రికలకు వారి సంకల్పము సరిగా, ఏకముఖముగా, తీంద్రకొన్నట్టు లేదు. ఆంధ్రభారతి, గ్రంథాలయ సర్వస్వము, సాహితి, సఖి, శారద, కళ, జయంతి మొదలైన పత్రికలు అనల్పమైన సాహితీ సేవ సలిపి అంతరించినవి. కృష్ణాపత్రిక, భారతి మొదలైనవి ప్రశస్తముగా తత్కార్యము సాగిస్తూనే ఉన్నవి. (వాణిజ్యము పోషణమున నిలద్రొక్కుకొన్న భారతి రచయితలకు ఆర్థికపోషణమిచ్చే ఔదార్యముకూడా ప్రారంభము చేసింది.) కాని నాటినుండి నేటివరకూ సాహిత్యము గతులు నిరూపిస్తూ, తత్పరిణామమునకు తోడ్పడుతూ దానికోసమై ప్రత్యేకము నిలిచి బ్రదికిన పత్రిక లేకపోయింది. నాటికీ నేటికీ కలిగిన మార్పు దేశములో సాహిత్యమునెడ ఉత్సుకతనూ, ఉత్సాహ మునూ పెంచినదయ్యా కొన్ని సిద్ధహస్తాలు ఏ ఆశకూ లొంగని అభిజాత్యములో ముహూర్తము వేచి బిగియడం చూస్తున్నది. ఇంతసంచలనంరేగిన కలావ్యాపారము రచనకు వచ్చేసరికి ఒకానొక తలములు తరుచు దాటడం లేదన్నది మాటల మార్పుతో బహుజనమతముగా నిల్చివున్నది. కాని ఉత్కృష్టమైన సారస్వతము ఏరి గమనిస్తే యెంతో ఉన్నతమైన విలువలు అట కానవస్తున్న మాట నిజం. ఇక నవీనులు భావగతిలోనూ, రచనలోనూ నవ్యత మెరుగులు దిద్ది అభివృద్ధి సంపా దించే సూచనలు కనబరుస్తున్నారు. వ్రాతకు ప్రోత్సాహమూ అవకాశమూ కలిగి, అభిప్రాయాలపరిపాకం ప్రతిభకు ఊత యిస్తే, ఇటు సారస్వ తమునెడల దేశములో శ్రద్ధ పెరిగితే, గర్వించదగ్గ సాఫల్యము చేపడుతుంది. అనన్యముగా సాహితీసేవకు పూనుకొన్న పత్రిక యిట్టియెడ పెక్కుకిరణాల సార్థకత చూపగల దన్నది ఒక మతముగా మాత్రమే ఆగక అంతటా అవసర మనిపించుకొంటున్నది. నవ్యసాహిత్యమహోదయమున వెలువడ్డ కావ్యధోరణుల అనుకరణములూ ప్రతిధ్వనులూ సహస్రమోయక మానని యీ గడియలలో నవ్య రీతుల ఒరవళ్లు చూపే పాశ్చాత్య సాహిత్యవీథిని పదనుపడ్డ ఆశయములూ, ఆదర్శములూ, సాంప్రదాయికములైన ప్రాచ్యుల కలాస్వప్నాలతో బాంధవించి అదనైన మెరుగులు దిద్దుతూ, ప్రతిభావికాసక్రమమును పరిశీలించి వివరించగల

విమర్శమూ, నలిగిన దారులనూ, తప్పక కొత్తదారులనూ చింపుకపడే సద్ర చనలూ ఏకత్రపరుస్తూ సర్వవిధాల ఉత్తేజనము సంపాదించడంకోసమై యింకా ఒక పత్రిక - ఒక పత్రికలో కొందరు - చేయి చేసుకోవలసే ఉన్నది. (ఒక పత్రిక అంటే ఒక్కటే పత్రిక అని కాదు.)

ఒక రాష్ట్రమునంతనూ ఉజ్జ్వాతలూచి విప్లవము నడిపించగల ప్రాభవము సారస్వతములో కనబడ్డదట. ప్రకృతిశాస్త్ర మథనము మొదలు విద్యావీథులన్నిట నుండీ విజ్ఞానరోచులు సమన్వయపడి మానుషవిచారవీథిని, అనుభవమాత్రోవల, నడచినడచి కావ్యకలావాటికనుసహా సొంపులు తిరుగవచ్చే ఔచిత్యము తెలియ వచ్చింది. వ్యక్తిజీవనము లోకముతో గాఢముగా, విస్తృతముగా కలియగట్టుకొని, వ్యక్తిమనస్సు-మానసికవపుపు-క్రియలలో, కళలలో విరియించుకోవలసిన సభ్యతా రీతులలో ఆంధ్రులపట్ల నేటి వెనుకాటు దుఃఖకరమేకాని, వారి సహజమైన ప్రతిభా, వారి నేటి సంకల్పగతులూ పరికిస్తే ఉత్కటమైన ఆశా, ఉత్సాహమూ చేపడక మానవు. ఎంతెంతటి ప్రాతికూల్యములు వీచుతున్నా, ఇప్పటి అతృప్తిలో తహతహలో ఏకాశయులకు కొందరకు సమాయోగము కుదిరితే సాఫల్యము చేపడక మానదు.

ఇట్టి సమాయోగములకు ప్రయత్నాలు ఈనడుమ పెక్కువిధాల జరుగు తున్నవి. (ఒకమూలనుండి అఖిలభారతపరిషత్తుకే పిలుపులు వినవస్తున్నవి!) కాని, యిప్పటి ఆంధ్రసాహిత్యరంగమున కానవచ్చే మూడు నాలుగుతరాల అభిప్రాయసంఘర్షణములూ, పక్షాభినివేశముల ఇరుకాటములూ, కేంద్రసమాయోగ ప్రయత్నాలలో సహా తబ్బిబ్బుగా తమప్రభావము కొంతవరకు పరచుకొంటున్న వని చెప్పవలెను. అయితే, రుచికి, ప్రామాణ్యబుద్ధికి సంబంధించినంతవరకు నవీనులలో పరస్పరము సమాధానమూ, సమ్మతీ తగినంతగ్గా ఉండనే ఉన్నవి.

వాడుకభాషకు సారస్వతమే లేసిదే అసలు వ్యాకృతభాషతో పోటీ యేమిటని అధిక్షేపించిన క్రీ. ౧౯౧౩ ముద్ర గుద్దించుకొని పాతకాలములో చేరి పోయింది. నేటికి చియ్యబట్టిన వాడుకభాష ప్రయోగమైనా పరిమితప్రయోజనము తోనే ఆగుతుందని, -ఏనాడో వ్యాకృతభాషలో రచించిన భారతాదులు నేటికీ మన మనస్సులకు, నాటివారికి వలెనే, సన్నిహితములై ఉండగా, వాడుకభాష రచనలు వాడుకనుడికారాలు మారగల కాలాంతరములో (ఇప్పుడయినా ఒకప్రదేశము వాడుక మరొక ప్రదేశమునవలె) దూరభవత కప్పుకొంటవని,- ఆక్షేపణము ఉన్నా, వాడుకభాషయే ప్రజాసామాన్యమునకు భావము అందించగల అపరిమిత ప్రయోజనముగల జీవద్భాష అనీ, కాలాంతరీయులకూ, భాషాంతరీయులకూ సౌలభ్యము గురిచూచి సూత్రాలలో ఇముడడంకంటె భాషాస్వాముల హృదయ వ్యక్తికి అనుకూలమై వాడుకనుడికారాలకీపి అంకినంతగా పిల్చుకొనడం సాహిత్య

మునకు సహజము కాగా, అది యెందులకూ అరికట్టక ప్రకృత మనుసరిస్తే వివేకమనీ మతాంతరము బిగ్గరగా ఘోషించేవరకూ వచ్చిఉన్నాము. క్రియకు, అంతకాలము ఆస్వాద్యమై ఇప్పటికీ మనోజ్ఞము కాకపోని వ్యాకృతభాష ఒకానొక సందర్భాల సమ్మతి పడసిన వాడుకభాషకు కాందిశీకము కావలె ననడం అనుచిత మనీ, వాడుకభాషకు సంప్రదాయసిద్ధీ, విలాసమూ, ప్రయోజనమూ ఉన్నవి కనుక అవి స్వీకరించదగినదే కాని అనన్యము కాజాలదనీ, ఆధునికకళాసేష్టాతులు సహా సౌందర్యసంపాదనముపట్ల వ్యాకృతభాషయోగ్యత చూచి తీరుతున్నారనిన్నీ, కాక, రెండూ ఏవో ఒక ప్రయోజనములకై కలమెక్కి సాహిత్యము కట్టివేస్తూ ఉన్నప్పుడు రెంటనూ చేయిఁతిప్పుకొని భాగ్యము పెంచుకొందామనిన్నీ అభిప్రాయములు. స్పష్టముగా కాని అస్పష్టముగా కాని, పరిపాకమునకు ఉద్యమిస్తున్నవి. ఇంతకూ, ఏ సభ్యభాషయందూ సహజ (దార్శనిక) వ్యాపారమై తెలియవచ్చే వ్యాకృతినుండి కాక, అభ్యాసవశాత్తు తెలుగుభాషయందు ఏర్పడిన కృతకతనుండి చింపుకపడే ప్రయోగపద్ధతి స్వైరతకే ప్రాధాన్యము నిలపక రమ్యమైనరీతులు అలవరుచుకోగల స్థితికయినా ఈ వాడుకభాషవాదము తోడు పడగలదన్నది కూడా ముఖ్యముగా గమనించదగ్గమాట. ఇట్లు వివాదాలకు విడివడి రంగుల బాణసంచాలలో చేతులు విసరుకొన్న స్కంధావారములు గుడారాలు చివికి తూర్పువెలుగులో సౌహార్దములు చల్లుకోబోతున్నవి. అథవా, యిందుల కెంతో వ్యవధి పట్టదు.

మన మొక దశాంతరమే ప్రవేశిస్తున్నామని చెప్పవలెను. గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు ప్రభృతుల ప్రాభవము కేంద్రప్రవాహము నుండి ఉపసంహరించుకొంటూఉండగా తత్ప్రాభవములందు, ఇతర ప్రోద్బలముల పదనులో, ఉపజ్ఞమెలకువలతో సాహితీక్షేత్రము పండించిన సాహితీసమితి ప్రాభవమున యువమనస్సులు, ఇతర ప్రోద్బలముల సంతరింపులతో, ఉపజ్ఞ మెలకువలతో, లేచి ఘట్టము మార్చుతా మంటున్నవి. క్రొత్త అవసరాలకు వైఖరులు నిలుపుకోగల ప్రతిభాశాలులు ప్రాతవారిలోనుండి సాగి ఒకరిద్దరు ముందుకు దూసుక రానేవచ్చు; కాని యిట ఘట్టము మారుతున్నామనీ, ఆ కవుల ప్రతిభ బహుముఖవ్యుత్పన్నమనీ మాత్రమే మన మనుకోవలసినమాట. కడచిన పాతికేండ్ల కళావ్యాపారములకు పర్యాలోకనముగా కావ్యరత్నభండారము, నవ్య కవితాపరామర్శము మొదలైన 'సారాంశముల' యెడల తాత్పర్యమేర్పడుతున్నది. మరిన్నీ, కేంద్రగ్రంథాలయము, కేంద్ర పుస్తక విక్రయశాల, కేంద్రపరిషత్తు మొదలైన కంజాయింపులతో సాహిత్యమును కార్యరంగముగాసహా చక్కబరచు కొనడం తత్కళావికాసమునకు దోహదమే అని వైశాల్యములు వలచుకొంటున్నారు సారస్వతులు. ఇప్పుడు అందరూ ఒక్కచో, ఒక్క అగ్రము విడక కళా

సంపత్తికి ప్రాధాన్యమిచ్చి సాహిత్యమును సమర్థించే నిమిత్తమై భూమి కల్పించి అనర్థాలు తప్పించగల అవకాశం ప్రత్యేకపత్రికయెడ సహజం.

ఇందులకిందులకుగాను 'ఉదయిని' దీపనలు తాల్చింది.

రసాస్వాదనముబట్టి మనస్సుకు సంస్కృతి ప్రసాదించే ఉత్కృష్ట సాహితీ కలాభ్యుదయానికి 'ఉదయిని' సంతతము తూర్పుదిక్కుయి ద్వారము తెరుస్తుంది.

* *

ఆ అభిలషించిన సాహిత్యపత్రిక నడిపేవిధానములో వరణభేదములున్నవి. అధమము మాసపత్రికఅయినా కావలెనని ఒకసలహా. కొంతవరకు సర్వతోముఖ సౌష్ఠవము రూపించగల పత్రిక, అది యెప్పటికి వచ్చేదయినా, ఒక ఆరోగ్యము కళాచిత్రములో రేపగలదు. ప్రతినెలా యింతపాటి సద్గ్రంథము ఒకపత్రిక దేశము నుండి యేరుకోగలకాలము మన కింకా కొంతయినా దూరమున్నది. ప్రస్తుతము ద్వైమాసికి నింపుకొనడమే చేయి నిండినపని. ద్వైమాసికిగానయినా ఇది ఉత్తమ రచనయే ధరిస్తుందని ప్రతిజ్ఞచేయడంతంటె, అది ఒక లక్ష్యముగా చూపడం అభిముఖ్యము చూపడం వివేకముగా, అందుబాటుగా కనబడుతుంది. మరి నిలుపు కొన్న ఉద్దేశాలకు తగ్గబలము చూచుకోనిదే ఆ ఉద్దేశాలు ప్రకటించడమూ, అందులకై పత్రిక చేబూనడమూ సాహసమంటూ రాగల ఆక్షేపణకు సమాధాన ప్రాయముగా, కొంతవరకు అన్ని పాగాలవారూ 'ఉదయిని'కి ఆశీస్సూ తోడ్పాటూ ప్రసాదిస్తున్నారని నిజం చెప్పవలసి ఉన్నది: ఇది ఒక కృతజ్ఞతా, ఒక ప్రార్థనా కూడాను.

రచనలకైనా, మొదటి తరగతులవారి కౌశలాలు సేకరించుకొన్న మాత్రాన మురిసి ఆగక, పెరుగుదల చూపే చక్కని చేతులవిన్యాసాలకు తగినంతగా ఆహ్వాన మీయడం పత్రికకు కర్తవ్యేతరము కాదనేసంగతి మరవరానిది. కళా సృష్టికి ప్రయత్నములంటూ దొరికినవంటే విధిగా పత్రికలు పూలకారుగా ప్రదర్శించి అందుకు ప్రోత్సాహమీయవలసిందే అనికూడా చెప్పేవారున్నారు. కాని యెప్పుడైనా అలాగు అవిమర్శముగా పోగుచేసుకొని ప్రోత్సహించగల మెట్టు ఉంటే మన మది గడవగలిగినామని చెప్పవలెను. విమర్శ మన్నది అస్పష్టిక్రియ లోటుపడి ఉండగా విజృంభించేదనీ, సృష్టిక్రియ వెల్లివిరిసినప్పుడు విమర్శము వచ్చినది యెక్కడా తక్కువే అనీ ఒకమతము. విమర్శము తక్కువైన కొద్దీ కళాసంపద పెరిగినట్టే అని కాని, విమర్శమును తలయెత్తనీక రచనలు గుణించు కొన్న దెల్లా మంచిమాట అని కాని ఊహలు పెంచుతున్నది కూడా. కాని, విమర్శమన్నది యెంతో సత్యమైన సహజవ్యాపారమై కళ మన అనుభవవీథిని నిలిచినప్పుడు ఆ అనుభవమును, ఆస్వాదనమును మనము తెలుసుకో యత్నించగా

అది రసనను చక్కబరుస్తుందని యేమరకుంటే, మనస్సుకు, ఆలోచనకు, (అదీ ఆ కళల గురించిన ఆలోచనకు,- శోధనమిచ్చే విమర్శము ఆ కళలకు విరుద్ధము కాక తోడ్పడ్డదే అవుతుందని చెప్పనే అక్కర ఉండదు. ఇక టి. ఎస్. ఈలియటు కవి నిరూపించినట్టు, ఉత్కృష్టమైన కళాసృష్టి వెల్లివిరిసినప్పుడే ఉత్కృష్టమైన విమర్శమూ-రూపుకట్టినది యెంతైతే ఏమి- ఉండగలిగిందని చెప్పి ఊరకుండక, ప్రాణికంతకూ పనిచెప్పే కళాసృష్టి ఆకళను గురించిన మనోవ్యాపారమైన విమర్శమును, అది వ్యక్తము కాకపూర్వమే, తనలో లయము చేసుకొని తనలోనే రూపమీయగలదనీ, కనుకనే ఆసమయాలలో వెలువడే కేవలవిమర్శమూ పరిమాణతః తక్కువ కావచ్చుననీ, రూపుకట్టిన విమర్శమాత్రం ఉత్కృష్టమైనదే కాగలదనీ సమన్వయములకు యత్నించనూవచ్చు. ఆమెట్టు మనకిపుడు లభించి లేదనీ చులకనగా చెప్పవచ్చు. మరి ఒక్కొకపుడు,- తరుచు,- సృష్టిపరమైన ప్రతిభకు విమర్శము ఒరవళ్ళు చూపి, కలాసత్త్వములు మనస్సుకు పట్టించి తోడు పడగలదన్నది గ్రహించడం కష్టము కాదు. పత్రికోద్యమమూ, అనుభవము విలువలు పరిశీలించుకొనే తాత్పర్యమూ అంతటా పెరిగిన యీ రోజులలో విమర్శము మరీ సన్నిహితమై కూర్చున్నది. అది కళకు ఋణపక్షమని యెంచి కుదించుకొనడం ఉన్నతికీ, కళాభ్యుదయానికీ భంగకరమనే గ్రహించవలసి ఉంటూన్నది.

సాహిత్యకళయందూ, చిత్రకళయందూ — కళామాత్రతత్త్వజ్ఞతలో మనస్సు తిరిగి తిరిగి — చెయితిరిగి రసపక్షపాతి శ్రీ అడివి బాపిరాజుగారు తమ వ్రాతతోపాటు 'ఉదయిని' స్వప్నమునకు దేశికమూ, రూపకమూ అయిన ముఖ చిత్రము రచించి దీనికి బొట్టు పెట్టినవారయినారు.

మనకు అర్థోదయమేనట.

జీవనపరిప్లుతిలో త్రచ్చుకొని మొలకెత్తిన చైతన్యము తనను లేపుకొన్న జ్యోతిఃపుంజముదీవనలు త్రావి తనయందు రసదేవతాత్వము నెఱపుకొన్నది.

తనకన్నుల వెలుగును రసాత్మకముగా నిరూపించుకొనడంలో—ఆ వెలుగు తనరసాత్మకతను నిరూపించడంలో—తనకు సంతతాభ్యుదయము చూచుకొన్నది.

ఏఉద్యమాలకూ భర్త్సనయే సోకుతున్న యీనాట ఏనిర్ధారణలకూ ఒత్తిడి చేయక యీవినీత ప్రయత్నమున వందలుసహా చేతి కందిచ్చి బుజాలు కలిపిన

మిత్రులకు, అభిమానులకు, యథాశక్తి తోడ్పడ్డ యితరమిత్రులకున్ను, అబ్బుర పాటుతో కృతజ్ఞత వందించడంకంటె మించి, వారిమనస్సులో శబలించిన సౌందర్యము చూచి ముగ్ధమాంగల్యములు ఏరుకొంటున్నది 'ఉదయిని.'

ఇకముందు వచ్చే సాయమునకంతా కృతజ్ఞతాభివందనముల జల నిర్మించినట్టే; పత్రికనడకయే వారివారికి కృతజ్ఞత ఊర్పుతున్నట్టు కాదూ?

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటము 1, సంచిక 1

# 2

గెథీ మహాకవి ప్రపంచభాషను గురించి కలగన్నాడట.

ఎన్నో సారస్వతములు—ఎంతో సారస్వతము, ఆస్వాదించేటందుకు, వివిధ భావగతులు, అవి కళకట్టినరీతులు అవగాహన చేసుకొనేటందుకు సభ్య జనుడు వలచి మార్గాలు వెదకకపోడు; అవి సాధించేయత్నము చూపకపోడు. స్వయముగా కళారచనకు పూనుకొన్నప్పుడు, నరనరాలలో ప్రవహించిఉన్న ఒక భాషతీపులు అనుభవమును, భావమును రంజించగా ఏకాంతమున పాడుకోకనూ పోడు. మాతృభాష కొకజండా, ప్రచురభాష కొకటి లేచి ఆకాశవీథుల నేలుతివి. ఈరెండిటికీ వైరుధ్యమని ఒకభ్రాంతి. తనరచన లోకానికి ప్రకటించడంలో, అసలు తనకు సంస్కృతీ రచనాశక్తి చేకూరిన విధానములో రచయిత సాధారణ త్వము సమర్థించడంలేదని యేలాగు చెప్ప వీలవుతుంది? సృష్టికీ అనుభవానికీ గల బంధుత్వము జ్ఞప్తికి తెస్తే అంతా వివరించినట్టే.

జనులు సమావేశాలు సలుపుకొంటారు. కళాపరిషత్తులు నిలుపుకొని వ్యవసాయములు ఫలింపించుకొంటారు. సారస్వతానికి జీవితమునెడగల ప్రయోజనాలలో కొత్త సాఫల్యాలు పరిణతపరుచుకొన్న రష్యా సారస్వతమహాసభ జరుపుకొని శంఖము పూరించింది. ప్రతిదేశమూ భాషాభివృద్ధికై సామాజికములైన యేర్పాట్లు జరుపుకొనడమూ, ఆప్రయత్నాలు పరిషత్తులలో శిఖరము కట్టడమూ ఎంతో మామూలు. భాష కొకపరిషత్తనే కాక, దేశాని కొకపరిషత్తు కావలెనని కూడా వాంఛ సహజమే అనిపించుకొంటున్నది. భారతదేశానికి ఇంతవరకూ ఒక కళాపరిషత్తంటూ ఏర్పడలేదు. ఈనడుమ కొన్ని ప్రయత్నాలు లేచినవి. ఇటీవలిది డాక్టరు పి. గుహా-ఠాకుర్తాగారు 'త్రివేణి'లో పిలిచిన ఆహ్వానము. దానిపై కొద్దిగా చర్చలుకూడా జరిగినవి.

ప్రాంతీయభాషలవారి కళావికాసములు వారిగోడలలోనే మూతపడిపోక ప్రతీతి వచ్చి భారతీయకళావిలసనమంతా ఒక్క ఉద్యానముగా రూపుకట్టడమే కాక, భారతకళాశక్తి దేశాంతరీయులకూ, దేశాంతరముల కళాశక్తి భారతీయులకూ అందించి సంస్కృతి వాగులు కలుపుకొనేటందుకు అట్టి కేంద్రపరిషత్తు సాధక మవుతుందనేమాట నిజం. కాని కొందరు ఒకగురుమండలిగా కూర్చుండి ఇన్ని ప్రాంతాల కళాసంపదలను ముద్రలువేసి బహుమానాలతో కొలవగలమంటే,

ఆసంస్థ సంకుచితత్వములో మునిగి, దేశీయుల స్వతంత్ర విలసనాలు చూడ జాలనిదే అవుతుంది. అసలు భారతకలాపరిషత్తు ఇతర దేశాల పరిషత్తులకంటె చాలా విలక్షణమైనది కావలెను. ఇతరదేశాలలో ఒక్కొక దేశాన ఒక్కభాషా సాహిత్యమే ఇక్కడ ప్రాంతీయపరిషత్తులు అక్కడి దేశీయపరిషత్తులవంటివి. ఇన్ని భాషలకు కేంద్రపరిషత్తు ఏర్పడడం అన్ని దేశాలమీద—ఐరోపాఖండమున కంతకూ అన్దముగా ఒకపరిషత్తు ఏర్పడినట్టు. కాని భారతదేశపు అనుభవైక్యము బట్టి ఈ పరిషత్తుకు ఒక విశిష్టమైన ప్రాభవమూ, ఆనుకూల్యమూ ఏర్పడవచ్చు; ఈ అవకాశమే లేనపుడు దీని ఆవశ్యకతయే కానరాకపోయేది. కాని యిది సాధించుకొనే ఆలోచనలకు కొన్ని ఉత్కృష్టమైన సంస్థలు క్రమశః నేడు చేపట్టు తున్న సంకుచితత్వము భయహేతువై సోకుతున్నది. అట్టి దుర్గతినుండి కాపాడు కోవలెనంటే, ముఖ్యముగా ఆపరిషత్తు ముద్రాధికారములు వలస దేశమండలి ప్రతిభాసామగ్రిని ఒక రంగమునకు తేవడమే తొలిలక్ష్యముగా నిలుపుకోవలసి ఉంటుంది. భారతదేశపు గొప్పరచనలు ఏవి లోకమునకు చూపగలనన్న ప్రత్య యము పడయడానికి పూర్వము ఆరచనలు తనమేజాపైకి చేరగల మార్గములు సుష్ఠుగా సంతరించుకోవలసి ఉంటుంది. ఇదియెంత వినీతముగా యత్నించినా పూర్ణసాఫల్యమునెడల గర్విష్టి సీయదు.

*   *

ప్రాంతీయసారస్వత రంగములందు కేంద్రపరిషత్తులు ఏర్పడి తత్సాహిత్య గతుల బహుముఖ చైతన్యములుగా నిలవడమే మొదట పెద్దపని. వారి చేతుల కలయికతో భాషాపరిషత్తు ఏర్పడటం సులభమౌతుంది కాని, అవి యేర్పడి చక్కగా నడిచే రోజువరకు భారతపరిషత్తు వేచిఉండనక్కరలేదన్న ఆశలో అర్థము లేకపోలేదు. కాని అది యేర్పడినా, ప్రాంతీయపరిషత్తుల యేర్పాటుకు చేసే యత్నమే ప్రధానమైనది కాగలదు; ఇతరుల సాయముతో కాక తాను స్వయ ముగా లక్ష్యము సాధించగల అవకాశము చాలా తక్కువ

*   *

మఱి ఆ భారతపరిషత్తు ఒక్క సాహిత్యానికే కాక, అన్ని సంస్కృతి శాఖ లకూ చుంబకము కాగోరినపుడు, అన్ని శాఖల పరిషత్తులతో జోక్యము పెట్టు కుంటుంది. ప్రాంతీయపరిషత్తులు ఒక్కొక్కటి అన్ని శాఖలూ కలియగట్టు కొనడం మంచిదని చెప్పవీలులేదు. ఏ శాఖకు ఆ శాఖకే ప్రత్యేకకూటములుండడం శ్రేయమని అనుభవము ఉపదేశిస్తుంది.

అధమం, సాహిత్యానికైనా అనేక ప్రాంతాలలో పరిషత్తులు ఏర్పడే ఉన్నట్టు తెలుస్తుంది. అవి తమయందు కేంద్రత్వము ఎంతవరకు సమర్థించుకొన్నవనే విషయం పరిశీలించవలసే ఉంటుంది తరుచు. (ఏ గుంపుచూచినా ఒకకొంతసేవ చేసే ఉంటుంది, కేంద్రత్వము పొందకుండానే.)

తెలుగుదేశములో ఆంధ్రసాహిత్యపరిషత్తు పెక్కుసంవత్సరాలుగా ఎంతో సారస్వత సేవ చేసింది. అయితే నవ్యవిప్లవాలకు ఓర్వక అది ఒకప్రక్కకు తొలగ వలచింది— అదే కేంద్రమనీ, ఈ ప్రవాహము నడిమిది కాదనీ యెంచి, ఇటీవల అభినవాంధ్రకవిపండితులు కూడి నవ్యసాహిత్యపరిషత్తు కట్టుకున్నారు. ఇప్పుడు స్వప్నమువస్తూఉన్న భారతపరిషత్తూ, ఒక విధముగా, నవ్యసాహిత్య పరిషత్తే - సాహిత్యశాఖకు సంబంధించినంతవరకు: నవ్యసాహిత్యవికాసమును లోకానికి చూపించడం అది అవలంబించగల లక్ష్యాలలో లెక్కపెట్టుకొంటున్నారు. కనుక ప్రస్తుతప్రవాహమును పట్టిఉన్న నవ్యసాహిత్యపరిషత్తుకే కేంద్రత్వము ఒప్పుకోవలసి ఉంటుందని ఒత్తి చెప్పనక్కరలేదు.

వాడుకభాషలో, కొత్త ఛందస్సులలో వచ్చేరచన సాహిత్యముగా గణించ నొల్లని వ్యక్తులనూ, గుంపులనూ తప్పించి నవ్యసాహిత్యము చియ్యబట్టి వస్తూనే ఉండగా, నవ్యులు క్రొత్త ఛాందసాలు పెంచుకొనక సరియైన విలువలమీదనే దృష్టి నిలిపితే నవ్యసాహిత్య పరిషత్తుకు కేంద్రత్వమూ, నవ్యసాహిత్యానికి అభ్యుదయమూ చేకూరగలుగుతవి. మరిన్ని అభ్యుదయ రీతులు యోజించి అనుస రించవలెనని పరిషత్తు అనుకొనడంకంటె, ఆ ప్రయత్నము కొనసాగించే తోడ్పాటు లెక్కచూచుకోవలసి ఉంటుంది. పరిషత్తువారు సారస్వతమును ప్రజలలోనికి ప్రాకించే యత్నము చేయవలె ననేకంటె, సారస్వతమును అలాగు దింపడం అపేక్షించక, ప్రజలు కొంత ఉన్నతిచేపట్టి కర్తవ్యము గుర్తించవలె నన్నదే యెక్కువ న్యాయమైన ఆలోచన.

ఇప్పటికి తగిన స్థోమతు సంపాదించుకోగల భాగ్యము పొందకపోయినా, పరిషత్తు వ్యక్తులలో ఉత్సాహము పొంగించి తీరుతున్నది. విద్యాప్రదర్శనాల మూలముగానే యిట్టి సంస్థలు సంపత్తి పెంచగలవని స్మరించి, భారత పరిషత్తుకే తిరుగ ఉపదేశము చూపవచ్చు; ప్రాంతీయసారస్వత రత్నములు భారతపరిషత్తు సేకరించి మట్టుకట్టితే, అవి లోకానికి ఒక్కొక్కటిగా పూజా పీఠాన నిలిపి సంప్ర దాయపు మడిపూజలు పిలువ నక్కరలేదు; ఆ నిగ్గు తనపని తానే చూచు కొంటుంది. ప్రాంతీయ పరిషత్తుల చనవుతో పరిపుష్టమైనది కాజాలకపోతే భారత పరిషత్తు వరమని యెంచనక్కరలేదు.

భారతపరిషత్తే పరిణతమయితే, ప్రొ. ఎడ్వర్డ్ థాంప్సనుగారు ఆశించినట్లు, చిన్న భాషలయందు కవితాప్రసాదము పడసినవారు జగద్వేద్యములైన ఆంగ్లాదిభాషలు తెలియని మాత్రాన విఖ్యాతికి నోచుకొననివారు కానక్కరలేదు. ఇదిన్నీ ప్రాంతీయుల లక్ష్యమును ఆకర్షించవలెనని హెచ్చరిస్తే వా రనుసరించే మార్గమునే వ్యాఖ్యానించినట్లు.

*  *

ఇతరకళాశాఖలలోనూ తత్త్రిదవలంబుల సాముదాయిక వ్యవసాయాలు ప్రతిప్రాంతములోనూ నిర్వహిల్లి నెయ్యములు పెంచుకొంటే భారతదేశానికి పెద్ద పండుగలు నిద్రమేల్కొంటవి. చిత్ర కళాప్రదర్శనాలు విరివిగా జరుగుతున్నవి. కాని, చిత్రకారులకు గోష్ఠులలో ఉండే ఆసక్తి యెంతటిదో తెలియరాదు. అన్ని శాఖలలోనూ మిక్కిలి సంపన్నమైన నాట్యరంగము, పోనీ మనప్రాంతములోనే, పరిషత్తు నిలద్రొక్కుకొనడమే కాక ప్రశస్తమైన కార్యవిధానములు గీసుకొన్నది. పత్రిక రంగానికి తెచ్చినది.

*  *

'నాట్యకళ'[1] పత్రికా లోకమున విశిష్టమైన పూజ్యస్థానమునకు నోచుకొన్నది. ఈ సంస్థలకు పత్రికలు చేయగల సేవ, ఉండవలసిన అవసరము స్మరించి 'నాట్యకళ'కు స్వాగతము పలకడమే కాక, సందర్భాలవల్ల ఏర్పడిన తన గౌరవమును ఇది సత్త్వశః సమర్థించుకొంటున్న సంగతి మిక్కిలి ప్రశంసించ దగ్గది. నాట్యకళకు చెందిన పెక్కు త్రోవల- రంగము, నాటక నిర్మాణము, సంగీతము, వివిధభాగాల 'సంబంధాలు' మొదలైన పెక్కువిషయాల-సమర్థులూ, అధికారులూ రచించిన వ్యాసములు దీని విజయమును భద్రపరుస్తున్నవి. పత్రిక స్వరూపమున్ను మిక్కిలి అందమైనదై విలువ పెంచినది.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటము 1, సంచిక 2

---

1. త్రైమాసిక పత్రిక. సంపాదకులు : నీలంరాజు వెంకటశేషయ్యగారు. చందా : రూ ౨ కార్యాలయము: 7 తంబుచెట్టివీధి, జి.టి., మద్రాసు.

నవ్య కవితకూ జూబిలీయే - అంతకంటె ఏలికలతో పోలికలకు పోరాదు కాని.

ఈ పాదశతాబ్దములో నవ్యులు సాధించిన దేమిటని ఒక్కొకచో జిజ్ఞాసతోను, ఒక్కొకచో అవిశ్వాసముతోను, ప్రశ్నరేగుతున్నది. బంగారములో పొదిగి చూచుకోగల గ్రంథచయము ఇన్ని సంవత్సరాలలో పండినది అంత యెక్కువ కాదు.కాని విలువలుకొలిచే కొలతలు ఎంతో పరిణతికి వచ్చినవి. నాటకము, నవల కావ్యము-అన్నిటనూ అభిరుచి నిశితమై పరిణమించింది. రచనాభ్యాసము అభిరుచి పరుగు అందుకో జాలదమే లేదని చెప్పవచ్చు. సారస్వతులు తమకుతామే పరాజితులవుతున్నారు తరుచు. నేడు సాధారణముగా మెప్పు పొందగల రచనము వెలువడ్డదంటే, అది సారస్వత భండారాన పదికాలాలపాటు నిలువగల దన్న మాటే. కాని, వ్రేళ్లపై లెక్కించవచ్చు, ఇటీవల వెలువడ్డ ఎన్నికగన్న గ్రంథాలను. అయితే వాయువు ప్రసవమై ఖరితో తొణుకాడుతున్నది.

* *

సారస్వతసేవనంలో సంస్కరణబుద్ధి మేళవించి, సాహిత్యాన్ని తన ముఖ్యమైన ఆశయాలకు వాహకముగా వంచుకోదలచిన వీరేశలింగము నాటి రచనములూ, అలాటి యిష్టమే రసకలితంగా చేపట్టగలిగిన చమత్కారి గురజాడ అప్పారావు రచనా నాడు పొందిన ప్రతిఘటనమూ నిరోధమూ కాని, తిరుగ సాహిత్యలక్షణపరంగా గిడుగు రామమూర్తిపంతులుగారూ, గురజాడ అప్పారావూ నడిపిన ఉద్యమం కొనసాగేటందుకు పొందిన ఆలస్యమూ విమర్శమూ కాని, అలాటి ప్రయత్నాలకు నేడు తిరిగి వాటిల్లగల స్థితిగతులు లేవంటే, సంఘస్థితికి ఎంతో మించిన దూరమైన ఆశయాలూ, సాధనలూ నాటివలె నేడు ఉండజాలవని కాదు; సంఘము, జనసామాన్యము, ఏనూత్న భావాలనూ శీఘ్రముగా అవగాహనం చేసుకోగల సంసిద్ధత కనబరుస్తున్నారు. ప్రచార ధోరణి ఇక సాహిత్యరచనలో నిలవలేదు. రచయితలు కళాదృష్టి యెక్కువగా పదను పరుచుకొన్నారు.

* *

రచనాధికారం కేవలము ప్రాచ్యపాండిత్యనిధులకు వదలి ఊరకుండని భావుకుల చేత వివిధసంస్కారాలు సారస్వతంలో అవతరించినవి. వాడుక భాషా, కొత్తకవితా లేపిన ఉత్సాహములో సహజమైననుడీ, భావనిరూపణమూ సారస్వతానికి పెంపు లీనసాగినవి: కొందరు సిద్ధహస్తులు పరిపక్వపడినారు. జనబాహుళ్యములో ఆస్వాదన సౌముఖ్యము పెంపుగాంచింది. రచనోత్సాహము

వివిధావలంబనాలు పట్టి పెరుగుదల చూపింది. శుష్కమైన పూజాపీఠమునుండి సారస్వతాన్ని జీవితములోనికి దింపవలెనన్న నాయకుల పిలుపున్ను ప్రచార ముఖముగా నిలిచిపోక కళాధోరణికి తావిచ్చి తన్ను సమర్థించుకొన్నది. ఈ పరిణతి కావ్యవీథిని వ్యక్తి జీవితపులోతులు తడవి గాంభీర్యము దాల్చింది.

* *

ఆంగ్లదేశపు 'న్యూరొమాన్టిక్ సంచలనం, 'ప్రి-రాఫెలిటిజ్మ్', టాగూరు కవి 'మిస్టిసిజ్మ్', స్వప్నసామగ్రి, కొత్త తెలుగుకవితను దిద్దుకోసాగినవి. కవి నగ్నమైన స్వీయానుభూతికి కావ్యవాణిలో కదలసాగినాడు. ఖంధవిముక్తి పేర గురజాడవారు భాషలో చూపిన విచ్చలవిడితనము కావ్యభూమిని ఒక ప్రక్క పాయగా వచ్చింది ; ప్రధానమైన కావ్యగతుల భాష తీర్పులు పొందింది, భావములో ఏర్పడిన ఐకాంతికత (*Individualism*) - ఏ కళారచనమందూ చేపడే నిగ్గయిన అవస్థ- భాషలో ఒక ప్రత్యేకమైనతను సంతరించింది. అటు విచ్చలవిడితనమున్ను తన పరిచయము ఆరీతియందు ముద్రించుకొని దాని నవ్యతను పట్టిచూప వచ్చింది. ఈ ప్రశస్తమైన రీతి వైలక్షణ్యము నవ్యులుపడసిన ఒక ముఖ్యమైన సంపత్తి.

* *

క్రొత్త ప్రాభవాలలో, కవి స్వీయానుభూతిని కావ్యమునకు పట్టే లాక్షణ మార్గాన అభినివేశము చూపుతూ గాంభీర్యము సంపాదించిన వాడయిన్ని, అను విస్మృతి యేమరి తాను సంకుచితత్వములో మిగలడం చూచుకొంటున్నాడు. రీతి సౌందర్యము పదనులో తన ఉద్రేకమే కాక భాష అనే ద్రవ్యములో పొందవలసిన నేర్పు తాలూకు అవసరాన్ని గుర్తించి, తొలుత కొంత ఉపేక్షకు నిల్చుకొన్న పాతకవుల రచనలలో కావ్యత్వవిలసనాలు గౌరవించడం నేర్చుకొన్నాడు. కొత్త పోకడ పాతవారిపై ఔత్కృష్ట్యమా నిలుపుకొన్నట్టిదే అని చెప్పనక్కరలేదు ; అది ఒక కొత్తపోకడ అని మాత్రం స్వీకరిస్తే చాలుననీ, పూర్వులు కథన కవితలో పొందిన ఔన్నత్యము తాము తమ భావకవితలో సాధారణముగా పొంద వలసే ఉంటున్నదనీ నేటివారు గమనించ సాగినారు. ప్రాశస్త్యములు నిర్ణయించే పట్ల అనుకృతులను మార్గదర్శకములుగా అవలంబించరాదు కాని, పూర్వకవుల అనుకృతులందు రచనాపాటవమైనా మెఱుగై నిలవగా, నేటి వారి అనుకృతులందు వస్తువూ, రచనా చూపే తేలికతనమువల్ల, నూతనత్వపు ఉత్సాహాతిశయమునుండి పరికరాల, పరిపాకాల పరీక్షకు అవసరము ఏర్పడుతున్నదని చెప్పవచ్చు.

* *

అనుభవసౌష్ఠవములేని రీతివిన్యాసము అభిరుచికి నచ్చకపోవడం సహజమే. ఏ క్రియయందూ వ్యక్తిత్వము - *personality* - వ్యక్తమైనప్పుడే విలువ

యేర్పడుతుండగా, సారస్వతముపట్ల అది అపేక్షించడం, సారస్వతమునూ ఒక ఉత్కృష్టకార్యముగానే చేపట్టమని కోరడం తప్ప వేరొకటికాదు. నవ్యకవిత తన ప్రాముఖ్యము మళ్ళీ పెంచుకొనేముందు, వాస్తవజీవనం ముద్రలు, మరింత విస్తృతమైన అనుభవశుద్ధి, రచనా సామగ్రిలో పుష్టిగాంచక తప్పదు. ఒకవేళ కవితకంటెను ఇతర విధానాల సాహిత్యము ప్రాముఖ్యానికి నోచుకోగల దేమో కొంతకాలం. ఏమయినా, భావ భరమూ, కళానిర్వహణమూ కూడా - సారస్వతము ప్రయోజనమూ, తత్సౌందర్యమూ కూడా - పరీక్షలోనిగా పొంద దగి ఉంటవి.

*   *

ఇంతకూ నేటి స్థితిగతులు నిర్ణయించుకొని భావిసౌభాగ్యానికి మార్గాలు తెరచుకొనే ముందు సింహావలోకనం అవసరమై కన్పిస్తున్నది. పత్రికలలో చెదిరి వచ్చిన వాఙ్మయం గ్రంథాలు కట్టి రాజూస్తున్నది. విశ్వనాథ సత్యనారాయణ గారు తమ 'రసతరంగిణి' గ్రంథమాలలో స్వీయములూ పరకీయములూ, ప్రసిద్ధిగన్న గ్రంథాలు ప్రచురపరుస్తున్నారు ముద్దుకృష్ణగారు కావ్యప్రపంచము పరిశీలించి 'వైతాళికులు' ప్రకటించి నవ్య కవిత నిగ్గు చూప యత్నించినారు. ఇతరమార్గాల నవ్యవాఙ్మయ వికాసమున్ను మరికొన్ని విభాగాలుగా సంపుటాలలో అందజేయ సంకల్పిస్తున్నారు. ఇతరులున్ను, కొత్త సంపుటాలు వెలువరు స్తున్నారు. దేశ మా యత్నాలకు ఇచ్చే ప్రోత్సాహమునుబట్టిన్ని భావివికాసము కొంతవరకు నిర్ణీత మవుతుంది.

*   *

ముఖ్యముగా యువజనము ఈయెడ తమపూచీ గమనించక మానదు. మిక్కిలి దూరపు సంస్కారాలూ, గూఢములైన జీవిత సమస్యలూ పలికే గుడి పాటి వెంకటాచలంగారి వంటి విప్లవకారునీ, సాంప్రదాయిక వ్యవస్థలకై శంఖా రవములు గర్జించే విశ్వనాథ సత్యనారాయణగారివంటి ధర్మభక్తునీ, సంఘ జీవితానికి పురోగతులు సూచించ సమకట్టిన ఉన్నవ లక్ష్మీనారాయణగారి వంటి ఆర్థిక మర్మజ్ఞునీ - ఇతర కక్ష్యల వారటుండగా - రసజ్ఞులు అవగాహన పరుచు కోడంలో, వారి అభిప్రాయాల పరిచయముతో ఆగక, వారి వ్రాతల లాక్షణిక సౌందర్యాలు ప్రత్యేకము పరిశీలించి తీరుతున్నారు. ఒక కవి ఆశయాలతో ఏకీ భవించ నక్కఱ లేకుండానే ఆతని కవితను కవితగా ఆస్వాదించ వచ్చునట. ఔను. ఏ రచనమూ అలాగే. తిరుగ, ఆ రచయితలున్ను కళా విన్యాసానికీ, తమ ఆశయాలకూ నిర్మాణములో సామరస్యము కుదర్చడానికి యత్నించే

తీరుతున్నారు. ఆశయాలకూ కళకూ రచయితలు చూపే సమమైన శ్రద్ధయున్ను, రచనయెడల రచయితలూ సహృదయులూ చూపే సమమైన శ్రద్ధయున్ను భవిష్యముగూర్చి యెంతో ఆశలు సూచిస్తున్నవి.

ఈ నవీనమైన స్థితికి బీజము నాడు - ౧౯౧౦ నాడు. నవ్యకవిత, వాడుకభాష ఉద్యమమూ ప్రారంభము కాక పూర్వము ఈ గతులు తెరచుకొని ఉండలేదని స్మరించ దగును. వాటివల్లనే, భావుకలోకానికి సారస్వతముతో నెయ్యము స్థిరపడ్డ వెనుకనే ఈస్థితి సిద్ధించ గలిగిందని స్మరించదగును.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటము 1, సంచిక 8

# 4

ఫ్రెంచి సాహిత్యపరిషత్తునుగూర్చి ప్రసంగిస్తూ 'ఇండియా అండ్ ది వరల్డ్' అనే పత్రికలో తత్సంపాదకులు శ్రీ కాళిదాసనాగ్ గారుకూడా భారత పరిషత్తు ఒకటి యేర్పడవలసిన అవసరాన్ని ఉగ్గడించినారు. అహంకారాలూ, కృత్రిమాలూ అలాటి సంస్థలలో మొలకలెత్తే అవకాశం చాలా ఉన్నప్పటికీ, సంస్థ యేర్పడకుండా ఉండే దౌర్బల్యంకంటె ఆ లోపాలయినా నయమే అని - అవి మానుషస్వభావానికి లక్షణముకూడా అని - ధైర్యము చెప్పినారు.

ఇటీవల శ్రీ కె. ఎమ్. మున్షీ ప్రభృతులు హిందీ సాహిత్య సమ్మేళన సమావేశములో, గాంధిగారి సమక్షాన, అఖిలభారత పరిషత్సంపాదనం ఆశించి, దేశానికి కావించిన విన్నపమునుగురించి బనారసీదాస్ చతుర్వేదిగారి హిందీ 'విశాల భారత' పత్రిక వ్యాఖ్యచేస్తూ, "మనవద్ద హిందీవారివద్ద భాషాసంబంధి సామ్రాజ్య వాదిత (*imperialism*) ఉన్నది. అది తగదు. అన్నిభాషలూ, తత్పరిషత్తులు, పూర్తిగా సహకారము చూపితే కాని ఆ భారతపరిషత్తు వచ్చి చేసేదేమీలేదు. మొదటనే జాగ్రత్తపడకపోతే పదపడి మనోమాలిన్యాలు సంభవిస్తవి. భారత పరిషత్తు అన్ని భాషా పరిషత్తులకూ పైది. అలాగే హిందీ సాహిత్య సమ్మేళనానికీ పయిదే; అది హిందీ పరిషత్తుకి స్వేచ్ఛ ప్రాయంకారాదు" అని మందలించింది.

"కాని యిది వారు వింటారా?"— ఇది చాలామంది భయం.

* *

మహాత్మాగాంధి స్వయంగా ఈ ఉద్యమాన్ని — భారత సారస్వత కేంద్ర నిధి సాధించే యత్నాన్ని - నడుప సమకట్టినారని మున్షీ ప్రభృతులు సంతోష వార్తగా ప్రకటించిరి. ఆ సంతోషము అందరూ శ్లాఘనదగినట్టు కానరాదు. గ్రామ పరిశ్రమ సంఘం ఏర్పరిచే ముహూర్తంలో, కుమారప్పగారు టాగూరు గారి సందేశంకోసమై శాంతినికేతనం వెళ్ళినప్పుడు, టాగూరుగారొక విన్నపము చేసినారు. ఆసంఘము తరుపున స్థాపించబోయే ప్రదర్శనశాల (*museum*) యందు చేతిపనులకూ పరిశ్రమలకే కాక, మనదేశీయ కళలకు తగినస్థానము ఇచ్చి వానిని పునరుద్ధరించవలసినదిగా దీనముగా ప్రార్థించినారు.

> ఒక జాతియొక్క ఆర్థికజీవితం మహాత్మాజీ అనుకొన్నట్టు, మరి యే విషయంతోను సంబంధంలేనిది కాదు. ఆర్థిక దారిద్ర్యంతోపాటు మనను సంస్కృతి దారిద్ర్యము పట్టిపీడిస్తున్నది. ఇది మిక్కిలి సిగ్గుపరిచేసంగతి- మన పూర్వౌన్నత్యం స్మరిస్తే మరీని. మన కళా సంపదలు నేడు విదేశీయ

ప్రదర్శనశాలలలో నిలిచిఉన్నవి. మన పల్లెటూళ్ళయందలి కళాకారులు అంతరిస్తున్నారు; మనప్రజల అభిరుచియా, అది మనజీవితానికి అ త్తని వైదేశిక విభ్రమాలతో పెడత్రోవలు పట్టుతున్నది.... దయచేసి మహాత్మా జీతో చెప్పండి, కళ అన్నది ధనవంతుల విలాసవస్తువు మాత్రమే కాదని చెప్పండి. బీదవానికిన్నీ అది అంతటి ఆవశ్యకమే— గుడిసె కట్టడంలో, కుండలలో, నేల అలంకరించుకోడంలో, మట్టి దేవతలలో, అనేక విధాల అతని కది ఆవశ్యకము.... మ్యూజియములో ఒక భాగము దేశీయ కళల ప్రదర్శనానికై ప్రత్యేకించవచ్చు; అందువల్ల మన జనములు ఏలాగు జీవిస్తూవచ్చిరో, ఏలాగు జీవిస్తున్నారో తెలియవస్తుంది; ఏలాగున వివిధ మార్గాల, అందుబాటుగా ఉన్న ఏసాధనాలలో తమ జీవితంతో కొంత రసము సృష్టించుకొనేటందుకు ప్రయత్నిస్తారో తెలియవస్తుంది........

"ఇది గాంధీజీ ఆలోచిస్తారా?" అని అడుగుతుంది 'విశ్వభారతి.'

నందలాల్ బోసుగారు మనకు ఆర్థిక ప్రాముఖ్యముకూడా ఉన్నదని చూపిరి. మనదేవతల పటాలు జర్మనీలోనూ జాపానులోనూ అచ్చయి వస్తున్నవి; అవి మనవారు కొంటారు — వారికి అవి 'కావాలి' కనుక. గాజులూ అవీ జాపాను వస్తువులు బీదవారు సహా కొంటారు, మనవాళ్ళయందు నమ్మకములేక. నిరుపేద లకు సహా ఈలాటి అవసరం వున్నప్పుడు ఆ అవసరాలు గడుపుతూ మనదేశి ఖత్తుల అందాలలో రుచిమరిగించే కళాకారులపూనికకు మహాత్మాజీ సాయము చేయ కూడదా? — అని నందలాల్ బోసుగారు. "ఇది మహాత్మాజీ గమనిస్తారా?" అంటుంది 'విశ్వభారతి'.

* *

ఈ అపనమ్మకానికి చాలా ఔచిత్యము ఉన్నది. అసహాయోద్యమ ప్రారంభ దినాలలో గాంధిజీవల్ల టాగూరుగారు పొందిన పరాజయముతో కళా వ్యాపారమే జయము పొందిఉండెను. తగులబడే యింటికి నీళ్ళు తెచ్చి పోయక పద్యములూ పాటలూ అల్లితే అవి రక్షించవు: గాంధిగారి యీ చిన్నవాదం, ఇందలివారి చిత్తవృత్తి, కళలకు ప్రసాదించిన ఉపేక్ష చీకటి చాయగా నిలిచి, భారత జీవితమును కదలించి తీరిన మహా సంరంభమునుండి వానిని కొంత చీల దీసినదని చెప్పకతప్పదు. ఆవాదము వారికి ఆసమయములో తప్పనిసరియై ఉండ వచ్చు: కాక అలాటి స్థిరమైన చిత్తవృత్తియే తగినది కావచ్చు. అందువల్లనే యింతటి నిర్వాహము జరిగి ఉండవచ్చు. కాని సంస్కృతిని, కళావ్యాపారమును మట్టి గాంధిజీ జయించెను. ఇది సిద్ధము. కనుకనే టాగూరుగారు గాంధిజీకే పంపు కొన్నారు నివేదనము,

అఖిలభారత పరిషత్తు ఏర్పరచడం, నడపడం అనగా ఒక రాజకీయ సంస్థలో ఒకభాగం అంగబలంతో ఏర్పరచడంకాదు. మొదట ప్రాతినిధ్యం ప్రధానం; సరియైన కుదురు ఏర్పడవలెను. నడపగల చేతికంటెకూడా. ఇది టాగూరు తరపు. దీనికి మహాత్ముని ఆశీస్సూ తోడ్పాటూ చేకూరడం ఆనందావహమే. కాని దీని నాయకత్వం వారియందు నిహితము కాదు. హిందీ ప్రచారోద్యమం గాంధిగారి తిరుహస్తంచేత నెరవేరినదే, నిజమే. ఇది హిందీప్రచారం వంటిది కాదని చెప్పడం ఒకవిధమైన పునరుక్తి. మరిన్ని, ఈ విషయం హిందీతో కలపరానిదని యిప్పటికే యెంతో విమర్శము వచ్చిఉన్నది - ఒక బహుళ ప్రచారముగల పెద్ద హిందీ మాసపత్రికవల్లకూడా. హిందీద్వారానే భారతీయభాషలు, భారతీయ వాఙ్మయం ఏకముఖమై భారతపరిషత్తు పని నెరవేర్చుకోగలవని మున్షీ ప్రభృతుల విశ్వాసం. హిందీ సామాన్యభాషగా విరివిగా అంగీకారము పొంది ఉండగా, ఈ విశ్వాసములో విపరీతములేదు. కాని భారత పరిషత్తు నిర్మించుకోవలెనంటే ఇతర భాషల, భాషాంతర పరిషత్తుల సాయము కోరడమే కాక, వారి గొంతుక వినవలె. ఆంగ్లము కొంతమందికి ఈసందర్భములో ప్రియముగాఉన్నది. 'త్రివేణి' భారతపరిషత్పత్రిక పూనగల లక్ష్యాలతోనే ఏడెనిమిది సంవత్సరాలుగా అనల్పమైన వాఙ్మయసేవ చేస్తున్నది; అది కాని ఆలాటి మరొక కొత్తపత్రికగా ఆంగ్లపత్రిక పరిషత్తు పక్షాన నడిపితే, భారతదేశంలో సమైక్యం సిద్ధించడమేకాక, దేశాంతరీయులకు, యావత్ప్రపంచానికి మన వాఙ్మయగతుల పరిచయం లభించగల్గుతుంది అని ఒకపక్షం పత్రికలలో మాటాడుతున్నది. ఏదేశము పరిషత్తయినా, లోకానికి తెలిసేనిమిత్తమై ఆంగ్లమువంటి పరభాషలో పని నడుపుకొనడం ఉచితం కాదు; కనుక భారతదేశమున్ను ఆలాగు చేయడం అవశ్యకం కాదని, అది పరిషత్తుకు ముఖ్యంకాదని, చెప్పవచ్చు. అసలు భారతపరిషత్తు చాలా విలక్షణమైనది; ఇన్ని భాషలకు ఒక కేంద్రపరిషత్తు ఐరోపాకొక పరిషత్తు వంటిదనీ భారతదేశపు అనుభవైక్యముబట్టి ఒక విశిష్టత దానికి నిలవచ్చుననీ ఇదివరలో ('ఉదయిని' రెండవ సంచికలో) అనుకున్నది స్మరింతాము. అప్పుడు, దేశానికి సామాన్యభాషగా హిందీ అంగీకృతమై ఉండడం పరిషత్తుకి హిందీని సిఫార్సు చెయ్యగలదు. ఈస్థితి స్థాపించుకొని, అన్ని ప్రాంతాలవారి సమ్మతులూ, అభిప్రాయాలూ తెలుసుకొని కార్యనిర్వహణానికి పూనుకొనడం పరిషత్తు ఏర్పడేపట్ల 'ప్రథమసేవకులు' చేయదగ్గపని. మున్షీ ప్రభృతులు ఇంతవరకు అగలేదు. శ్రీ ప్రేమచందుగారి 'హంస' పత్రిక ఆగామి పరిషత్పత్రికా ప్రాయమై శ్రీ ప్రేమచందు మున్షీగార్ల సంయుక్త సంపాదకత్వమున వెలువడుతున్నది ఈ అక్టోబరునుండి.

కాని మున్షీ ప్రభృతుల స్థానం మరికొంచెం తెలుసుకోదగును. ఈ ప్రయత్నం 'హిందీభాష అభివృద్ధి నిమిత్తమై వివిధ ప్రాంతీయ సారస్వతుల సాయము పొందడానికై పూనుకొన్నదని హిందీ సాహిత్య సమ్మేళనం తీర్మానం చెపుతున్నది. అందుకై బయలుదేరిన పత్రిక అఖిల భారత సాహిత్య ముఖమైన పత్రిక కాగలదని ఆశయం. ఏభాషవారైనా వినీతముగా ఈ ప్రయత్నము చేయ తగ్గదే; కొంతవరకు పెక్కు పత్రికలలో జరుగుతున్నది కూడా. అది మరింత సన్నద్ధముగా చేయబూనడం ప్రశంసార్హము కాకపోదు. పరిషత్తు మాట దేవు డెఱుగును. 'హంస' నూతనరూపముతో రానేవచ్చినది: స్వాగతము చెపుదాము.

* * *

భాషావశంచేత 'హంస' పరిషత్పత్రిక కావచ్చు. కాని, 'విశాలభారత్' సంపాదకులు చెప్పినట్లు, హిందీ సాహిత్య సమ్మేళనంనుండి భారతపరిషత్తు ఏర్పడబోవడం లేదా ఉన్నపాళముగా 'హంస', పరిషత్పత్రిక హోదానుబట్టిచూస్తే, చాలా క్రిందుగా నడవగలుగుతుంది. ఏమంటే, అది ప్రధానముగా హిందీపత్రిక కాక తప్పదు. ఇతర భాషలకు తక్కువ అవకాశమే ఇవ్వగలుగుతుంది. కాక, ఇతరభాషల నుండి సరియైన తగిన వాఙ్మయము రావడానికీ, వచ్చిన గ్రంథము ఆయా భాషలో జరిగే సాహిత్యావిర్భావ చరాన్ని తగినంతగా తెలియజేసేది కావడానికి 'హంస' చాలా ప్రయాసపడవలసి ఉంటుంది.

కాని, ఆ ప్రయాసము పడదగ్గ ప్రయాసము.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటము 1 సంచిక 4

~ఖిలభారతోద్యమం సాహిత్యము విషయమై కూడా పొర్లివచ్చి భాషాపరిషత్తుల కర్తవ్యం మరింత మోపుదల చేస్తున్నది. అన్ని భాషలనుండీ మంచి రచనలు హిందీలో తర్జుమా అయి, హిందీద్వారా అన్ని భాషలవారూ ఆ రచనలతో పరిచితి సేకరించుకోడమువల్ల అఖిలభారత సాహిత్య మనేది హిందీలో పరిణమించ గలుగుతుందనీ, అట్టిది ఆవశ్యకమనీ 'హంస' (హిందీపత్రిక) ఘోషిస్తున్నది కొత్తకాదు. భారతీయ సాహిత్యపరిషత్తొకటి యేర్పడింది. అన్నిభాషల సాహితీనిష్ణాతులకు పరస్పర సహయోగము ఏర్పడి, ఒక భాష దేశమందరూ ఎరిగి ఆ భాషలో దేశ మంతటి సాహిత్యపు నిగ్గూ సమకూర్చడంవల్ల, శాస్త్ర పరిభాషకై దేశమంతటా ఒకే పదజాలము ప్రచలితం చేయడంవల్ల, దేశానికంతకీ జాతీయ వాఙ్మయ మనేది పరిణమిస్తుందట. ఉన్నతభావాలు కలిగి, జాతి ఐక్యానికి తోడ్పడుతూఉండే వాఙ్మయమే ప్రోత్సాహము పొందబోతున్నది. కేవలము ప్రాంతాల పరస్పర సారస్వత పరిచయానికి మాత్రమే కాక, ఈ 'ప్రచార' పరత్వములో భారతీయ సారస్వతము ఏకముఖము కాబోవుతున్నది, సాహిత్య కళను ప్రయోజనాలలో నడిపించడానికి, ఉపయుక్తతతో పరీక్షించడానికి, పూనిక నిలిచింది.

చిరకాలము ఏదో ఒక ఐక్యముతో భారతదేశము అవిచ్ఛిన్నత నిల్పుకొని, నేడు పరాధీనతారూపమైన అనుభవైక్యములో మరింత బిగిసి ఏకముఖ కార్యకారితకు ఐకకంఠ్యము విచ్చినదై, భాషల భిన్నతనుబట్టి యేర్పడే అడ్డంకికి సామాన్యభాష విరుగుడుగా చేకొని హిందీని జాతిపై విప్పింది. దేశమంతకూ సంబంధించిన రాజనైతిక వ్యవహారాలకై, కొన్ని భిన్నప్రాంతాలవారి పరస్పర వ్యవహార ప్రవృత్తికిగాను హిందీ మాధ్యమముగా ఒప్పుదల పొందింది. రాట్నపు చప్పుడులో అక్షరాల చప్పుడును పరాజితము చేసి ఉపేక్షించిన గాంధిమహాత్ముడు ఇప్పుడు అక్షరాలా జాతీయసారస్వత ప్రయోజనాన్ని ఉద్ఘాటించి నాయకత్వం వహించడంలో మహాత్మునిపై సారస్వతమూ, సారస్వతముపై మహాత్ముడూకూడా దండెత్తినారు: ఈ అఖిల భారతీయ సారస్వత మనేది జాతీయతకు నచ్చే వన్నెలు చూపవలెనట. ఇందుకు తిరిగి సామాన్య భాష హిందీ సార్థకత కనబరిచింది. సామాన్యభాషగా నిలబడే సందర్భంలో ఉర్దూతో వచ్చిన రాపిడివల్ల హిందీలో వచ్చే పరివర్తనముకంటె భారతీయ సాహిత్య మాధ్యమముగా దానియందు రానై ఉన్న పరివర్తనము గొప్పది. అన్ని ప్రాంతీయ భాషలయందూ సాధారణముగా వాడుక తిరిగే పదజాలమునెడ శ్రద్ధ వహించి, ఆయా భాషల నుడికారములకు కూడా తావిచ్చి విశాలత అలవరించ బడుతుందట.

హిందీలో ఈ వస్తున్న అఖిల భారతీయ సారస్వతాన్నే జాతీయసారస్వత మనబోతున్నారు. పేరు ఏమి పెట్టినా, దీని ప్రయోజనముమాత్రం పరిమితమై ఉంటుంది. వివిధ భాషా సాహిత్యగతులు హిందీ తెలిసిన ఒక సాహితీకారుడు గమనించడంవల్ల, ఆంగ్లము ద్వారా విదేశీయ సాహిత్యములు ఆకళించుకొన్నప్పటి వలె, అతని సంస్కారము పెంపొందుతున్నది. కాక (అన్యదేశీయ సాహిత్యము లతో అడుగు కలపవలెనన్న ప్రయత్నముతోపాటు) భారతీయసాహిత్యముకు వెనుకబడకుండా కాని, అంతకుముం దడుగిడీ దారి చూపడానికి కాని ఉత్సాహపడ గలడు. కాని ఒకటి: హిందీభాష వారికి మాత్రం, మన భాషలో ఇతర భాషల నుండి మంచిరచనలు అనువదిస్తే మనకు కలిగే హృద్యతవంటిది చేకూరేమాట వాస్తవం. ఇతర భాషలవారికి తమ భాషలో ఆ రచన వస్తే కాని ఆ హృద్యత లేదు. హిందీలో గ్రాంథిక కృతక భాషనుండి విడబరిచి ప్రజాభాషకు ఎంతో దగ్గరగా వ్రాతభాషను తీసుకవోయే పూనికకూడా ఈ యెగలోనిదే. దానిలో అర్థమే ఉంటే, హిందీలో వచ్చిన ఈ భారతీయ సారస్వతమంతా హిందీవారికి హృదయానికి దగ్గరకు రాగా, (అన్యభాషలయెడ హిందీ అవలంబించే వైశాల్య మును పురస్కరించుకొని) అన్యభాషలవారికి భాషకు సన్నిహితముగా వస్తే గొప్పమాట. ఇది జాతీయ సారస్వతమే అంటున్నారు మరి. మతవాఙ్మయమూ, శాస్త్రవాఙ్మయమూ సంస్కృత భాషలో భారతదేశమందు జాతీయవాఙ్మయముగా ఒప్పుదల కాంచింది. నేడు తిరిగి రాజనైతికవాఙ్మయమూ, శాస్త్ర వాఙ్మయమూ జాతీయవాఙ్మయముగా హిందీభాషలో అంగీకృతము కావడములో ఔచిత్యము జారదు. కాళిదాసాది మహాకవుల కావ్యాలు సంస్కృతసాహిత్య మనడంకంటె భారతజాతీయసాహిత్య మనడంలో ఔచిత్యము లేదు. జాతీయత అనేది అపేక్షించే ప్రయోజనాలను ప్రసవించడమే ప్రధానముగా చేసుకొనజాలక, సాహిత్యము అనే రమణీయతా ప్రధానమైన ఒక కళ తన ముఖ్యక్రియా ద్రవ్యమైనభాషనే యెక్కువబంధువుగా చేకొంటుంది—జాతికంటె. భారతభాగవతములు సహా మనకు తెలుగువే కావలెను; హిందీవారికి తులసీరామాయణమే హృద్యతరము-సంస్కృతము తెలిసినప్పుడుకూడా. జాతీయత ఇన్నిభాషల సాహిత్యమునందూ భావసామగ్రి నింపి ఉద్రేకము ప్రసాదించే దేవత కావచ్చు. కాని. ఈ భాషల లోని సాహిత్యము హిందీ అనువాదములో జాతీయసాహిత్యము నిర్మించరాబోవదు. ఈ అనువాదమును భారతీయసాహిత్యమని గౌణముగా పిలుచుకోవచ్చు; ఆంగ్లభాష ద్వారా మనము ఐరోపీయ సాహిత్యమును పరిచయము చేసుకొంటున్నాము; ప్రపంచసాహిత్యమనే రుచిచూస్తున్నాము; ఆభాషద్వారా భావలోకములో తొంగి చూడగల్గుతున్నాము; అలాగే హిందీ భారతీయ సాహిత్యములకు తెరగా పని

చేస్తుంది. సారస్వతులలో సహా హిందీ మిక్కిలి ప్రచలితము కాగల్గితే, భారతీయ సాహిత్యరుచులు ఒక్కచో ప్రదర్శించే ఉద్యమం సార్థకమవుతుంది.

*    *

ఒక వేళ ఇతర దేశాలవారికి ఇది భారతీయ వాఙ్మయమని ఒక్కచో కన బరచగల మంటే, తిరుగ అది ఏ ఆంగ్లములోనికో అనువదించవలసి ఉన్నప్పుడు, ఒకసారి హిందీలో పరివర్తితమైన దానికంటె మంచి ఆధారమైన మాతృకనుండే అనువదించడం చెల్లుతుంది. ఇందుకు 'త్రివేణి' వంటి పత్రికలు, ఇటీవల లండనులో ఏర్పడ్డ '*The Indian Progressive Writers Association,*' భారతదేశపు '*P.E N. Association*' వంటి సంస్థలు ఎక్కువ ఉపకరిస్తవి. 'త్రివేణి' ఈ జూలయి మొదలు మాసపత్రికగా వెలువడు తుందట. మన దేశ మందే కాక విదేశీయులకూ మన మనస్త్వములూ, యత్నాలూ నాటజేయడానికి 'త్రివేణి' యీ నూత్నరూపంలో మరీ కృతకృత్య కాగల్గుతుంది. అధమం పది సంవత్సరాలనాటికి, 'హిందీ' యెరుగనివారు అక్షరాస్యత లేనివారనిపించుకొనేస్థితి యేర్పడుతుందని శ్రీమతి లీలావతీ మున్షీగారి మతము. సారస్వతలోకాన్ని సహా హిందీ తన ప్రాముఖ్యముతో అంతగా ఆకర్షిస్తే ఆశ్చర్యము లేదు కాని, ఆంగ్ల పత్రికల ప్రాముఖ్యము కొరవడడం కష్టం.

*    *

కాని యీ భారతీయసాహిత్యోద్యమానికి ప్రాంతీయసాహిత్యాలు కొంత కదలవలసి ఉంటుంది. సాహితీభావముకంటె జాతిభావమన్నది ఒక్కొకచో ప్రాధాన్యము వహించి, కళకంటె ప్రచారమును ముందుకు నెట్టవచ్చు. తెలుగు కైతలవారు, తరుచుగా, కళతో నెయ్యముచేసి ప్రచారమునుండి దూరముగా వాహ్యాళి పోయి ఉన్నారు. వారికి పిలుపు అలజడి కలగజేస్తే అది అప్రచారపక్కినుండి కళను విముక్తముగా ఉంచగల ప్రతిఘటననే రేపుతుందనవచ్చు. కాని అది రూపాంతరాలు వహించి వీరి కళారీతులలో రూపాంతరాలు ఘటించడానికి ఇతర ప్రోద్బలాలతో చెయ్యి కలపగలుగుతుంది. పాతకూర్పులనుండి విముక్తిగా లేచిన నవ్యకవితలో ఇప్పటికి కరుడు కట్టక తప్పని కావ్యసమయము (*Poeticism*) తానుకూడా మరొక ముక్తరీతులకు ఇప్పటికే దారి వదలుతున్నది. కవిత్వము పాట నుండి మాటకు చేరువ కాగలుగుతూ ఇటీవలి ఆంగ్ల కవితారీతులకు విజయము పల్కుతున్నది. కవిత్వపు ఆభిజాత్యమునుండి కూడా విముక్తి పడసి, జీవిత ఘోషకూ, సహజభాషకూ కవిత చేరువ కాబోతున్నది. ఈ ఉద్యమము ఒక కొత్తపొంగు రచనారీతులలో సారించడానికి వీలున్నది. విలువల ఆలోచనలో

తెలుగులది పెద్ద చేతులలో ఒకటిగా నిలుస్తుంది. వీరు హిందీ భాషలో, ఆ జాతీయ వాఙ్మయపు అనువాదాలలో ఏమాత్రము న్యాయముపొందుతారో చూడవలసిఉన్నది.

*       *

హరి జి. గోవిలుగారి శ్రమ ఫలించి నాగరలిపి ౨౦౦ టైపులనుండి ౧౧౦ టైపులకు వచ్చింది. ఇండో - రోమనులిపి మిక్కిలి సులభముగా నేర్వవచ్చును కనుక అది భారతదేశానికి సామాన్యలిపిగా స్వీకరించవలె నన్న వాదాన్ని నాగరలిపి జయించింది. 'ప్రపంచమంతటితో వ్యవహార' మన్నదానికి ఇప్పుడు ఉద్ధరత కనబడడం లేదు; భారతరాష్ట్రీయత, రాష్ట్రీయ (జాతీయ) సాహిత్యము, అన్నదే ఇప్పుడు ప్రచండముగా సాగుతున్న ఉద్యమము. ఈ ఉద్వేలతలో నాగర లిపి, హిందీ నిలద్రొక్కుకొనక మానవు. అసలు దేశభాషలవారికి సామాన్య భాష కాని, సామాన్యలిపి కాని ఆవశ్యకమా అన్న ప్రశ్న వాటి పరిమితార్థత గమనిస్తే, లేవనక్కరలేదు. ఇన్ని భాషలు నేర్చుకొనేందుకు ఒకేలిపి అవలంబించడం అనుకూలమే అని చెప్పవచ్చు. అయితే అది ఆయాభాషాభూమి ప్రవేశించనక్కరలేదు.

*       *

ప్రాంతీయభాషలకూ, ప్రాంతీయ సాహిత్యాలకూ ఈ ఉద్యమం అపకారము చేయకుండడానికీ, ఉపకారము చేయడానికీ కూడా ప్రయోగరీతి పూచీ పడవలెను.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటము 1 సంచిక

'ఉ ద యి ని'

'ఉదయిని' ఈ సంచికతో ఒక సంపుటము పూర్తిచేసినదవుతుంది. ఎన్ని ఇబ్బందులు గడవవలసివచ్చినా, 'ఉదయిని'కి అభ్యుదయయే నిరంతరము అభయమిచ్చి నడిపిస్తున్నది. ఇందుకు కారణభూతమైనవి దానకర్తలయూ, చందాదారులయూ తోడ్పాటూ, సహనమూ మిక్కిలి కృతజ్ఞతా పాత్రములు. అంతే కాక, ఆంధ్ర ముద్రణాలయాధికారుల సహనమున్నూ, సౌహార్దమున్నూ ప్రత్యేక ప్రశంసకు పాత్రములు.

కొ త్త అ ధ్యా య ము

రెండవ సంవత్సరము - లేదా, రెండవ సంపుటము - ప్రవేశించడమే పత్రికకు కొత్త అధ్యాయము ప్రారంభమైనట్టు. తాను పడిన శ్రమలకూ, తనకు చేకూరిన ఆదరములకూ నడుమ ఆదరములవిజయమే మిగిలి పత్రిక ప్రజాసేవకు ఇంకా నోచుకొన్నదవుతున్నది. ఆ ఆదరమును ఆధారముచేసుకొన్న ధైర్యముతో నున్నూ, సేవాపరాయణత ఇనుమడిగా చూపే పూనికతోనున్నూ, కార్యమందలి అమితాసక్తివల్లనున్నూ 'ఉదయిని'ని కొత్త సంపుటము నుండి మాసపత్రిక చేయ సంకల్పిస్తున్నాము. ఇకపైని వేళపట్టుకు సరిగా పత్రిక అందజేయగలమనే ధైర్యము కలుగుతున్నది. రావలసిన చందాలు సరిగా వసూలయివుంటే, ఇదివరకైనా పత్రిక కష్టము లేకుండా సరిగా వచ్చి ఉండేది. అయితే, ప్రతికూలస్థితులన్నిటికి పైని, అభిమానము లేని చందాదారు ఒక్కరూ లేరనే అనుభవాన్ని గుర్తించి తీరినాము. ఇకపైని మరింత అభిమానముతో తెలుగువారు మా ఉద్యమానికి తోడ్పాటు చూపి పత్రికను వినియోగపరుచుకోగలరనే నమ్మికతో 'ఉదయిని'ని మాసపత్రికగా మార్చ సమకట్టుతున్నాము.

---

## జనార్దనరావ్ బ్రతికున్నాడు

జనార్దనరావులాగే 'ఉదయిని' ఆరో సంచిక కూడా కాల గర్భంలో కలిసిపోయింది. ఎందుకో ఆ సంచిక అంటే నాకెంతో ఇష్టం. ఇది ఆరో సంచిక అనుకుంటాను. అందులో జనార్దనరావు ఆరో ప్రాణం ఉంది. ఈ సంచిక పకోడీల దుకాణంలోకి పోయిన సమయంలోనే జనార్దనరావు శవంచితిలో కాలుతున్న దృశ్యం నేనూహించుకుంటాను.



మా స ప త్రి క 'ఉ ద యి ని'

మాసపత్రిక కావడం వల్ల 'ఉదయిని'కి రాగల అదనమైన ఒత్తిడికి జడుపు కలిగి చందా నాలుగు రూపాయల నుండి ఐదు రూపాయలకు పెంచవలెననే పెద్దల సూచన కొంత ఆకర్షకముగా లేకపోలేదు. కేవలము ఇప్పటిపుటలలో సగమువంతు పుటలతో సంచిక మిక్కిలి చిన్నదై సుష్ఠుగా కనబడదు కాబట్టి దాదాపు అరవై పుటల గ్రంథము శ్రమపడి కూర్చి, ప్రతిసంచిక యందూ ప్రకటించడం ఇంపుగా కనవస్తున్నది. అట్టి యెడల ఆ నాలుగు రూపాయలకే పన్నెండు సంచికలు అంద జేయడం కొంచెము కష్ట సాధ్యమే అయినప్పటికీ, చందాదారులకు అదనముగా శ్రమ యీయికయే పత్రికను జాగ్రత్తగా నిర్వహించి నెగ్గించవలెనని యెంచినాము. ఇది నిర్వాహకులకు శ్రమదాయకమనుటలో సంశయము లేదు. కాని, ఈ మార్పువల్ల ప్రజాదరము మెండుగా లభిస్తుందనే ఆశ బలీయముగా ఉన్నది. ముఖ్యముగా పత్రిక విజయానికి అమూల్య సామగ్రియైన రచయితలకు మా కృతజ్ఞత ఉచిత రీతిని వెల్లడించలేము ఈ పైని మరింత వారిపై బరువు మోపి మా ఋణిత్వాన్ని పెంచుకొని వారి వాత్సల్యాన్ని సమర్థించడం మాకు తీరని కర్తవ్యమై నిలుస్తున్నది. 'ఉదయిని' తొలిమాస సంచిక యీ విజయదశమికి (అక్టోబరు 25) వెలువడుతుంది.

* *

న వ్య సా హి త్య ప రి ష త్ప త్రి క

ఆంధ్ర దేశంలో చిరకాలంగా సాహిత్యపరిషత్తు ఒకటి ఉండగా నవ్య సాహిత్య పరిషత్తు అని యింకొకటి యేర్పడడం ఒక పెద్ద సంఘటన మని చెప్ప వలెను. కాని ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుట్టుకయే నవ్యగతుల యెడ వైరుద్ధ్య మొకటి పురస్కరించుకొని జరిగి ఉన్నపుడు, ఈ నవ్య సాహిత్యపరిషత్తు ఏర్పడ డంలో వింత లేదు. ఆ యేర్పడడం వల్ల నవ్యసాహిత్యానికి గల శక్తిమత్త్వము మాత్రం వెల్లడి అవుతున్నది. మరిన్ని, కేవలము ధనాఢ్యుల ప్రత్యేకాదరాన్ని ఆధారము చేసుకొని కాక, తదీయుల దీక్షోత్సాహముల యందే ఆశ పెట్టుకొని యేర్పడ్డ నవ్యసాహిత్య పరిషత్తు దేశాన్ని ఆకర్షిస్తున్నదంటే దాని ఉనికికి కావలసి నంత శుభకామన చేకూరిన దన్న మాట. దాని ముఖ్యమైన పరికరం నవ్యసాహిత్య పరిషత్పత్రిక అయిన 'ప్రతిభ'[1] వెలువడింది. వ్యక్తులుగా నవ్యసాహిత్య పారి షాదులున్నూ 'ఉదయిని'కి ప్రాపులైనవారై, సంస్థ తరపున 'ప్రతిభ'ను వెలువరచ

1. 'ప్రతిభ'ను గురించిన సమీక్ష ఈ సంచిక 'వాఙ్మయ వీథి' కలములలో చూచేది.

డానికి నడుముకట్టినారంటే, "ప్రతిభ'కూ 'ఉదయిని'కీగల నెయ్యముమాట చెప్పనక్కరలేదు. 'ప్రతిభ' 'ఉదయిని'కి తోడై యాత్రాగతికి జీవమూ, సొగసూ పెంపొందించగలదనే ఆశ తప్పక సార్థకము కాగలదు.

రెండు పరిషత్తులు

అనేక విధాల ఆంధ్ర సాహిత్యపరిషత్తు అనల్పమైన సేవ సారస్వతానికి చేస్తున్నదయిన్ని, కొన్ని ముఖ్య ధర్మాలు ఉపేక్షించి యింకొక పరిషత్తుకు అవసరం ఏర్పరచడంలో దృష్టి వైశాల్యము చాలమికి విమర్శ పాల్పడ్డది. కొత్తగా ఏర్పడ్డ నవ్య సాహిత్య పరిషత్తున్ను తిరిగి అలాటి విమర్శకే పాల్పడకుండా ఉండడానికి అవకాశ మున్నది. నిజానికి ఇరుపక్షాల వైరుధ్యము ఎక్కువ గణనకు నిల్వరానిదని యిటీవలి స్థితిగతులు నిరూపిస్తున్నవి. నవ్యకవులు ఆ పక్షము వారి మెప్పులు సహా పొందినపుడు నవ్యకవితలోని నికృష్టరచనలపై విరోధము ఆధారపరుచుకోడం ఉత్కృష్టమైన పద్ధతి కాదని చెప్పనక్కరలేదు. వాడుకనుడికారము రచనయందు ప్రవేశ పెట్టగలిగినవారూ, గ్రాంథికములో సహా అందె వేసిన పాండిత్యనిధులై వాడుక భాషలో చక్కని రచనకు పూనుకొన్న వారూ ఇంకొక వైరుధ్యము తగ్గించగలుగుతున్నారు.

వాఙ్మయములో సంప్రదాయ సిద్ధమైన ఉనికి గలదై, నేటి విశిష్ట భావ గతినిబట్టి వాఙ్మయ నిర్మాణ క్రమంలో కొన్ని మెట్లుగా అభిజాత్యానికి నోచుకొన్నదై, నుడికారానికి ఎక్కువ అనుకూల్యము ప్రసాదించిన పూజ్యత గడించి యెంతో ఉత్కృష్ట రచనలు దేశములో మేలుకొల్పి, పెక్కు కలాల మోజుకు నోచుకొన్నదై బిగిసి వాడుక భాష శక్తి పెంచుకొన్న యీరోజులలో, కొన్ని గుణాలు విస్మరించీ, కొన్ని లోపాలు విస్తరించీ దానిని అపాకరింప చూడడం కంటె,— వ్యవస్థలేమికి గర్హించడం కంటె,— కళాశాలుల, వ్యుత్పన్నుల కలాల చైతన్యవికాసంలో దాని భవిష్యత్తు భద్రపరచడం శ్రేయస్కరమని యెంచదగును. ఇందులకై వేచి ఉండడమే కాక, వ్యవసాయములు సాగించడానికి తమ త్రోవల తాము 'ప్రతిభ' వంటి మంచిరకం పత్రికలు చాలా నిర్వాహకములు కాగలవన్నది అనుభవము చెపుతున్న సంగతి.

అయితే వీటిబ్రతుకు అంత సులభమైనది కాకపోవచ్చు. నికృష్ట వాఙ్మయముతో, వేలకు వేలు రూపాయల యెత్తునకు జనకోటి కౌతుకపడుతుండగా, ఉత్కృష్టవాఙ్మయమూ, పగిడీచుట్టిన పత్రికలూ పొందుతున్న కడగండ్లు, బిగుపౌతున్న మాట నిజమే కాని, కొంత పరిశ్రమ మీదట రుచిగల హృదయాలు వందలుగా లేచిరావడానికి చాలా అవకాశం ఉన్నది.

నికృష్ట వాఙ్మయం

కనుకనే, ఎంతటి నికృష్ట వాఙ్మయ విజృంభణాన్ని అణచడానికైనా, ప్రభుత్వాధికారాలు దండము ధరించి రావలెనని తత్తరపడ నక్కరలేదు. కాని జన బాహుళ్యము రుచులు విరిగిపోక పూర్వము ఆలాటి వాఙ్మయగతులు అరికట్టడానికి మంచి పత్రికలూ, సంస్కృతిగల వ్యక్తులూ, సంస్థలూ పూనుకోక వగచి లాభము లేదు. ఈ సూక్ష్మ విషయాలలో, ఎక్కడ ఆగవలెనో తెలియని ప్రభుత్వ దండముమారు రుచిదండమే యెక్కువ అనుకూలమైనదనే నమ్మిక వాఙ్మయ వికాసానికి ఆస్పదమిస్తుంది.

వాస్తవికత

వాస్తవికత, లోకవృత్తానుకరణం, (*Realism,*) నేటి సారస్వతములో మిక్కిలి విశృంఖలముగా కలము నడుపుతున్న శక్తులలో ఒకటి చిరాగత సంప్రదాయ సిద్ధములైన రుచి మార్గాలకు భిన్నములయిన్ని కావ్యౌచిత్యాన్ని మిన్నగా పాటించే మంచి రచనలు నేటివి కొన్ని అరుచికరములైన రచనలతో పాటు గణింపబడి అక్రమముపాలుకావడం లేకపోలేదు కాని, ఆ మంచి రచనల సామ్యాభాసములో నికృష్ట రచనలు విజృంభించడం మాత్రం చాలా శోచ్యమైన స్థితి యేర్పరుస్తున్నది. ఈవిషయమై "త్రివేణి" యీ జూలై సంచిక యందు తత్సంపాదకులు తమ సహజ భావుకమైన అమర్షముతో ఆంధ్రులకూ ఆంధ్రేతరులకూ కూడా చూపిన రుచిస్థానము గమనించదగ్గది. అయితే యీ రోచకిత్వాన్ని ప్రయోగించుకొనడంలో, ఆధునికమైన భావగతులవల్ల - ఒక నిరీశ్వరత, చార్వాకత, ప్రకృతి శాస్త్రీల ప్రోద్బలము, వట్టి నైరాశ్యము, ఇన్నిన్నిటి వల్ల, - ఉద్గతమై గంభీరమూ సుందరమూ కాగల సాహితీవాణిని సంప్రదాయ పరాయణతలో, గ్రుడ్డి ఆభిజాత్యములో నొక్కివేయక కాపాడడానికి శ్రద్ధ వహించడం చాలా అవసరం.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటము 1 సంచిక 6

# ఉదయిని

## శృంగాటకం

[జనార్దనరావ్ సాహిత్య సాహిత్యేతర సమకాలిక సమస్యలను ఈ 'శృంగాటకం'-అన్న శీర్షికకింద'ఉదయిని'లో చర్చిస్తూండేవాడు. నిర్భయానికీ, నిర్మోహమాటానికీ ఈ విమర్శలు ఉదాహరణలు.]

### 1

ఈ సంచికలో శ్రీమతి చావలి బంగారమ్మగారు వ్రాసిన 'పుంతలో ముసలమ్మ' అనే కావ్యం సందర్భ వివరణం అపేక్షిస్తుంది. పుంత అనేమాట (ఉపరథ్యకు) గోదావరీప్రాంతంలో వాడుకలో ఉన్నట్టు అనేకచోట్ల లేనట్టు తెలుస్తుంది. 'పుంతలో ముసలమ్మ' అన్నదీ అలాటిదే. ఆపేరుపెట్టి ఒకరాతిని - ఏ మైలు రాతినో, సర్వేరాతినో - పూజిస్తారు.

*    *

టాగూరు కవి యీనడుమ మద్రాసులో కళా ప్రసంగాలు విరజిమ్మి, ప్రదర్శనాలలో తన కళాదర్శాలకు మచ్చులు చూపిపోయినాడు. ఆతని లాలిత్యాలూ గాంభీర్యాలూ ఆనందం కలగజేయడం 'లోకవార్త' అయిపోయింది. సందేశ మీయడమంటే ఆయనకు సరదా. సాహిత్యవైభవం మాతృభాషలోనే చిలికి తీయమని ఆయన యిచ్చిన సందేశం విలువైనదే. (దానిని గురించి శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఈ సంచికలో ముచ్చటించి ఉన్నారు.) కాని, తాను నేర్వని ప్రాంతీయభాషల సాహిత్యాన్ని గురించి - ఆ సాహిత్యం ఏ ఆంగ్లభాషనో పరివర్తితమై తాను చూడగలిగితేతప్ప, కాక, సరియైన భోగట్టా తనకు దొరికితేతప్ప, - విమర్శములు భావిస్తే సమర్థించడం కష్టం. మనభాషలో మన సాహిత్యాన్ని పెంపొందించుకొమ్మన్నపుడు, ఇప్పటికి అలాగు ఎంతవరకు జరిగి ఉంటుందో గమనించడానికి కూడా పూనుకొంటే, తన 'సందేశాని'కే గౌరవం.

ఆంధ్రనాటక కళాపరిషత్తువారి నాటకరచన పోటీనిబంధనలు సంస్కారా పేక్షంగా కానవస్తాయి. నాటకం ప్రదర్శనోచితంగా ఉండవలెనని పరిషత్తువారు అపేక్షించడం అనుచితం కాదుగాని, ఆ ప్రదర్శనానుకూల్యం తమ దృష్టిలోనో చేతిలోనో కానవచ్చే పీఠ్యనుబట్టి కుదించుకొనక, సాహిత్యకళారీతిగా నాటకం తాలూకు స్వాతంత్ర్యం ఒప్పుకొని, రంగం ప్రతిభాన్వితమైన రచనను నిరూపించు కొనే యత్నంలో పరిణతి చెందడం లక్ష్యంగా నిలుపుకొంటుందని గమనిస్తే ఇన్ని నిబంధనలు అక్కరలేకపోను. రచించిన నాటకం ఎల్లరికీ ప్రదర్శనానుకూలంగా ఉండవలెననీ, ఒకానొక నాటకం ఆలాగు ఉండగలదనీ భావించడానికి ఆస్కారం లేదు; వస్తువుకంటె రంగం ముందుగా నిలిచి రచనకుమాత్రం కుదింపులు మిగులు తాయి. (కొందరికి ముగ్గురు స్త్రీలూ దొరకరు! వా రా నాటకం మానివేస్తారు. ఆలాగే దేనికీని!) సంగీతం భావప్రకటనానికి వినియోగ పరచరానప్పుడు, మూడు గంటల వ్యవధికి హక్కుపొందిన నాటకం రెండుగంటలకు వచనభాగం మించ రాదన్న నిబంధనకు అనవసరమైన నిర్బంధముగా లొంగవలసి వస్తుంది. బహు మతి పొందిన నాటకంతాలూకు ప్రథమ ముద్రణాధికారం పరిషత్తువారు నిలుపు కొన్నప్పుడు, ఇంతకాలంలో ప్రకటిస్తామనికూడా వాగ్దానం చెయ్యడం వారికి ధర్మం. లేదా, ఏదో రెండుమూడు సంవత్సరాలు దాటినవెనుక గ్రంథాధికారాలు రచయితకు వదలితే బాగుంటుంది. ఈ నిబంధనలు సంస్కరించి తిరుగ ప్రకటిస్తే రచయితలకు న్యాయమూ ప్రోత్సాహమూ మరింత చేకూరగలవు.

* *

నాటక కళాపరిషత్తువారి యీ పోటీలవల్ల నాటకరచనకు ప్రోత్సాహం ఏర్పడి కొన్ని మంచినాటకాలు సిద్ధమవుతాయని ఆశించవచ్చు. ఉత్తమమైనదానికి రు ౧౧౧౬ చాలా ప్రశస్తమైన బహుమతి అనేమాట అటుండగా, ప్రథమముద్ర ణాధికారం పరిషత్తువారు నిలుపుకొనడంలో ఒకవిధంగా ఉపకారమే జరుగుతుంది: రచించిన గ్రంథం ప్రకటించుకొనే బరువుకూడా గ్రంథకర్తకు తప్పుతుంది. ఎటొచ్చీ అధికారం నిలుపుకొన్న పరిషత్తు గ్రంథకర్తను ప్రకటించుకోనీయకపోవ డానికి అధికారం ప్రయోగించి ఊరకుండక తప్పక తమరు ప్రకటిస్తారనే నిశ్చ యత వెల్లడిస్తూ ఫలానగడువని చెప్పడం. (ఆ గడువులో గ్రంథకర్త ఆశా, జనుల ఆశా నెరవేర్చి గ్రంథంవల్ల తమకు జరగగల వ్యాపారం సాగించుకోడం.) అన్ని నిబంధనలు చేసిన పరిషత్తుపట్ల, తప్పక అపేక్షణీయం.

* *

ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారి బహుమానాలవల్లా అనేక శాఖల వాఙ్మయ రచన ఉత్సాహము కొన్నది, చిత్రకళకుకూడా సహవాసమిచ్చి. గ్రంథాల

అధమం ఉత్తమగ్రంథాల - ప్రకటనం విషయమై విశ్వకళాపరిషత్తువారు పూను కొనడం సముచితం కాకపోదు. అటువంటిది, ఆ ప్రకటనభారం రచయితలకు వదలడమేకాక ప్రకటనం జరిగేవరకూ పారితోషికంలో కొంత నిలుపుచేయడం - మంచి ఆశయముతోనే అయినా - అసంతుష్టి యిస్తున్నది. గ్రంథం త్వరలో వెలువడేస్థితి యేర్పడుతున్నది, నిజమే. కాని, వారివల్ల రచయితలకు ముట్టిన పారితోషికం గ్రంథ ప్రకటనానికి సరిపోతుందని నిశ్చయంగా చెప్ప వీలులేని సందర్భంలో ఆపారితోషికం అచ్చుపనికిగాను చేసిన కొంతసాయం మాత్రమే అవుతుంది. ఈయేర్పాటు రచనాక్రమాన్ని నిర్బంధించేది కానందున సంతోషించ వచ్చు. కాని ఆలాగు రచనకు నిర్బంధమూ తిక్కన చిత్రరచన విషయమై జరి గిందని అసంతుష్టి జనించి పత్రికలూ, లోకులూ విమర్శములు విసరకపోలేదు. ఏమైనా, ఈయీసందర్భాలు జనాభిప్రాయాలు గమనించి విశ్వకళాపరిషత్తువారు పరువైన ఒక తెలుగుపత్రికలో లేఖరూపంగా తమ ఉద్దేశాలు వివరిస్తే చాలా మన స్సులకు ఒకవిధంగా శ్రమ తగ్గించినవారవుతారు.

ఉదయిని: సంపుటి 1. సంచిక 1.

# 2

'కళానిధి'[1] కథలే ప్రధానంగా ప్రకటించే కొత్తపత్రిక. దీని విశిష్టత, వ్యాసకర్తలకు విరివిగా ఐహూకృతి యిచ్చే కంకణధారణం; ఇది సాహసికమై మిక్కిలి ప్రశంసార్హముగా ఉన్నది. మొదటి సంచిక నింపిన మూడు కథలూ సాంఘికవైఖరి సంతరించుకొని ఆస్వాద్యముగా ఉన్నవి. సంపాదకులు యౌవన యుక్తముగా తమ ఆశయాలను తెలిపిరి. తక్కిన కళలయందువలె సారస్వత రచనలయందూ లక్ష్మీప్రసన్నత అవతరింపించే దీక్షలో సంపాదకులు పాత్రశుద్ధి నేమరకుండవలెనని దేశ మపేక్షిస్తున్నది.

* *

తెలుగుదేశములో పత్రికలసంఖ్య మరీ పెరిగిపోతున్నదని ఫిర్యాదు. ఇతర దేశాలలోనే కాదు, ఇతర ప్రాంతాలలో సహా చక్కగా పోషణ కాంచుతున్న పత్రికల సందడి గమనిస్తే ఆశ్చర్యము కలుగుతుంది. కాని యీ ఫిర్యాదులో అర్థములేదని రుజువుచెయ్యవలెనంటే, పత్రికలు ఒకేరకముగా, ప్రతిబింబాలుగా, నడవక, వేర్వేరు పొలాలు పట్టడం ఉచితం. అప్పుడీ ఫిర్యాదే రాదు! కాని అప్పు డవి చక్కగా నిర్వహించడానికి తగ్గ ఆదరణ ప్రజలవల్ల చేపడాలి.

* *

ప్రబుద్ధాంధ్ర, తత్సంపాదకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, లేవ దీసిన హిందీ - తెలుగుల అధికార సంఘర్షణం భాష పొలిమేరలుదాటి 'హిమా లయోత్తుంగ శృంగం' ముట్టింది: మహాత్ముడు కూడా ప్రసంగించి తీరినట్టు తెలు స్తుంది. సామాన్యభాష దేశానికి కావలసిన సమయము వచ్చినప్పుడు హిందీకే హక్కున్నది కాని, ఆ అవసర మిప్పుడు కాదు అని చెప్పబోతే, ఇది సమయమే అని చెప్పడానికి పదిహేను సంవత్సరాలూ, కొన్ని లక్షల బుద్ధులూ ఎదురొడ్డ గలవు. దక్షిణ భారతములో హిందీప్రచారము జరపడంలో భాషలమీద దొంగ దాడికూడా నిర్వాహకుల సంకల్పమే అని చెప్పవస్తే అది రుజువుచెయ్యడానికి ఆస్కారముచాలదు. దానంత అది మనభాషకు అదుపువచ్చిందని చెపితే ఒప్పుకో వచ్చు, మానవచ్చు; కాని, విమర్శభాగమెటున్నా, మన ప్రాంతము కట్టుకోవల సిన జాత్యభిమానముకై, భాషాభిమానముకై యీ పత్రికమోసిన పిలుపు చాలా

---

1. మాసపత్రిక సంవత్సర చందా రూ. 8. సంపాదకులు, ప్రకాశకులు; కె. కృష్ణమూర్తిగారు, తెనాలి.

ప్రముఖమైనది. హిందీ పత్రికలకూ, మనప్రాంతానగల ముఖ్యమైన పత్రికలకూ ఇక్కడ చేకూరిన ఆదరము విషయమై శ్రీ శాస్త్రిగారు చూపిన తారతమ్యము మొదలైనవి రిత్త సంరంభముగా త్రోసిపుచ్చడం ప్రజలకు సాధ్యంకాదు. ఇట ఆలోచన హిందీమీదకాదు, తెలుగుమీద నిలుపుకోవలసి ఉంటుంది. వంగదేశములో మాతృభాష చైతన్యమురేగి బలిసిన యిప్పుడు అంగ్లమువల్ల ఒత్తిడిలేదు, ఆంగ్లము నెడల వైరుధ్యమూ లేదు.

* *

మొన్నటి నాటక పరిషత్సభలలో, మద్రాసులో, సత్యనారాయణగారి 'వేనరాజు' నాటకప్రదర్శనము సాంతముగా జరగనీయనే లేదు సామాజికులు. అనేక - రకాలుగా రేగిన ఆ అలజడిని అనేక కారణాలకు కట్టినారు. నేటిసంఘపు ఆచారాభిరుచుల కెదురీత; నదరైన కదలిక యీయని దీర్ఘవాదములు; రంగాల యేర్పాటులో వైవిధ్యము లేకపోవడం; వాదాలలో సహజ పరిణామము కానరామి; స్థానంవారు హార్మోనియంకు పనిచెప్పకుండా, సామాజికుల చెవులకూ కొంచెము పనే చెప్పడం; కొందరి ఆహార్యములో లోపము; చివరకు కవియందు కిట్టని కొందరి గూడుపుఠాణి. నటులు విధేయతతో కవివల్ల అభ్యసించిన కొత్తనాటకము; అడివిబాపిరాజుగారి కళాదృష్టిని సలహాగా వినియుక్తము చేసుకొన్న ఉత్కృష్టమైన ఆహార్యాదికము; కవి ప్రఖ్యాతి - ఉన్నలోపాలు సామాన్యులకు ఓరిమి చెరిచిన సందర్భాలు నాటకము సాంతముకాకుండా నిలుపుచేయించిన సంఘటనం, అదీ యిట్టి ప్రశస్తమైన సంపుటిలో, అతి అరుదు.

* *

'వేనరాజు' ప్రదర్శనము సాంతముగా జరిగిందంటే, ఒక గొప్ప కొత్త నాటకం ఆస్వాదనకూ, పరిశీలనకూ తేవడమే కాకుండా, ఇంకొక్కవిశేషముకూడా తెచ్చిఉండేది. స్థానం నరసింహారావుగారి పృథువు (పాత్ర), ఇప్పటికే రంగములో విహరించవచ్చినది, నిజమైన నిర్వహణము ప్రదర్శించి ఉండేది. 'వేనరాజు'లో పృథువు.కెంతో ప్రాముఖ్యమున్నది. పృథువుకెంతో ప్రాముఖ్య మున్న భాగమే (అసలు నాటకములో ముఖ్యమైన భాగము) ఆడనీయలేదు అయినా 'విప్రనారాయణ'లో దేవదేవి, 'వేనరాజు'లో పృథువు స్థానంవారి కొత్తపాత్రలుగా మనసులో నిలవగల్గినవి.

* *

భావోద్రేకము ప్రదర్శించడంలో నిపుణులైన రాఘవాచార్యులుగారు, ఇటు ప్రాచ్య సంప్రదాయ అంగవిన్యాసరేఖావైదగ్ధ్యము చూపే కూచిపూడి భాగవతులు వేదాంతం రాఘవయ్యగారు స్థానంవారు తమ నడిమిస్థానం ఇస్తారు. స్థానంవా

రీరెండుఅంశలూ తమ పాత్రనిర్వహణంలో అపూర్వమైన సొగసు మేళవించు కొంటున్నారు. పూర్వము భావోద్రేకములోనే ఎక్కువగా నేర్పులు మెఱసిన వీరు ఇపుడు ప్రాచ్యపక్కిపంకకు సాగివచ్చినారని చెప్పవచ్చు. నేటి రంగాన ఈవిధ మైన సమ్మేళనము ఇంతసహజము కావించినది అసాధారణమైన ప్రతిభా ప్రదర్శన మని చెప్పవలెను.

* *

కూచిపూడివారి అభినయము ఇంతకాలము అనాదరము పాలుపడ్డా విద్యా ప్రియు లెంత భక్తిశ్రద్ధతో ప్రాచీనకళను నిలిపినదీ చూపి విస్మయము కొల్పింది. ఎంతో ద్రుతమైత అంగవిన్యాసములో అంత సున్నితములైన వైదగ్ధ్యములు చూపి రాఘవయ్యగారు మన ప్రాంతమందలి నాట్యకళ పునరుజ్జీవనము పొందడమే.... అది యిప్పుడే ఉత్కృష్టస్థానము పొందగలది అని నిరూపించినవారైనారు.

ఉదయిని : సంపు 1. సంచి 2.

# 3

'ప్రజామిత్ర'లో 'చెణుకులు' వ్రాసినవారు తమ సంప్రదాయజ్ఞతను సముద్రాలు దాటించజూచినారు. శ్రీరంగం శ్రీనివాసరావుగారు ఈ సంచికలో వ్రాసిన లేఖను ఇట గమనించదగును. సంస్కృత సంప్రదాయము భాషావిశ్వము నంతనూ ఏలుతున్నదని వీరికి నమ్మిక కాకపోతే, ఆంగ్లసంప్రదాయమున్నూ తమచేతికి లొంగినదని ప్రత్యయ ముండవలెను. కాని ఆంగ్లమున ' కెయస్మన్' అని ఒక అలంకార మున్నదని చెపుతున్నది సంప్రదాయమే.

*　　　*

ఇట్టి అవినయాలకు ఉద్ధతపడకపోతే 'చెణుకుల' వంటి విమర్శపద్ధతి ఆపేక్షణీయమే అని చెప్పడానికి ఇంకొకటి రెండు అభ్యంతరాలు కనబడవచ్చు. కవులయూ, కవితలయూ విలువలు శ్రద్ధగా నిర్ణయించగల ఔచిత్యమూ, నైశిత్యమూ ప్రదర్శించ జాలనప్పుడు విమర్శకుడు తనదైన పాండిత్యపు పొలాన మాత్రమే కంచె వేసుకుంటే నయం. కాని 'చెణుకులు' అసలే ఎత్తివేయవలసిన అవసరముకూడా వచ్చినట్టున్నది. అనేక విషయాల ప్రశంసాపాత్రమైన 'ప్రజామిత్ర' తన సారస్వత సేవనంలో 'చెణుకుల' పద్ధతివల్ల అప్రశస్తి తెచ్చుకొన్నదని చెప్పనక్కఅలేదు. నేటి వాఙ్మయముపై నేడే విమర్శము వ్రాయడం ఎంత కష్టమని ప్రతీతియో అంత అవసరమున్నూ - పద్ధతులు కుదరాలి.

*　　　*

'ఉదయిని' రెండవసంచికలో చలంగారు వ్రాసిన 'ప్రేమపర్యవసానం' అనేకథకు కొన్ని అక్షింతలు పోగుపడ్డవి. కాంగ్రెసు శిబిరము రంగముగాపెట్టుకొని కాంగ్రెసును, కాంగ్రెసువారిని, అపహాస్యము చేయ నెంచారట. యుగయుగాలుగా మన మనస్సులో మెరుస్తున్న రాముడు అనే పెద్దవెలుగును ఆర్పివేయ యత్నించారట. గ్రామ్యమైన వర్ణనలు చొనిపారట. ఈ రకరకాల విమర్శలు సరిగా విచారిస్తే జారిపోక తీరవు. ఎంతో పూర్వుడు, శిష్టుడు షేక్స్పియరు - మహాకళాసంపన్నుడు కనక అతనిమాట తలపెడదాము- 'ఒతెల్లో' నాటకంలో, ఒతెల్లో తన భార్య డెస్డిమోనాతో కాషియో శయ్యాగతు డైనాడని ఇయాగో చెపుతూండగా, 'ఆమెతోనా' అని అడుగుతాడు : 'ఔను ఆమెతో – ఆమెమీద' అని చెపుతాడు ఇయాగో. ఈ మాటలు విడతీస్తే గ్రామ్యవాసన ప్రదర్శించకపోవు. కాని ఆసందర్భములో కావ్యప్రయోజనపరంగా ఇంతటిమాటలు సహా ఎంతో సహజంగా, అవసరంగా అతకడమే గొప్పచాతుర్యము. కాబట్టి కథాగతిని వర్ణనాదికములు పరీక్షించడం సమంజసం కాదు. ఉన్నతమైన క్షేమకోసం వెదికిన నిర్మలకు

సుందరశివరావు ఆదర్శపురుడుగా దొరికాడు. (కాంగ్రెసుగాలికి గౌరవమే! తర్వాత కథకు పాత్రలు బాధ్యులు, ఆమాటకువస్తే దీనికీ వాళ్ళే బాధ్యులు- ఇక కాంగ్రెసు కేమి లోటు వచ్చింది ? ఉద్దీపనం ఇవ్వడం మట్టుకు చేస్తుంది గాక. అది మంచి రకంగానే ఇచ్చిందికూడా.) అతని కొక భార్య ఉన్నది. ఎంత చనువు పెంచు కొన్నా మోహము తరవనొల్లదు నిర్మల. అతను తన దీక్షలనుండి కొన్ని ప్రభా వాలలో పడి జారి ఆమెయెడ అన్ని విధాల అబద్ధుడు కాబోతాడు. రాముడనే తన ఆదర్శాన్ని తర్క-రీత్యా, హేతువాదంతో, ఘోషముందు సమర్థించుకోలేకపోవడం కూడా ఇందుకే తోడ్పడుతుంది. ఆమెతో వలపు పెంచుకొన్న అతడు బలవత్సన్ని వేశాలలో శారీరక ప్రవృత్తులకు లోబడడం, 'బలవా నింద్రియ....విద్వాంస మపి కర్షతి' అన్న గీతావాక్యం మన్నించేవారు కాని, శాస్త్రపరిచయమూ పాశ్చాత్య వాఙ్మయపరిచయమూ కలవారు కాని విడ్డూరంగాఎంచరు:అది యెందుకు ఇక్కడ తీసుకోవాలి అని పరీక్షకు దిగాలి. అంత ఉన్నతులలో ప్రేమించిన ఆ ఆదర్శ పరుడు ఆమెకు, చివరకు ప్రాపంచికముగా వలచిన ఘోషుపదవికే జారవచ్చాడు. ఆమె ఆ ఆశాభంగము భరించలేక, ఆ స్వప్న విచ్ఛిత్తికి తమతమ దౌర్బల్యాలకు ఏడ్చింది; ఈపాటిభాగ్యానికి ఆతనిభార్యను అన్యాయమూ చేయడమూ, తాను అంతటి ఆశాభంగము పొందడమూ తలచుకోలేక, ఒకచే తలాన నిలిచిన చిర మిత్రుడు ఘోషునే పెళ్ళిచేసుకొన్నది - సుందర్ మొగమైనా ఇక చూడజాలక. ఇక ఆమెలో మిగిలిన దేశభక్తివంటి ఆదర్శాలను కూడా ఆలంబము జారింది. దేశభక్తుడు ఘోషు నెల కాకుండా సబిన్‌స్పెక్టరు పరీక్షకు హాజరైనాడు. నిర్మల జీవితంతో సంఘర్షణానికి పాల్పడి విషాదమూర్తి మనకు పరిణమించింది. ఈ సందర్భాలలో అందలి ప్రతి ఘట్టమూ తప్పనిసరి అని గుర్తించవచ్చు.

* *

'ఉదయిని' సంపాదకులుకూడా అదృష్టవశంవల్ల ప్రతీగుమ్మమూ ఎక్కి చందాదారులను చేర్చుకుంటున్నారని 'ప్రబుద్ధాంధ్ర' చెప్పినది చాలా చనువైన భోగట్టా; కొద్దిమాసాల్లోనే హిందీ దురాక్రమణ పరిమితి "వారికి" తెలియ వస్తుందని ఇది ఆధారంగా తత్సంపాదకులు నమ్ముతున్నారు. వారు చెప్పిన మాసా లింకానిండలేదేమో కాని, యింతవరకు ఎక్కిన గుమ్మాలద్వారా ఆ దురాక్రమణం పరిమితంగానైనా తెలిసి రాలేదు. కాని యిందువల్ల వారిఆశను ప్రతిఘటించడం 'ఉదయిని'కి ఇష్టమూ కాదు, అవసరమూ కాదు. 'ఉదయిని' వ్రాతవల్లకాని, హిందీ ఇంగ్లీషులు భారతదేశంలో ఏది యెంతెంతమందికి తెలుసునో దొరుకుతున్న లెక్కలవల్లకాని, హిందీకంటె ఇంగ్లీషుకు భారతదేశపు సామాన్య భాష కావడానికి హక్కుఏర్పడుతున్న దనుకోడానికి వీలు కన్పడదు. ఇంగ్లీషు

సామాన్యభాష చేస్తే,(హిందీ రానివారే కాదు,)ఇంగ్లీషురాని వారంతా నేర్చుకోవాలి. హిందీ రానివారికంటె ఇంగ్లీషు రానివారిసంఖ్య దేశంలో కొన్నిరెట్లు ఎక్కువ. ఇది మిక్కిలీ చర్వితచర్వణమైన విషయం అయినప్పటికీ,, 'ప్రబుద్ధాంధ్ర' సంపాదకులీ లెక్కలు జిజ్ఞాసతో సంపాదించే ఉన్నప్పటికీ, మళ్ళీ చెప్పడం చాలా అనవసరమైన ఆవసరమయింది. సామాన్యభాషకు అవసరం వచ్చిననాడు హిందీకే హక్కున్నదనీ ఆ అవసరం ఇప్పుడు కాదనీ 'ప్రబుద్ధాంధ్ర' సంపాదకులే (లెక్కలతో సహా) మద్రాసువేదికపై చెప్పినట్టు చెన్నపురి ఆంధ్రసారస్వతసంఘం దస్త్రమూ, ఆంధ్రపత్రికా సాక్ష్యం చెప్పుతవేమో. మరి ఒకవేళ అవసరం లేనివారికి హిందీ కషాయం పోయించడంవంటి అసందర్భాలు ప్రచారంలో జరుగుతున్నవని తెలియవస్తే (ఆ నిర్ణయం నిజమే అయినా, నాయకులయెడ దుస్సంక ఆరోపించ నక్కర లేకుండానే విమర్శము నడపవచ్చు.

*　　　　*

తెలుగుమీదకంటె హిందీమీద దేశంలో ఎక్కువమోజు, దానికి ఎక్కువ ఆదరమూ పెరిగి అవజ్ఞపాలవుతున్నదనీ, అసలే ఉపేక్షపాలయిన మాతృభాషను ఉద్ధరించ సమకట్టవలెననీ ఇక'ప్రబుద్ధాంధ్ర' దేశీయులను ఎక్కువ ఆకట్టితే, తన సంకల్పం మరింత అందముగా నెరవేర్చుకోగలదేమో. ఈపూనికదేశీయులూ, పత్రికలూ తప్పక చేపట్టవలసిఉన్నది. "ఉదయిని" పూర్వం చెప్పినదికూడా విమర్శం వైపుకంటె తెలుగభిమానంవైపు మొగ్గుదల చూపింది. "ప్రబుద్ధాంధ్ర" ఇక్కడకూడా మొగ్గుతా నంటుంది.

ఉదయిని : సంపుటి 1 సంచిక 3

# 4

ఈ సంచికలో శ్రీ తేజోమూర్తుల కేశవరావుగారు చెక్కిన 'పావురాలు' అనే దారుచిత్రము (*wood-cut*) ప్రకటితమైనది. ఈ చిత్రము ౧౯౩౩ సం. మద్రాసునందు జరిగిన చిత్రకళాప్రదర్శనమున (దారుచిత్రములలో) మొదటి బహుమానము బడసినది. ౧౯౩౪ సం. న లండను ప్రదర్శనమునకు పంపగా, ఒక ఆంగ్ల పత్రికయందు దీని గూర్చిన ప్రశంస ప్రకటితమైనది. *Wood-cut* అని పాశ్చాత్య ప్రపంచాన మిక్కిలి వాడుకలోనికి వచ్చిన యీవిశిష్ట శిల్పరీతి పూర్వము హిందూదేశమున ఎంతో విరివిగా ప్రబలినదయ్యూ,ఇటీవల క్షీణించినది. జపాను దేశమున మంచి ప్రవీణత యీక్షేత్రాన పండివున్నదట. పాశ్చాత్త్యులు నేడు ప్రత్యేకము గ్రంథముల చిత్రప్రక్రియకు ఈ రీతి మిక్కిలిగా వినియోగ పరుస్తారు. భారతదేశములో నేడీబత్తునందు ప్రవీణులు కాని, అసలు అభ్యాసకులు కాని, యెందరో లేరు. శాంతినికేతనమున నందలాల్ బోసుగారు, రమేంద్రనాథ చక్రవర్తిగారు చాలా నేర్పరితనము సంపాదించి ఉన్నారు దీన. రమేన్ చక్రవర్తి గారు ఒక చిత్రవృంతము (*album*) కూడా, ఈరీతి చిత్రాలది, ప్రకటించి ప్రసిద్ధులై ఉన్నారు. లక్నో చిత్రకళాశాల యందును ఇది అభ్యస్తమవుతున్నది. ఇటీవల మద్రాసు చిత్రకళాశాలయందును ఇది ప్రవేశము కాంచినది ; విద్యార్థులు ప్రదర్శనములకు చిత్రములను పంపుతున్నారు కూడ. మద్రాసు ప్రదర్శనమున ప్రత్యేకము ఈదారు చిత్రములకై బహుమతులు కేటాయించిరి. అందే ఈ సంచిక యందలి చిత్రమునకు మొదటి బహుమానము వచ్చినది.

* *

చిన్నయసూరి పాండిత్యం ఆక్షేపణకు పాత్రమయింది. వ్యాకరణ దోషమే దొరికిందట - ఆట! 'వినోదిని' (ఈ ఆగస్టు సంచిక) సమాలోచనలో 'నీతి చంద్రిక' తొలివాక్యం చిన్నయసూరికి అప్రతిష్ఠ తెచ్చింది. "గంగాతీరమున సకల సంపదలు కలిగి పాటలీపుత్రమను నగరము గలదు. అని ఆ వాక్యము. 'కలిగి' అన్వయం 'చిన్నయ్య అయినా చెప్పలే'దనుకొన్నారు. భారతములో "కరుణ కలుగుమమ్మ కమలనేత్ర" (ఆది. ౮. ఆ.). "అంతయెరుకలేవె" (అర. ౧ ఆ ) అన్న సందర్భాలలో 'కలుగు' సకర్మకంగా కట్టి శబ్దరత్నాకర కారుడు అన్వయం చెప్పి ఉన్నాడు. దీనికి చిన్నయ్యను పిలావ నక్కఱలేదు. మొదటి 'కలిగి' అన్నప్పుడు సకర్మకంగాను, 'కలదు' అన్నప్పుడు అకర్మకం గాను గుర్తించినప్పుడు చిన్నయ్యా, మరి పెక్కుమందీ శాంతి చెడనివారవుతారు.

'సాతాని' అయి పుట్టడానికి గాని, తెలుగు దేశానికి బొడ్డులాంటి ప్రదేశము లయిన గుంటూరు కృష్ణా గోదావరిజిల్లాలలో ఒక చోట పుట్టకపోవడానికి గాని చిన్నయసూరికి స్వయంగా ఏమీ పూచీ లేకపోయినా, ఆయన జగత్ప్రసిద్ధమైన పాండిత్యము, ఆ కారణాలవల్ల, ఈ రోజులలో సహా, గౌరవం కోల్పోయింది !

* *

ఇటీవల భారత పరిషత్తు మేల్కొలుపులు వినబడి కొందరు తెలుగులు చాలా అడావిడిపడ్డారు ఆ సందర్భంలో ఒకసారి ఒకరివల్ల తెలుగు సాహిత్యపరిషత్తులు రెండూ విమర్శకు పాల్పడ్డవి. ఆంధ్రసాహిత్య పరిషత్తు ఒకప్పుడు ఆధునిక సారస్వతానికి చాలా తోడ్పాటు చేసేదట, ఇప్పుడు లేదట. నవ్య సాహిత్య పరిషత్తు చాలా నింద్యగతులకు తావలమైనదట. కాబట్టి ఇంకొక సాహిత్య పరిషత్తు ఏర్పడవలెనట. తెలుగులో ఈ భారతపరిషత్తుకు తెలుగుదేశము నుండి రచనలు, ముద్ర కొట్టి, పంపగలదు. ఔను, సాహిత్య పరిషత్తు ఒకటి ఉండగా నవ్య సాహిత్య పరిషత్తొకటి యెందు కేర్పడవలెను ? ఇంకొకటీ యేర్పడవచ్చు........

కాని, కాదు. సాహిత్య పరిషత్తుకూ నవ్యసాహిత్య పరిషత్తుకూ, వాటి 'ఋణ' భావములు తప్ప ప్రత్యేక కార్యవిధానమున్నది. ఆ రెండూ కలిస్తే తెలుగు దేశము చాలా ధన్యమే. కాని విడి ఉండడంలో భ్రాంతిపెట్టుతున్నంత వైరుధ్యం లేదు. అందువల్ల వాఙ్మయవీధికి వాటిల్లుతున్న నష్టం హెచ్చు కాదు. రెంటికీ అతని యితర వాఙ్మయమున్నూ ఎంతో గర్హకు పాత్రమైనది యీ విమర్శకునిచేత. కాని యీ పరిషత్తుల క్షేత్రాలకూ మించి, ఒక పరిషత్తుకై యెదురుచూడగల వాఙ్మయవాహిను లేవి దేశమున మోగుతున్నవో, అవి యేపాటివో స్పష్టపడడంలేదు.

* *

ఇంకొకమాటయున్నూ. ఒక పరిషత్తుతోనే పని నడుపుకొనడానికి సాధ్యము కానినాడు రెండవది యేర్పడింది. తొలుత సాహిత్య పరిషత్తులో ప్రవేశము పొందడానికి విఫల ప్రయత్నములైన కొన్ని భాషలు విడిగా పోషణము పొంది ఇటీవల ఒక పరిషత్తు కట్టుకొన్నవి. ప్రస్తుతము ఈ రెండు పరిషత్తులలోనూ ప్రత్యేకత పొంద యత్నించి విఫలమైన బృహద్భావాలేమో, తదనుయాయు లెవరో దేశానికి తెలియవచ్చినది లేదు.

పూజ్య శ్రీ జయంతి రామయ్యపంతులు గారు 'భావకవిత్వము'నూ, 'గ్రామ్యభాష' నూ విమర్శించి ఉన్నారు. ఇటీవల వారు కావించిన విమర్శములలో మిక్కిలి అందమైన అధ్యయనములు కొన్ని.... కనుకనే భావకవిత్వమునూ, వాడుకభాషనూ కఱకుతనముతో దూషించ సమకట్టి కొందరివలె కాక కొంతవరకు నెయ్యపుదూరాలకు వచ్చినారు. వాడుకభాష వాదము ప్రబలినతర్వాత భాషాప్రయోగపరిశీలనము వ్యాకరణ దృష్టితోకంటెఎక్కువ. నుడికారపుదృష్టితో జరుగుతున్నదని వీరి వ్యాసములు విస్పష్టము చేస్తున్నవి కడచిన సాహిత్య పరిషత్సమావేశమున సహా, విమర్శములు ఉండనే ఉన్నవి కాని, యీదృష్టి నిలవకపోలేదు. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ నడింపల్లి సుబ్బరాజు గారు "గిడుగు రామమూర్తిపంతులుగారి యొక్కయు, గురజాడ అప్పారావు పంతులుగారియొక్కయుఁ గృషి యాంధ్రభాషకు నూతన కళల నుజ్జీవమును కలుగ జేస్తున్నదని మనమంగీకరింపక తప్పదు" అనిముక్తకంఠముతో పలికినారు.

భావకవిత్వమును గురించి ఖండనము లోతుకు పరుచుకోవలెనంటే, బుద్ధి సౌష్ఠవమును మఱచిపోవలెను. శ్రీ రామయ్యపంతులుగారు అంతటి జోదు కాజాలక గౌరవార్హులైరి. కాని యిప్పటికికొందరీవాదము ప్రవేశించక మానరైరి. హేళనకై, హాస్యముకై యెవరో కావించిన అపహాస్యములు తమ వాదమునకు బల మీయగలవి కావని శ్రీ కవికొండల వేంకటరావుగారు లోగడ కృష్ణాపత్రికయందు ప్రకటించిన సమాధానము వీరికి నచ్చజెప్పగలది. 'శుక్లపక్ష'కారులు అనంత పంతుల రామలింగస్వామిగారు తామా కావ్యము తమాషాకు వ్రాసితిమని చెప్పు కొంటున్నారు. అది రామయ్య పంతులుగారు తమవృత్తికి ....కొంటున్నారు. వరకు వారికీ వీరికీ కూడా భావకవులుకొందరు కొన్ని భావకావ్యములు నచ్చునవి నచ్చ నివిగైకొనిభావకవిత్వమును తిట్టబూనడం చాలా అనాలోచితం.ఏమంటే, భావకావ్య ములువీరికీ పెద్దలైనవారికి సహా నచ్చినవాటికంటె నచ్చనివే రచనములు ఎక్కువ వస్తున్నవి. అంతమాత్రముచేత వారు నీరుగారనూ అక్కరలేదు. పూర్వకవుల ఔన్నత్యము ఇక్కడ అప్రాకృతము కాదు. పూర్వకవుల.... నవీనుల దొరక యత్నము. ఈ కొత్తదారిని వీరిసిద్ధి అల్పముకాదు ; అది క్రమశః సౌష్ఠవము పడయను వీరి సామర్థ్యము చాలదనియా, వీరిమార్గము నచ్చదనియా అసంతుష్టి ? అసలు ఈ అసంతుష్టి చాల కల్పితమని తెలియవచ్చింది - రామయ్య పంతులుగారి వ్యాసమువల్లనే.

ఉదయిని: సంపుటి 1 సంచిక 4

ప్రతిసంచికా చీకటినుంచే ఉదయించి, 'ఉదయిని' ఆవిధముగా సార్థక నామధేయ అవుతున్నది. దేశమువల్ల వచ్చిన ఆదరము తక్కువని చెప్పలేము. ఈస్థితి త్వరలో దాటవచ్చునని ధైర్యము లేకపోలేదు. ఆలస్యమైన సంచికకు పాత తేదీ తగిలించడం చందాదారులకు కాని (ముఖ్యముగా) పత్రికకు కాని అంత అనుకూలము కాదనన్నీ; ప్రకృతపు తేదియే వేసి చందాకు సరిపడ్డ సంచికలు అందచేయడం నయమనిన్నీ తోస్తున్నవి. కాని త్వరలో ఆలస్యాలకు తగినన్నీ సంచికలూ వెలువరిచి సంవత్సరాలను తృప్తిపరచవలెనని ఆశ. చందాదారులయూ, దానకర్తలయూ తోడ్పాటు ఇందుకు ఆధారము. దానకర్తలు దానకర్తలు కావడములోనే ఔదార్యమున్నది; ఈ విశిష్టసందర్భాలలో అవుతూ రావడములో మరీ ఉన్నది. ఇది ఐదవ సంచిక: చందాదారులు తాము బాకీలను చెల్లించి కొత్త వారిపైని నేరము మోపజూస్తే యెంతో బాగుండును.

* *

నవ్యకవితకు, ఒక విధముగా నవ్యసాహిత్యానికి, ఇరవైఐదు సంవత్సరాల జీవనం లెక్కచూచుకొని పర్యాలోచించడం నేడు మనకు కొత్తకాదు. ఇందులకు ఒక ఉత్సవము (అర్ధోదయ మనే పేర కాబోలు) జరపడానికి శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నంగారు (ఎమ్.ఏ, ఎల్.టి.) మొదలుగాగల పెద్దలు పూనుకొన్న పూనిక ఫలించడం మిక్కిలి అపేక్షించతగ్గది.

* *

రాజమహేంద్రవరము ఈనడుమ సారస్వత ప్రాముఖ్యానికి మిక్కిలిగా నోచుకొన్నదవుతున్నది. నవ్యసాహిత్య కార్యస్థానము అక్కడ చేరినది. రా. బ. మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు పర్లాకిమిడి వదలి, ఆంధ్రదేశ మంతటిలో ఆ అఖండ గౌతమీ తీరభూమి ఆవాసయోగ్యముగా ఏరుకోవచ్చిరి. కందుకూరు వీరేశలింగం పంతులు తన వీరపదవికి చిహ్నము శిలామూర్తి కట్టి అక్కడ నిలిచినాడు. బహుముఖాల జాతికృతజ్ఞతకు పాత్రత రచించుకొని జీవనవాహినుల కవాటాలు తెరచిన వీరేశలింగం పంతులుగారి శిలా విగ్రహప్రతిష్ఠాపనం అన్ని విధాలలో సంఘసంస్కారమూ, అంతకంటె బ్రహ్మ మతావలంబనమూ ప్రధానముగా నదరుకువచ్చేరీతిని జరిగినా, సాహిత్యగతులు కొన్నింటికి పాదులు పెట్టి, చిన్నకథ, భావకవిత మొదలైన పక్కలకు అంటక పోయినా, భాషగతికి ఉజ్జీవనమూ, ప్రోద్బలమూ ఇచ్చినవాడు కాగా ఆతని విగ్రహము సారస్వతుల ఉత్సవమునుకూడా నిరంతరము అనుభవిస్తున్నదని చెప్ప

వచ్చు. అతడు మెరిసే ఆగాలిలో నవ్యసాహిత్య అర్ధోదయోత్సవము జరిగే సూచనలున్నవి. మరిన్ని శ్రీరామమూర్తి పంతులుగారి సాన్నిధ్యము ఆఉత్సవానికి బహుశః ఆ శిలావిగ్రహానికి నూత్న జీవనం ఇస్తుంది. గౌతమి పొంగి ఆ తల మంతా అభిషేకించవలెనని కవిత అల్లుకొంటుంది కాబోలు.

శ్రీరామమూర్తి పంతులుగారు గంజాం ఆంధ్రుల తరపున ప్రతినిధిత్వం వహించి అక్కడి ఆంధ్ర క్షేత్రాన్ని ఉత్కలం కబళించిన అక్రమానికి ప్రతిఘటనసూచకంగా రాజమహేంద్రం చేరడం ఆంధ్రదేశ చరిత్రంలో చేర్చుకోదగ్గ సంఘటనం. కాని రాజకీయముగా ఈ సంఘటనంవల్ల జరిగే సంచలనం మాటయెటున్నా, సారస్వతరంగములో చాలా ఉజ్జీవనము కలగడానికి అవకాశం ఉన్నది. శ్రీ పంతులుగారు దేశముకొరకు పర్లాకిమిడిలో ఉండిన్నీ వాడుకభాషకు ప్రమాణరూపము గౌతమీతీరంతో, రాజమహేంద్ర భాషతో, ముడిపెట్టుతూవచ్చిన వారు, నేడు అనేకవిధాల సారస్వతోజ్జీవనముతో తొలకాడ నోచుకొన్న ఆపట్టణమే వచ్చిచేరి, నవ్యసాహిత్యపరికరాలతో జోక్యముపెట్టుకొనకుండా ఉంటారని నిరాశ పొంద వీలులేదు. పౌరులయూ, వివిధసంస్థలయూ స్వాగతానికి సమాధానము చెప్పుకుంటూ శ్రీ పంతులుగారు ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారికిని తమకునూగల మతభేదము చాలా స్వల్పమైనదనీ, అది నిరూపించుకొని సమాధానానికి రావడం సులభమనీ, శ్రీశ్రీశ్రీ పిఠాపురం మహారాజావారితో పదియేను నిమిషాలు సమావేశం దొరకేయెడల వారినికూడా తమవంకకు సమాధానపరచగలమనీ చెప్పిన మాటలు ఫలిస్తే, నేడు సారస్వత రంగంలో వైరుధ్యాలకై ఖర్చుపడే శక్తి మంచికిగాను వినియుక్తమయే అవకాశం ఏర్పడుతుంది.

* *

ఆంధ్రవిశ్వకలాపరిషత్తుకు ఒక కర్తవ్యాన్ని విన్నవిస్తూ తాపీ ధర్మారావు గారు (బి.ఏ.) మొదలుగాగల ఐదుగురు ఆంధ్రులు ఈలాగు విశ్వసిస్తున్నారు : "ఆంధ్రకలాపరిషత్తువారికి తెలుగుభాషతో ప్రసక్తి ఉంది. ఆ తెలుగుభాషలో గిడుగు రామమూర్తిపంతులుగారు చేసినకృషి ఎంతగొప్పదో లోకానికే తెలుసును .... అట్టి మహాకృషి ఫలితాన్ని కలాపరిషత్తువారు ఇంతవరకూ ఉపయోగించుకోకుండా ఉండడం చాల దుఃఖకారణం. ఇప్పుడు సంపూర్ణాంధ్రత్వంకల రామలింగారెడ్డిగారి ఆధిపత్యంలోనయినా ఈలాటి కొరతలు తీరుతాయని పుట్టెడాసతో నున్నాము....ఈ జూలయిలో పరిషత్తుని తెరుస్తారు. ఆలోగా రామమూర్తిగారు తెలుగుపీఠాన్ని అధిష్ఠిస్తారు అన్న సంతోషవార్త ఆంధ్రులకు వినబడునని మా విశ్వాసము"

ఏ భాషవారిలోనూ రామమూర్తిపంతులుగారివలె ఒకభాషయందలి సారస్వతాన్ని గాలించినవారు ఎందరో ఉండరు. ఆంధ్రులకు విశ్వకలాపరిషత్తు చేపడి ఇంతకాలమయిన్ని, వీరి అసాధారణ పాండిత్యాన్ని తగినరీతి మన్నించకపోవడం పరిషత్తు ఆంధ్రుల సంస్కృతి విద్వత్తలయెడ చూపే అనుబంధవిశేషాన్ని విమర్శిస్తూ ఖేదకారణమై నిలుస్తుంది. కాగా ఈ ఆంధ్రప్రముఖుల ప్రకటనంగమనించ తగ్గది. శ్రీ పంతులుగారికి డాక్టరేటు ఇచ్చి గౌరవించడం, వారిచేత పరిషదుపన్యాసాలు చేయించడం, వారికృషిని- చేసినదానినీ చేయగలదానినీ.... గ్రంథాలుగా ప్రకటించడం లోనైనపనులకు కళాపరిషత్తు ఎప్పుడు పూనుకొన్నా పూనుకోతగ్గదే.

మాతృభాషలోని తీపి మనస్సునెంతో ఆహరించగా, శ్రీ పంతులుగారు 'ఆడిన' మాటకూ 'వ్రాసిన' మాటకూ దూరాలూ సన్నికర్షలూ పరిశీలిస్తూ వాఙ్మయము చులుకితము చేసుకొన్నారు. కాని అవశ్యకాన్నిబట్టి వారి మనస్సు నేటికి సాహితీపరత్వముకంటె భాషాపరత్వముతో ఎక్కువరంగు తిరిగినదై నిల్చి ఉన్నదంటే వారికృషిని సరిగా తెలిసికొన్నట్టే. ఇక పరిషదధికారులు ఆ పీఠాన్ని ఎటువలె నిలుపనెంతురో. కాని శ్రీ పంతులుగారిని సత్కరించడానికి పరిషత్తు తనకు వీలయినన్ని మార్గాలు చేపట్టదగును.

ఉదయిని: సంపుటి 1, సంచిక 5.

## 6

'త్రివేణి' భారతసారస్వతానికి వాణిగా నిలిచి, ప్రపంచ సంస్కృతి వికాసానికి అంకితమై విదేశములందు సహా అందచందాలకు మెప్పుగాంచిన పత్రిక. దాదాపు తొమ్మిది సంవత్సరాలు అమిత ప్రయాసలు గడచి, ఈ జూలై నుండి మాసపత్రికగా మారి మరింత శ్రమలకు సిద్ధపడి మరింత జనాదరానికి ఆశపడు తున్నది. ఒక ఆంధ్రవీరుని పూనికయైన ఈ గొప్పసంస్థ అడ్డులేని అభ్యుదయము పొందడానికిగాను, ఉన్నతమైన లక్ష్యము మరింత యేపుగా సాధించడానికిగాను ముఖ్యముగా ఆంధ్రులు తోడుపడడం కర్తవ్యం. ఇతర జనుల తోడ్పాటు పత్రిక విలువనుబట్టి కొంతవరకు ఏర్పడుతుంది కాని, ఆంధ్రులు ప్రత్యేకాభిమానము చూపడం సహజమైన ధర్మం. అధమం, పత్రిక విలువనుబట్టి చేయవలసిన సాయమైనా ఆంధ్రులు చేయగలిగితే పత్రికకు ఇదివరకు కలుగుతూ ఉన్న కష్టం కూడా కలగదని చెప్పవచ్చు. సాయము మాట అటుండగా, 'త్రివేణి' ని ఎక్కువగా వినియోగపరుచుకోని ఉదాసీనత ఆంధ్రులు దాటవలసి ఉంటుంది. ముఖ్యముగా ఆంధ్రజాతికి మనస్సులు సరిలేకపోవడానికి చాలా కారణాలు లేక పోలేదు కాని, వారి బుద్ధికుశలత, కళాభిరుచి ఎంత నిజమో వారి ఉదాసీనతకూడా అంత నిజమైనదని ప్రత్యేకము లెక్కపెట్టుకోవలసే ఉంటుంది. దేశములో, ప్రపంచములో తమ స్థానాన్ని సంతరించుకోగల అవకాశాలు ఎక్కువౌతున్నప్పుడు తెలుగువారు తగిన ఉత్సాహం కనబరచక మానరు. ఇందులకుగాను సారస్వత విషయాలలో ఎక్కువ శ్రద్ధ వహించి, తదారాధనకై ఉత్సుకపడ్డ పత్రికలకు క్షేమము కలిగించి అందువల్ల మేలు పొందుతూ, తమ సత్తువను తెలుసుకొనడమూ, పెంపొందించుకొనడమూ ముఖ్యమని ఆంధ్రులు గమనించక చాలాకాలము ఉపేక్షించరు.

ఈ సందర్భములో 'ప్రబుద్ధాంధ్ర' పత్రిక నిలిచిపోవడం మిక్కిలి శోచ్య మని స్మరించక మానలేము. బహుముఖములైన ఆంధ్ర జాతీయతను ముక్త కంఠముతో ఉద్బోధించి సార్థకనామధేయఅయిన యీ పత్రిక, సంపాదకుని అమిత కార్యదీక్ష అయినా ఉపయోగపడక, అంతరించి ఒకలోటు మిగిల్చింది. ఈపత్రిక వ్యాఖ్యలు ఆంధ్రత్వాభిమానములో ఒక మతాభినివేశము దాల్చి కొంత సంకుచితత్వము కనబరుస్తూ రాకపోలేదు కాని, ఆ అభిమానము విలువ అంతట ఉపేక్షించతగ్గది కాదు. ముఖ్యముగా హిందీయెడల వివాదము ఈ సంపాదకులు పాదుకొల్పినది ఆంధ్రదేశాననే కాక కర్ణాటక తమిళ ప్రాంతాలకు కూడా పాకి ఒకానొక ఆలోచన దేశములో ప్రచలితం చేయడమేకాక, జాతీయ దేశీయ

(సామాన్య) భావాల వివరణానికీ, ఆ వివరణము ప్రాముఖ్యము పొందడానికీ కారణ మయింది. స్వల్పములోనే 'ప్రబుద్ధాంధ్ర' దేశములో విరివిగా వ్యాప్తి గాంచిన దయిన్నీ అంతరించినదంటే ముఖ్యముగా ఒక కారణం కనిపిస్తుంది. చిన్నరకం పత్రికలు చౌకధరలలో ఎంత విరివిగా అమ్ముడుపోయి లాభాలు చేకూర్చినా, కొంత ఉన్నతభావాలకు కట్టుపడ్డ పత్రికలు తక్కువ వెలలకుపోయి తగిన రాబడి తెచ్చుకొనడం కష్టసాధ్యమని యిదొక పాఠముగా గుర్తింపవలసి ఉన్నదేమో.

* *

మదామ్ సోఫియా వాడియాగారు (బొంబాయి) ఆర్జెంటైనాయందలి *Buenos Ayres* నందు సెప్టెంబరులో జరగబోయే పి. ఇ. ఎన్. ప్రపంచ మహాసభకు భారతదేశపు ప్రతినిధిగా నియుక్తురాలైనది. *Poets, Playwrights, Editors, Essayists and Novelists*- ఈపేళ్ళ వ్యుత్పన్న రచయితలందరికీ ఈ *P.E.N. Club* ప్రపంచమందొక కేంద్రసమాజమై, వివిధ దేశాలలో, భిన్న జాతులలో సంస్కృతిపరమైన ఐక్యము పరిణతపరచడానికి పదియేనేళ్ళుగా పాటుపడుతున్నది. డాక్టర్ స్కాట్ సతి ఇదినెలకొల్పి జగద్విఖ్యాతప్రతిభుడైన గాల్స్‌వర్దీని మొదటి అధ్యక్షుడుగా సంపాదించగల్గినది. గాల్స్‌వర్దీ ఈ సంస్థ లక్ష్యాలను మిక్కిలి కొనియాడి వ్యాప్తికి తే ప్రయత్నించడమే కాక, తనకు నోబెలు బహుమానముగా లభించిన ధనమంతా యీ సంస్థ భండారములో పోసినాడు. అతని మరణానంతరము, ప్రపంచ చరిత్రాది గ్రంథాలు వ్రాసి విఖ్యాతి బడసిన హెచ్. జి. వెల్సు దీని కధ్యక్షుడైనాడు. దీనికి అన్ని దేశాల లోనూ శాఖలు నెలకొంటున్నవి. భారతదేశములో ౧౯౩౩ సం.లో బొంబాయి నగరమున ఏర్పడెను. దీనికి శ్రీ డా. రవీంద్రనాథ టాగూరుగారు అధ్యక్షుడు; సర్ సర్వేపల్లి రాధాకృష్ణ, శ్రీమతి సరోజినీ నాయుడు, శ్రీ రామానంద ఛటర్జీ ఉపాధ్యక్షులు; కిందటి సంవత్సరమున్నూ ఈ సంవత్సరమున్నూ ప్రపంచ మహా సభకు భారతప్రతినిధి అయిన శ్రీమతి సోఫియా వాడియా దీనికి కార్యకర్త్రి. ఇతర దేశాల రచయితలకూ భారతీయ రచయితలకూ పరస్పర పరిచయము సమకూర్చడమూ, కవిప్రపంచములో భారతీయులకుకూడా మరింత బాంధవము సంపాదించడమూ, భారతములో సహా ప్రాంతాలకు పరస్పరము సంయోగము తీసుకరావడమూ దీని లక్ష్యాలలోనివి.

ఇటీవల లండను నగరమున జరిగిన *International Association of Writers for the Defence of Culture* అనే ప్రపంచ గ్రంథరచయితల

సమావేశమున్ను పి.ఇ.ఎన్. సమాజమువారివలె ఉన్నతలక్ష్యము కనబరుస్తున్నది. జర్మనీ మొదలైన విశంకప్రవృత్తిగల ప్రభుత్వాలలో నలిగిపోతున్న కళా సంపత్తినీ, సంకుచితమైన అభిప్రాయాలుగల ప్రభుత్వమువల్ల తిరస్కారమూ, అనాదరమూ, బహిష్కరణమూ పొందిన మహామేధావుల గొప్పతనమునూ విశాలదృష్టితో నిలబెట్టి, స్వాతంత్ర్యమును మానవస్వత్వమును ఆరాధించి ఉద్ధరించే శుద్ధలక్ష్యులు- కవులు, కళాకారులు, దార్శనికులు, చరిత్రకారులు, నవలాకారులు, రాజనీతివేత్తలు, పండితులు మొదలైనవారు - జగత్తు కంతకూ చెందిన సొత్తు అనే భావాన్ని లోకములో వెల్లడించి వ్యుత్పన్నతను సంరక్షించే నిమిత్తమై - శాంతి స్వచ్ఛందతల పేర 'రచయితల' రక్షణ ప్రధానాశయంగా.... ఈసంస్థ ప్రవర్తిల్లుతున్నది. విశాలమైన ఈ ఆలోచన ప్రపంచమంతటా అనేక ముఖాల వ్యక్తమౌతున్నది. ఇందు జాతి, భాషా, భూరూపవిభిన్నతలు అడ్డంకులు కాకుండే రీతిని సాధన కావించడానికి సర్వవిధాల ప్రయత్నములు జరిగినా, ఈ జాత్యాది స్వత్వములు - అవి సంకుచితములు కాక సంరక్షకములు మాత్రమే అవుతుండగా - భగ్నము కావలసిన ఆవశ్యకము కన్పట్టడం లేదు. కాని జాతుల అంతరంగములో ఒక ఏర్పాటు విశాలదృష్టితో కావలసి ఉన్నది.

* *

భారతదేశ సారస్వతము నిమిత్తమై ఒక ప్రపంచ సభకు ప్రతినిధి పోవడ మనగా ఏమిటో అని ఆశ్చర్య మవుతుంది. ఏమంటే, భారత సారస్వతము, ఆధునికమైనది, ఏ ఒకరికి తెలిసినది? తెలియడానికి తగ్గ అవకాశమేమున్నది? ఇన్ని భాషలలో సారస్వతములు, ఇంచుమించు అన్ని చోట్లనూ, అభ్యుదయ సంరంభముతో తాండవిస్తున్నవి నిజమేకాని, ఆంగ్లములోనికి తర్జుమా వచ్చినంత వరకు వాటి ప్రశస్తి కొందరికి మాత్రము అపాటి సమగ్రముగా తెలిసినది, అంతే. దేశాంతరాలలో వీని ప్రసిద్ధి అయినా, పరిచయమైనా కొలది అయిన ఆంగ్లానువాదముల పయినే నిలిచి ఉన్నది. ఆ అనువాద ప్రకటనాదులు ఇన్ని భాషలలో నుండి జరిగినది తక్కువ అనియే యెంచవలెను. మాడర్న్ రివ్యూ, త్రివేణివంటి పత్రికలు ఈవిధమైన ప్రయత్నము సాగిస్తున్నా, ఈలాటి సార్వజనిక సన్నివేశాలకు అనుకూల పరిస్థితు లేర్పరచగల ప్రయత్నాలు విరివిగా ఈ ఒకదృష్టితో జరగవలసే ఉంటుంది. అఖిలభారత దృష్టితో హిందీ మాధ్యమముగా సారస్వతము కేంద్రీకృతము చేస్తున్న మున్షీ ప్రభృతుల పూనిక మిక్కిలి ప్రశంసార్హమే కాని, ఇతర దేశాలతో సహచారమని వచ్చినపుడు ఆంగ్లములో తిరిగి యింతపనీ జరగవలసే ఉంటున్నది. పి.ఇ ఎన్. వారి కార్యవిధానము ప్రతీక్షించదగ్గది.

కాని యీ సందర్భములో వంగదేశము విశిష్టత గమనించదగ్గది. భారత దేశములో ఇన్ని భాషలున్నా ప్రపంచ మహాసభలందు భారతదేశ మొక స్వరూపముగా ప్రతినిధిని ఆహ్వానిస్తారు. సాహిత్య విషయము భాషపై ఆధారపడ్డదన్నది ప్రసిద్ధమే అయినా, భారతదేశానికి శ్రీమతి సోఫియా వాడియాగారు ప్రతినిధిగా పోయినది ప్రాంతాలు గణించడం కష్టమే. కాని వంగప్రాంతానికి మాత్రం ప్రత్యేకం డాక్టరు కాళిదాస నాగ్‌గారు ఆహ్వానం పొందినారంటే, వంగభాష ఇన్ని భాషలలో ఒకటయిన్ని ప్రపంచ దృష్టి నాకర్షించినదై అన్ని ప్రాంతీయ భాషలకూ మేలుబంతియై, స్వభాషలయందయినా ప్రతిభాకృషులు ప్రాంతములందే అణగిమణగి పోవడానికి బదులు ఆయా భాషకూ ప్రాంతానికీ ప్రఖ్యాతియే సంపాదించగలవని బోధిస్తున్నది. ఇందుకు టాగూరుకవి మున్నగువారి రచనలు మాడర్న్ రివ్యూ పత్రిక ఆంగ్లములో వెలువరించి ప్రపంచానికి పరిచితపరచడంవద్దనుంచీ జ్ఞాపకము చేసుకోవలసే ఉంటుంది. భాషాఖండమందు సాహిత్యకృషీ, అది వెల్లడికి తెచ్చే ఏర్పాటుకూడా అనేక విధాల ప్రతి ప్రాంతమందు జరగవలసే ఉంటుంది. అపరివ్యక్తముగానైనా, పరిషత్తులూ, పత్రికలూ ఇందుకు చాలా ఉపకరిస్తవి. వీని 'వేర్పాట్లు' రచనాస్వచ్ఛందతను కుంటుపరచకుండా చూడడం ఒక మెలకువగా మాత్రం నిలుపుకోవలె.

* *

భారతీయ సాహిత్యమునకు ముఖపత్రికగా బయలువెడలి సంవత్సరము కాక పూర్వమే, పదకొండు సంచికలతోనే, 'హంస' (హిందీపత్రిక) అంతరించింది. సేఠ్ గోవిందదాస్‌గారి 'సిద్ధాంత స్వాతంత్ర్య' అనే నాటకము ప్రకటించిన 'హంస' ప్రభుత్వంవారు అందులకై కోరిన ౧,౦౦౦ ధరావతు ఇచ్చుకోలేకపోయింది. పెద్ద సన్నాహముతో నెలకొన్న యీ సంస్థ తన మహదాశయాలను నిర్వర్తించుకొంటున్న సంతుష్టి తగినంత పడయక పూర్వమే అంతరించడం ఎల్లరకూ దుఃఖదాయకము.

జి. కె. చెస్టర్‌టన్ మరణిలచి ఆంగ్ల వాఙ్మయ నిర్మాతలనుండి ఒక విచిత్రమైన పీఠము ఖాళీచేసి మృతజీవులలో చేరుకొన్నాడు మాగ్జిమ్ గోర్కీ రష్యను వాఙ్మయపీఠికి దురదృష్టము మిగుల్చుటతో ప్రపంచ వాఙ్మయ వాటిలో ఒక మహాకృషిని వదలిపోయినాడు.

ఋషి కావ్యకంఠ అయ్యలసోమయాజుల గణపతిశాస్త్రిగారు, ఆంధ్రవాల్మీకి వాసుదాసుగారు కీర్తికాయులై ఆంధ్రజనావళికి నష్టము వాటించినారు. వావిల కొలనువారు ఆర్యకథానిధి, సుభద్రావిజయ నాటకము, రామాయణము మొదలైన వివిధకక్ష్యలకు చేరిన గ్రంథములు రచించి ఆంధ్రుల మనస్సుకూ బుద్ధికీ కూడా చేరువకు వచ్చినవారు.

## గంగా భగీరథీ సమానం - తెలుగు సాహిత్యం?

జనార్దనరావులో ఉన్న ఒక గొప్ప సుగుణం ఏమిటంటే, తన అభిప్రాయాలను ఎవరిమీదా బలవంతంగా రుద్దేవాడుకాదు.... అతడి మొగంమీద నేనెప్పుడూ కోపం అనేది చూడలేదు. నిస్పృహ చూశాను. నిరాశ చూశాను. అందులోనే ఒక అజేయమైన పట్టుదలకూడా చూశాను. బాధపడడం చూశాను.... జనార్దనరావు మరణం వలన మన తెలుగు సాహిత్యానికి హేమంతం ప్రాప్తించింది. (వైధవ్యమే అందుకు అతిశయంగా చెప్పాలంటే) ఇది నిజం.

శ్రీశ్రీ

# గ్రంథ పరిచయాలు

[పుస్తకాల సమీక్ష పత్రికల్లోకానీ, రేడియోల్లోకానీ ఓ మొక్కుబడిగా ఈనాడు తయారైంది. ఏ కొద్ది పత్రికలో - సమీక్షకులో దీన్ని శ్రద్ధగా నిజాయితీగా నిర్వహించడం మనందరకూ తెలిసిందే! జనార్దనరావ్ వివిధ పత్రికల్లో చేసిన గ్రంథ సమీక్షలను పరిశీలిస్తే అతడిలో నిజాయితీ - పడి పోతున్న సాహిత్య విలువలపట్ల తపన కనిపిస్తుంది. ఎంతటి గొప్పవాళ్ళనైనా, మిత్రుల్నైనా "పోనీలే!!" - అని వదలడం అతనికి కానిపని. 'ఉదయిని'లో 'వాఙ్మయవీధి' అన్న శీర్షికను గ్రంథ సమీక్షలకు కేటాయించాడు. పి.వి. రాజ మన్నారు, పిలకాగణపతిశాస్త్రి, పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు లాంటి ప్రముఖులు ఉదయినికి సమీక్షకులు]

## పూలదండ (ప్రథమ భాగము)

రాయల్ సైజు ౧౬ ఛ ౨౫౫ పుటలు. వెల రు. ౧-౮-౦ గ్రంథకర్త : పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ప్రకాశకులు : కలాభివర్ధనీ పరిషత్తు, రాజ మహేంద్రవరము.

నేటి మన వాఙ్మయ పరివర్తనము వల్ల తెలుగుభాషకు సిద్ధించిన కళా వ్యవస్థలలో చిన్న కథ ఒకటి. అది కొద్దికాలమునుంచే మన భాషలో ప్రవే శించినా అప్పుడే కొన్ని చేతులకు పదునుపెట్టి కొన్ని కళాహస్తములకు తన దీక్ష ఇచ్చినది. ఆరితేరిన అరిందా చేతులు ఈ కళావిన్యాసముతో మన వాఙ్మ యమును అనల్పముగా అలంకరిస్తూ ఉన్నవి. ఇట్టి అలంకారములలో పూలదండ ఒకటి.

ఈ భాగములో ఇరవై కథలు ఉన్నవి. 'గ్రంథకర్తలు చిన్నకథల ద్వారా ఆంధ్రజాతిలో గొప్ప పరివర్తనమును పుట్టించవచ్చు'ననే నమ్మకముతో గ్రంథకర్త వీటిని వ్రాసి ప్రకటించినాడు. ఆ పరివర్తనము ఎక్కువగా మధ్యమ జీవనములోనూ, కొంతవరకూ నిమ్న జీవనములోనూ రగులుకొనదగినది. అందుకనుకూలముగా గ్రంథకర్త ఈ సంపుటములో నిమ్న మధ్యమ జీవనము లకు సంబంధించిన కథలనే వ్రాయడముచేత పాఠకుల ప్రశంసకు పాత్రుడై

మనోరథసిద్ధి పొందవచ్చును. అదీకాక, జనుల ఆదరము ఎక్కువగా పడసిన గ్రంథము తప్ప ఆశయము ఎక్కువగా నెరవేర్చజాలదు. ఆ ఆదరమూ కలగడమునకు కావలసిన కళానైపుణ్యము కూడా ఇందులో అనేక మార్గాల వెల్లువగా ప్రవహించినది.

అయత్న సులభమైన కథా నిర్వహణము ఇందు మెచ్చదగిన ప్రధాన లక్షణములలో ఒకటి. పరికరములు సేకరించడములో కాని, కథ పరిణతము చేయటములోకాని, చెప్పడములోకాని, ఎడలేని సౌలభ్యము గోచరిస్తూ ఉన్నది. కథనము ప్రవాహమువలె నడచిపోతూ పాఠకునికి ఉత్సాహము పెంపొందిస్తూ ఉండగా, స్వాభావికత, రసికత, పరిహాసము, హాస్యము మొదలైన విలువగల కథా లక్షణములు మనసును తనుపుతూఉంటవి.

సారస్వత నిర్మాణములకు కళా, ఆశయమూ రెండూ ప్రధానములే. ఉత్తమ రచయితలు కళా స్వరూపములో ఆశయమును కరిగించి పోస్తారు. 'ఇరువుర మొక్కచోటికే పోదము' 'ప్రేమపాశము' "క్రిందికా? పైకా?" 'ఆడాళ్ళని పెంచగూడదు' "నా నీడ చూసుకొనే నేను జంకేను" "జన్మానికల్లా ఒక్కటేముద్దు" అనే కథలలో ఇటువంటి కళాసౌందర్యము కనబడుతూ ఉన్నది. ఉత్కృష్టమైన ప్రేమదైవికములూ, మానుషములూ అయిన విఘాతములకు వివశమైనప్పటి పరిణామమూ, ఆవిఘాతములను అది గడచినప్పటి పరిణామము వీటిలో బాగా నిరూపితములైనవి. "ఆడాళ్ళని పెంచగూడదు" మొదలైన కథలలో చదువరిని భ్రాంతిపెడితే చమత్కారమైన కథనమున్నూ, సూచనా పరత్వమున్నూ, స్వాభావికతయున్నూ కల్పనకు సమగ్ర సౌందర్యము నింపుతూ ఉన్నవి. "క్రిందికా? పైకా?" "ముందు హాలాహలమూ పిదప అమృతము" మొదలైన స్వీయకథనములు చెప్పేపాత్రయొక్క వ్యక్తిత్వమును ప్రకటిస్తూ సజీవముగా ఉన్నవి.

సంస్కర్త తన ఆశయములను కథలద్వారా బోధించనెంచినా తన సంస్కార స్వప్నములను వర్తమానములోకి మార్చవలసినదే. కాబట్టి సంస్కార ప్రియుడైన యీ రచయితయూ భవిష్యదాశలను వర్తమానములో ముద్రించే యత్నము నిపుణతతో చేసినాడు. ఈ కథకుడు తన ముఖ్య సందేశమైన విధవా వివాహావశ్యకతను వేర్వేరు దృక్పథములనుండి పరీక్షించి నిరూపించినాడు. కథకుని వాదనలను ఈ కథల సుష్ఠుగా తమకు యోగ్యమగునట్టుగా ప్రకటించినవి

విధవా వివాహ రజస్వలానంతర వివాహకథలమాట అటుంచగా 'తహస్సీలుదారుకాదు - వర్తకుడు' 'రావులయ్య' 'నలుగుర్ని పోషిస్తున్నానిప్పుడు'

మొదలైన కథలు నిమ్న మధ్యమ జీవనములలోని బ్రదుకుతెరువులను కొన్నిటిని విమర్శిస్తూ ఉన్నవి. 'పుల్లంరాజు' అనే కథలో వ్యభిచారము తొలగించడమునకు సానివృత్తీ, కళలూ పాడుచెయ్యడమువల్ల లాభము లేదనే వాదము హేతువాద పూర్వకముగా చిత్రితమై, కథకుని ఆశయము బలముగా ప్రకటితము అవుతున్నది.

ఈ కథలో సంభాషణములలోని స్వాభావికత చాలా ప్రశంసనీయము. సంభాషణ సందర్భములలో రసికత స్వాభావికత రంగరించి పోసినాడు రచయిత. ఉల్లాసమయములైన పలుకుబడులున్ను విరివిగా ఉన్నవి. కనుకనే కొన్ని కొన్ని కథలు వృత్తకల్పనాదుల సందర్భమున కొంత అసంతుష్టి కూర్చినా అందులో కూడా ఒక్కపుట అయినా విసుగు కలిగించదు.

ఇక హాస్యరసము అత్యుజ్జ్వలముగా ఉన్నది. గబగబా కథ చెప్తుతూ ఆ వాక్యములతో కలిపే హాస్యరసమయమయిన వాక్యము విసరుతూ ఉంటాడు రచయిత. 'లొట్టన్న' అనే పిట్టకథ పుటలో సగమైనా లేదు కాని చదివితే నవ్వుకు చాలా పని చెప్తుతుంది. అది అసలైన పిట్టకథ. అందులోనిది మేలైన హాస్యరసము.

రచయిత ఒకే ఆశయమును అనేక కథల ద్వారా బోధించడముతో కథలకు పరస్పరము పోలిక ఉండడంచేత చదువరి మనసుకు నవనవాహ్లాదము కొంచెము తగ్గిపోతుంది. ఆశయ ప్రాధాన్యము ప్రబలి కొన్నిచోట్ల కళా నైపుణి నిదిగద్రొక్కుతూ ఉన్నది. తన సందేశము ప్రకటించే తొందరలలో రచయిత కథను అస్వాభావికత తెరువులలోకూడా నడిపించిన తావులున్నవి. విధవా వివాహ సందర్భములో పరమఛాంధస వృద్ధస్త్రీలు కూడా తమకు తగినంత పరివర్తన కారణము లేకుండానే కొన్నిచోట్ల అనుకూల నిర్ణయములతో కథను గట్టెకించినారు. ఆ సందర్భములలో పాత్రల వ్యక్తిత్వముచెడి కథకుడే మాటడినాడన్నమాట. ఒక చరిత్ర పరిణతము కావడమునకు, ఒక ఆశయము నెరవేరడమునకు గొప్ప విఘాతములు కల్పించి చివరకు, జయము నిర్ణయించడము గొప్ప కళానైపుణ్యమునకు లక్షణమై ఉండగా ఆటంకములు దాటించడమునకు వెనుకంజవేసి అస్వాభావికత నాశ్రయించడము ఇందు కొన్ని స్థలములలో కనబడుతుంది. ఇంకా సంస్కార బోధల విషయమైన సంభాషణలు ఉదార హృదయమునకు సమ్మతమైన సరణి అనుసరించవలెను. కథకుడు తన ఆశయమును నెరవేర్చడమునకు తన పాత్రలతో లోపాయికారి యేర్పాటు చేసుకొన్నట్టు కనబడగూడదు. ఈ లోపములు సవరించుకొంటే ఒక్క ఆశయము బోధించేవే యెన్నో కథలు వ్రాసినా విసుకు కలగడమునకు అవకాశము తగ్గుతుంది.

ఇక వర్ణనలు : కథనమునకు జాగుచేసేది యేమీ ఇందులో కథ. మంచిదే. కాని, కొంతలోటు కనిపిస్తుంది. బాహ్య ప్రకృతి వర్ణనము చాలా తక్కువ. సుందరమైన ప్రకృతిని కథలలోకి తీసుకురానేలేదు. అటువంటి సందర్భములు కలుగజేసికోనేలేదు అంతః ప్రకృతి వర్ణనమైనా, ఎక్కువగా లేదు. మానసిక పరిణామములు ఇంకా బాగా చలించవలెను. మానసిక చరిత్రము మధురముగా చిత్రించిన తావులున్నా అనేకములు, కథలలో దానికంత ప్రాధాన్యము లభించ లేదు. అది లభిస్తే గాంభీర్యము ఎక్కువై కథకులకు పాఠకలోకముమీద ప్రభావము ఎక్కువ అవుతుంది బాహ్య చరిత్రముకంటె అంతశ్చరిత్రము వర్ణించడము రచనా సామర్థ్యమునకు ఎక్కువ పరిణామము. అదీకాక సంఘ పరివర్తనమునకైనా మానసిక పరివర్తనము నిదానమవడంచేత అది విరివిగా వర్ణించదగినదే, ఆ వర్ణనము కొంచెము తక్కువ అయినా ఇంగిత పరిశీలనము మట్టుకు సుష్ఠుగా కనబడుతూనే ఉన్నది. నవలా, నాటకమూ మొదలైన సార స్వత వ్యవస్థలలో ఇటువంటి వర్ణన లెక్కువగా ఉండవలెనుగాని కథ తేలికగానే ఉండవలెనని కొందరభిప్రాయపడినా, ఉత్తమ కథారచన వర్ణనలు కథకు కలిగించే జిగీ, లోతూ వ్యక్తము చేస్తూనే ఉన్నది. కాబట్టి ప్రకృతి ప్రేమ, మానసిక చరిత్రము, ఘటనాయుద్ధము, భావసంకులత మొదలైన అంశముల గంభీర చిత్రణము ఇంకా యీ కథకుని రచనలో ప్రాధాన్యము వహించి పెంపొందితే యీయన రచనకే కాకుండా తెలుగు కథకు కూడా ఔన్నత్యమూ, ప్రాశస్త్యమూ కలుగుతవి.

కొం. జ.

 సుభాషి - నవంబరు 1927

## ప్రభవ

గ్రంథకర్త : శ్రీ శ్రీనివాసరావుగారు, కవితాసమితి, విశాఖపట్టణము, క్రౌనుసైజున 54 పుటలు కలవు.

వెల : రు. 0-8-0.

ఇది కవితాసమితి గ్రంథావళిలో మొదటిది. ఇందు ప్రకృతి గీతములు, ప్రణయ గీతములు, ప్రకీర్ణ గీతములు అను వేర్వేఱు విభాగముల పదునాఱు ఖండ కావ్యము లున్నవి. శైలియందు సార్థకతకంటె సమాసతత్వరత యెక్కువ గోచరించుచున్నది. ఇంకను విషయానుగుణ్యముగ శైలియందు మార్పులు కన్పడ వలెను. తెనుగు వాడకము చాల తక్కువగ నున్నది. ఒక్కొకచో బదలించు సమాసభూయిష్ఠత యున్నను మొత్తముమీద శైలి బాగుగనున్నది. భావము లందును గాంభీర్యమున్నది. భావములకును, భాషకును సామరస్యము సంధించుట

కీ కవి యింకను ప్రయత్నింపవగును. ఇది చదివినవారికి కాలక్రమమున ఈ కవి కవిత యింకను సంపన్నము కాగలదను ఆశ పొడమును. భావస్వాతంత్ర్యమును, భాషాసౌష్ఠవమును మెచ్చదగియున్నవి. ప్రకృతిపథముల తత్వాన్వేషణము సలుప సమకట్టిన యీ కవికిశోరమానసము ఉత్సాహ రంజితమై యొప్పుచున్నది.

—కొంపెల్ల జనార్దనరావు,
భారతి—1928, ఆగస్టు.



## వాల్మీకి

కాళ్ళకూరి గోపాలరాయ ప్రణీతము. ప్రకాశకులు : విశల్యాడిపోవారు, ౪, ఆచారప్పన్‌సందు, జార్జిటవున్, మదరాసు. క్రౌను సైజు ౧౦౪ పుటలు.

వెల : రు. ౧-౦-౦.

ఆదికవి వాల్మీకి జీవితకథ వస్తువుగ నవలంబించి రచించిన అందమగు రూపక మిది. ఇందు జటిలమగు వస్తుకల్పనము లేకున్నను అట్టి మహచ్చరిత్ర మును పరిణమింపజేసిన మనస్తత్త్వము నిరూపింప యత్నించి యీ చిన్ని వస్తు వునకు జీవము పోయగల్గినాడు కవి.

చౌర్యము నుత్తరించి ప్రాచేతసుడు 'సమానసంపత్సామ్రాజ్య' స్థాపనా సంకల్పమున నాటవికుల కూడగట్టుకొని పరిసర రాజ్యముల దనయేలుబడిలోనికి లొంగదీసుకొను యత్నములు నడుపుచుండ, నారదప్రేరితులగు వసిష్ఠ విశ్వామిత్రు లాత్మవృత్తపరిశీలన ముద్బోధించుటతో వివేకమురేకెత్తిన యాతని మానసికజీవనము ఆతడు 'వాల్మీకి'యై, ఆదికవియై, నిర్వాహణమున సరస్వతీ ప్రసాదము చూఱకొను పర్యంతము చక్కని యితివృత్తమున సమంజసమగు చిత్రణము గాంచినది. గర్భసంధి యందలి ప్రాచేతసుని భావ విక్షోభము కడు తగి యున్నది. ప్రాచేతసుడు మృతప్రాయుడై నారకయాతన లనుభవించి ఆ ఉపాధియందే పునరుజ్జీవితుడయిన దృశ్యము, వసిష్ఠ విశ్వామిత్రుల వ్యాఖ్యానములతో ప్రభావమినుమడించి, కవి నాటక కళా నిరూఢికి నిదర్శనముగ నున్నది. అచేతన దశయందు మహర్ష్యుపదిష్టమైన రామ మంత్ర స్ఫురణ మొకవంక విరక్తి శిఖరమున కాకర్షించుచుండ, కొమరిత లేచిపోవుటచేతను, భర్త విరాగి యయిపోవుటచేతను పరిఖిన్నయై దీనదశయందు ప్రత్యక్షమగు తనప్రేయసి పరిత్యక్త కానుండుట వేఱొకవంక పిలుపిడు కూర్చుచు ప్రాచేతసుని కడుబాపిడి పెట్టును. ఇట్టిపట్టులు నటకుల సామర్థ్యమును పరీక్షించును.

మన స్తత్త్వప్రవాహమున మనలను సూక్ష్మమార్గముల నంతగ నడిపింపక తరుచు బాహ్యపరివర్తనములనే చూపినను, ప్రధాన పరిణామసూత్రములను కవి యేమఱలేదు. ప్రతిపాత్రయు సార్థకతను, మంచి పరిణతిని పొందినది. తత్తర పడక స్వతంత్రకల్పనతో కవి సహజ సాధ్యగతుల నవలంబించి రూపకమును ప్రశంసాపాత్రముగ నిర్వహించినాడు.

శైలి కడుహృద్యము; శోభాన్వితము. ఇంపైన భావసంపదతో కవిత లలితముగ నున్నది.

పద్యరచన కుదాహరణము :-

ధరణిఁ వాఙ్మయ పీఠ మెక్కి బహుధా
ధర్మంబు శాసించి, త
త్సరణిఁ దూషణ భూషణంబులను శి
క్షారక్ష లుద్దించుచుఁ,
సరసామోదముగాఁగ మానవమన
స్సామ్రాజ్య మక్రాంతముఁ
పరిపాలించు కవీశు వైభవము వి
శ్వశ్రేయముఁ గూర్చుతన్.
సుమనో మంజుల మందహాస రచనల్
జొబ్బిల్లి నల్లారు జొం
పముచే మోద్పులఁ గోకిలోక్తుల సమా
హ్వానించి, పూఁదేనె న
ర్ఘ్యముఁ బాద్యంబు నొసంగి, నమ్రయయి పం
డ్లర్పించి సేవించి, ని
త్యము నియ్యాశ్రమలక్ష్మి పాంథులకు బ్ర
హ్మానందముఁ గూర్చెడిన్.
ఆనందమయ శైశవాహ్యాజదరహాస
రోచిర్విభూతి దూబూచి యాడి,
వ్రీడానతవధూటి ప్రియురూపులకుఁ దార్చు
క్రేఁజూపు మెఱపులఁ గ్రేళ్లు దాఁటి,
పొదరిండ్ల విహరించు పుణ్యదంపతుల లీ
లాలల దమృతాబ్ధి నోలలాడి,

విరహదైన్యోత్పన్న విభ్రమ భ్రమణ త
రంగ రంగములఁ దుఱంగలించి,

ఖండనోద్దండకాండప్రకాండకాండ
దండకోదండటంక్రియఁ దాండవించి,
పరమ పురుషార్థసిద్ధులఁ బ్రజ్వలించు
నల రసస్వరూపిణి వాణి నభినుతింతు.

ఇందలి గ్రామ్య భాషా గేయముల శైలిలో తూగు తక్కువగ నున్నది. ఈ రూపకమున గుణములు మెండు. ఇది ఆంధ్ర వాఙ్మయమున మంచిస్థాన మలంకరింప గలిగి యున్నది. కొం. జ.

భారతి 1929

## చాకిరేవు

కర్త: కొల్లూరు ధర్మారాయకవిగారు, బి.ఏ., ఆంధ్రగీర్వాణ సాహిత్య సమ్మేళనము, విజయనగరము. 'పూజాపుష్పములు-౨'. ఫెదరువేటు కాగితము; క్రౌను సైజు, ౬౦ పుటలు. వెల రు ౧-౦-౦.

తెలుగు భాషలో విమర్శనలవలెనే వ్యంగ్య రచనలు కూడా ఇటీవల వెలువడుతున్నవి. మన ప్రబంధాలలోను, శతకాలలోను వ్యంగ్య రచన మంచి నేర్పుతో నెలకొనడం మనకు కనబడుతున్నా, ప్రత్యేకం వ్యంగ్య కావ్యాలు ఒక వ్యవస్థతో వెలువడినవి అరుదు. పాశ్చాత్య వాఙ్మయ ప్రోద్బలం, పత్రికోద్యమ ప్రాబల్యం, సారస్వతాభివర్ధనం, వాఙ్మయ నిర్మాతల చాకచక్యం పెక్కిటితో పాటు వ్యంగ్య రచనకు ఒక స్వతంత్ర వ్యక్తిత్వమూ, శక్తీ ఇచ్చాయి. గద్యాభిరుచి వ్యాప్తికారణమై దీనికి మరింత జయము తెస్తూ ఉన్నది. విమర్శనలవలెనే ఇవీ దురాచారాలను, దురభ్యాసాలను తొలగించి సంఘానికి, సంస్థలకు మేలు చేయడానికి ప్రయత్నిస్తవి. అంతేకాక, స్వయంగా హాస్యరసభూయిష్ఠములై ఉండడం చేత పాఠకుల కామోదము కూర్చుతవి. ఇట్టి గ్రంథాలు మనకు మెండుగా లేకపోయినా, ఆధునిక యుగము పెక్కులు ప్రసవించే సూచనలు కనబరుస్తున్నది. ఆవశ్యకమై, వర్ధిల్ల దగినదై, ప్రకృతం ఆలంబనం తక్కువగా ఉన్న ఈ రచనా పద్ధతికి చెందుతుంది ఈ చాకిరేవు.

ఇది ఆధునిక వాఙ్మయ మాలిన్యాన్ని తొలగించే సంకల్పంతో వెలువడినది. భావకవిత్వం, గ్రామ్య భాష, కథానక రచనం, తత్ప్రచయితల పోకడలు మొదలైన విషయాలు ఈ కవి విమర్శనానికి విషయాలు. వీరి అధిక్షే

పణాలు చదువరికి ఇష్టమైనా, కాకపోయినా, పఠనాభిలాష అతనిలో నిలుపడానికి తగిన హాస్యరసోన్మేషం వీరి రచనలో కొంత ఉన్నది. అయితే ఆంగ్ల భాష అమితంగా వాడబడడం చేత రుచికి కొంత అవరోధం కలుగుతుంది. భాషా సంస్కర్త లీరీతిగా ఆంగ్ల పద బహుళమైన మాతృభాష వ్యవహరిస్తున్నారనే విషయం సమ్మతమైతే, సంఘ సంస్కారంలో జయధ్వజం ఎత్తి వాఙ్మయ ప్రపంచోద్ధరణానికి వేం చేసిన వీరి గిరీశం మొదలైన వారిలో ఈ విషయానికి వ్యంగ్య చిత్రణం ఉంది అని సమాధాన పఱుచుకోవచ్చు ననుకుంటే, అట్టిది అంత సమ్మతంగా కనబడదు. ఒక వేళ సమ్మత మన్నా, అంత చేటు భాషాంతర భూయిష్ఠంగా ఉంటే ప్రయోజన భంగం కలుగుతుంది. పోనీ, పాత్రలను వదలి కవిగారు స్వయంగా చెప్పే మాటలు చూస్తే, ఆంగ్ల భాష వాడుక ఎదురుగాలి పోస్తూంది చలాకీ ధోరణి దీనిలో కనబడుతుంది. కాని అందులో తెలుగు పాఠకునికి విందు పెట్టే రీతి నిది తగినంతగా లక్ష్యపెట్టలేదు. ఎవరైనా ఆంధ్రసభలో ఇంత ఇంగ్లీషు - తెలుగూ మాటాడితే అతడు ఇంపుగా మాటాడేవాడుగా పరిగణనం పొందడని చెప్పవచ్చు. అత్తుకొనే ఆంగ్ల పదాలతో పెక్కు తావులలో కవి హాస్యరసాన్ని చిందు వార్చక పోలేదు. ఈ స్వారస్యం అభంగంగా ఉంచడానికి కవి ప్రయత్నించక సాగి మార్గం తప్పాడు. చక్కని తెలుగు పదాలతో రక్తికట్టవలసిన కొన్ని తావులు ఆంగ్ల పదాలకు చోటిచ్చి తెలుగు మాటలతో రక్తిని కూడా కోల్పోయినవి. లేకుంటే ఇది ఇంకా మంచి రచన అయ్యేది. వ్యంగ్య రచనకు కవికిగల సహజమైన ఉపజ్ఞ ఈ రచనలో కనబడుతున్నది. అయితే కవి తన విమర్శనలు ఏ పాత్రనోటనో వివృతంగా చెప్పించేటంత తీవ్రతతోను, సహజతతోను అంతటా వ్యంగ్య చిత్రణం చేసి ధ్వనింపజేయ లేకున్నాడు.

'బ్రహ్మలోకంలో భాషాకాంగ్రెస్' అనే వ్యాసంలో నారదునికి కవి పూని ఉపన్యసించాడు. పాత్రలలో ప్రాణంపోసి వదలలేదు; బాహ్యంగా ఆవహించి, ముందు కవే కనబడుతున్నాడు, కళ అణగిపోతూఉంది. 'కవిత్వపు ట్యూషన్', 'ప్రాక్టికల్ కవిత్వం' అనే రెండువ్యాసాల—గిరీశంగారి రంగాల—లోను, గిరీశంగారి సహజధోరణి పూర్తిగా దీనిలోకి ప్రాకిందని చెప్పవీలు లేకపోయినా, నేర్పు కనబడుతున్నది. 'చంద్రుడు' అనేకథలో కవి మంచి అవకాశం కల్పించుకొని తన ఆశయాలు స్వయంగా వ్యక్తీకరించాడు.

'గ్రామ్యభాష'వీరికి ఇష్టం కానట్టు సువ్యక్తం. ముఖ్యంగా 'భాషాకాంగ్రెస్' వీరి సిద్ధాంతంకోసం రచించారు. అయితే వీరు 'గ్రామ్యం'లోనే ఈ గ్రంథం ఆమూలాగ్రంగా రచించడానికి తగిన హేతువులు, ఆభాషవిషయమై వారి అభిప్రాయం కొంత నారదులవారి ఈదిగువ ఉపన్యాసభాగాలు తెలియజేస్తవి:

"హాస్యరసోద్దీపకంగా వుండే కావ్యాలలో గ్రామ్యం రాయవయ్యా' అంటే ప్రతివాళ్లూ *serious subjects* కి కూడా అదే ఉపయోగిస్తున్నారు."

"గ్రామ్యం రాస్తే శాశ్వతత్వం వుండదు. అందరికీ సుబోధం కాదు. నేడు తెలిసినా కొన్నాళ్లకి తెలీదు. అయితే మాభూలోకపు *correspondent* ఈకాంగ్రెసు భోగట్టా అంతా గ్రామ్యంలో ప్రకటిస్తాడని నాకు తెలుసును. గుచ్చుకొన్నముల్లుని ముల్లుతోనే తియ్యాలిగదా. ఇంతకూ ఈ విషయం ప్రజలకి వెంటనే తెలీడ(వే ప్రధానంగాని, శాశ్వతంగా భాష కిది అవసరంలేదు."

ఇవి కవిగారి అభిప్రాయాలే అని చెప్పడానికి ఏమీ సంశయం లేదు. ఈ కాంగ్రెస్ రచనమే చెపుతుంది; గ్రామ్యసరస్వతి నుదుటిమీద బ్రహ్మవ్రాసిన వ్రాత బలపరుస్తుంది,—ఆంధ్రదేశంలో మాత్రమే కొద్ది కాలం ఆబిడ ఉండాలట,తర్వాత సమను పంపగా వచ్చెయ్యాలట బ్రహ్మలోకానికి.

'భావకవిత్వం'లో విఱ్ఱవీగజూచే వెఱ్ఱి మొఱ్ఱి పోకడలుగా తమకు తోచిన వానిని వీరు ఖండిస్తారు గాని కవితాశక్తిని నిరసింపరు. కథానకరచనాన్ని వీరి 'చాకిరేవు' అనుకూలంగా శుభ్రపరచడానికే చూచింది కాని చింపి ధ్వంసముచేయ డానికి చూడలేదు. అయితే ప్రధానసమస్యలజోలికి వీరు పోలేదు; పైమాలిన్యం తోనే వీరిపని—ఇది 'చాకిరేవు' మాత్రమే కనుక.

వాఙ్మయసమస్యలు వీరింకా బాగా పరిశోధించి పరిపక్వతకాయమయమైన రచనలకు పూనుకోదగుదురు. దీనిలో భావిరచనా సాఫల్యం మొలకలు కనబ డుతవి. తమఅర్హత గుర్తించి వీరు ముందు ముం దిట్టి వ్యంగ్యకావ్యాలు రచించి అల్పతరమూల్యంలో ఆంధ్రజనులకు అందజేసి వాఙ్మయసేవ చేయదగుదురు.

కొం. జ.

భారతి 1929 ఆగస్టు

## కథాగుచ్ఛము

కర్త: రవీంద్రనాథ ఠాకూర్. అనువాదకులు: శోభనాదేవి, వైకుంఠరావు గార్లు. విశ్వభారతి చెన్నపురి ఏజెన్సీ, ౩౨౩, తిరువత్తూరు హైరోడ్, చెన్నపురి.

కథానక రచనానికి ఆసక్తీ, అభినివేశం దేశంలో ఎక్కువగా ఉన్న ఈ సమయంలో టాగూరువంటి ఉత్తమ రచయితల రచనలకు అనువాదాలు వెలు వడడం స్వాభావికమే కాక అవశ్యకం కూడాను. 'రాసమణికొడుకు', 'కాబూలీ వాలా' 'బాయిఫో(టా', 'హైమంతి', 'ఎండానీడా' అనే ఐదుకథల గుచ్ఛం ఇది. మొదటికథలో రాసమణికొడుకుపేరు 'కాళీపద' అని రచయిత వాడినప్పటికీ, 'రాసమణికొడుకు'అని కథకు నామకరణం చెయ్యడంలో రచయిత ఔచిత్య

పరిశీలనం వ్యక్తం అవుతుంది. రాసమణి తీర్చిదిద్దిన ప్రకృతిగల ఆవ్యక్తి-రాసమణికి అపుత్రునిపైగల ప్రభావము ప్రధానముగా-కథకు సూత్రధారి. కథానిర్వహణం 'రాసమణికొడుకు'తో ఉంది-అతడు 'కాళీపద'అయినాసరే, కాకపోయినాసరే. ఈలాగు పేరుమొదలుకొనీ కథకుడు అతిసూక్ష్మ దృష్టితో కథలను తన అభీప్సితమార్గాలంబడి జెయిజారక నిల్కడతో నడిపిస్తాడు. కోమలమైన మనఃప్రవృత్తులను లేపి జీవనానికి పరిశుద్ధి కూర్చడం రచయిత పరమ ప్రయోజనంగా కనబడుతుంది. కథకు కావలసిన సంఘటనం కవి బాహ్యప్రపంచంలో కంటె అంతః ప్రపంచంలో వెదికి తీస్తాడు. బాహ్యాంతరాల సమ్మేళనం రచనలో సిభృతంచేస్తాడు. పాత్రలలోనూ, ఘటనలలోనూ సాదృశ్యవ్యత్యాసాలు సంతరించి కథాసూత్రానికి కాంతులు ఘటిస్తాడు.

భావన 'అతిసున్నితం'; రచన అతిలలితం. గంభీరములైన భావాలకు సమ్మోహనమైన చిత్రలేఖనం చేస్తాడు. కవి సామాన్యజీవనంలో ఇతివృత్తాలు కల్పించి జనసామాన్యానికి వాటి ప్రభావం నాటజేస్తాడు. 'ఎండానీడా'లో ప్రభుత్వపు అత్యాచారాలు గర్హ్యస్థితిలో చూపడం కూడా మనప్రత్యేక దేశంమీద అత్యాచారం చేసే బ్రిటిషువారి ప్రత్యేకగర్హ్యవర్తనం చూపడంతో ఆగక, అటువంటి సంబంధం ఎక్కడ ఉన్నాసరే, దానికి వర్తించే విశ్వప్రాముఖ్యం అవలంబిస్తూ ఉంది. 'కాబూలీవాలా' వాత్సల్యస్ఫురణం హృదయాన్ని అశ్రుపరవశం చేస్తుంది. ఇటువంటి అనుభవాలశక్తి వివృతంగా గోచరించే పట్టులు ప్రాధాన్యం వహించి ప్రతికథలోనూ తరుచుగా గోచరిస్తవి. విశ్వసహానుభూతి పోషించుకొనే సహజ మనోవిన్యాసం ఈ కవిరచనలో అంతటా ప్రసరించి ఉంటుంది. ఉత్తమానుభూతులు నేర్పుతుంది ఈ రచన. ధ్వని రచనా మార్దవానికి మాధుర్యంతెస్తూ ఉంది. కవి స్వయంగా నీతిబోధ పల్కడు, అది ధ్వనిస్తుంది. కథారచనలో ఉత్తమకళ చూడవలెనంటే టాగూరుకథలు చూడవచ్చును.

అనువాదం ఒప్పిదంగా ఉంది. వాక్యరచనలో కొన్ని క్రొత్తపోకడలు ఉన్నవి. అన్యభాషారచన కనువాదం కావడంచేత తెలుగులో కొంత అపరిచితమైన వాక్యనిర్మాణపద్ధతి దొర్లవచ్చును; కాని సాధ్యమైనంత తెలుగుతనమైనా శైలికి అలవబుచుకోడానికి అనువాదకులు తాత్పర్యం వహించవలసింది. వాడుక భాష వేడుకమీటి ఈ అనువాదం 'అగ్గినిప్పు' కూడా ప్రయోగించింది—"ఒంటిమీద చెయ్యి వేసి చూచాడు, ఒళ్లు అగ్గినిప్పు". (పుట ౭౨.)పదిమంది పెద్దమనుషులలో సమ్మతిగనే వాడుకభాష వాడదగినది. అనువాదకులు మూలలేఖకుని హృదయం గ్రహించి జాగరూకతతో ఏకార్థములుగా కనబడే పదాలలో కూడా సూక్ష్మభేదాలు

కనిపట్టి అనువదించవలసి ఉంది. అనువాదంలో జీవం ఉంది. సరళమై, కదనాను కూలమైన శైలితో ఒప్పుతూఉంది. కొం. జ.

భారతి 1929 ఆగస్టు

## ఆవేదన

గ్రంథకర్త : శ్రీ శివశంకరశాస్త్రి గారు, తల్లావఝ్ఝలవారు, గుంటూరు - తెనాలి. క్రౌను ౩౨ సైజు, ౭౧ పుటలు. వెల ౮ అ.

ఇది కొన్ని కావ్య 'ఖండిక'ల చిన్న సంపుటము.

అన్ని కావ్యాలూ ప్రణయమువంటి ఏదో ఒక్క ప్రవృత్తికి చెందినవి కాక భిన్న ప్రకృతికముగా ఉన్నవి. ప్రతికావ్యములోనూ ఒక ఆవేదన కనబడుతుందనే చెప్పవచ్చు. వివిధ విషయాలంబనములైన 'ఆవేదన'ల కూర్పు ఇది.

---

ప్రశ్న : కొంపెల్ల జనార్దనరావును గూర్చి మీరు గొప్ప ఎలిజీ రాశారుగదా. అంతగా కదలించేటటువంటి ప్రభావయుతమైన ఎలిజీరాయటానికి ఆయన మిమ్మల్ని యే విషయంలో అంతగా *Influence* చేశాడు?

జవాబు: జనార్దనరావు *Influence* నామీద ఏమీలేదు. ఆరోజుల్లో ఆయనభావాలు చాలా *conservative* గా ఉండేవి. అప్పుడు మా యిద్దరి మీద కూడా విశ్వనాథ సత్యనారాయణ ప్రభావం బాగా వుంది. నేను సరిగ్గా ఆ రోజుల్లోనే అనుకరణ కాకుండా సొంత గొంతుకోసం వెతుక్కుంటున్నాను.

శ్రీశ్రీ తో ఇంటర్వ్యూ. 14. సృజన ఫిబ్రవరి 1970

ప్రశ్న: శిష్ట్లా ఉమామహేశ్వరరావు గారు మిమ్మల్ని *Influence* చేసినట్లుగా విన్నాను. ఎంతవరకు? నిజమా? వచన కవితకు మీరు ముందా? ఆయనా?

-జ్వాలాముఖి

జవాబు: నామీద గురజాడ *Influence* ఉంది. చింతాదీక్షితులు, బసవరాజు వీళ్ళు నన్ను గురజాడ దగ్గరకు చేర్చారు. ముద్దుకృష్ణ, నేనూ అదే దార్లో వెళ్తుండే వాళ్ళం. శిష్ట్లాని చూచినప్పుడు - *I was really inspired,* నాకంటె ముందు శిష్ట్లాయే *start* చేశాడు - ఇద్దరమూ వక్కదారంట వచ్చిన వాళ్ళమే.

నారాయణబాబు చాలా తర్వాత వాడు. ముద్దుకృష్ణ చాలా మంచి వచన గీతాలు రాశాడు.

కొంపెల్ల జనార్దనరావుని పిరమిడ్లు.

"కవివయసుఎప్పుడూ".... 14. సృజన ఫిబ్రవరి 70

ఈ కావ్యాలలో కొన్ని సశీర్షికములూ, కొన్ని విశీర్షికములూను. 'స్వవిష యములో' చెప్పినట్లు, "పద్యాలలో కొన్ని ద్విపాత్తులూ, కొన్ని త్రిపాత్తులూను", చతుష్పాత్తులే కాక, వీరి నూతన ప్రియత్వమూ, సంస్కరణాభిలాషా అందముగా వసంతతిలక మొదలైన కొన్ని సంస్కృతవృత్తాలను తెలుగులో ప్రతిష్ఠించినవి. క్రొత్తవృత్తాలలోను, గేయకల్పచ్ఛందస్సులోను వీరి మృదువాణి పెక్కు తావుల అలంకృతమైనది. 'స్వవిషయము'లో కవిగారే తెల్పినట్టు, "రచనలో సాహసము" ఒక విధమైనది కనబడుతుంది. తమగ్రంథము తామే విమర్శిస్తూ, పైవారివలె, (కవిమీద) "కొంత వాత్సల్యము, కొంత అభిమానము, కొంత సహనమూ ఉండడ ముచేత మందహాసముచేసి సహృదయులకు అంజలి ఘటిస్తున్నాను." అని (అర్థలో పము సహృదయులు పూరించుకొందురు) ముగించేఽరు,—'శివశంకరశాస్త్రి' గారే. తమ కావ్యము కొలదులు తామే ఉగ్గడించుకోడమూ నూతనత్వమే. (అయితే గ్రంథము పట్ల యథార్థవిమర్శ వాక్యాల స్వార్థమే ప్రధానము, అవి యెవరుచెప్పిన వైనాను.) ఇట్టి నూతనత్వమే వీరి సాహసము. గ్రంథములో "నవీన కల్పనలు ఏపాటి అంటే" తిరిగి, 'స్వవిషయము'లో చెప్పినట్టు, "కొద్దిపాటి". ఆ "పాటి" నిరూపించడానికి పాఠకుడు ప్రయత్నిస్తే, "పుష్కరమై కవితా సామగ్రిలో చేరిన కాఫీ" కవి (కావ్యరచనలో) ఉపయోగించడము: కనబడుతుంది. ఇట్టివి విడిస్తే, భావసామగ్రిలో గొప్ప నూతనత్వమూ, సాహసమూ కవిగారి ప్రతిభకు అత్తలేదు. ప్రతనత్వములో కవి అభిమానమూ, ప్రయత్నమూ కేంద్రీకృతములు కావు.

కవితలో కదిపి కుదిపే ఆవేదన లేదు. 'స్వప్న సంధాయి అయిన విలా సమూ లేదు. అనుభవశుద్ధి ఉన్నది; కాని భావనలో లోతు, విస్తృతి లేవు. రచనలో సౌకుమార్యము, మాధుర్యము, ప్రసాదము ఉన్నవి; ఓజస్సు, కాంతి తక్కువ. జవమూ, ప్రాభవమూ లేక అలసమై, సౌమ్యముగా ఉన్నది. శిల్పనైపుణి భావనలో వలెనే రచనలోనూ కవిప్రయత్నానికి పాత్రము కాలేదు. కవిగారు తమ అనుభవ మును నిర్మలభావరంగములో స్ఫురింపజేస్తారు; దాని నిగ్గు చూపి పరిప్లుతి కలిగింప లేరు. ఒక అవస్థ, శైలి అవలంబిస్తారు: ఆ అనుభూతిని రసతన్మయతతో, ఉల్బణ భావసామగ్రితో ప్రపంచించి, కరిగి కరిగింపజాలరు. వీరికి భావదర్శనము అల్పము, తత్ప్రదర్శనము అల్పతరము. ఈ కవి ద్రష్ట కాడు.

దీనిలో కొన్ని కావ్యాలలో తఱుచు శతకవాఙ్మయము పోకడలు నిర్వి శేషముగాను, ఈషద్విశిష్టముగాను గోచరిస్తవి.

"........రాధానాథపాదద్వయీ
స్ఫురదుద్దీప్తికి తుల్యమై భవము నె
ట్లో గాననై తింగదా;"

"నీ సుధామధుర నామకీర్తనము
నిరతము సలిపెడివారల్
ఆర్తిహరా, దుఃఖార్ణవ పారగు
లౌ టబ్బురమే దేవా!"-

ఈశ్వరభక్తి ఉత్కృష్టమని పెక్కురితోపాటు వారూ అనుభవముతో తెలిపెరు, - ఛందోబద్ధముగా.

ఎన్నో పద్యాలున్న కావ్యములోను ఒకటి రెండు పద్యాలు మాత్రమే కవి ప్రధాన భావానుభవమును తెలియజేసేవి. తక్కినదంతా ఆ అనుభవము ఏ పరిస్థితులలో కలిగినదీ అనావశ్యక విశేషాలతో తెలిపే కథాకథనము. కలిగిన అనుభవమైనా సామాన్యము : ఉన్నతానుభూతులు లేవు. ఆ ఒకానొక అనుభూతికి ఒకజీవి అగ్గమౌతున్నాడనే మనకు తెలిసేది : ఒకకవి అది అనుభవిస్తున్నాడని కాదు.

"నేను రమ్యమైన మార్గాన వెళ్లుతూ కొందఱు వ్యాధబాలకులు ఒక ఉడుతను మట్టు పెట్టి ఉల్లసిల్లడము చూచేఁను. తర్వాత వెళ్లుతుంటే,—

పోవంజొచ్చితి సాగి, కూసె విహగం
బుల్ శ్రావ్యనాదంబులం
బూవుల్ రాలెను, గాలి వీచె, నయినం
బోయెన్ ముదం బంతయున్."

అని ఒక కావ్యార్థము. నాటి ప్రభాతవేళ తాను "సుధాసమానమగు కాఫీ గ్రోలి.... షి కార్ పోవన్" లేవడము మొదలు కావ్యము ఎనిమిది పద్యాలలోనూ కవి నిరూపించిన ప్రధానార్థము ఏమీ ప్రౌఢముకాదు. కావ్యత్వమూ, రసమూ తక్కువ అని కవిగారు సమంజసముగా స్వీకరించేఁరు - అయినా ఇవి ప్రకటించేఁరు కాని. వీరు సూక్ష్మార్థపరులు - సూచనామాత్రమే వీరికి ఇష్టము - అంటే, అటువంటి ఆశయానికి అంత పరిసర వర్ణనము అసమన్వితమౌతుంది. పదగుంఫన తక్కువ; ప్రయోగసార్థకత ఒక్కొక్కచోట సందేహాస్పదము. కథనకవిత, భావకవిత తఱుచు అవిదగ్ధముగా కలిసి ఉంటవి దీనిలో. కవి మన స్తత్వము ద్వారము చేరుతాడు: ప్రదక్షిణము చెయ్యగలడు; కాని ప్రవేశించి, వెలుగు పెట్టుకొని పరిశీలించలేడు. అథవా, నిరూపించ లేడు. కళాలోకానికి ఈ రచన వల్ల ప్రబోధము, సందేశము మృగ్యములు. రమ్యమనదగు శైలిలో నిర్మల సులభములైన భావాలు పొందించినపద్యకావ్యాలు దీనిలో ఉన్నవి. అయితే, భావ ఖనులుతవ్వి, కళా విలాసములో కరిగించి కూర్చే సారస్వత నిర్మాణాలకు ఉత్సుకపడే అభిరుచికి ఇది తనివి తీర్పదు.

"అధ్వానముగా జేరితిన్"-(పుట ౩౮.) "అధ్వాన" మంటే "అమార్గ" మని నిఘంటు. అమార్గానికి ఇక్కడ ప్రయోజనములేదు. మార్గము అనే కవి ఆశయము. వెనుక వెనుక త్రోవ, మార్గము అని ఆ అర్థములోనే కవి ప్రయోగించి ఉన్నాడు. వేఱొకచోట పక్ష్మార్థమందు పక్ష్మలము ప్రయోగించి ఉన్నాడు. (పుట. ౩౦.)

శబ్దసౌష్ఠవము పాటిస్తారు వీరు. మంచిధార వీరి కవితకు ఒక లక్షణము. తమ పరిమితప్రతిభను వీరు మనశ్శుద్ధిగా, వడిదుడుకులేక, వినియోగపఱిచి, కావ్యాలకి ఒకశ్రుతి, ఒక సమ్మేళనము సంఘటిస్తారు. ఇంత సాహసమూ, నూతనత్వమూ, రచనాగుణములూ ఉండీ, ఈ 'ఆవేదన' సారస్వతముపట్ల ఉత్తేజనము కాని, - చెప్పనే అక్కఱలేదు, - ప్రోద్బలముకాని చలాయించుకోలేదు.

కొం. జ.

భారతి 1929 సెప్టెంబరు.

## ముత్యాల సరములు - చిన్నకథలు

గ్రంథకర్త (కీ.శే.) గురజాడ వెంకటఅప్పారావుగారు, బి.ఏ., ఎఫ్., ఎమ్ యు; ప్రకాశకులు: గురజాడ వెంకట రామదాసుగారు, విజయనగరము క్రౌను ౧౬ సైజు. ౧౦౦ పుటలు. వెల తెలియదు.

చాలకాలము క్రిందటే ప్రకటితములైన ఈ సంపుటములోని కొన్ని ఖండకావ్యాలద్వారా శ్రీ అప్పారావు పంతులుగారు తమ సంస్కార ప్రియతకు ఒకవంక కొంత గౌరవాదరాలను, వేరొకవంక కొంతనిరసనను సంపాదించుకొన్నారు. నేటి తెలుగు వాఙ్మయపు క్రొత్తపోకడలకు బీజాలు, సూచనలు వీరికవిత భరించి ఉన్నది. నేటి సారస్వత పరివర్తనానికి వీరి ఆకాంక్ష వీరి కవితలో విస్ఫుటము.

యాదృచ్ఛికమైన స్వప్నోల్లేఖనముచేత గాక, ఆవేశ విస్ఫోటనముచేతగాక, బుద్ధిపూర్వకముగా విప్లవము, పరివర్తనము అవలంబిస్తుంది వీరి సారస్వత రచనోద్యమము. కనుకనే కాబోలు, ఈకావ్యాలలో తేజము, సారము అపూర్ణములు.

శక్తిచేతగాని, పరిమాణముచేతగాని ఈ కావ్యమాల - అన్నికావ్యాలూ తొలుతనే ప్రకటింపబడి ఉన్నా - ఆధునిక వాఙ్మయానికి అధినాయకత్వము వహింపలేదు. అయితే ప్రకటితములైన 'లవణరాజుకల' మొదలైన కావ్యాలు తమ ప్రోద్బలముచేత ఒక నూతనమైన అభిరుచి వాఙ్మయములో రేకెత్తింపక పోలేదు. నూత్న కవితకు పథ ప్రదర్శనమే చేసినవి. వీరి తేజస్వి అయిన ప్రతిభ 'ముత్యాలసరము' అనే క్రొత్త ఛందస్సు ప్రవర్తింపజేసి శాశ్వతఖ్యాతి గడించుకొన్నది. ఈ ఛందస్సు వీరు నేర్పుతో - ముఖ్యముగా కథనకావ్యాలకు - వినియోగించి దీని అందమునూ, ఆనుకూల్యమునూ ప్రదర్శించినారు. తరువాతి

యువకవులచేత పొలుపులు దీజిన ఈ 'ముత్యాలసరము' తొలుత వీరిచే మాత్రము నియమాగత సౌందర్యము కొంత కొరవడినమాట నిజము. అయితే చిరకాలము నుండి వాఙ్మయములో అవలంబనము పొంది ఉన్న ఉత్కటనియమాల నిరంకుశతకు ఎదురొడ్డి నిలిచి వీరు తమనుడికి ఒక విచ్చలవిడి అయిన, సున్నితమైన ఛందస్సు లలితసంగీతముతో వెలయించుకోవలెనని పూనిన సంకల్పమే ఈయనియతికి బాధ్యము కావలెను. ఇంక, 'సాటివా రోదార్చె' వంటి వాక్య దోషాలుకూడా రచయిత లక్ష్యపెట్టలేదు. శైలిలో అసంస్కృతి వీరి సంస్కారలాలసకు ఒప్పినది- జాతీయత తీపి విలసిల్లి నంతవఱకు - ఉత్సుకతలో కొంత అతిక్రమించికూడా. ఈ ఉల్లంఘనానికి అతిగా ప్రేరేచిన ఒక స్వాతంత్ర్యము వీరికి సహజమై, పులకరించే కవితాలోకన పటిమలోని కొరతల నాక్రమించి, ఇంచుమించు ఏకావ్యానికి సమగ్రత కూర్చుకొనేనిష్ఠ కుదరనీయలేదు కాబోలు.

అయినా, 'లవణరాజుకల', 'కన్యక', 'డామన్ పితియస్' మొదలైన కథన కావ్యాలలో స్వల్పమైన భాషానియమాలచేత సహజ మధురమైన వీరి శైలి మధురతరమయినది తరుచు. దీనికితోడు, వాడుకభాష అన్నందులకు, చక్కని నుడికారము, జాతీయత, స్వాభావికత ఒప్పిఉన్నవి. సంభాషణ భాగాలలో నాటకౌచిత్య సౌందర్యాలు తులకిస్తవి. వాదముపట్టు సహజముగా, సమ్మతముగా విలసిల్లుతుంది. కథనములో జీవము పొంగుతూ ఉంటుంది. 'పూర్ణమ్మ' అనే ఆడపిల్లల పాట మన మధురకవితల పోకడలలో తీపులుచిలికి, సందర్భమెఱిగిన నుడితో, కన్నెవలె పవిత్రమైన జాలికథతో పాఠకుల సానుభూతిని చూఱకొంటున్నది

క్రొత్తభావాలతో సుకుమారముగా సత్యసౌందర్య నిరూపణచేసే భాగాలు రచయిత కళారహస్య సౌందర్యానుభవము వెల్లడిస్తూ ఉన్నవి.

వీరి భావకవితలో రాజభక్తి, దేశభక్తి, సంఘసంస్కరణము మొదలైన విషయాలు తావుకొన్నవి. జీవిత పరామర్శము కొంత నిర్వేదములో మెలగినది. ఇట్టి విషయాల కవితలలో ఆంతరిక స్వరూపము ఉన్నా, ఆంతరికశక్తి అంతగా కనపడదు. అయినా కొన్ని పోకడలు తీవిగా ఉన్నవి, కథన కవితలో తమ ఆశయాలను నాటజేసే నేర్పు వీరికి ఎక్కువ.

గద్యకథానకములలోనూ వీరి ఈచాతుర్యము విస్ఫుటము. కథానకవ్యవస్థను ఉత్తమరీతిని తృప్తిపఱచగల వీరి చిన్నకథలు ఈవాఙ్మయానికి వీరిని తొలుతటి రచయితగా నిర్ధరింపగలిగి ఉన్నవి ఈసంపుటము సకాలములో ప్రకటితము కాకపోవడము ఈ ప్రాముఖ్యము కొంత తగ్గించినది. ఈ సంపుటములోని రెండు చిన్నకథలలో 'మీపేరేమిటి?' అనేది వాఙ్మయానికి ఒక భూష....

'దేవుడు చేసిన మనుషుల్లారా
మనుషులు చేసిన దేవుళ్ళారా!
మీపేరేమిటి?'

ఈఆరంభములో కథాతాత్పర్యము చక్కగా సూచితమైనది. ఏతదాది తుదివఱకు కథనము ప్రశంసనీయముగా ఉన్నది. ప్రధాన కథాభాగము ఉపోద్ఘాత ప్రాయముగా ఏర్పడిన కథాభాగములో ఒకపాత్రనోట విచ్చుతుంది. ఈ రెండింటికి సమంజసమైన సంగ్రథనము నేర్పుతో కూర్పబడినది. అంతటా హాస్యము కళామయమై విరిసిఉన్నది. ఉత్తమ వ్యంగ్యము స్వాభావికత కుంటువడక రచయిత ఆశయాలను సమ్మతముగా, చమత్కారముగా ప్రదర్శిస్తూ ఉన్నది. గద్యరచనలో, ముఖ్యముగా హాస్యవ్యంగ్యరచనలో, వీరు సిద్ధహస్తులు.

వీరి వాఙ్మయము లోకముతో తన సంబంధము ఏమరక తనవిధి నిర్వర్తించడానికి ఉద్యతమై ఉంటుంది. లోకవృత్తము తనలో ఆవరించుకొని, దాని యెడ తనకర్తవ్యము నెఱవేర్చుతుంది. 'లవణరాజుకల' వీరి సాంఘికాశయాలకూ, కవిత్వాశయాలకూ నిదర్శకమై ఉంటూ, కవితాశక్తినికూడా ధరించి, వాఙ్మయానికి వీరి కవితాజీవిత ప్రయోజనము ఒకవిధముగా సంగ్రహించి అర్పిస్తూ ఉన్నది.

స్వతంత్రముగా క్రొత్తమార్గము త్రొక్కి వీరు ఆర్జించిన జయము అనల్పము. నేటి ప్రౌఢ్బలములలో ఈ ప్రతిభ ప్రవృత్తమయితే ఆ జయాపహత పరిమాణము పరిణామము ఇంకా గొప్పగా ఉండేవి. అయితే ఈ ప్రౌఢ్బలాలకు ప్రౌఢ్బలమే వీరి వాఙ్మయము.

వీరి నవ్యప్రతిభ కొలది వాఙ్మయముతోనే తన ప్రవృత్తి చాలించుకోడము శోచనీయమే. వీరి పత్రికా వ్యాసములు, ఇతర రచనా శకలములు ప్రకాశకులు కూర్చి త్వరలో ప్రకటింపనున్నారట.

దీని సంపాదకీయ నిర్వహణము అంత తృప్తికరముగా లేదు.

కొం.జ.

భారతి 1929 డిశంబరు.

# కృష్ణశాస్త్రిగారి 'ప్రవాసము; ఊర్వశి'

కొంపెల్ల జనార్దనరావుగారు

'కామార్తాహి ప్రకృతికృపణాశ్చేత నా చేత నేషు' - మేఘదూత.

'ఇది చేతనమనీ ఇది అచేతనమనీ కూడా తెలియని స్వభావదీనులు గదా కామార్తులు.' ఈమాట చెపితే కాని తోచింది కాదు కాళిదాస మహాకవికి - ఈ తత్త్వ దర్శితలో అంచులు దిద్దుకొంటే కాని తన సృష్టి అందము నిండలేదు. తన నాయకత క్రిందనే కావ్యము వెలయించుకోవలసి వస్తే యేలాగు చెపుతాడో. ఇప్పుడు నాయకత యక్షునిది, భావకత కవిది. అప్పుడు రెండూ కవివే. అప్పుడు ఈ యక్షునిలో మునిగిపోడు కవి; యక్షుని విడిచిపోడు: యక్షుడే కవి అయిపోతాడు; తన స్రష్టలో అంచులకు విస్తరిల్లి లీనమైపోతాడు. అతడపుడు కామార్తుడే కాడు; "కామార్తులు చేతనాచేతనముల ప్రకృతికృపణులు కదా!" అని చదువుకున్న కవి కూడా కాకపోడు. ఒక నాయకునిలో కవి పోసిన ఊర్పు కాక కవి ఊర్పు స్వయముగా వెలువడుతుంది కావ్య స్వరాలలో. "నాయకునిలో తానే కదా పాడుకున్నాడు - కవి ఆతడే" అంటే ఒప్పుకోడు కవి. 'యక్షుడు,'- 'రాముడు' — అని గీతలు గీసివేసినాడు నాయకునికి. అవి తాను కాదు. తనగీతలు వేఱు: తాను 'కవి.' తాను నాయకుడు కావలసి వచ్చినా "కవి" కానట్టి నాయకుడు కాడు. 'రాముడు ధీరో దాత్తుడేకా! ధీరోదాత్తు డుత్తమ నాయకుడేకా' అనరాదు; కవి ధీరోదాత్తుడేకాడు, అతడు, అవిరోధముగా, సర్వ నాయకుడున్ను; తదతీతుడున్ను. కాకపోతే "నానృషిః కురుతే కావ్యమ్' (ఋషి కానివాడు కావ్యము వ్రాయడు) అన్న సత్యము తప్పకుండా "కావ్యము" ఏలాగు వ్రాసినాడు? రాముడు కవిచేతిలో ఒక యెడ కవి యంతటివాడు కావచ్చు; కవి అతనిలో ముక్తముగా మాటాడుకోవచ్చు. కాని కవే నాయకుడైనప్పుడు మనము "రాముని" గీసుకొని 'కవి' అని పిలుచుకోలేము. రాముని ఉద్వేగము చూచి మనము చివరకు రసమే, ఆనందమే, అనుభవిస్తున్నాము - రాముని మొగాన ఏడుపే. రాముడు ప్రవర్తిస్తున్నాడు: కవి పాడుకుంటున్నాడు. రాముని చూస్తున్నాము: కవిని వింటున్నాము. రామునిలోనూ కవినే విన్నాము, కాని అపుడు రాముని చూస్తున్నాము. ఇప్పుడు కవినే చూస్తున్నాము, కవినే వింటున్నాము. రాముని నిరూపించేటప్పుడు

ఏలాగో తన్ను నిరూపించుకునేటప్పుడూ అలాగే, కవి రసాత్మకుడు: తాను ఆనందిస్తూ మనలను ఆనందింపజేస్తాడు. కవే నాయకుడైతే పండుగే: కవి ఋషియట; ఆతని ఆత్మోన్నతి మనకు వివృతమవుతూంది మఱి. భావకవి అంటే లోకానికి ఎంత ఆశో! ఆ ఆశ యెంత న్యాయ్యమైనదో!

కవే నాయకుడు. కావ్యాలు "ప్రవాసము; ఊర్వశి." ఒక్క సంపుటములో రెండు కావ్యాలు. ఇవి ఒక్క అనుభవషడ్జమున వెలసినవే కూడా. అవస్థా భేదము తిరిగినా, రెంటనూ ప్రసృతమై ఉన్న మూల ప్రవృత్తి సూత్రము ఒక్కటే. 'ప్రవాసము' అడిచినముద్రలలో ఊర్వశి ప్రవహించగలిగింది కూడా. ఒక్క 'జీవిత రహస్య మార్గమ్ములలో' మనస్సును తన కగ్గము చేసికొన్న భాగ్యము వాని హృదయము.

"ఈ నిశావసానమ్మున ఏశుభాని
లమ్ము నిట్టూర్చెనో........"
"ఇది విభాతమహోత్సవమ్మె మొ!"

అని "ప్రవాస" నిశావసానమున, అట "ఊర్వశీ" విభాత మహోత్సవము పాటించుకున్నాడు కవి. "అయగమ్య తమస్వినీ గర్భకుహరాల వెడలిపోయిన ప్రేయసి" 'వేదనా సుఖమ్మే' అయి, ఊర్వశిలో "అపూర్వ కరుణార్ద్ర నీరవ మూర్తి"గా వచ్చి పలకరించింది, "ఇది." ఉపాసితమైన ప్రేయసీత్వము కవి ప్రేయస్త్వములో అనుభవపు టనుస్యూతి నెఱపుతూ ఉంది. "మూడు లోకాల సుఖ మొక్క ముడి నిమిడ్చి విసర" జూచే భావోల్బణమైన సుఖోపాసనలో అంత వఱకు విలపించి వచ్చిన 'అమవస కన్నీటి పాటలు భిన్న పరత్వము మాసిపోతుంది. ఇంత కలిసి కట్టైనవి యీ రెండు కావ్యాలూను అసలివి రెండు కావ్యాలు అనే కంటె, రెండు కావ్యావళు లంటే ఎక్కువ నిజం. "సఖి" పత్రికలో ప్రకటించిన "కావ్యావళి," పెక్కు పేరులు గల కావ్యాల దండ, ఇట ఈ రెండు కుదుళ్ళకూ సాయపడింది: రెండు రకాల అంచులలో కవి భాగించుకుని ఔచిత్యములో ప్రయోజనము అర్థించాడు.

ఆ కావ్యములలో చాలా భాగము కృష్ణపక్షపు ముద్రను సంతరించుకొన్నవి కావడము చేత ఆ గ్రంథానికి "కృష్ణపక్షము" అని పేరు పెట్టి, అక్కడ ఐక్యము సమర్థించడానికి కవి ఉద్దేశించనప్పుడు, "ప్రవాసము; ఊర్వశి" అని జాబితాయే గ్రంథ నామముగా ఇచ్చిన యిక్కడ, ఒక్క సంపుట మనే బుద్ధి చేత, కలిసి కట్టు తనము సాధించుకోవడము ఎందుకు - అని సంకోచము తొంగి చూడనే వచ్చు. కాని యీ ఐక్యము మనము సాధించుకోబోయినది కాదు.

ఆదే మనకు సోకుతుంది. ఆది యిక్కడ గణించుకోవశములో ఒక అర్థసంధి ప్రయోజనము తారసిల్లుతుంది.

సాధారణముగా కవి ఆత్మకు తెలియడానికి ఒక కావ్యము కాదు, కవినే (అతని కావ్యాలన్నీ) చదువమన్నారు. కవి పూర్తిఅయేపటకూ అతడు తెలియడని కాదు, వివిధ కావ్యాలలో ప్రసరించిన మనోవృత్తి మాత్రము, సందేశ ప్రతి పరముగా, వివృత మవుతుందని. మనకీ రెండు కావ్యాలు కలిసివచ్చినవి. "కృష్ణ పక్షము" నుంచి యిది, కేంద్రముకు సంబంధించినంత వఱకు, భిన్న గతి త్రొక్కదు కృష్ణ పక్షములో కవి ఇంకా కొన్ని వస్తువుల కేసి చూచాడు: ఇక్కడ ప్రేయసి కేసి మాత్రమే చూస్తున్నాడు. కాని ఆ చూడడములో - దర్శన పక్కిలో - మూలగతమైన మార్పు లేదు; - అప్పటి జీవితానుభవపు యౌవనోదయము మాత్రము ఇప్పుడు కొంత చిక్కబడింది; నాటి కోవెల కొలము తనము నేడు హేమంత శృంఖలోచితమైన క్రొత్త యెలుగులకు తావలమయింది! ఈ ఐక్యవిధి, ఈ కావ్యాల ఆనుషంగిక పరిశీలనములో ఫలించినట్టిది, ఇది సంధులు విడగొట్టి నేటిలో ముంచి వదలివేస్తే, తేలే ప్రతిశకలములోనూ కానవస్తుంది.

ఈ గ్రంథమంతా ఒక్కటే భావమన్నాడట ఒక మహాకవి. దాని ప్రకారము ఇందు మానసిక పరిశ్రమణము తక్కువ అన్న మాట. ఒక్క భావమే అయితే, ఇంత విస్తరించి నిరూపించడానికి ఎంతటి భావన, ఎంతటి నేర్పు కావలెనో!

ఈ విమర్శమువద్ద మనము నిలిచి పరికిస్తే, తన ప్రవృత్తివాటికలో ఒక్కచో ఆబద్ధుడై చుట్టూ అనుభూతి పూచుకున్నట్టు, కవి మనచుట్టూ వికసిస్తాడు.

'మత్పు రానేక పుణ్యజన్మములు పండి
జాహ్నవీస్వచ్ఛవును సుధాస్వాదుమూర్తి
వైన నీదివ్యసాన్నిధ్య మంటుకొంటి
పుడమికిన్ స్వర్గమున కొక్కముడి రచించి'

అన్న ప్రణయోపాసకుడే, నాయని సుబ్బారావుగారు పిలిచే ప్రతి పిలుపుకీ విశ్వము తన ప్రేయసిని అనుభవించ గలిగితే,

"ఊర్వశీ, ప్రేయసీ. నేడొ యుష్మదీయ
చరణ కరుణామధుకణమ్మొ దొరకునేమొ,
మూడులోకాల సుఖ మొక్కముడి నిమిడ్చి
విసర లేనొ కాలాంతమే వెనుక ప్రాక"

అన్న ప్రణయ - సుఖోపాసకుడు కృష్ణశాస్త్రి పిలిచే ప్రతి పిలుపుకీ (ప్రతి మాటలోనూ పిలుపు సురక్షితమే) విశ్వము కొంత పెఱచూపు చూస్తుంది.

రాజ - ఋషిని వరింపవచ్చిన రాజ్య లక్ష్మి ఈతని చూచి మరలిపోతే, రాజ- భోగిని వరింపగల ఒక రాజ్యలక్ష్మిని ఈ కవి తాను చేపట్ట జూస్తాడు. తన జీవితానుభవ మెంత ఆసక్తితో స్వీకరించాడో అంత ఆసక్తితో, అంత తత్పరతతో దానిని చిత్రించుకొని దాని కంకితము చేసుకొన్నాడు ("అంకితము -ఊర్వశికే'' కా)!

'ఈ యలంకార ప్రియను ప్రకృతిని వలతొ
ఆ నిరంజనతత్త్వము న్నాశ్రయింతొ!
.... .... ....
ఏది కవిత కుపాస్య మోయీ సఖుండ !
ఏది మదికి విచార్య మోయీ సఖుండ !'

అన్న రాయప్రోలు సుబ్బారావుగారి విచికిత్స యీ కవిని బాధించదు. కారణము, ఆయనకు

'కవిత భోగపథాన కాకర్ష పెట్టు,
మనసు భోగపరిత్యాగమునకు లాగు' ;

ఈయన కీరాయిడి లేదు. మనసు భోగపరిత్యాగమునకు లాగదు. టాగూరు మహాకవికీ లేదు. అతనికి కవిత భోగపథాన కాకర్ష పెట్టదు. అతడు భోగమునకు వాలే ప్రకృతినీ, తత్పరిత్యాగమునకు తోలే సంస్కృతినీ కలియగట్టే రహస్య దర్శనపథాలు ప్రయోగించుకొన్నాడు, జీవితములోను, దాని సత్త్వమును పాడే కవితలోనూను. ఈ కవి 'జీవితరహస్యమార్గమ్ములు' వేఱే.

తాను కను విప్పినదే ఆ ఒక వాటికలో నన్నట్లు, ఆవాసనల కగ్గమై అదే లోకముగా కీర్తించుకున్న మనస్సు,

'ఈమిడిసిపాటు సిగ్గుమోల నేల, తేనె
తేటచినుకేని లేని యీపాట కిపుడు ?
ఇంతచివు రిచ్చి యంత హేమంతశృంఖ
లాల బంధింతు మూగతనాలగొంతు !

స్వామి ! నూత్న వసంత జీవప్రవాళ
పల్లవమ్ములరుచులె నా బ్రతుకుజీర
గోసి తీయదనమ్ములు వోసినపుడె
వెడలిపడలేద ! యొక యడు గిడగలేద,

మూడులోకాల బరువులమోత నడిగి
యడగి చిడికెనుగద అంధజడము తాను!
ఓయి గాయక సార్వభౌమా! యివేటి
తగని త్రుళ్ళింత వెలితినృత్యమ్ము లోయి!'

అని దృష్టి పైకి త్రిప్పి తనసమృద్ధబాష్పకణాలకు హృదయద్రవణముతో భక్తిరంగు కిరణించింది. ఈమనస్థితితో కాదు కవి 'ప్రేయసి' యెడ అనుభవాన్ని లాలించు కున్నది. 'ఊర్వశీ! ప్రేయసీ! నేఁడొ యుష్మదీయ -' అన్న పద్యము ఈ అవస్థలో ముంచితే, 'మత్సరానేక పుణ్యజన్మములు పండి' అన్న (నాయనివారి) పద్యమువంటిదిగా పరివర్తిత మౌతుందేమో! అది ఆత్రుళ్ళింతనృత్యాలలోనిది. ఇపుడవి తటస్థ దృష్టికి పరామర్శభాజనములవుతున్నాయి. ఈ సంగాసంగముల బిగువులో చూచుకోవలసిన ఈ కవిలక్షణ పరిష్కారమును సంగములోనే బిగించుకొన్న వారు, ఇట్టి పెలపోకడలు చూచి, కవికి అనుభవ శుద్ధి కాని, చిత్తశుద్ధి కాని లేదంటారు. సంగముఘోష అంత యెక్కువై ఆబిగువు, నిజానికి, పరిణతము కానీయలేదు.

'ఆటతో పాటతో నేర్చినట్లు దేవ
ఏనుకూడ నీవలె నటియింపనిమ్ము,
ఎడతెగనియాత్ర నెట్లొ సాగించువరకు!
ఎట్లొ నీదర్శనమ్ము సాధించువరకు!'

అని కవి చెప్పుకున్న పలుకులవలన, - అతడూ 'యాత్రికు'డే! కాని అతడు తనయాత్ర సంధియైన 'సౌందర్యరసైకజీవి'త్వమును ఒక 'బరువులమోత నడగి యడగి' నిరూపించుకోవడముచేత యాత్రాపరత్వము మాటువడుతూ ఉంటుంది. కనుకనే విచ్చలవిడిగా వికసించి మధురించిపోయే కవి తరుచు ఒక ఉపరాగమునకు పాల్పడుతూవచ్చాడు.

మన కాతడు తరుచు 'యక్షుడే' అయి కన్పడుతాడు. తన 'నీదర్శనమ్ము సాధించువరకు' పూనిన "యాత్ర" మాట మఱచిపోతాడు. "యుగయుగంబుల కలల్ పాడనా"; "సందేశాల బరపనా దిక్కుదిక్కులకు చుక్కలకు";

"నాహృదయమిందు విశ్వవీణాగళమ్ము
భోరుభోరున నీనాడు-మ్రోతవెట్టు"

అనికూడా కవి చెప్పలేకున్నాడు. కాని యీకలలు, సందేశాలు విశ్వమువేనా అని సంకోచము వెన్నంటి వస్తుంది. పోనీ, విశ్వమువే; - అతనిలో 'వీణాగళమ్ము'తో

"భోరుభోరున మ్రోతవెట్టు" కూడాను ; - కాని, విశ్వముఖాడైన కవిది కాదీ విశ్వము : యుగయుగాల విశ్వయాత్రికులకు వినవచ్చిన సందేశాలు ఇందులో గొంతువిచ్చి వినబడవు ! ఇది యక్షునిది ;- నాయకునిది. అతడు తన అనుభవపు భావసామగ్రిని తనలో తరిబీయతు చేసుకుని - కాక, తానే దానిలో తరిబీయతుఅయి, బయటికి జైత్రయాత్ర వెడలివస్తాడు, ఆ అనుభవపరిచ్ఛిన్నత లోనే మునిగి.

బైరనుకవిఅంటే కార్లైలుమహాపండితుడు ఇష్టపడలేదట, -సంస్కృతి తులసమ్మకు నీరు పోసినవాడుకాడని. ఆ కవినే గేథిమహాకవి (అతడూ బ్రహ్మాండ నాయకుడే) చాలా మెచ్చుకున్నాడట ! అది యెట్టిదైనా సరే, తపన అంటూ ఉన్నదంటే అది, (జిజ్ఞాసాపరిణతిలో) సంస్కృతివంకకే దారితీస్తుంది అని. తన అనుభవసారము తాను కవివలె నిరూపించుకుని సంస్కృతి అర్చలో తన "కోటా" తాను తీర్చగలడు : కాని నాయకుడుగా (తన అనుభవమువెడలి) ఈ కవికిగల ఆసక్తికి తోడు నాయకత యెడల అతనికిగల ఆసక్తి నాయకుని స్వయంపుష్టి తప్పిన కృతకతకంటా యీడ్చుకపోయిన తావులు తరుచు. ఈ ఆసక్తిప్రభావము కళావీథికొసకంటా, శిల్పము మేరలకంటా, పరుగువారింది. కవికి తెలియకుండా వికసించిన కళాధోరణులు ఉన్నతవీథుల భద్రపడగలిగినవి కాని, అతని కంట బడిన ప్రతిసౌందర్యమూ నలుగుడు తిన్నది - తనలక్షణమునే అతడు, తెలిసిన మట్టుకు, భోగిస్తాడు ; ఉపాసించడు. తాను సౌందర్యరసైకజీవి ; తన జీవిత్వము నిలుపుకొనేటందుకు కూడా సౌందర్యముస్వాదమును ఖర్చుపెట్టుకుంటాడు.

మఱి తన సౌందర్యరసైక జీవిత్వమునకు తగిన ప్రయత్నము సంకల్పించి, నాయకునిసహా కవి స్వయముగా తయారుచేసి చూపుతాడు. సర్వాభినయమూ కుదిరికతో నెఱపుకొంటూ,

"నాసఖీ, నాసఖీ,
నే సైపగాలేను"

అని అకావ్యవల్లభమైన ఉద్వేగప్రకటనములో సహా రస ప్రౌఢికి, నాయకతా నిరూఢికి తృప్తిపడి, దూరముగా రంగముమీద మసలి మరలిపోతాడు. షెల్లీకవి "*I pant I expire*" వంటి రచన, అవస్థపరిణతి విశేషాలను మెఱపించి వేసేది ఈ "చెప్పడము" మాత్రముతో సాదృశ్యపుటాభాసము మాత్రమే చూపుతుంది. ప్రవృత్తే, సంకల్పమే రసానికి, కావ్యకర్తకి ప్రధానమైన ద్రవ్యము కనుక, అధీరతయే, ఉద్వేగమే కవితకు తొలియోగ్యత అని మెచ్చే వారు అస్థానము భావుకతకు, సూక్ష్మార్థదర్శితకు చెందిన దని గమనించనివారు. అవిధీరతలో, హృదయవిస్తృతిలో పరిపుష్టము లన్నది వారికి మఱీ మఱుగు.

మఱి ధీరులైన మహాత్ములంతా కవిగ్రామణు లేనా అని కసరవచ్చే రసికులు "మౌనమే కళ" అన్న సూక్తిని ఎంతదూరము తరుమగలరో! టాగూరుగారి పిచ్చి, కవితకు పరమావధి "పురుషుడు" (*Man*) అన్నది, ఆయన సంచిలోకే గెంటవలెను కాబోలు! అవస్థ పాడుకోవడమే కవిత అని ఏడిగువలకో పోయి పాడుకుంటే అభిరుచి పుచ్చక తరుముతావు. ఇది మొదలు ఉపజ్ఞపదములో సాగుతుంది కవితప్రశస్తి. "*Odes*" అనబడే వరద కవిత్వాల ప్రశస్తి సహా ఈ భావుకతలో జీవము దాచుకొంటుంది.

ఎల్లలలోసహా "సౌందర్యము" చూఱలు కొనజూచే ఈకవి, తన సౌందర్య రసైక జీవిత్వము నొక భోగవేదికపై నిలుపుకుంటున్నాడు.

కనుకనే తరుచు విషాదము విషాదిహృదయము నుండి తరుముకొని రాక, దానిని ఒక పూనికగల చెయ్యి కౌతుకముతో సంతనగా దిద్దుతుంది. ఆ చెయ్యి తనదనే కాక, ఆవిషాది తానే అని కవి హక్కు ప్రకటిస్తాడు. పోనీ, విషాదమూ కవిదే, చెయ్యీ కవిదే; కాని కవీ, చెయ్యీ విషాదము వారు కాకపోతూ ఉంటారు.

రసభావానుభవాధికమునందుకంటె శిల్పమునందు ఈ రచనాదీక్షితుని విహారము ఎక్కువ చేతనాన్వితమై విలసిల్లింది. కాని, ఆసామగ్రీ సంపాదన క్రమములో "కవి"త్వమును, "నాయక"త్వమును మీఱిన శిల్పి అవతరిస్తాడు. చిత్రము తెఱపులలో కూడా గీసిన ఆగీతలు విశ్వజవనిక మీద నిలవ వలసిన చిత్రముతో సామరస్య సంవాదిత్వాలు నిలుపుకున్నవి కావు. ఒక కొన్ని వస్తువులయెడలా, పదాలయెడలా కవి అవ్యాజమైన మక్కువ అలవరించు కొన్నాడు. ఆమక్కువ ఈ సౌందర్యరసైకజీవి విప్లవశీలమును ఊతగా గొని స్వైరసంచారము నెఱపుకొంటుంది. దీనికి మొట్టమొదటి పుటలోని అంకితపు పాటయే ఉదాహరణ మిస్తుంది. అందు తుదిభాగ మిది:

'ఈ యశ్రుఝురులతో
ఇరులతో, రొదలతో
సొదలతో, ఈహాస
మృదులవాసనలతో
విసముతో, సిగ్గుతో
కొసరు తేనియలతో
ఈ పాటబ్రతుకు నీ కేపాటిదోయి, నా
నెచ్చెలీ!
నెచ్చెలీ!'

ఇక్కడ మృదులవాసనలు, కొసరుతేనియలు ఆ తక్కిన భావపుమెలపులతో (ఆ రొదలతో) కలియక, 'ఈపాట్రబతుకు నీ కేపాటిదోయి' అన్న వినయవాణి సౌందర్యాన్ని భంగపఱపక మానవు, తాము స్వయముగా సౌందర్యము కలవై. ఆపాట్రబతుకులో అవీ ఉన్నవి కాబట్టి కవి చూపినాడు అను; కాని అవి వినయ పరముగా వంచబడలేదన్నది మిగిలే ఉంది. ఉన్న గుణాలు ఏకరువుపెట్టడము అనుచితమా అని సమర్థించబోతే, శిల్పానికి అంత తాత్పర్యము వహించిన ఈ కవి ప్రయత్నమందలి ఆశయమే అపాకృత మవుతుంది. అది కవిని రక్షింప బోయి మరీ హింసించినట్టు. ఆ శిల్పతత్పరత మఱుగుపడడానికి ఆ పరిచితము లైన పదాలయూ, వస్తువులయూ మెత్తదనము, అందము వంటి సున్నితమైన గుణాలు బాధ్యములు. స్పర్శకు మెత్తనిపదమైతే ఈరంగములో ప్రవేశము పొంద డానికి గొప్పయోగ్యతగల పుట్టువు పుట్టినదన్నమాట. కాని, చిత్ర మేమిటంటే, ఆ మృదుపదాలన్నీ కలిసి, మళ్ళీ, అర్థపరముగానే కాక వృత్తిపరముగా కూడా మార్దవ భంగమే చేయ పాల్పడుతాయి. రీతిసౌష్ఠవములు చూపినతావులు 'చెవి'కి నిదర్శనములై, ఈ కవి కొకపదవి సంపాదించి పెట్టనే పెట్టుతున్నవి. (అక్కడ ఆవేశము పదనుపెట్టింది!) కాని అది కవికికూడా తెలిసిన గుణమైపోయింది!— ఇక భావప్లుతి ఆవరింపుల వెలికంటా చేయి చాపి గూళ్లు కొట్టబడినవి. ఇట్లు ఒక పరాధీనతయే, స్వయముగా రసప్లుతిలో ఉద్గమించగల భావవ్యక్తిని నిరోధించి మఱుగుపఱిచే వస్తుశిల్ప పదశిల్పాలకు మూలమవుతూ ఉంది లావణ్యతరళమైన పొరలో లూరటిల్లి కాంతి చిమ్మకోవలసిన భావము శిల్పము మడతలలో చిలపలుగా కప్పపడి తన సమర్థత విసరుకోలేకపోతూ ఉంది. ఉన్న రెక్కలు తడుపుకుని కూర్చుని, 'నే నెట్లు పక్షి నౌదు?' అంటుంది, కవితోపాటు.

'కలుగునా నాకు నీవియోగమ్ము సకియ?
వాలు నీకనురెప్పల జాలిచూపు
లల్లి దిగజారి దిగజారి, అమరనాథ
కంకమాలా సుమదళాలు గాగ, గగన
వాహినీనీరజాళినీపక్షనీల
నాట్యములుగ, తారాతోరణములు గాగ,
నింగినీడలమెట్లుగా, నీలిమొయిలు
జిలుగువిరుపులుగా, పులుగులుగ, నలరు
లుగ, నలఁగా, కలలుగాగ, సొగయబోని
విసివికోని వింతవలపు వేడివేడి

తొందరలపరువుల నెంత తూలి తూలి,
ఎంత దిగజారి దిగజారి, ఎంత వెదకి
వెదకి పడినవొ, పెంధూళి గదలలేక
వెలుగు లేక యెగురలేని వీని కనులె
శిలలు గాక; వదలనికౌగిలి బెనంగ
బెదరుగాక లజ్జాగాఢవేదనాగ్ని !
వదలునా యెట నెదురేగి వెదకు వలపు !
కలుగునా నాకు నీ వియోగమ్ము, సకియ !'

ఇట్టిచో బాహ్యస్ఫూర్తి శిల్పపరికరముల నాశ్రయించి కవి విశ్వ హృదయము నంటజూస్తే, అవి భావజవనత లేనివై కవిని మోసికొని నిలబడు తాయి. ఇక్కడ కుప్పపోసిన సామగ్రి భావపరిపాకమునకుగాను పాకము పడవలె నంటే, ఒక సహజప్రతిభకో, అది వినియుక్తము కాగల యోగనిష్ఠకో తృషిత మవుతుంది. (ఇక్కడ *Synthesis* అనే ఆంగ్లపదము మంచి మాస్టరు.) ధ్వని స్వామి టాగూరు మహాకవి.

'....*and her eyes that smile from the blue*
*sky drank their light from me*'

అని స్వల్పములో అతిసున్నితముగా పలికించుకుంటాడు, ఈలాటి భావమే. ధ్వనికోసము గోపనమునకు పూనబడక భావము అంతరాంతరముల వర్ణితమే కా ప్రయత్నిస్తుండగా, తీక్షణముగా తగలవలసిన భావము వెంబగా మాత్రము తగిలి నిలిచి, వస్తుతలము సోకినంతగా భావతలము సోకక, 'ఈకవి భావపరుడు అనే కంటె వస్తుపరుడు అనదగదా' అనే అనుమానము, తనవంక తాను, తెరతెరగా దొంతర పెడుతుంది.

ఇట్లు భావుకతవలని పరిణామములను బోధించవలెనని, ప్రదర్శించవలెనని వెన్నంటిన ఆసక్తి ఒక కృతకతకు పరిణతమై సహజతపట్ల రేపిన సంగ్రామము ఒక్క కావ్యములో కాదు, ఒక్కపదము వాడుకలో సహా నైజగుణమువలె ఉప స్థితమైన సందర్భములు కావలెనంటే ప్రసన్నమవుతాయి. 'కృష్ణపక్షము' లోని అపరిణతములైన సహజకోమలగతులు కొన్ని యిందు సమగ్రతవంకకు తిరిగి, షెల్లీకవి గాంధర్వము, కీట్సుకవి పాకము చూపినవయ్యా, తఱుచు స్విన్‌బర్న్ కవి కృతకత లోని కంటా పడిపోతూ వచ్చాయి. స్విన్‌బర్న్ కవి అనుభవాలు అతని కవితా ప్రారంభము నాటికి ఆవేశపు వేడి అణిగి అతని మనస్సులో అభిముఖ్యములు మాత్రము కట్టుకోవడముచేత, అతని రచనా ప్రయత్నము

శిల్పములో తీంద్రించి, పదనువారింది. కృష్ణశాస్త్రిగారు తన అనుభవము స్వయముగా ప్రసవించే ఆవేశముకంటె ఎక్కువ పిండుకొనేటందుకు చేసిన ప్రయత్నము ఆ కృతకతలో....వాలున్నదని పలుకవస్తుంది. మఱికొన్ని గుణములు చేరితేనే కాదు, ఉన్నవి కొన్ని లేకపోతే యీ కవిత ప్రశస్తతరముగా విలసిల్లేది.

అవిదృష్టమైన సహజోద్గమము ఉత్తమ నీచ ధోరణులు రెంటికీ ప్రభవమైతే, ఇట ప్రయత్నముతోడి చేసేత జయావహతను, జయభంగమును కూడా ఈనుతూంది. అందు, కవి చిత్త రహస్యతత్త్వమును మాటు వెట్టుతూ, దాని నొకవేళ మూలతః మార్పునేకల ప్రాభవము నేమో ఘోషపెట్టే కృతకత ప్రచారములో, తొలుత జయభ్రంశము తనపరామర్శము పాలు పొందవస్తుంది.

కాని భావప్లుతికి, రచనాసక్తికి ఒక సంగ్రామమే కాక ఒక సంశ్లేషము అతుకువడి, కవి కళాచాతుర్యమును గణిస్తూ ఉంది.

విభావసామగ్రిని, రంగమును, వర్ణించుకొనేటందుకు సహా మనస్సు చాచుకొనే 'హృదయేశ్వరి' నుండి, అణువులో నిలిపితే సృష్టి ఉబికించుకునే 'ఫలశ్రుతి'కి గీసిన గీతమీద 'ప్రవాసము; ఊర్వశి' తాకుతుంది. కాని ఆ గీత పయినే కట్టుపడి ఉండదు. ఇందు, 'హృదయేశ్వరి' చిత్తశుద్ధి, హృదయవ్యక్తి సహజముగా, విస్ఫుటముగా కానరాకపోతే, అందులకంటె అదనమై భావము కోనల వెలుతురు పెట్టే యత్నము సహజము. 'ఫలశ్రుతి' యందలి పరిపక్వమైన ధోరణి యిందు కొన్నియెడల మాత్రమే సుఖంకరమైన భావాలలో వ్యక్తమైతే, అట్టిది లేని మేరలుకూడా, తపనస్థానములో భావనావిలాసము, శిల్పసౌందర్య వికాసము నిలిచి, మనోరంజకత నిర్వహించుకున్నవి.

ఈవిధికి అంతకూ కళ్లెము పట్టినకారణము కవి తనను గురించి యిచ్చిన తథ్యమైన వర్ణనలో దొరుకుతుంది.

(*The poet's eye in a fine frenzy rolling*

*Doth glance heaven to earth, from earth to heaven....*

అన్నట్టు.)

'....ఆత డున్మత్తభావశాలి,
ఆగికోలేదు రేగునూహల నొకింత !
ఎట్టి నిశినే నదరిపోవు నెగసిపడును !

ఇంత చిరుగీతి యెద వేగిరించునేని

పాడుకొనును, తాండవనృత్య మాడుకొనును;
మ స్తక మ్మొరగా వంచి మన్ను మిన్ను
వేయికే లాడగా వ్రాసి వేసికొనును !
....... ..............అతండు
పాట పదములకై నిత్యపథికుడయ్యె—'

ఈ యెగసి పడడము మనకు తరుచు వినబడుతుంది. ఇది కవి ప్రవృత్తిని గుఱించిన ఒక పెద్దసత్యము.

'ఈ వియోగ నిరాశా క్ష
ణ క్షణ ప్రతీక్ష చెదరి
ఎగసి ఎగసి పగిలి పోదునో !'

అని ప్రేయసికోసమే కాక, పాటకోసముకూడా అంత వ్యగ్రత వహిస్తాడు.

ఈ కవితోడి అనుషంగిక పరిశీలనమునకు ముచ్చట కూర్చే కళాశాలి నాయని సుబ్బారావుగారికి

"... పద్యమ్ము ప్రేమ పొంగించుకొన్న
నానవానందవాహినిలోని నలుసు."
"......... ఆనందపరమార్థ మేలుచున్న
నాదుహృదయాంతరాళమ్మునఁ ధ్వనించు
అసలు పద్యమ్ము వచ్చినదని సతమ్ము."

ఇంచుకలో ఈతని 'వ్యాపకత' నుండి "అవచ్ఛిన్నత" కు భేదము కట్టుకున్న కృష్ణశాస్త్రిగారు, పాటపదములకై నిత్యపథికుడు కాబట్టి, అతని కళాప్రయోగము కవి నుండి పాటవఱకూ కంటె, పాట నుండి కవివఱకూ ప్రసరించింది. కనుకనే అతని పాట వివిధ విభ్రమాలలో పల్లవించి,

'ప్రతిపదమ్మున శీతల స్వాదు మధు తు
షారముల పార్శ్వముల విరజల్లు చేగు'

అన్న స్వీయచరిత్ర తుదివాక్యము పట్టిమాట కాని మధురాపకాశాలు పుష్పించింది.

"వినరా వీ విభావరీ
వేలాశాలల నీమృదు
వసనాంచలముల గుసగుసలో,

మసలు చరణమంజీరము
కొసరు జాలిపలుకరింతలో !

ఈ కుటీర ముఖద్వార
మిందే వ్రేలాడి సగము
వాడి, విరహ తోరణమ్మునై
వలపంత సడలి నేల జీ
రాడి యెన్ని నాళ్ల మనుదునో!'

నీమనోజ్ఞ కాంచన కాం
చీమణి ఘంటాగళములు
ఏకాంతము కరగ మ్రోయగా
విన నరచే బ్రతుకు దాల్చి
యెడద మ్రోత కెంత యేడ్తునో !"

ఇట్టి పంక్తులు కవి సహజకళావికాసమును, శిల్పప్రయోగ సామర్థ్యమును నిరూపిస్తున్నవి.

*"The glistening bells of her anklets rang in my blood, and her misty viel fluttered in my breath."*

అన్న టాగూరు మధురభావము వేఱొక గొంతుకలో ఇక్కడ వినబడుతూంది. ఈ కవి గొంతులో ఒక ప్రాపంచిక మైన జీర తప్పనిది : ఎంత ఆత్మపరమైన భావము తెచ్చినా, ఈ గొంతులో పడి అది నీ ఇంద్రియముల మీదుగానే పయనిస్తుంది. కనుకనే ఒక్కొకచో అంతటి సౌఖ్యముకూడా ఇస్తుంది. బాగున్న దను, బాగులేదను, కాని ఈతనిపాట నీకు గ్రుద్దినట్లు తగులుతుంది : అది నీవు లఘువుగా తొలగద్రోసికోలేవు; కనుకనే అంత విసుగైనా పొందుకాని.

టాగూరుకవి ఆకసముగుండా, ధ్వని జగత్తును మేలుకొలుపుతూ, మన "గుండె నెత్తురుల'లోనుంచి ఆత్మలో విసరే భావగీతిక ఈతని జీరగొంతులో నగిషీలు పడి ఎట్టి పరిణామము పొందుతుందో ఒక్క ఉదాహరణము బాగా తెలుపుతుంది.

*Do not go, my love, without asking my leave.*

*I have watched all night, and now my eyes are heavy with sleep.*

*I fear lest I lose you when I am sleeping.*
*Do not go, my love, without asking my leave.*
*I start up and stretch my hands to touch you*
*I ask myself, "Is it a dream?"*

*Could I but entangle your feet with my heart and hold them fast to my breat.*

*Do not go, my love, without asking my leave.*

—టాగూరు.

'నేను నిద్దురవోదునో, యేమొ, కరుణ
సెలవు గైకొన కేగగా వలదు; ఇన్ని
నాళ్ల యెడలేని యెడబాటు నా నిరీక్ష
ణమ్ము బరువులు బరువులై నయనయుగళ
మయ్యొ, దిగలాగు నిద్దుర మరపులకును.
ప్రియతమా, యిక నిదురింతు పిలువబోకె
బాసిపోకు నిర్భాగ్యపుబ్రతుకు దాటి !
ప్రియతమా, పొరలి పొరలి మొయిలు లేవొ
మేలుకొననీవు రెప్పల వాలి యదిమి !
ఎటు లెగసి యెగసి పడుదు ! ఎటులు చేల
కేల్త్సిన్నంటి యదిమికో తూలిపోదు !
అబ్బ ! నా బ్రతుకంట, నీయడుగుదోయి
నాప, ప్రియతమ శృంఖలమై పెనంగ,
దిక్కుమాలిన యెడద బంధింపలేను !
ప్రియతమా, నిను వదలికోలేను, నిదుర
కదలియై కాటుకై కనుగవ నడంచు !
ప్రియతమా, వీడి పోకోయి, వీడలేని
నామమతచిచ్చు కునుకునా, నన్ను బోలి.'

టాగూరు కవికావ్యములలో తా నొక కొంత భావాలోకమునకు చిహ్నమై నిలవవచ్చే "లిప్స" ఇక్కడ "ఎగసి యెగసి పడు" తుంది.

లిప్స ఉపస్థితికే విమర్శకులు కొందఱు శాఫో కవయిత్రిని గర్హించారట, అట కళాప్రకాశనము సాధ్యమనేది యేమఱి. కనుకనే –

కాని ఆమెయందు లిప్స కళయై విహరించింది;
"నాడు శాఫో విరహ కంఠనాళ వేణు
వాలపించిన యరుణారుణాంధ, గీతి
యేడ్పు, నిట్టూర్పు, కోపించు నిపుడు, సంధ్య
యటుల, కాలవిశాలవిహాయసమున"

ఆగీతిని ఇంత ప్రత్యక్షముగా, హృదయంగమముగా, వర్ణించుకోగల ప్రవృత్తి సాదృశ్యము శాఫోతో పొందగలవాడు ఈకవి.

లిప్స, ఆత్మ రంగరించి కవితావేశము క్రోవులుపట్టిన బ్రౌనింగుసతి మనోజీవనము ఎట్టిదో, ఒక్కభావము మనకు చూపుతుంది. అది భారతాంతఃకరణకు చుట్టమైనదై, ఆ అంతఃకరణను సాకు కొనే తెలుగుకవి వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి మృదూక్తిని చక్కగా నిరూపిత మయింది.

"ఈ నవవేణుదండ మిటు
లేటికి చెక్కెద వేల చిల్లులై
పొ నొగిలించెదం చడలి
పోయితి; రిత్తపు టూర్పుగాడ్పులన్
గానముగాగ మార్చుటకె
కా యని యిప్పుడు నే గ్రహించితిన్
..................... ........"

మతసిద్ధాంతాలు ఫలించడానికి ఏది ఆద్యప్రవృత్తమో అదే - బ్రతుకుతో ఆత్మ పడసిన అనుభవ కథయే, - కవితలో మూలద్రవ్యము కావున, లిప్స, స్వానుభవ ఆత్మవికాస సాధనముగా కవితావేశములో సంతరించుకోగలిగారు ఇట్టి కొందఱు కవులు. ఈ సిద్ధులలో షెల్లీ కవిని కూడా ఉన్నతపదవులలో చెపుతారు. ఆతని "ఎపిసైకిడియన్" (*Epipsychidion*) అనే కావ్యముకంటె లిప్సాత్మకమైనవి యెన్నో ఉండవు. దాని ప్రోద్బలము "ఊర్వశి"లో రక్తమై ప్రవహించి, కృష్ణశాస్త్రిగారి వ్యక్తిత్వముతో తెలుగు భాష కొక విలువైన క్రొత్త కావ్యము ప్రసాదించింది. షెల్లీకవి ప్రోద్బలమునకు ఈ కవిని లోలుపుని గావించిన లిప్సాగుణము ఈకవి రచనను చైతన్యమై నడపింది ఇందు వలన, షెల్లీనివలె ఈ కవిని తత్త్వమూర్ధమునకు విసరకపోయినా, ఈతని భావనమున రచనమున ఒక తీక్ష్ణత యేర్పడింది.

'స్థాణువయ్యెనో పాషాణ జఠరమ్ము
గనెనో, కదలదు మెదలదు కంఠరవము,
నే డిదేమో క్షమాజననీపురాణ
గర్భకుహరమ్ము విదలించి కారుచిచ్చు
బెరుపుమంటమూలం గేదో యేదో ప్రాకె,
ఇపుడు ప్రళయమే......................'

భావములకు, వేదనలకు ఇట్టి మూర్తనిరూపణ మిచ్చే చక్కని కళా ప్రసారము ఈ చైతన్యమునే బింబిస్తూ ఉంది. ఇట పాటవము మురిసిపడే విశ్వనాథ సత్యనారాయణగారి పోకడ పోలిక చూపుతుంది.

'ఇది నీకై యిడినట్టి నాయుపదః ము
న్నేనాడో ఘనసొగ్రముల్
పదనై ఆంధ్రవిరోధి కంఠదళన
ప్రారంభసంరంభ మే
చుదినాలఁ మఱి తోడి సైనికులమై
చూడాదు ప్రేమంబులో
నిది లేశం బనియైన చెప్పుటకు లే
వే నాటి స్వాతంత్ర్యముల్.'

సహజోద్గమమున గొంతు విచ్చినాడంటే సత్యనారాయణగారు పేలవమైన పోకడపడినా నిరోధించుకోడు. కాని, క్షణములో వాయువేగాన మింటి కెగసి శక్తిగుళికలు విసరివేస్తాడు, అదే గొంతులో. కృష్ణశాస్త్రిగారు ముక్తకంఠముతో పలికేది తక్కువ. ఆయన సంస్కృతి నెఱపుతూ నెఱపుతూ పటుత్వము వెలయించినతావున వారిగుపురి కలయిక ఇరుముఖాల త్రోవ చూపుతుంది. సత్యనారాయణగారు ఎక్కువ చెపుతాడు; కాని యెక్కువ చెప్పవలసి చెపుతాడు: కృష్ణశాస్త్రిగారి మాటలు అర్థమును మిగిలికూడా ఒక సౌందర్య ప్రబంధములో వినబడుతాయి. కాని చెప్పవలసినది ఆవిష్టమై చెప్పిన సందర్భాలు కవి అంతరిక మహత్త్వమును ఎలుగెత్తి చాటుతవి.

'ప్రవాసము' లో రచన కడు దిద్దుబాటుగా నడిచింది. కావ్యవస్తువు క్రమవికాసము కాంచుతూ తగినశిల్పము నాకర్షించుకుంటూ వచ్చింది.

'రేయికడుపున చీకటి చాయవోలె,
తమపుటెడద దివాంధగీతము విధాన,

ఘూకరావాన వలవంత రేకరీతి
నావిషాదమ్ము లో దాగినాడ నేనె!'

కవి ఒక్కభావము నెంత శ్రద్ధమై తడవుకొన్నాడో అంతశ్రద్ధమై దానిని గిసికొంటూ, తన ఆదర్శమైన షెల్లీకంటె ఒక్కడుగు ముందిడినాడు, అలంకార రచనలో.

'ఏను మరణించుచున్నాను; ఇటు నశించు
నాకొరకు చెమ్మగిల నయనమ్ము లేదు;
పసిడివేకువ పెండ్లింద్ల బడిన యెవరు
కరగనేర్తురు జరఠాంధకారమృతికి?

నామరణశయ్య పరచుకొన్నాను నేనె!
నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను!
నేనె నాపయి వాలినా, నేనె జాలి
నెద నెద గదించినాను, రోదించినాను!

బ్రతికియున్న మృత్యువుపై ప్రవాసతిమిర
నీరవసమాధి గ్రుళ్ళి క్రుంగినపుడేని
నిను పిలిచినాన, నామూల్గునీడ మునిరి
కుములునేమొ నీగానోత్సవముల ననుచు;

ఇదియె నాచితి, పేర్చితి నేనె దీని,
వదలిపోని నా యవసానవాంఛ గాగ
వడకని కరాలు రగులుచు దుడుకుచిచ్చు
లాలనల నింత నుసిగాగ కాలు త్రుటినె?

ఆలయు వాతెర యూర్చు గాలులు కదల్చి
రేపు నంతె నా కాష్ఠాల రేగుమంట
మును బ్రతుకునట్ల నాదేహమును దహింపు!
పడదులే ఆర్పగా నొకబాష్పమేని!'

ఈ కావ్యములో (భావగతి భైరనుకవివల్ల పుడికి పుచ్చుకొంబడ్డదై) రీతి,—'పద్ధతి'—ఎంత కుదిరికతో ఈ చేతి వ్యాశ్రయించుతుందో వ్యక్తమవుతూంది. అవస్థాంతరములో ఇదేతలమున కానవచ్చే కావ్యములు.

'ఆమె కన్నులలో అనంతాంబరంపు
నీలి నీడలు కలవు...............'

ఈ మొదలయినవి (ఛిలాసచ్ఛాయలు ఒత్తిగించి) కవి ఈ రచనాపక్కికి నిదర్శనాలు. పద్ధతికంటె ప్రాముఖ్యము దట్టించుకొని 'ఊర్వశి'లో భావనావిలాసము తలుచై ప్రాకింది.

'కాలమే పసిపాప
కను విచ్చిన యుషస్సు
కలగా కలవరించి
వెలుగుగా పులకించి
ఇరులకడు పొరసి నే
తెరచి వాలిననాడె
మిసిమివన్నెల మేన
మసి జాలిగా నయ్యె....

తొలివియోగిని నేనె!
తొలిప్రేయసిని నేనె!
ఆనాటి కీనాటి కేను నీదాననే!

వేయివేలు యుగాలు
రేయినై పవలునై
అడరి కురిసినయేడ్పు
అలరి విరిసిననవ్వు
బరువుకానుకగ, మన
భాగ్యబంధమ్ముగా
చేర్చికొని నాలోన
కూర్చితిని నీకొరకె!

తొలివియోగిని నేనె!
తొలిప్రేయసిని నేనె!
ఆనాటి కీనాటి కేను నీదాననే!'

ఈ ఊర్వశి పాటలో ఈ భావనావిలాసము పరిణతి విశేషమున కాన వస్తుంది. అర్థావబోధము దూరమయిన రచనానదములుకూడా కొంత ఈ గుణము త్రొక్కించినవే.

లిప్స (*passion*), విలాసము (*fancy*), శిల్పము (*craft*)—ఇవి యీకవి కళాధోరణిలోని ప్రధానద్రవ్యము లనవచ్చు.

'మూతవడనేలేని
ముక్కోటిదేవతల
కనుతారకలు కోర
కములై సుమములయ్యె
ఓసరిలి యొండొరుల
నొరసికొని విరుగబడి
దిశ లంట చీకటులు
నిశయే దివసమయ్యె!'

ఇట్టియెడల ఆ గుణములు, పాళ్లు మార్చుకొంటూ పాకము చూపినవి. పాఠకుని హృదయములో నిజమైన సహానుభూతి కదుపుకొంటున్నవి. చిత్త శుద్ధితో వెల్లివిరిసిన కావ్యార్థము స్వయముగా తనకు రమ్యమైన ఉపాధిని వ్రాసి కొని వచ్చింది. కనుకనే, 'అలంకారము' అర్థాత్మకతలో ఒక పటిష్ఠత, సమగ్రత తెగిపడింది. కవి తానున్నా ఇంపైన ఛందస్సులు కల్పించుకొని, ఆవేశము భావమునకు ప్రసాదించే సంగీతమునకు తగిన లయ కూర్చుకోవడములో అప్రమత్తుడై ప్రవర్తించినాడు.

భావకవిత్వమును (గేయముగా) పాడుకొనే అవకాశమును తెలుగుభాషలో పెంపుచేసినవాడు కృష్ణశాస్త్రిగారు గురజాడ అప్పారావు, బసవరాజు అప్పా రావు, నండూరి సుబ్బారావు, చిలుకూరి నారాయణరావు ప్రభృతులకు గతాను గతికుడు గాక, స్వతంత్రమైన 'పాటపదము' ప్రచలితమూ, ముద్రితమూ చేసి కొంటున్నాడు. (*Lyre*) లైర్ అనే జంత్రముమీద పాడుకోదగిన పాట ఒర వడిని వెలసిన కవితాపక్కి నేటి పరిణతికి న్యాయ్యముగా తెలుగు నుడియందు 'భావకవిత్వము' అనబరగినప్పటికీ, దాని గేయరసాత్మకత వివృతము చేయ బడుతుంది ఇట్టికవులయందు.

గేయచ్ఛందములలోనే కృష్ణశాస్త్రిగారి చేయి నేర్పు తిరిగింది. ఇచ్చటి లయనడక సాధారణ ఛందోఽనుసరణమున కూడా ఈయనచేత అనిరుద్ధగతులు అవలంబించింది. అనగా ఛందోభంగములు, యతిభంగములు మొదలైనవి సహా ఏదో ఒకలయకు సంతుష్టితో తావు విడిచి నిలువగలవు.—కృష్ణపక్షమునందలి

'ఏడ్వలేక యేడ్వలేక యేడ్చుచుంటి'

ఇలె

'మింట వెలుగు చుక్కగన్న మిణుకురన్న'— వట్టివాని నియమోల్లంఘనము భావము ఛాయా లేపనమునకు తోడుపడేవిగా ఉంది కవి 'చేతి'నే చూపుతవి.

ఈయన పాట క్రొత్తదనము భావగతిపరముగా కూడా అన్వయిస్తుంది. 'బ్రహ్మసమాజ ప్రార్థన గీతాలు' అనుషంగపరచి పరిశీలించినపుడు, ఈతని ప్రణయగాథలకు చెందిన గీతాలలో,—

'కలువపూ బ్రతుకులో
కనుమోడ్చు వెన్నెలే
కాలావలంబైన
గతియేమీ?....'

ఇట్లు తత్త్వాలు పాడే ఒక తాటస్థ్యము కవి అనుభవాన్ని పరామర్శిస్తూ మనస్థ్సితి పరిణతి సూత్రమును సులభముగా దొరకించుతూంది.

కవి తన అనుభవము ధోరణిలోనే, ఆగుణములతోనే, భక్తిమార్గానకు త్రొక్కుకపోతాడు; ఈ తాటస్థ్యమున్నూ ఒక కనువిప్పు కాని నిర్వేదము రాపిడి కాదు. కనుకనే, ఎన్నిజన్మ లేడ్వవలసి ఉన్నా, ఆజన్మలు కావలెనని వరించగలదు, ఈ కవి. 'మనసు భోగపరిత్యాగమునకు లాగదు' అన్నది, జీవితాశాసనముగా అన్వయించి, ఈతని మెడలో వేయనగును. 'మూడులోకాల బరువులమోత నడగి యడగి చిదికిన అందఱము తాను,'

'ఆటతో పాటతో నేర్చినట్లు దేవ
ఏనుగూడ నీవ వటియింపనిమ్ము,
ఎడతెగనియాత్ర నెట్లో సాగించువరకు!
ఎట్లో నీదర్శనమ్ము సాధించువరకు!'

అని పల్లవించిన కోకిలగీతము వాస్తవికముగా ఫలించే స్వప్నమునకు తృషితమవుతుంది.

శిశువువలె, ఋషివలె తనలో స్వాస్థితత్త్వములు ఆకళించుకొనకపోతే, వృద్ధునివలె, పండితునివలె అనుభవమును అధిగమించి ఈసిద్ధికి కవి ప్రవృత్తుడు కాగలడు అని యీ కావ్యమాల ఆలపిస్తూంది. 'ప్రవాసము; ఊర్వశి' 'జీవిత రహస్యమార్గమ్ము'లు తెలిచి కవి హృదయము బిగ్గగొంతుకతో 'పాటపాడించి' వట్టివి!

'వైశాఖి' రెండవ సం. సంచిక 1982

# 'ఆంధ్రకవిత్వ చరిత్రము'*

(వి మ ర్శ ము)

## కొంపెల్ల జనార్దనరావుగారు

పేరునుబట్టి యిది ఆంధ్రకవిత్వము చరిత్రమని అనిపించుచున్నది— కాదూ? కాని అట్లు కాదు ఇందు ఉదాహరణరూపముననైన ఎక్కిన ఆంధ్రకవిత్వము కొంచెము. అందు తొంబదిపాళ్లు శ్రీ అప్పారావు గారి సొంతమే. మఱి యిది రచయిత రచింపఁబూనిన ఒక ఆగామి బృహద్గ్రంథమునకు ఉపోద్ఘాతప్రాయమైనదై, ఆపేరే తొడిగికొన్నదనుటకు ఆనుకూల్యము లేదు. ఇది ఒక గ్రంథమే అయి తనవిషయమునుబట్టి పేరు దాల్చి, కావలసినచో తన పీఠికయందు, రాఁబోవు ఒక ఫలాన గ్రంథమునకు ఇది ఉపోద్ఘాత ప్రాయమన్న ప్రకటనకు తావిచ్చిన ఈయవచ్చును. 'ఆంధ్రమున కవిత్వచరిత్రము' అని ఒక సమాధాన ప్రయత్నము. కవిత్వచరిత్ర మనఁగా, కావ్యమీమాంస అని, కవిత్వతత్త్వపరామర్శమని, అర్థమగుచో, ఇందలి వస్తువునకీపేరు ఇంతవఱకు సరిపోయినదని కొందఱు సాఁగదీయఁగలరు.

ప్రాచ్యములు, పాశ్చాత్త్యములు నగు వివిధభాషా సాహిత్యములందు వివిధ కాలములందు కావ్యప్రతిభ కాంచిన వికాసపరిణామములు, చరిత్రక్రమమున కాకున్న లక్షణక్రమపరముగ, ఇందు పరిశ్రమాయత్తమగు పరామర్శమునకు భాజనములయి, రచయిత అభిప్రాయధోరణికి అగ్రము చూపినవి. ఇది మిక్కిలి అదనుపట్టిన, మెచ్చఁదగిన ప్రయత్నమే.

తెలుఁగున కవనప్రతిభ ప్రాఁతరాపిళ్లకు విప్లవించినవెనుక వెలువడిన విమర్శగ్రంథములలో నెల్ల భావస్వాతంత్ర్యమును, విషయవిస్తృతియు చూపు కొలఁది సంఖ్యలో చేరు నిది. సారస్వతమగు 'అరాజకోద్యమ' సంరంభమున మొదటి పఙ్క్తులలో కానవచ్చు ఈ 'భావకవి', తనస్వాతంత్ర్యరతి, పాతసారము, ఉపజ్ఞ అడుగడుగున చిహ్నితమొనర్పఁగడఁగు విమర్శకుఁడుగ దర్శనములు విసరుచు వచ్చి యీ పెద్దవిడిదిని విస్తరిల్లినాఁడు.

---

* గ్రంథకర్త : బసవరాజు వేంకటఅప్పారావుగారు, బి. ఏ., బి. ఎల్. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. క్రౌను సైజు, ౩౦౦ పుటలు. వెల రు. ౧-౮-౦.

ఇది ౧౯౨౧ లో విరచితమైనట్లు గ్రంథకర్త పీఠిక చెప్పును ప్రకటిత మైనది '౩౧ తుదనో '౩౨ తొలుతనో. ఇది రచించిన క్రొత్తనే ప్రకటితమై యుండిన, ఇది తెచ్చుకొని యుండు మెప్పు ఈపదేండ్ల రసజ్ఞత పెంపులో ఊరి యుండెడిది. ఈ ప్రకటించు ముందే యిది రచితమై యుండినచో, విషయావగాహనము మెఱుఁగెక్కి, రచనాపక్కి పాకముతిరిగి, ఇంతకంటె మేలు తరమైన గ్రంథము మనకు లభించియుండెడిదని ఆశింతము నాఁటిరచనయే నేఁడు ప్రకటితము కావలసివచ్చినను, కవిసంస్కృతి వికసనము ననుసరించి గ్రంథమున కొంత సంస్కరణము ప్రాఁకుట స్వాభావికము. మఱి, రచయిత తనయెడ చెప్పుకొన్న పాదుషాలను మించిన బద్ధకములవలననో యేమో, ౧౯౨౧ సం. ననే నిలువఁ ద్రొక్కుకొని మాటాడు వాక్యములుకొన్ని గ్రంథము నొకమట్టిపొర క్రింద కొంత చైతన్యముగా పట్టుచున్నవి. మహాసంగ్రామానంతరము ఐరోపీయవాఙ్మయ గతి స్తంభించిపోవుపఱకే ('ఇఁక ముందు నేపరిణామము దాల్చునో చెప్పుట దుస్తరము(?) అని నుడువుచు) తడవి, ఆసమయముకొసను వినవచ్చు కవితారావములలో 'యీట్సు' కవిగొంతుక ప్రాచ్యసంస్కృతి చ్ఛాయ లాలపింప మచ్చులు వినతెనన్న మథనము, నోబెలుబహుమానము నొడిచిన యీ పదిసంవత్సరాల తత్కవివికాసమును పట్టుట యెంతఆవశ్యకమో, తద్విపర్యయమున నిపుడుచేపడిన ఆశాభంగము కొలతచూపి చెప్పఁగలదు.

ఆంగ్ల కావ్యము లెన్నియో మెచ్చి, ఆంగ్లమున కవులయు విమర్శకులయు నభిప్రాయములు గౌరవముతో స్వీకరించిన ఔచిత్యము నెఱపియు, '........ఆంగ్లేయులు సాక్షాత్తు కలిపురుషావతారులు. అందుకనియే వారికి ద్రవ్యకాంక్ష మెండు. రసభావము మృగ్యము....' అన్నభావములు ఏప్రోద్బలమున నేర్పడినవైనను, ఈపదియేండ్లకు రచయిత పరిశీలించియు ప్రాచ్యతాముద్ర నిలఁబెట్టుటకో యేమో అట్లు వదలినాఁడని సమాధానపడుట సులభము కాదు.

"....'తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వమ్మును జరపువాఁడు' అనుభాగవతవచనము యొక్కయు, 'ఆత్మవత్సర్వభూతాని'యను నుపనిషద్వాక్యముయొక్కయుఁ బ్రామాణ్యమును క్రూరులును, రాజ్యకాంక్షాపరులును, హింసారతులును, మాంసాశనులును, నాస్తికులును నగు పాశ్చాత్యశాస్త్రజ్ఞులకును, పాశ్చాత్యజనులకును వెల్లడించి భారతీయవిజ్ఞానప్రాశస్త్యమును ఘంటాపథముగఁ జాటి తన్నుఁ గన్న దేశమునకు ఖ్యాతియును, దన కశేష శేముషియును(?) శ్రీ వసువు [జగదీశచంద్రబోసు] గడించినాఁడు—"

ఇట్లు నిబిడితములైన వాక్యములకు లోకము అంగీకారముద్ర వదలఁగలిగినచో, వెలతురువలె పరువిడుచున్న పాశ్చాత్యవిజ్ఞానగతిసహా తత్త్వపారమ్య

సమర్థనమునకు బారలు చాఁచునవెడి రహస్యములు కీర్తించిన జెనరల్ స్మట్సు-లు తల వంచుకొని సముద్రాలలో దాఁగుదురేమో!

గంటము త్రుప్పువట్టి, అక్షరముల అక్షరాంకణమునకు లోహపుముద్రలు మొలచిన యీకాలమున రచనా కాలమునుండి ప్రచురణకాల మనుచు లెక్కించు కోవలసివచ్చినది కనుక కాని,—గ్రంథమును యథాతథముగ పరిశీలింపఁజెల్లును.

ప్రాక్పశ్చిమములు రెంటికిని "పద్ధతులు వేఱయినను బరమార్థము....రస ప్రతిపాదనమేయని గ్రహించిన"వారై తత్సంయోగము అసంభవము కాదని ఉప దేశించి, "పాశ్చాత్త్యవాసనలు నన్నువీడక వెంటాడుచున్నను, భారతీయ నాగర కతకు మూలకందమనఁదగు సంస్కృత వాఙ్మయమును జుల్కనఁగఁ జూడక, మూలాధారముగనే గ్రహించి సర్వత్ర వాదమునకుఁ గడంగితిని. కాని, సాంస్కృతికాలంకారికుల ప్రధానసూత్రమును మాత్రమే కయికొని, యప్రధానము లగువానినెల్ల విడిచి సాహిత్యమునకును, రసమునకును, శైలికిని సంబంధించిన ముఖ్యసూత్రముల చర్చతోడనే గ్రంథమును బూరించితిని. అప్రధానవిషయము లఁగూర్చి విపులవ్యాఖ్యానము గావలసినవారికి పూర్వసంప్రదాయానుసారములగు లక్షణగ్రంథములెన్ని యేనియుం గలవు. 'చక్కనిరాజమార్గమే యుండఁగా సందుల గొందుల దూఱ నేలనే యో మనసా!' యను త్యాగరాజువాక్యమునే ప్రమాణముగఁ గయికొని కావ్య తత్త్వాన్వేషణమున ముఖ్యసూత్రములనే ఆధార ముగఁగొని రాజమార్గముననే నడువఁ బ్రయత్నించితిని"అని పీఠికయందొసఁగిన రచనావిధానపరిచయము ననుసరించి నడచుచు వీరు సంస్కృతమున సాహిత్య చర్చ కావించిన లాక్షణికులను రెండుకక్షలకు విడఁదీసి, "ఒకపద్ధతివారు శాస్త్రో దేశము శిరసావహించువారు. రెండవపద్ధతివారు స్వచ్ఛందప్రకృతిమార్గముల ననుసరించి శాస్త్రోదేశమును గొన్ని యెడల మీఱి రసమునే ప్రధానలక్ష్యముగ నంగీకరించి కావ్యలక్షణమును నిరూపించిరి. శాస్త్రోదేశము ననుసరించి కావ్య లక్షణమును నిర్వచించిన లాక్షణికులలో వామనుఁడును, వాగ్భటుఁడును [?ఉద్భ టుఁడు], భోజుఁడును, మల్లినాథుఁడును, విద్యానాథుఁడును ముఖ్యులు. శాస్త్రోదేశ మును ప్రధానముగ గడింపక రసప్రవృత్తియే ముఖ్యసూత్రముగఁ గైకొని కావ్య స్వరూపమును చిత్రించినవారిలో దండి, మమ్మటుఁడును, విశ్వనాథుఁడును, జగన్నాథపండితుఁడును ప్రముఖులు"అని యిరుకక్షలను వర్ణించిరి.

వామనాదులును, మమ్మటాదులునుగూడ తమ తమ మతముల నిరూపించు శాస్త్రగ్రంథములను తామే నిర్మించిరి కాని, వామనాదు లొకశాస్త్రము నాదేశమును శిరసావహించుచు వర్తించినవారును కారు, మమ్మటాదులు నిర్మించినవి శాస్త్ర గ్రంథములు కాకపోవను లేదు. గ్రంథకర్త ప్రధానాశయ మేమన, కొందఱు

భారతి సంపాదక వర్గం 1927



ఎడమ నుండి కుడికి :

కీ॥ శే॥ మల్లంపల్లి సోమశేఖర శర్మ, ప్రతివాది భయంకర రంగాచార్యులు,
కీ॥ శే॥ గన్నవరపు సుబ్బరామయ్య, కొంపెల్ల జనార్దనరావు.

భారతి సంపాదక వర్గ సభ్యులు 1928



ఎడమ నుండి కుడికి :

ప్రతివాది భయంకర రంగాచార్యులు

కీ॥ శే॥ మల్లంపల్లి సోమశేఖరశర్మ

కొంపెల్ల జనార్దనరావు.



ఎడమనుండి కుడికి : 1930

కొంపెల్ల జనార్దనరావు

ప్రతివాది భయంకర రంగాచార్యులు

(శ్రీ తిరుమల రామచంద్ర సుత్తించింది)

(వ్యాకరణాదు లపేక్షించుచు) అదోషత్వ, రీతిగుణా లంకారాది విశిష్టత కావ్య మునకు వలయునని స్వీకరింప, కొందఱు, ఏది యెటులైనను, రసరమణీయతాదులే ప్రధానము లని చెప్పిరి అని. కాని, మొదటి మతము 'లాక్షణికమత' మనియు, రెండవది 'రసికమత' మనియు పిలుచుకొన వీరికి మన సైనది. ఇచట, 'ప్రథమ పీఠము వారు....నియమములను బెంచి ఆదర్శమునకు వైరశ్యమాపాదించిరి' అన్న స్వకీయ 'మిత్రు' లొకరు వ్రాసినది వీరు మెచ్చుచు స్వీకరించి 'లాక్షణికుల'కు సంకుచితత్వము లక్షించి, 'రసికమతము'ను రసికతకు, స్వాతంత్ర్యరతికి శ్లాఘించిరి. ఈ గర్హ్యమతము నర్హ్యమతము వీరిచేఁ బడసిన విమర్శము గమనించి నచో గ్రంథము ప్రధాన సూత్రమున అకళింతకు వచ్చును.

"....కావ్యమునందలి సర్వాంగములు నదోషములుగను సగుణములుగను నున్నఁగాని, కావ్యమున రసముండనేరదని యిమ్మతమువారి యభిప్రాయము" అని వామనాదులయెడ వీరు కసిపట్టినది. రస ముండనేరదేమో యనుతహతహతో, తత్సంపాదనసామగ్రిగా అదోషత్వసగుణత్వాదు లుపాసించిరని వామనాదులను నిరూపింపగల యీ వాక్యము వారిని రసికమతముతో చేర్చి, వారియెడ రచయిత ఇష్టవైరుద్ధ్యమును డీ కొనుచున్న దగుటచే, రసమన ఆస్వాద్యత యనుకొని, వారు ఆ (రీత్యాది) ద్రవ్యములకు ప్రాధాన్య మిచ్చి రన్నదే యిందలి తాత్పర్యముగ స్వీకరింపుఁడు క్షమాసంపన్నులు.

"'అదోషౌ సగుణౌ సాలంకారౌ' అను మాటలను దమవిజయపతాకలపై విలిఖించి కవిని ప్రతిఘటింపఁ జూచుచున్నా" రనిపించుకొన్న 'లాక్షణికుల'లో మొదట పేరు వేయించుకొన్న వామనుడు 'కావ్య శబ్దోఽయం గుణాలంకార సంస్కృతయో శ్శబ్దార్థయో ర్వర్తతే' అనియు, 'రీతి రాత్మా కావ్యస్య' అనియు' అన్నందులకు ఆతని సరదా తీరినది. కావ్యవ్యాపృతిని సంకుచిత మొనర్చుటే లాక్షణికుల తాత్పర్యముగ గణించుటయందు, "సాహిత్య మెట్లు జీవసూత్రబద్ధమై దేశకాల పాత్రానుసారముగ మార్పులఁ బొందుచు, భిన్నపరిణామములఁ దాల్చుచు, నభివృద్ధిఁ బొందుచుండునో గోచరింపక మాన" కుండుటకుఁగా, "విశాలదృష్టితో, సమరసభావముతో సాహిత్యచరిత్రము నవలోకింపఁ" జెల్లు నను ఆశయము, రచయిత పాఠకులయెదుటఁ బెట్టినది, ఆయన చేత 'లాక్షణిక' 'రసిక' మతము లను ఒక్క సంస్కృతాలంకారికులను - బరిశీలించుటకే భిన్నమై పోయినది.

'రీతి కావ్యమున కాత్మ' యన్న యెడ, 'గుణ విశిష్టమైన పదరచన రీతి యని వివరించినాఁడు వామనుఁడు. అలంకారములు లేకున్న యెడను కావ్యత్వము బెడ దాతనిమతమున. ఈ గ్రంథకర్త దెబ్బ తప్పించుకొని, కావ్యత్వము గీయు సందర్భమున 'తదదోషౌశబ్దార్థౌ సగుణౌ' అని విసరిన మమ్మటునిమాటలలో

'సగుణౌ' అను విశేషణమును విమర్శించి రసప్రాధాన్యమును స్థాపించు సందర్భమున విశ్వనాథుఁడు గుణముల కంగీకరించిన రసైకధర్మత్వము, సంకుచితత్వపు అభియోగము నుండి వామనుని రక్షించుచున్న సంగతి విశ్వనాథునివాదము సారమునే అటు నుండి యిటు తిరుగవేసిన, ఫలించును.

శౌర్యాదు లాత్మకువలె, గుణములు రసైకధర్మములు. కావ్యత్వమున అంగీకృతములైన శబ్దార్థముల యందు రస మున్నదనియా, లేదనియా ? రస ముండియే తీరినపుడు సరసములనిచెప్పక సగుణములందు వేల?-అని విశ్వనాథుడు విశ్వనాథుఁడు వీరికి ప్రమాణము. రసమున్నచోట గుణము లుండితీరిన వన్నమాట, విశ్వనాథుని యీ మాటలచొప్పున. మఱి గుణములు లేనిచోట రసముమాత్ర మేదీ ? పోనీ, గుణము లున్నచోట రసము లేకపోవుటెట్లు ! అని ఒకటి. కావ్యమున గుణము లుండియే తీరుచున్నపుడు, గుణము లుండియే తీరవలయును కావ్యమున - అన్న అంశమునకు వర్తించు నిర్వచనము, కావలసిన, విశ్వనాథుని కంటె వామనునకు తత్త్వసూక్ష్మతలనుబట్టి తక్కువ 'మార్కులు' తెచ్చుననుము కాని, వామనుఁడును విశ్వనాథుని వస్తువును పట్టియే యున్నాఁడని తెలును. విశ్వనాథుఁడు గుణములు రసైకధర్మము లన్నాఁడు : వామనుఁడట్లు చెప్పలేదు కావున, ఆతని దృష్టితో ఆతఁ డెంత వఱకు రసవస్తువును ఆవాహించినాఁడో చూచిపెట్టుట మంచిదే.

'తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథఞ్చన,

స్యా ద్వపు స్సున్దరమపి శ్విత్రే ణైకేన దుర్భగమ్'

అని కావ్యమున దోషస్పర్శ సుంతైనను భరింపక,

'శరీరం తావ దిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ'

అన్న ఆదుర్భగమైన సౌందర్యముతో ఇట 'రసిక మతము'న ప్రవేశము కొట్టి, రసమునకును, గుణములకును గూడ అలంకారములం దతర్భావ మిచ్చి భామహాదుల ఆవరణమునుండి కొంతగా వామనుని 'భాయి,' యగుటకు చేయి చాఁపిన దండి, 'కావ్యశోభాకరములగు ధర్మములను అలంకారము లందురు' అని చెప్పఁగా, ఆ మాటలతోనే, 'కావ్యశోభను చేసెడి ధర్మములు గుణములు; తదతిశయ హేతువులు అలంకారములు కాని' అని వామనుఁడు ముందడు గిడి రీతిమతమును పరిణత మొనర్చెను. అట దశగుణములలో 'దీప్తరసత్వం కాంతిః' అని ఒక గుణమును చెప్పి, సమగ్రగుణయైన వైదర్భికి శ్రేష్ఠత్వము నప్పియు, 'ఓజఃకాంతి మతీ గౌడీయా' అని మూఁడిట నింకొకరీతియందుఁ గూడ దీప్తరసత్వమును తాపియు, 'సందర్భేషు దశరూపకం శ్రేయః' అని రస ప్రధానమగు దృశ్య ప్రబంధమునకు అగ్రతాంబూల మిచ్చియు రసపక్షపాతము చూపినవాఁ డాయెను.

విస్తార, వికాస, విద్రుతు లనెడి మనోవ్యాపారముల నేదే నొకటి నెఱపని రచన ఏదెసనుండియు మనసున కాస్వాద్యము కాక, కావ్యత్వద్వారము వెలుపట నొక 'మతము' సాహాయ్యమునకుఁగా పడగాఁపులు పడియుండును. కాక, అట్టి ఆస్వాద్యత సంతరించుకొన్న కావ్యమున, ఆ మనోవ్యాపారములు భజించు ఓజః ప్రసాద మాధుర్యమును, అందు ఇమిడిపోవు వామనుని దశగుణములు, అవి నానిష్ఠములు అయియే తీరునని పెద్ద బోధింపవలెనా ?

ప్రసాద మను గుణము సర్వరసాంతర్యామి యఁటగా !

'రీతి యన్నది సంఘటనా విశేషము. సంఘటన మఱి అవయవసంస్థాన రూప మైనది. ఆత్మ తద్భిన్నమైనది. మఱి కావ్యమునకు రీతి ఆత్మ యెట్లు ?' అన్న విశ్వనాథుని ప్రత్యుక్తికి పాల్పడ్డ వామనుని రీతిమతము, అధమము, విశ్వనాథుని రసమతమున వస్త్వలంకారాదులకు విడిది లేదన్న ఆక్షేపమునకు గుఱి కాని సందర్భములు తన వ్యూహమున ఇముడ్చుకొన్నదని రుజువు చేయుటకు సిద్ధపడు ఒక ప్రయత్నము, వామనాదులు సంకుచితులు కాక ఉదారముగ కావ్యతత్త్వము నారాధించి రనుటకు వినియోగపడఁగల సార్థకత మనకుచాలును. ఈ రచయిత పట్టిన 'కావ్యశబ్దోఽయం గుణాలంకారసంస్కృతయోః శబ్దార్థయోః వర్తతే' అన్న యెడనైన, 'ఉపచారముచే శబ్దార్థమాత్రవచనము ఇట స్వీకృత' మని నుడివి, తొలుత సంతరించిన 'కావ్యం గ్రాహ్య మలంకారాత్; సౌందర్య మలంకారః' అన్న ఏర్పాటుచే, సౌందర్యము కల శబ్దార్థములు కావ్యత్వమున నిల్చునను కట్టుబడి చేసి వామనుఁడు, వెనుకటి ఇష్టార్థవ్యవచ్ఛిన్న పదావళిని కావ్యరూపము నల్లుకొన్న దండి మొదలు, విశ్వనాథుని రసాత్మక వాక్యత్వము వఱకు ఎందును కావ్యాత్మను కృత్స్న నిహితముగఁ బడయఁ జాలమిని, 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్' అని తెగ ముందునకుఁ బోఁబోయి దండివఱకు వెనుకకును వెళ్లినవంటివాఁడయిన ఇటీవలి పండితరాజు ప్రతిభవఱకును, జగన్మోహినివలె దొరకి దొరకక వినోదించిన కావ్యాత్మను నిరోధించుటకు కాని, కోల్పోవుటకు కాని తగిన ప్రయత్నమును కాని, అర్హతను కాని నెఱపె ననుటచే సాహిత్య విమర్శకు లొక్కడుగు ముందిడఁజాలరు. వాల్మీకి కాళిదాసాదుల యేమహాకావ్యము తెచ్చినను, అందఱు లాక్షణికులు నేదో ఒకలెక్కను కావ్యముగనే స్వీకరించి కావ్యసౌందర్యమును ఆస్వదించి ఆరాధించిరి. అయిన, ఆ సౌందర్యము ఏవిచ్ఛిత్తి రేఖలపై నృత్యము తిరిగినదో గుర్తించి వచించుటయందు పలుకులు భేదించుటకు, వఱచినన్ని కారణములు.

'అనలంకృతీ పునః క్వాపి' అన్నందులకు మెచ్చఁబడియు, 'తదదోషౌ శబ్దార్థౌ సగుణౌ' అన్నందులకు, ఏమో, జార్చఁబడ్డమమ్మటునికంటె 'సాలంకార

ములు' అన్న ఒక్క పాపముచేసిన విద్యానాథుఁడు 'జీవితం వ్యంగ్యవైభవమ్' అని, ఈ రచయిత రసికవర్గీయుల సంచికట్టులో లెక్కపెట్టిన వ్యంగ్యమును కీర్తించినవాఁడయ్యు 'లాక్షణికవర్గము'నఁ ద్రోయఁబడినాఁ డన్నచో, వీరు ఒక చాదస్తముగఁ బట్టిన దృష్టి 'అలంకారము' మీఁదనే నిప్పులు కురియుచున్నదో, దాని కసలొక పద్ధతియే లేదో అని రెండును సిద్ధపడును.

ఈ మనఃస్థితికి తోడు వాఙ్మయ పరిచయము (అదోషత్వము వీరికి కిట్టనట్లే) కడు సదోషమనుటకు ఒకటి రెండు మాత్రమే ఉదాహరణములు లెక్కపెట్టుకొను ప్రయత్నము, వీరి సిద్ధాంత రచనలలో సహా ఆగుణము నిబిడితమై ఉన్న యాథార్థ్యమును కొంచెపఱుచుట యగును.

'నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతమ్' అన్న భోజుడు, వెంటనే,

'రసాత్మకం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతించ విందతి'

అన్నను 'తొలిపీతము' వాఁడే అనుటకు ఒక్కటే కారణమని (అసలు సరియైనది ఉన్నచో) ఎట్లు చెప్పఁగలము? "'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్' అను మల్లినాథుని మతము నంగీకరించుటకు గొప్ప చిక్కు తటస్థమగుచున్నది. మల్లినాథుఁడు మహా విద్వాంసుఁడును సుప్రసిద్ధ వ్యాఖ్యాతయుఁ గానఁ గావ్య వ్యాఖ్యానములకు సంబంధించిన మరియాదలను సూచించెనే గాని కావ్యసృష్టిని, నిరోధింపఁగల నియమముల నేర్పఱుపఁదలఁప లేదు. వ్యాఖ్యాతల విమర్శనము లన్నియు సిట్టిఫలితమునే యర్థించుచున్నవి. అంతియేకాని యవి కావ్యలక్షణముగ నంగీకరింపఁ దగియుండలేదు." అని ఒకవ్యాఖ్యానము. కావ్యలక్షణమును విడఁబఱుచుటకంటె ఈకావ్య మర్యాదల సూచించుటయందలి ఇతరమగు తాత్పర్యము మాట యెటున్నను, 'అదోషౌ' మున్నగువాక్యము వ్యాఖ్యాతగ మల్లినాథుఁడు కాక లక్షణకర్తగ విద్యానాథుఁడు వచించినట్టిది. ఈసంగతి మొదటనే తెలిసియుండిన, దీనికిఁగా వీరికి ప్రత్యేకప్రయత్న మక్కఱయుండి యుండదు. విద్యానాథుఁడు కావ్యలక్షణమున గుణాలంకారముల మాట చెప్పినది, ప్రాయశః ప్రాప్తమగు సౌందర్యావయవ నిరూపణముగ అన్వయించుకొని, అతఁడు వ్యంగ్యవైభవమును, రసాస్వాదమును కీర్తించి రసమతము ననుసరించిన వాఁడనుమాట మఱవకుండుట మంచిది. వామనుడు 'రాత్రియామ స్తురీయః కాలః' అని చెప్పినాఁడు కనుక, తెల్లవారుకడ, రాత్రి నాల్గవజామున మాత్రమే కవిత కట్టవలెను, వేఱొకప్పుడు వలదని యాతని తాత్పర్యముగ అనన్యముగ స్వీకరించుటయు, దానికిఁగా నాతని గర్హించుటయు నన్నవి బాఱెఁడిటు, బాఱెఁడటు తగులును. అది ఒకపరిశీలనము, ఒక ఉపదేశము శాస్త్రములు ప్రభుసమ్మితము లనుటయందు వానియెడ అహం

కార, దుర్గర్వ సమ్మితములు చెప్పుకొనుట ఎప్పుడును తగియుండలేదు; క్రీస్తు శకము ఇరువదియవ శతాబ్దికి మఱింతతగదు. వానియెడ పాలక, రక్షక సమ్మితములేవో చూచుకొని, ఉన్నదానికి వ్యవస్థ సవరించుట వాని ఆశయమని స్వీకరించిన, వానిపదవి పూజింపఁబడ్డదే యగును: అంతకు దాఁటిపోవనందులకు సంతుష్టము కూడను. విద్యానాథునిదే అనుకోఁబడిన

'కావ్యం యశసేఽర్థకృతే'

అన్నపద్యము, కావ్యప్రయోజనముల నుగ్గడించున దగుటచే, వేతొకతావున విమర్శపడసినది. మమ్మటుని 'కావ్యప్రకాశము' లోనిదని 'ప్రతాపరుద్రీయము'న నుదాహృతమైన యీశ్లోకమును విద్యానాథునిదే యనుకొని వీరు ఎదుర్కొన్నారు.

'హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్'

అన్న స్వేచ్ఛారుతులచే వీరి మెప్పునొడిచిన మమ్మటుఁడే అది వచించెనని యెఱిఁగియుండుచో, వీరు మమ్మటుని రెండుగా చీల్చుకొనక సామరస్యము చూడ యత్నించి యుందురన్న ధైర్యము కాలాఁగకున్న, అట్లు యత్నింపఁదగియుండెడిదని వాదించుకొందము. ఆ మమ్మటుఁడు 'తదదోషౌ శబ్దార్థౌ సగుణౌ' అని నుడివిన భాగము చూడకయే 'అనలంకృతీ పునః క్వాపి' అన్న భావనమును వీరు మెచ్చుకొనిరని మనలను ఎవ్వరును నమ్మమనుటలేదు. మరి యెందులకు అట్లు దాఁటవేసిరన్నది సమన్వయము చేసికొనుటకు మనము ప్రయాసపడుట కేమికాని రీత్యలంకారాదులయెడ వీరి అనిష్టతకు, వీరి అనుభవమున తెలుఁగు సాహిత్యము నావహించిన స్థితిగతులు, ఆధునికుల తిరుగుబాటును, దానియెడ వీరి అనుబంధములును వీరి మనసున కారణము కట్టిన వనుమాట చాలవఱకైన నిజమగును. వీరి సిద్ధాంతములు, మతములు కూడ వీని ప్రోద్బలమునకు బాంధవము చూపునవే.

తుదకు వీరు రసికమతమునకు మూలసూత్రముగ చేతమిగుల్చుకొన్న విశ్వనాథుని "వాక్యం రసాత్మకం కావ్యం" అన్న 'చక్కని రాజమార్గము' కూడ వీరి యీ పక్షపాతమునకు, స్వాతంత్ర్యమునకు లోఁబడినది. తమ స్వతంత్రమగు దర్శనశక్తిచే రసకుటుంబమునకు అర్థసూక్ష్మతలు తెచ్చినచో వీరి విమృశ్యతాపీఠము వేఱుగనుండును కాని, విశ్వనాథుఁడు ప్రమాణ మనుమాట తుదివఱకు మీటుచు, లాక్షణికుల మాటలకు సొంతఅర్థములు ఆపాదించి వారి మతముకానిది వారి మతముగా అన్వయించి చెప్పుటకుఁగాను, వీరి స్వాతంత్ర్యము భాషాపచరియలోపముతో నెయ్యము సలిపినది.

'సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్,
యావద్రసం వర్తమానః స్థాయీ భావ ఉదాహృతః'

అన్న శ్లోకమునకు,

"సజాతీయములను విజాతీయములును నగు భావములచే, మార్పుచెందని మూర్తిగలదియు, రసమునంతయు ప్రదర్శించునట్టిదియు నగుభావమే స్థాయీ భావమని చెప్పఁబడినది."

"ప్రధానభావము తదనుగుణములును విరుద్ధములును నగు భావములచే మార్పునొందక రసమును సర్వమును ప్రదర్శించుననియే పండితరాయల నిర్వచనముయొక్క యర్థము" అని వీరి వివరణము. 'అతిరస్కృత-' అనఁగా 'మార్పు చెందని-' అన్నఅర్థము మాట అటుంచుదము; 'యావద్రసం' అనఁగా ('రస పర్యంతము' అనుటకు) 'యావత్తు రసమున్ను' అని తెలుఁగు నుడికారము సొంపును, 'వర్తమానః' అనఁగా ('ఉండునట్టిది' అనుటకు) '(*to*) *Present*' (వర్తింపఁజేయు, ఎదుటఁబెట్టు) అను ఆంగ్ల బాంధవమును చొనిపి వీరు కావించిన అర్థవివరణము కడువిచిత్రము. కాని యిది యీవ్యాఖ్యాన లోకమునకు మొదటి దృశ్యములలోనిది. 'రస' సామగ్రిని గూర్చిన వీరి అవగాహనము చాల తెలుసుకో నున్నది.

'స్థాయీభావమే రసము' అని ప్రతిపాదించుచు, "స్థాయీభావమునకు ప్రధానలక్షణము విభావాదికముచేతను, విరుద్ధములగు సంచారీ వ్యభిచారాది భావములచేతను విచ్ఛిత్తి నొందక, యచలమై, చిరస్థాయియై, సర్వభావములను నాత్మ రూపమును దాల్చునట్లుగఁ జేసి వాని యన్నిఁటికిని స్వకీయవాసన నొసంగు ననుటయే" అని యొక ప్రబోధము. స్థాయిభావము (అసలు స్వజన్మకారణమగు) విభావములచే విచ్ఛిత్తి నొందుట, - పోనీ పొందకపోవుట, - (ఏకార్థకములగు) సంచారి వ్యభిచారి భావముల భేదము, స్థాయియెడల (రసనిష్పత్తికి తోడ్పడు) సంచారి (రీవ్యభిచారాది) భావముల విరుద్ధత, వాసనాశబ్ద విభ్రమము - మున్నగు ప్రశంసలు విమర్శనోత్సాహమునకు నిర్వేదము రుద్దునట్టివై ఉపప్లవించెడివి.

వేతొకచో నిట్లే 'భావ' శబ్దవ్యాఖ్యాన సందర్భమున, "దృష్టికి గోచరము లగు వస్తువుల దర్శనమువలన జనించిన సుఖదుఃఖాది భావములచే హృదయావేశమునొందు నవస్థయే భావమగును. ఇయ్యది భావనవాసనయను పదములనుండి జనించినది. ఇతరవస్తువులకు సైతము సువాసన నొసఁగు భావమే యిచట గ్రాహ్యము" అన్న వాక్యార్థము వీరి లాక్షణికతా నైశిత్య మెంతటిదో తానుకూడ చూపుచున్నది.

'స్వాద' నిర్వచనమని చెప్పుచు వీరు చెప్పినది వీరియెడల మన మొక అవస్థను స్థిరపఱుచుకొంటకు సాధనముగనైన గమనింపవలెను.

"మనలాక్షణికులు రసముయొక్క బాహ్యస్వరూపమును నిరూపించు సందర్భమున,

"స్వాదః కావార్థసంభేదా దాత్మానంద సముద్భవః' అను సూత్రమును గావించినారు. వానికి 'కావ్యార్థేన విభావాదిసంసృష్టిస్థాయ్యాత్మకేన భావకచేతసః సంభేదే ప్రత్యస్తమితస్వపరవిభాగే సతి ప్రబలతరస్వానందోద్భూతి స్స్వాదః' అను వ్యాఖ్యానము గావింపఁబడినది. ఈసూత్రవ్యాఖ్యానముల రెండింటివలన వ్యక్తమయిన భావము లేవన :—

"స్థాయీభావమునకు విభావాదికమును గలిగిన కావ్యమునందు వర్ణితము లయిన వస్తువులతో మనసు పూర్ణముగ స్వపరభేదము లేకుండ లగ్నమగుటవలన జనించు ప్రబలతర స్వానందానుభూతియే స్వాదము. కావ్యమునందు స్థాయి సంచారీ వ్యభిచారిభావములు ప్రదర్శింపబడును. అనేకవస్తువులు వర్ణింపఁబడును. అట్లు వర్ణింపఁబడిన వస్తువులయందుఁ గవియొక్క మనసు లగ్నమయినప్పు డనఁగాఁ గని నేను, ననుభావమును వీడి వర్ణించువస్తువునందే లక్ష్య ముంచి యిహమును వీడి వస్తువునందు లీనమయిపోవునపుడు తత్ఫలితముగఁ గవికిఁ బ్రబలతరానందము జనించితీరును. అట్టి యానందమునే మన లాక్షణికులు స్వాదమని నిర్వచించిరి. స్వాదమనఁగా స్థూలముగఁ జెప్పిన రసపారవశ్యమే!"

ఈ తెలుఁగువివరణము సంస్కృతవాక్యావళి అర్థమును తాత్పర్యమును తప్పినదికాక, ఒక ముఖ్యమగు విషయమును తెలియఁజెప్పుచున్నది. వీరు ఎంత సేపును రసాదికము కవి కావ్యము వ్రాయునపుడు పొంగు నడతగా అన్వయించుచు వత్తురు. అసలు, మన లాక్షణికులు కవి ప్రతిభావిశేషము కారణముగ కావ్యసృష్టి విలసిల్లు ననుటతో—ఆ ప్రాంతముల-విషయిపరమగు (*subjective*)పరామర్శము వదలి, (*objective*) సంభావించి చర్చించి రనుమాట ఇట్టే అనుభవసిద్ధమగుచుండ వీరు విశ్వనాథుని 'రసాత్మకం వాక్యం కావ్యమ్' అన్న సూత్రమునుప్రమాణముగ స్వీకరించియు విశ్వనాథుని రసాదినిర్వచనములను పాటింపక సొంత అర్థములపై నడచుటయేకాక, అవి లాక్షణికుల నోటనే క్రుక్కఁజూచుట కర్తవ్యతాగౌరవమును ఒకటి రెండుసార్లు కోల్పుచ్చుచున్నది. తమ కాల్పనికార్థములఁబట్టి లాక్షణికుల భావములు వీరికి సరిపడమి వింత కాదు; మఱి దానిపై వీరి యాతీర్పులును వింత కావు :

"రసప్రవృత్తికి నకారణజనితస్వాదమే కారణమని మనవారు గ్రహించినట్లు స్పష్టముగఁ దోఁచుటలేదు. మనవా రెంతవఱకును నవస్థాదికమున భావము పరి పక్వము నొంది తుదకు స్థాయీభావముగ పరిణమించునని తెలుపుచున్నారు. మామతమున, రసము చిత్తపరిపాకము ననుసరించి రససందర్శనానంతరమున జనించి పర్యాలోచన మనఁదగు విభావానుభావాది వివిధావస్థల యనుభూతివలన స్థాయిత్వము నొందుననియే."

చాలసేపటివఱకు స్థాలీపులాకత్వము అతిక్రాంతము కాదు. వీరి రస భావమును దెలుపు కొన్ని వాక్యములు ఒక్కటిగా కుప్పవోసికొందము: వీరి పరిశీలనము పెక్కుముఖముల తెలియవచ్చును.

౧. "రసమునకు వ్యుత్పత్తి ననుసరించి 'ఆస్వాదింపఁబడునది' యని యర్థము కలుగుచున్నది. స్థూలముగఁ జెప్పిన, రసము మానవహృదయముల నాకర్షించు వస్తుసౌందర్యమే."

౨. "ప్రకృతియొక్క గాని, మానవజీవితముయొక్కగాని సందర్శనము వలనఁ గవియందు జనియించెడు స్థాయీభావమే రసమగుచున్నది."

౩. "ముఖ్యముగ సూచితమగు నర్థ మేమనఁగా కవిమనమునందు వస్తు సందర్శన బలమున జనించు భావోద్రేకమే, భావానుభూతియే రసమని."

౪. "రసము మొదట తీక్ష్ణభావముగ జనించి విభావాదికముల పరామర్శచే తుదకు స్థాయీభావము నొందును.'

౫. "రసము జనించునపుడు స్థాయీభావముగఁ జనించునా? లేక స్థాయీభావముగఁ బరిణమించునా? మామతమున రసము మొట్టమొదట మెఱపుఁ దీవయుం బోలె నిశితతీక్ష్ణతగల కాంతితో జనించి కవికన్నుల మిఱుమిట్లుగొల్పును. అనఁగా, జనించునపుడే రసము తైక్ష్ణ్యము గలిగియుండి స్థాయీభావ మనందగి యుండును. కాని స్థాయిత్వము మాత్రము చిరానుభూతివలన స్థిరీకరింపబడఁ దగిన దగుటచేఁ బిదపఱకు సిద్ధించును. కాని మొట్టమొదట జనించు రసానుభవమున స్థాయీభావమున కుండవలసిన నిశిత తైక్ష్ణ్యము పూర్తిగ నుండును."

౬. "నిశితమగు భావతైక్ష్ణ్యము కావ్యమునఁ జిరస్థాయిగా నేకరీతిం బ్రదర్శించుట దుస్తరమును, దుర్భరమును.... మొదటినుండియుఁ జివఱపఱకు వైవిధ్యము లేకుండ నేకస్థాయిని గవిరసమును బ్రదర్శింపఁ బ్రయత్నించిన నది విసువుఁ గల్గింపక మానదు. ఎల్లప్పుడును ఏకార్థమును సూచించు మాటలతో నిండియుండినఁగాని యేకాగ్రత సూచించు రసభావము ప్రదర్శితము కానేరదు.... విసువును రోఁతయు జనింపకుండుటకై కవి సాత్త్వికవ్యభిచారాదిభావములను, విభావానుభావములను దగురీతిని బ్రసరించి కావ్యమున రసమునకు వైవిధ్యమును వాహ్లాదకత్వమును గల్గింపవలెనని మన లాక్షణికుల యభిప్రాయమై యున్నది."

౭. "రసమునకు పర్యాయపదమనఁదగు స్థాయిభావము...."

వీరు మన లాక్షణికుల ప్రధానసూత్రము ననుసరించుట యన్నది వీరి ఆశయము వఱకును, పదజాలము నునికివఱకును మాత్రమే సత్యమగుచున్నది. వారి రాజమార్గము గాదు, అసలు వారిమార్గమే పట్టఁబడలేదనుట కెంతయో తరువాయి లేదు.

కాని, "రసమునకు కారణము ఆధ్యాత్మికము కాని భౌతికము కాదు" అను ఉత్సాహమెత్తి రస ప్రవేశమునకు మెట్టుకొనిన వీరి ఫలితము రసతత్త్వమునెడ వీరివిధేయతను చూపుచు, వీరిమాటల పరిసరములకు లాక్షణికుల రసకల్పమును, విమర్శాత్మకముగనే, ప్రసరింప వీలు కొలుపును.

"వస్తుసందర్శనమువలనఁ గవియందు జనియించెడు స్థాయీభావమే రస మగుచున్న"దని, "కవి స్థాయిభావము నలవఱచుకొనవలె" నని వీరు చెప్పుటలో అర్థము కొంచెము వ్యాఖ్యాశ్రయమై ఇచ్చట సరిపడనిదిలే. ఒకానొక స్థాయి, రతి, నాయికా నాయకులు ఆశ్రయముగ, ఆలంబముగ (కవినికాదు ఆశ్రయించినది) మొలకెత్తినది. వారు ఆలంబనవిభావము. అది ఉద్దీపితమై, పరిపుష్టి గాంచి, ఆస్వాద్యతకు వచ్చిన దగుచు శృంగార రస మయినది: దాని ఆస్వాద్యత మనకు—సామాజికులకు, పఠితలకు. కవి యిదియింతయు సృష్టించిన అలౌకిక ప్రతిభాశాలి. రససాక్షాత్కార మయినవెనుకనే కవి సృష్టికిఁ బూనుకొనుట యన్నదిస్వానుభవ మగుచుండ, లాక్షణికుల రసముముగ్గులు ఆమొదటికి అంట లేదనుటకు వీరు సిద్ధపడుటయం దాశ్చర్యము లేదనుకొందము. రసము మెఱపుఁ దీవవలె దర్శన మిచ్చుచుండ, విభావానుభావాది క్రమము రసనిష్పత్తికి అవినా భూతములనియు వీరెట్లు స్వీకరింపగల్గుదురు? అనఁగా, లాక్షణికుల రసపాక క్రమము మెఱపుఁదీవదర్శనముకంటె చాలకాలము ఆక్రమించునని యిట తాత్పర్యము. "కవిమనమునందు వస్తుసందర్శనబలమున జనించు భావోద్రేకమే, భావానుభూతియే రసము''—అన్న వాక్యమునకు సరిపడియే యుండునీమెఱపు. కాని దీనిజన్మప్రకారము పరిశీలించిన, ఆవస్తువులు, తత్సందర్శనము మున్నగునవి విభావాదులుగనే విడివచ్చినవై లాక్షణికుల సూక్ష్మ సౌందర్య విజ్ఞతను విరఁజిమ్మును. కవిసృష్టియు తిరుగ నా అనుభవము త్రోవనే, విభావానుభావాది క్రమమునే, భజించును. "భావమెప్పుడును జన్మాంతరసంస్కారబలమునఁ గవికి వస్తుసందర్శనముఁ గావించిన నిమేషముననే లబ్ధమగు'' ననుటకు, "రసము జనించునపుడు తైక్ష్ణ్యము గలిగియుండు'' ననుటకు,—రససాక్షాత్కార విధాన మునకు— ఉదాహరణముగ వీరొసంగిన వాల్మీకి కవి చరిత్రము 'మానిషాద....' అన్న ఆద్యపద్య ముదికించిన కరుణరసావేశముకథ, ఈ విభావాదిక్రమముననే యాశ్రయించిన దగుట, రససమారాధకులు తమకు కావలసినదే అదిగా వివరించి ప్రసిద్ధమే చేసియున్నారు అదియే వీరును ఉదాహరించియు లాక్షణికులయెడ భేదము చూచుట వారిని సరిగా అర్థముచేసికొనకుండుటచేతనే యని ఒక్కమాటలో నుడివిన చాలదు. రసమనఁగా చిత్తవికారమనియు ఊరకే వ్యాఖ్యానించినది కాదు వీరు,

లాక్షణికుల మతమున, పూర్వరాగవిప్రలంభ శృంగారరసమున వెలయు కామదశాదశకమును వీరన్వయించిన విధము వీరి రస సంభావనమును కొట్టవచ్చి నట్లు చూపును. అసలా దశావస్థలు రససిద్ధిక్రమమున మెట్లని వీరి అవగాహనము-స్వకీయ కల్పనమైనను గాదు. పాత్రముల సంస్కారసంపన్నతనుబట్టి కవి-సంస్కారశాలియగు విద్యార్థికి పాఠములు త్వరలో ముగియునట్లు, - ఉచితము లగు కొలఁదియవస్థలు మాత్రమే కల్పించునఁట.

"కొందఱు పాత్రములు (?) చూచుటతోడనే భావోద్రేకము నొంది రస పారవశ్యముఁ జెందుదురు : మఱికొందఱు చూచినతోడనే భావోద్రేకము నొందక, యేదో యొకరీతిని జీవితము వెళ్లించుచు వివిధావస్థలనొంది తుదకు రసస్పర్శ ననుభవించినవారు గలరు."

('రస' మనఁగా చిత్తవికార మయినట్లే 'పాత్ర' మనఁగా జీవి, మానుష వ్యక్తి, యన్నమాట. ఇది లాక్షణికుల యర్థమే యని మాత్రము వీరు చెప్పలేదు; కాని అట్లు కాదని వీరికి స్ఫురించినట్లే మనకు తెలియదు.)

పూర్వకాలపు టమాయకులందు భావోద్రేకము గాని రసపారవశ్యము గాని యేమాత్రము ననుభవింపక గతానుగతికము లగు లోకమర్యాదల ననుసరించి జీవితముఁ గడపుచు నేయొడిదొడుకులను ననుభవింపక స్వస్వరూపమును స్వాత్మోపలబ్ధియు గ్రహింపనివారై జీవితములఁ జాలించువా రెందఱనుగూర్చి మనము విని యుండలేదు?"

"మన పెద్దల కాలమున నిప్పటి భావోద్రేకమును నిప్పటి రసావేశమును దక్కువగనే యుండెను. ఇప్పటి కాలముననో యువతీయువకులు అవాచువ్వలఁ బోలె భావోద్రేకమున ఱివ్వనఁ బై కెగయుచుందురు. చూచుటతోడనే రసావేశము ననుభవించు ప్రణయినులు నేఁటికాలమునఁ జాలమంది గలరు. అట్టి రసహృదయులకుఁ జూచుటయు, భావానుభూతి నొందుటయు, రసపారవశ్యము నందుటయుఁ గూడ నేకక్షణజనితములే యగును. వారికి మనయాలంకారికు లుపదేశించిన దశావస్థల యంత్యపరిణామ మతఁడగు రసపారవశ్యమును రససిద్ధియు నేకక్షణముననే లభ్యమగును, అందులకనియే కవి పాత్రములయొక్క శక్తులను, చిత్తవృత్తులను, చిత్తసంస్కారములను లక్ష్యమున నుంచుకొని దశావస్థలలోఁ దగినవానిని ననుభవించునట్లు చేయఁదగును. సింహమునకు మృగరాజ ఠీవియు, మత్తేభహనన శక్తియు నేయవస్థాదికమును గ్రమాంతరముగ ననుభవించుటచేఁ గలిగెను? ...."

దశావస్థలు వీరు ఏకరువు పెట్టకపోలేదు. అందు తుదను మరణము లేక పోవనులేదు మఱి ఆమరణ దశాదశకము ననుభవించిన పై రససిద్ధి, జడయఁ బడునని లాక్షణికుల మతముగ కాని, జడత్వము పొడవున అవస్థలు పదివఱకు

మొలచును రససిద్ధి నంతరింపఁగలవని తమ అంగీకారముగ కాని వీరు ఎట్లు వివరింపఁగలిగిరో తెలియదు. (అథవా, మనకు తెలియునులే. ఇట రససిద్ధియందు వీ రిముడ్చుకొన్న తాత్పర్యము పెక్కుచోట్ల వ్యాఖ్యాతమయి కానవచ్చును.

"రసము స్థాయీభావము నొందినప్పుడు అన్యవిషయములు స్మృతికి రాకుండును. స్థాయీభావముచే నావహింపఁబడిన రసహృదయులకు నిజభావనా ప్రపంచము దక్క నన్యప్రపంచ ముండదు. సీతారామచంద్రులకును సౌఖ్యసమయమునఁ బ్రపంచము సర్వమును స్మృతిదూరమై, 'అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణత (?)'చేఁ బరవశులయిన వారికిఁ దాము గావించుకొనుచున్న సల్లాపముల యందలి యాసక్తిబలమున రాత్రియంతయుఁ గడచినసంగతి కూడ గోచరింప దయ్యెను గదా! ఆహా! సౌఖ్యానుభూతియన్న, రసానుభూతియన్న నిట్లే యుండవలయుఁ గదా?"

ఇంద్రియ జన్యమగు సౌఖ్యానుభూతియే వీరిమతమున రసము. ధర్మ అర్థ మోక్షములు ఒరగి,—

"రసమునకు మానవసహజ మగు కామమాశ్రయము."

"మానవసహజమగు కామము నేయే పద్ధతుల ప్రకారము రసముగా మార్చి వర్ణించును? కోరికలు రసికులచేతులలో నెట్టిమార్పులను, నెట్టియవస్థాపరిణామములను బొంది రసస్వరూపముతో బయల్వెడలును?" అని కొన్ని శంకలుగా కామప్రవృత్తి యడుగులిడినది. లోకమున రసము ఒకటి, కావ్యమున రసము ఒకటి- రసము రెండువిధములని వీరి ఆశయము. కామమున రసము లేవేవి యెట్లెట్లు ఫలించునో చెప్పుటకు పూనుకొని వీరు శ్రమపడలేదు.

మన లాక్షణికుల రసము వట్టి సాత్త్వికపు మొగము. వారు పాత్ర సామాజికుల కగు 'సాధారణీకృతి' పై వీణవాయించి, 'కామలోభాది బీజభూతములగు రజస్తమస్సులచే అస్పృష్టమైనదై బాహ్యవస్తు విముఖతాపాదకమగు సత్త్వమను మనోధర్మము, అలౌకిక కావ్యార్థ పరిశీలనమున ఉద్రేకించి, అనగా రజస్తమస్సులను అభిభవించి ఆవిర్భవించి,.... బ్రహ్మాస్వాదసహోదరమగు రసమును ఆస్వాద్య మొనర్చు'నని వచించియు,

'పారిమిత్యా ల్లౌకికత్వా త్సాంతరాయతయా తథా,
అనుకార్యస్య రత్యాదేః తదోద్భోధో న రసో భవేత్'.

అనుచు అనుకార్యులగు రామాదుల (పరిమితత్వ, లౌకికత్వ, సాంతరాయత్వములు భజింపక గతిలేని) రత్యాద్యనుభూతికి రసత్వము లేదని వీరిమతమునకు కత్తివాదరగ స్థిరీకరించినారు - 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అన్న నాలుకనే,

రసానుభవ మలౌకిక వ్యాపార మనియు, రసమునకు కారణము ఆధ్యాత్మికము కాని భౌతికము కాదనియు నుడివి. వ్యాసవాల్మీక్యాదులను కావ్యనిర్మాతృ, కావ్యకారులకంటె భిన్నముగ కవిబ్రహ్మలగుదురని ఉత్తమ పీఠమున నిలిపియు, రసమును పరిమితత్వ, లౌకికత్వ, సాంతరాయత్వములు భజించు రాజస తామస వ్యాపారనిర్విశేషతలో ఊరఁ ద్రొక్కిన వీరి ప్రయత్నము, కవులనిపించుకొనువారు తమ చిత్తవికార క్రమములన్నిటికి గౌరవాతిశయమే పదయవలయునను హక్కులు రచింపఁబోవును.

విషయిముఖమగు (*Subjective*) కవితయందు, కవి తన అనుభవమును తిన్నగ వెలువరుచునపుడు అనుభవమును పట్టిన రజస్తమస్సులు సత్త్వమునకు చోటిచ్చెనాయని 'చిత్తవికార'పరులు ప్రశ్నించుట యందును, అట అతీంద్రియము కాని చిత్తవికారమే స్థాయియై రసమైనదని వారు తలంచుటయందును వైపరీత్యము లేదు. విషయపరమగు (*Objective*) కావ్యముననను కవి వస్తువు నాశ్రయించి తన ప్రవృత్తిని రగుల్చుకొనుచు, విషయి కావ్యమున వలెనే, అనుభవ ప్రాభవముల విసరు ననుభవించుచునే యుండును కాన, రెంటను కవి చిత్తవికారమే రసద్రవ్యమని వారు జండా యెత్తఁగలరు. సీతావియోగమున రాముఁ డేడ్చుకథ చూడనో, చదువనో సామాజికుఁడు, పతిత తనంత తా వలచివచ్చుట రామునివలెనే పత్నీవియోగముననే యేడ్చుటకై కాదు. ఈ ఆస్వాదమునందలి భావకచేతస్త్వమే సర్గ ప్రతిభావలిత విశిష్టమై కవిపట్ల వర్తించి, రాముని ప్రవృత్తియెడ కవి ప్రవృత్తి భిన్నతను నెఱపుచున్నది - భావకచేతసులే చుగు సామాజికుల అవస్థకంటెను విశేషము ప్రదర్శించుచు

ఎందఱో ఏడ్చువారిలో ఆ ఫలానవారు కవి అనుకొని, వారియేడుపు విషయికావ్యము అని నిదర్శించినది లక్షణముగాదు. కావ్యము వ్రాసినవాడు కవి, కవికర్మ కావ్యము అన్నట్లు - దేనివలన అతఁడు కవి అయినాఁడో (అతని) ఆకృతి కావ్యము. (ఈపేచీ ఇంతటితో తేలునది కాదు.) మఱి కావ్యమయిన దాని కెల్ల - అది విషయపరమైనను, విషయిపరమైనను - ఒక్కటే లక్షణము మన మాస్వాదింతుము. అనఁగా, విషయకావ్యమున నెట్లు పత్నీవియోగమున కేడుపక పత్నీవియోగమునకు రాము నేడ్పించి చూపునో, అట్లే విషయికావ్యముననను కవి ప్రవర్తించును. తనను తానే (అసంలక్ష్యముగ) విభావించుకొని, తనను తానే (రామునివలె) విషయముగ చేసికొని, రసరచన సంతరించును.

కవిదృష్టి కొక ఆవరణము (*atmosphere*), క్రమ్మి యుండు నన్నాఁడు వాట్స్ - డంటన్ పండితుఁడు (*Theodore Watts - Dunton*). అది కవికి సహజ విభావనాసామర్థ్యము—*a spontaneous faculty for idealisation*

అని చెప్పవచ్చును. అది లేనిచో రసోదయమే లేదు. అనఁగా విభావనకు వలయు సత్త్వము నెఱుఁగని చిత్తవికారము రసము కాలేదు. ఆతని సృష్టి అపార కప్పుకొనియే అవతరించి సామాజికుల కఁడ్లకు విభావన నేర్పును. ఇచ్చట, సామాజికులపట్ల మన రసికులు (ఒప్పుగ) సత్త్వోద్రేకమునే కనిపట్టిరి. కవి ప్రతిభ సర్గక్రియకు వేదనపడునపుడు ఈ విభావన దూరము తొలఁగి నిలువదు. ఎన్నఁడో ఎక్కడనో జరిగిన సంఘటనము, ఎదుట లేని దయ్యి, స్మృతిపథమున వచ్చి అమూర్తముగ వర్తించురీతిని, కవికి అనుభవము అనుభవింపఁబడు వేళనైనను భావుకమగు తన స్మృతిపథమున మ్రోఁగఁగలదని యీ విభావనకు అంచుకట్టిన ఒకవర్ణనగా చెప్పవచ్చును. మఱి ఆతఁడు కవియే అయినపుడు కవిచిత్తవికారమే రసమని నుడివినది యిందులకు భిన్నము కాదేయని ఈ విమర్శకులు ఉల్లాకు చూపవత్తురు : రాముఁడు తనదే యగు సౌఖ్యానుభూతి యందు వీరి ఉల్లాకు చివుకఁబెట్టి, ఎల్లరదగు రసానుభూతికి వంచన తప్పించినాఁడు.

రసకల్పము నేఁటి కావ్యవికాసమువఱకు ప్రయోజ్యమగు రహస్యము వివృతము కాఁగల అవకాశము ఈ గ్రంథమున భగ్న ప్రణయమయినది.

కవికి బ్రహ్మత్వ మంగీకరించుచు కావ్యస్వాతంత్ర్యము ధ్వజాంకముగ పట్టఁబడిన మహోత్సవమున శాస్త్రములకు తగిలిన దెబ్బలు లెక్కలేవు.

"సాహిత్య"మను ప్రయోగము మనలాక్షణికులకు కావ్యలోకమునెడఁగల తాత్పర్యమును వీరి భావమునకు భిన్నముగ నెఱుఁగఁజెప్పును. సాహిత్యమునకు కవితతో సంబంధ మేమని యెవ్వరందురు—'సందితమపి సాహిత్యమ్' అన్న సూక్తి ఆస్వదింపఁబడు వాడుకయు, కావ్య తత్త్వనిరూపణమునకు సమర్పితమగు అలంకార శాస్త్రమునకు 'సాహిత్యశాస్త్ర'మను అభిధానమును మఱవనివారు?

"కవిని బంధించుటకయి మనవారు తయారుగావించిన శాస్త్రశృంఖలలను ఛేదించుటకుఁ బ్రయత్నింతము....లాక్షణిక సైన్యముల నతిరథులు, మహారథులు, నర్ధరథులుఁగూడ నున్నారు. వీరిలో వైయాకరణు లతిరథులు. పాణిని యేపుణ్యదివసమున భూమిపై నవతరించెనో కాని, యానాఁటినుండియు నీ వైయాకరణుల యధికారము నిరంకుశముగను, నిర్వికల్పకముగను సాఁగుచునే వచ్చినది....."

అన్న ఉపక్రమణిక సుగమార్థము : కవిని బంధించుటకై శాస్త్రములు తయారైనవని చాలమంది నేర్చుకోవలయును.

తెలుఁగు వ్యాకరణమును వీరు తెలుఁగుకళ్ళతోఁ జూడక, 'ఆంధ్రవైయాకరణుల యధికారనిర్వహణము' నెంచి, 'సంస్కృతవైయాకరణులచేఁ గల్పితము లగు నియమములు చాలవని కాఁబోలు, మనయాంధ్రలాక్షణికులు నర్ధానుస్వారము, రేఫఱకారములకు భేదము, చజలకు భేదము, మొదలుగాఁగల నియమములను నేర్పఱచిరి" అని గర్హింప నిచ్చగించిరి. సంస్కృతము సోకుఁడే యెఱుఁగక కేవలము తెలుఁగువాఁగున నడచు అధ్యయనము సంస్కృతమునకు ఈమాటవలన కట్టఁబడిన అసంగత ప్రాభవమునకు తనకడప దాఁటనీయదు.

కాని, అంతవఱకు శ్రమ అక్కఱలేదు. వీరి మాటలయందే ఒకవిభీషణ చ్ఛాయ యున్నది. "సదసద్వివేకులగు పాఠకులు కొండొకయెడ నర్ధానుస్వారమును గవి ప్రయోగింపకున్నను సందర్భము ననుసరించియు, బుద్ధిబలము నను నర్థము గ్రహింపలేకపోరు"—అని వీరు పాఠకుల తెలివిలో కొంత అదుకఁ గోరుదురు; దాని ఆశ్రయము నపేక్షింపక భాషాసౌష్ఠవము నర్థించిన 'ఆంధ్రవైయాకరణుల' సహజోద్యమమును, ఎవరిచేతనో కల్పితములైనట్టివి నియమములు చాలవనియఁట. ఇంకను నియమముల నేర్పఱచుటగా వ్యాఖ్యానించుట ఒక సరియగు ప్రయోజనము నెంచియే యనుటకు అనికలు చాలవు. "అర్ధానుస్వారములకుఁ ప్రయోజనము శూన్యమని చెప్పవలను పడదుగాని, తదభావము మాత్రము గవికి శాశ్వత ఘోరనరకప్రాప్తి నాపాదింపఁగల మహాదోషముకా" దని వీరి 'విజ్ఞప్తి'. ఇది వీరి అంతటి గర్హ కెట్లు తోడుపడునని చెప్పఁగలము?

శాస్త్రములయెడ ఇట్టి ఆశయములతో నడచిన నడత యింతటిసార్థకతను మించదాయెను.

కాని యీ పోకడలకు కారణము మాత్రము ఈ పోకడలయందే కొంతగా తనగొంతుక చాఁచినది.

"వైయాకరణులతో మనకుఁ బెద్ద పోరాటమాయెను. వారిని వీడి రసిక పథమునఁ గావ్యతత్త్వాన్వేషణ పరులమై చనియెదముగాక! కాని విరోధివర్గ మింకను నాశము కాలేదే? అరుగో తార్కికులు, నైతికులు, ధర్మవేత్తలు మొదలగు నతిరథార్ధరథ శ్రేష్ఠులు బాణులు తీఱి యుద్ధపరికరములతోఁ గావ్యరసాన్వేషుల నెదిరింపఁ జూచుచున్నారు. కావున మనకు వీరితోఁ బోరాటము తప్పదు. ద్వంద్వయుద్ధమే కరణీయము. ముందుగఁ దార్కికుని నోడింప యత్నింతము....కవి సహజముగ పక్షపాతి, అభిమాని, చిత్తవికారములకు దాసుఁడు; పక్షపాతము, నభిమానము, చిత్తవికారజనితమగు వ్యామోహమును లేనిది కవిత పుట్టుటయే యసంభవము. కావున కవిత ప్రభవిల్లవలె నన్నఁ దార్కికుని దూరముగఁ దొలఁగిపొమ్మనుట యవశ్యకరణీయమ్ము."

ధ్వనిమత స్థాపకులంతటి కావ్యమర్మజ్ఞులు భాషకు సంబంధించిన సర్వ విషయములకు ఆదొపూజ్యులని వైయాకరణుల కీర్తించిన సంగతి యెఱుఁగుదుము. తార్కికుఁడు కవిని 'నీవు తార్కికుఁడవు కమ్మోయీ' అని తీంద్రించినట్టు వినలేదు. తుదకు వీరు ఉత్తమకవులలో లెక్కపెట్టిన వాల్మీకికి సంకుచితత్వములు మిక్కుటముగ లేనిదే ఆ ఉత్తమకవిత పుట్టలేదనియు ఎఱుఁగము. మహర్షుల ఉపనిషత్తులు గొప్పకావ్యములు కావని సమ్మతింపఁజాలము.

ఈ శాస్త్రలోకము నెడల సంగ్రామము నెఱపుచు 'నీతిశాస్త్ర' వేత్తయగు 'నైతికునితోడి వివాదము నకుఁ గడంగి ('నీతి యనఁగా మానవులకుఁ దామొనరించు కార్యముల విషయమునఁగల గుణదోష విచక్షణతయుఁ బుణ్యపాప విచక్షణ తయునే' అఁట) వీరు కావ్యప్రయోజన నిర్ణయము ప్రవేశించినారు. ఇచట

'కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యఃపరనిర్వృతయే
కాంతాసమ్మితత యోపదేశయుజే' .

అన్న వాక్యము "మనదేశమునఁ గావ్యము నీతిబోధకముకగ నుండవలెనని శాసించిన లాక్షణిక శాసనములలో నెల్లను ప్రమాణాధికారము నంది యున్నది" అని (అది విద్యానాథుని మతముగ)నుపపాదించి, అది కావ్యస్వాతంత్ర్య నిరోధకమని తద్విమర్శకు పూనుకొని,

'అనన్యపరతంత్రామ్'

అన్న మమ్మటుని మాటతో అది చిదిపినారు. "కవి నిశ్చయముగ నన్నిప్రయోజనముల నర్థించి కావ్యము వ్రాయునా?" అని మందలించిన వీరు "కావ్యమున నీతి ధ్వనిమాత్రముగ నుండును" అని ఒకచో ఒప్పుకొనిన మాట వాస్తవము. "కావ్యము....వానిని (నీతి, ధర్మము మొదలగు ప్రయోజనములను) సాధన మాత్రములుగఁ గైకొని సేవకపదముల నియోగించునే కాని వాని కెన్నఁడును దనతో సమానమగు గౌరవమును స్థానమును నొసంగదు" అని వక్కాణించిరి. కాని వీరు విద్యానాథుని దనుకొన్న 'కావ్యం యశసే' కూడ 'అనన్యపరతంత్రామ్' అన్నమమ్మటునిదే!

వేదములు ప్రభుసమ్మితము లేమి యుపదేశించెనో కావ్యముల నదే ఉపదేశించును మనవారిమతమున. (భారతీయులకు జీవయాత్రాశయ మంతటను ఒక్కటే.) కాని అందు ఒక రమణీయతను, స్వాదమును, రసమును, వైచిత్ర్యమును,—ఇన్నిన్ని మాటలకు తెమలని ఒక అతిలోక సౌభాగ్యమును—గుర్తించి కావ్యము కాంతాత్వమున ఓహ్నించుకొన్నారు ప్రాచ్యులు.

ఈ సందర్భమున, "ముస్లిమ్ కవులలోను కొంత మంది ప్రాయికముగ నీతిబోధనఁ గావించిరి.... వీరును ప్రాయికముగ నీతిబోధనఁ గావించిరని నిర్ధారించుటకు వీలు లేదు" అని వీరి కలమున వ్యాఘాతములు మిగిల్చినది నీతిరసముల సంఘర్షణము. "ప్రాయికముగ నీతిబోధనఁ గావింపఁజూచిన పాఠకులు మన్నింపరనుభయమునఁ గవులు కావ్యమును రసవత్తరముగను, నీతి ధ్వనించునట్లుగను వ్రాసిరి" అని నుడివినది లాక్షణికులయెడ వీరితైక్ష్ణ్యమును మాత్రము కదపలేదు. (సుఫీ కవులు నిజముగ నీతి కోసమే బ్రదుకఁదలఁచి, నీతి చెప్పిన ప్రజలు వినరను అగతికత్వముననే కవిత్వము నవలంబించినమాట, మాటాడక, స్వీకరించిన,) మనజనులు నీతి నీతిగా చెప్పినను విన్నారు; అయినను మన కావ్యపురోహితులు 'కాంతా సమ్మితతయోపదేశయుజే' అని 'అనన్యపరతంత్రామ్' అన్న నోటనే పలికి రమణీయార్థ ప్రతిపాదనము చేసిన వారు.

(ధర్మము ధర్మముగా నుపదేశించిన జనులు వినరను భయము లేదు. అట్లుపదేశించుటకు ఎన్నో మార్గములున్నవి, కావ్యము కాక. కావ్యమునకు ఏమియు పరాధీనత అక్కఱ లేదు; కావలసినంత స్వాతంత్ర్యమును లాక్షణికులు ఒప్పుకొన్నారు. అయిన 'ఉపదేశయుజే' అని అనన్య ప్రేరితముగ పలికినది వారు కావ్యతత్త్వ మెఱుఁగకయని చెప్పరాదు. రస నిర్వహణమున అన్ని ప్రయోజనములు ప్రతిఫలించిపోవునని కాని, ప్రయోజన మొక్కొంటికి ఒక కొన్ని పరికరములు తెచ్చి గ్రుచ్చెత్తిన కావ్య మగును- లేకున్న కాదు - అని వారి తాత్పర్యము కాదు.)

సంస్కృత భాషాపరిచయమును, తత్సాహిత్య పరిశీలనమును చాలకయు, తదాధారమునఁ గావింపఁదగు వర్తన మంతయు నతిస్వతంత్రముగఁ ప్రదర్శించిన కారణమున 'అడుగడుగునందు పాతంబులైన' వీరు, స్వయముగ అనుభవము గల కవియై నుడువు 'సృష్టికిని' మానవునకును గల రహస్య సంబంధమును గుర్తించినవాఁడే రసికుఁడు' అను నిట్టి భావుక వాక్కులను, విదేశీయ సాహిత్య సిద్ధాంతాదుల వినియోగమునను, రవీంద్రుఁడు, అరవిందుఁడు, ఆనందకుమార స్వామి మున్నగు భారతీయ పండితుల కావ్యతత్త్వ పరిశీలనముల వ్యాఖ్యాన సమన్వయములను ఈ విపుల గ్రంథము తన ప్రాశస్త్యమును పఱచుకొనుచున్నది. ఒక్కొక్కచో అప్రశస్తమగు శాఖాచంక్రమణమున్నను, పెక్కు విషయములిందు చర్చకు వచ్చి సాహిత్య భావమును అల్లినవి. మన శాస్త్రాదుల అంశలు ఇట 'మనా' పడుటకు, ఏ పక్షపాతమో, అభిమానమో, చిత్త వికారమో కారణమయి యుండు ననుకొన్నను వట్టి పరిహాస మయిపోవదు. వీరు స్వయముగ కవి. కవికి ఆ గుణము లుండవలసిన వని వీరి అభిప్రాయము. శాస్త్రముల యెడ

వీరి తీవ్రత యందును నిజమగు గర్హ కంటె ఈ గుణములు ప్రసవించిన అతిశయోక్తిపాలె లెక్కువ.

వీరు ఉదాహరించుకొన్న స్వకీయ కావ్యముల యందు వీరి ఆశయములు చిత్రితములగుచు వచ్చిన వనుటకు చాల అవకాశ మున్నది. స్తోత్రాలంకారతతో సరళముగ, సహజముగ భావములు వ్యక్తి కాంచును. గుణములయెడ వీరికిఁ గల అవజ్ఞ నవజ్ఞ చేసి అవి ప్రాఁకిన చోటులు కలవు కాని కొంత వఱకైన వీరి ఆశయము నెఱవేఱకపోలేదు. రస మున్నది లేదు అని పేచీ లెందులకు కాని, మన ఆలంకారికులు నిరంతరము సుకవిత యందు పసి పట్టిన ఉక్తి వైచిత్ర్యము చమత్కారము, విచ్ఛిత్తి విశేషము, అన్నది వీరి (ఆ నాఁటి) రచన యందు చాల తక్కువై, ఎవ్వరో అన్నట్లు, 'అది గద్యములో చెప్ప రాదూ?' అని కొందఱి నోళ్ళ కందించుటకు భావము నందలి 'సామాన్య'త కూడ చేయివైచును. మన ఆలంకారికులే యేల, వీరు ఆరాధింప వెనుదీయని వాట్స్‌డంటన్ పండితుఁడు సహా '*Absolute Poetry is the concrete and artistic expression....*' అన్నపుడు '*artistic*' అను పదమున భావించిన అర్థము అదియే.

ఈ ద్రవ్యమే తొలుత నుండియు మన అలంకార దర్శనమున అస్ఖలితముగ వెలయుచు వచ్చినది. దీనికి సమర్పితులైన వామనాదుల ప్రవర్తనములను బాహ్యముగ అల్లుకొనుచు సత్త సడలినవారు 'ఆదర్శమునకు వైరళ్యము' తెచ్చి యున్నచో, వామ నాదులే ఆ నీరసతలను అంచించి రని ఈ గ్రంథకర్త లెక్కలు కట్టుటకు ఈ ద్రవ్యమునే వీరు ఉపేక్షించి రన్నది చాల వఱకు సూచీపడును. వీరి రస నిరూపణముననను దీని ప్రభావము నిర్లిప్తము కాదు.

కవితను గూర్చి తన భావనకు లొంగిన ఆశయములు, సరదాలు తన కవిత యందే పాకముపడవచ్చుట యన్నది అందఱిపట్లను సదాసిద్ధము కాదు. మంచి కావ్యము ఆస్వాదించి దాని సౌందర్యమును వ్యాఖ్యానింపఁగల రసన, అన్నియు ఉత్తమ కావ్యములే వ్రాయుదురు కనుకనే వీరికిఁగలదని చెప్పనక్కఱ లేదు. ఇందలి ఉదాహరణములకు లొంగని వీరి ఆశయములు చిత్రించి చూపఁ గల కావ్యములు తెలుఁగున లభ్యము లగుచున్నను, అవి యిందు ఆహూతి పొంద నందులకు వీరిని నిలఁబెట్టి ప్రశ్నించు నధికారము మనకు లేదు. అట్లు జరిగి యుండిన, ఈ గ్రంథము ప్రయోజనము మఱి కొంత విస్తృత నిర్వహణము కాంచి యుండెడిదని యూహింతము. రచనా కాలమునకు సిద్ధముగ నుండిన కావ్యముల నుండి, భారత భాగవతాది ప్రాచీన గ్రంథములందలివే కాక, ఆధుని కులగు కీ. శే. శ్రీ గురజాడ అప్పారావుగారివి కొన్ని పద్యములు ఇట ప్రవేశము పొందిన మాట మనము గమనించుకొని, పాదుషాలను మించిన ఐద్లకమును, అట్టి

తదితరమును చించుకొని యిటీవలివి కూడ కొన్ని వీరు చొన్పరాదా యను ఇచ్చను అంత ఒత్తిడి చేయకుండుట సమంజసము.

కవనవేత్తృత్వమే కాక గాంధర్వ వేత్తృత్వమును వీరి విమర్శకతకు తన కానుక తా నిచ్చినది.

"…. గణము మూఁడు మాత్రలకు తక్కువగాకుండను, ఆఱు మాత్రల కెక్కువ గాకుండను నుండును కావున మాత్రల సంఖ్యను బట్టి ప్రాయికముగ, మూఁడు తరగతుల గణము లేర్పడును. అవి యెట్టి వన — రూపక - జంపె - చాపు తాళగణములు. రూపకగణమునకు మూఁడు మాత్ర లుండును. 'చాపు' గణమునకు నాలుగు మాత్ర లుండును. జంపెగణమున నైదు మాత్ర లుండును. 'త్రిపుట' గణము రూపక - చాపుగణములు వరుసగా నున్న వాని యొక్క కూడిక యగును. అనఁగ నేడు మాత్ర లుండును. కాని మొదట రూపకగణమును తరువాత చాపుగుణమును నుండవలెను. మూఁడు గురువులు గల మగణము రెండు రూపకగణము లగును."

అని తాళములలో గుణములు గ్రుద్దినారు,

ఒకలఘువు, అనుద్రుతము, ద్రుతము కూడి యేర్పడ్డ జంపె, లఘువు మిశ్రజాతిదై, పదియక్షరముల కాలము మెట్టుచు, వాడుకయందు (బద్ధకమున సౌకర్యము చూచి) దెబ్బ, ఉసి, రెఁడుదెబ్బలు, ఉసి-గా, ఆవృత్తము రెండైదులకు విఱిఁగిపడుచుండుటను ఆశ్రయించి వీరు ఆ తాళమున నైదక్షరములే భుక్తము కావించి అలయ పట్టిన పాట ఉదాహరించిరి. ఒక ద్రుతము, ఒకలఘువు రూపము కట్టిన రూపకము (చతురశ్రము) ఆఱక్షరముల కాలము కలది, రెండుగ తఱుఁగబడి, (సౌకర్యపరమగు వాడుకసహా ఒప్పనిరీతిని) వీరిచే మూఁడక్షర ములకే నోఁచుకొని యీ ఉదాహరణము ధరించినది :

"చిన్నవోయె ముద్దుమోము
కన్నులంట నీఱు (?) గాఱు
వన్నె తఱిఁగి వాఁడె మేను
కన్నె యేలనే ?"

మూఁడు మాత్రలకు సాఁగు ఒక్కలఘువున ప్రాణము సిల్చుకొను త్రిశ్రజాతి ఏక యిట సరిపోవును. కాక, యిట రూపకమే వేసి చూపించునపుడు ఆఱక్షరములు వెల్లడిగ ప్రవేశించును. ఆ ఆఱక్షరములను మూఁడక్షరములుగ భావించిన పొరపా టైనను జరిగినది.

చాపుకూడ కొంత సంపత్తి కోల్పోయినది.

రూపకము, చాపు బుజములు తాచి నిలుచుండవలెనన్న త్రిపుట ఇంకేమి మాటాడఁగలదు ?

కాని వీరు తమ యీ స్వతంత్రమైన, సోపజ్ఞమైన సమన్వయమున మన పరిశీలనమునకు బెదరులుకూడా పెట్టినారు : (వెనుకటిమాట లందుకొందము:)

"ఈ పద్ధతి ననుసరించియే మనపూర్వు లిట్టి మాత్రా ప్రధానములగు ఛందోరీతులను రూపకము, జంపె, త్రిపుట, చాపు మొదలగు పేళ్లనే పిలుచుచుండిరి."

ఈభోగట్టా మనలో ఎందఱకు క్రొఁతదో లెక్క పెట్టవలెను.

"....జంపెనే ద్విపదయని....కొందఱు పిలుచుచున్నా"రని చెప్పినదానిని బట్టి, వీరు జంపెకు ఉదాహరణముగా ఒసఁగిన,

"పాడవే కోకిలా
పాడవే యింపుగా
ప్రాణము ల్హాయిచే
పరవశ మ్మొందఁగా
పాటఁ బాడవె తీయఁగా
కోకిలా
పాటఁ బాడవె తీయఁగా"

అన్న యిట్టిఛందమునే కొందఱు ద్విపద యన్నారు కాఁబోలు నని మఱి పదనులకు పోవలదు మనము.

ఇన్నిన్ని పొలాలుగా కావ్యరహస్యములను పరిశీలించినందులకే వీరిని అభివందింతము. ఈ మేరలు ఈ విధముగ త్రొక్కుటకు ఈ స్వాతంత్ర్యమందలి అతిమాత్రత కారణమని మాత్రము తెలిసికొందము.

కవిగా వలచిన పరిమితులు విమర్శకుఁడుగా నైన వీరు త్యజింపఁగలిగి యుండుచో, తక్కిన వరములు చేకూరని అనర్థము ఇంత ముద్దరంగులలో ఇట ప్రాఁకి యుండక, యీ పరిజ్ఞానములు చాల సాఫల్యము తినిపించి యుండెడివి.

ఒతెల్లో నాటకమున, వివిధ విభ్రమముల నర్తింప వచ్చిన హత్యకు ప్రధాన పాత్రములు దాదాపు అన్నియు తల లొగ్గఁగా, కాషియో మాత్రము మిగులఁ గలిగెను. దుండగీఁడగు అయాగో కత్తిపోటును, నేర్పరియగు షేక్స్పియరు కవి కలము పోటును తప్పించుకొన్న కాషియోను శ్రీ అప్పారావుగారు రెండు మూఁడుసారులు చంపిరి. "ఒతెల్లో....కాసియోను జంపి....భార్యను.... ఘోరముగ

తలక్రిందులతోఁ జావమోఁది చంపె" నఁట. కాషియో చావలేదు సరిగదా, ఆతని పొడిచినదై నను అయాగో కాని ఒతెల్లో కాదు. డెస్డిమోనాను ఒతెల్లో కుత్తుకపిసికి, ఊపిరాడనీయక, చంపినాఁడు. *Stifle* అనుధాతువునకు తలదిండులతో చావ మోఁదుట యని ఆంగ్ల సాహిత్యము తరిచిన వీరు తప్పుటర్థము చేసికొన్నారని శంకించుటకంటె ఆక్రియాపదమును గుర్తించి వ్రాయునంతటి శ్రద్ధ వీరు వహింప లేదన్నది సత్యమగును. ఈ అశ్రద్ధ వలననే కాఁబోలు, అన్వయదోషములును ఇందు విహారములు సలుపుచు వచ్చినవి.

"అంతియే కాని వానినిఁ గావ్యమున రసమునకు నీడువచ్చు నధికారినిగా శాస్త్రమునకుఁ దావొసఁగితి మేనిఁ 'జనువిచ్చినఁ జంకెక్కె'నను లోకసామ్యము యథార్థమై కావ్యమున రసమునకుఁ బదచ్యుతి సంభవించినను సంభవించును."

"ఆంధ్ర భాషకు స్వాతంత్ర్యమును ప్రత్యేక జీవనమును గలవనియు, నాంధ్రభాషకుఁగల విలక్షణతయే యాంధ్రకవుల కావ్యకల్పనల కాధారభూత మనియు, నూరక సంస్కృత పద్ధతుల ననుకరించుట బానిసలకు సహజమగు పారతంత్ర్యమును వెలికిఁ జూపించుటయే యగుం గాని తన్మాత్రమున నాంధ్ర భాషకు స్వతస్సిద్ధముగ లేని గౌరవము రాఁజాలదు."

ఇట్టివి ఒకటి రెండైనచో ఏ బాపతు 'క్షమాపట్టికల' లోనో చేరఁగలిగి యుండెడివి.

మఱి, ప్రయోగసామర్థ్యము నందలి లోపమును, అర్థ్యతాపరిమితత్వ మును, ఈ అశ్రద్ధతోనో, బద్ధకము తోనో, నిశ్శేషముగ భాగింపలేము. వీరి రసజ్ఞతయెడ గౌరవముతో మఱచిపుచ్చఁ జూతము. రసమునుగూర్చి వీరికిఁ గల అపోహములవలని రసికత్వకల్పన వీరి వాస్తవ మగు రసజ్ఞత పొడవునను కిరణ ములు పఱపినను, దానిమాట వీరి సిద్ధాంతముల కట్టుబడుల ప్రసంగములో చాలించుకొని, కావ్యలక్షణ వికాసపరామర్శమున విపులతరమగు నవకాశమునకు వేచియుండు ధ్వనిమతము ఒకరకము విసరులతో నిష్క్రమింపవలసివచ్చుట వీరిరసమతమథనము ముందు పెద్ద లోపముగ గణించుట మాని, తత్త్వబిందువులు బాంధవించుట యందు వీరి నేర్పు విలసిల్లకున్నను, కావ్యసౌందర్యము నాస్వ దించుటకు వీరు చూపిన రసన అల్పము కాక, ప్రపంచమందలి వివిధ సాహిత్య ముల పరిచయ పరామర్శము లొసఁగుచు, నేఁటి ఆంధ్రసారస్వత సంరంభమున సంస్కారధోరణికి ఒక విధముగ ప్రాతినిధ్యము చూపుచు సంపన్నత విరియు ఈ గ్రంథము ప్రాశస్త్యమునకు వెలుఁగు పెట్టునని రచయితకును, రచనకును మెప్పు దెలుపుట మన తుది కర్తవ్యముగ పాటింతము.

భారతి 1938 జనవరి.

# కావ్యమాల

మొదటిభాగము. క్రౌనుసైజు

రెండవభాగము

కూర్పరి : ఉభయభాషాప్రవీణ కొత్త సత్యనారాయణచౌదరి గారు, పండితుడు, బోర్డు హైస్కూలు, నిడుబ్రోలు, భాషాపోషక గ్రంథమండలి, అమృతలూరు, గుంటూరుజిల్లా.

మొదటి భాగము 4 వ ఫారమునను, రెండవది 5 వ ఫారమునను ముఖ్య పఠనమునకుగాను (మద్రాసు) పాఠ్యగ్రంథనిర్ణాయక సంఘమువారు నిర్ణయించిరి. ఇందు పెక్కులు ప్రాచీన గ్రంథములనుండియు, కొలదిగ అర్వాచీన గ్రంథముల నుండియు గద్యపద్యఘట్టములు కూర్చియున్నవి.

ప్రతిసంపుటమునను దాదాపు సగమువఱకు పురాణ ప్రబంధ నాటకాదుల నుండి ఉద్ధరించిన పద్య భూయిష్ఠ భాగములును, తక్కిన సగమునకుపైగా గద్య రచనా భాగములును గలవు. ఈ గ్రంథముల ముఖ్యమైన ప్రయోజనము భాషా ప్రౌఢి విద్యార్థులకు గతపుటయని తెల్లము. ఈ మాట ప్రబంధాది భాగముల కంటె 'ధర్మజరాజసూయము' వంటి వచన భాగములనెక్కువ కొట్టవచ్చును. కావ్య కలారీతులు చవిచూపుటకంటె నీతిబోధవంటి కార్యము చొచ్చివచ్చుచున్నది యీకూర్పు ఫక్కిలో, కూర్పరి శ్రీ సత్యనారాయణచౌదరిగారే 'మొదటిభాగము'న నొక వ్యాసము రచించినారు 'సుభాషితము' అని. అదిఇరువదియెనిమిదిపుటలుగా, ఇట్లు చేయవలె నట్లు చేయవలెనని విద్యార్థికి నడవడికనుపట్టిన 'నీతులు', 'బుద్ధులు' బోధించు పూనికలో అంతరించినది. చిన్నయసూరి గారి 'నీతిచంద్రిక' భాగము, నేతివెంకట సుబ్బరాయశాస్త్రి గారి 'ధర్మజరాజసూయము' నందలి నారదాగమన ఘట్టమును (ఇదినారదుడు ధర్మజునకు రాజసూయము సేయుమనుచు రాజనీతి మర్దించిన భాగము) - ఇది నడచినమీదట 'కూర్పరి' పోసీ విద్యార్థులకు బుద్ధి, బుద్ధులు చెప్పుటకే అన్ని పుటలు సాగక; బుద్ధికి పనిచెప్పు ఒక చక్కని వ్యాసము రచించియో, కొనితెచ్చియో అచికిన, ఈ గ్రంథముల ఉద్యమము-ప్రయోజనము- ఇంతలో తిరిగి నిలిచినదని నిరూపించుమాటలు మారి యుండెడివి. ఈ 'ఫారాల'కు ఇంకను నీతిశతకాలు చదివికొని బుద్ధులు నేర్చుకొను విద్యార్థికంటె, బుద్ధినేర్చుకొను-

బుద్ధి వికాసమునకు విసరుకొను - విద్యార్థిత కలాశాలకు ఎక్కువయోగ్యత, ఔచిత్యము నిలుపుకొనును.

అయిన, ఈ పరికలు అందముగనే ఉన్నవి. ఆధునికులలో చిన్నయసూరి, త్రిపురనేని రామస్వామి చౌదరిగారులు ముఖ్యులు, ఇందు దర్శనముగాంచుటకు. 'కూర్పరి' తనరచనయందు 'పరస్పరసంసర్గవశాత్తున', 'తృష్టి' (తృప్తియను అర్థమున) - ఇట్టి ప్రయోగములయెడ మెలకువ జూర్చుకొనకయు, ఇంకను సమర్థమగుశైలి వాడియుండిన బాగుండెడిది. అయినను, వీరిశైలి చిన్నవాక్యములలో సరళమగు నడకనడుచుచున్నది.

తరగతులతారతమ్యమునకు తగురీతి కూర్చుటలో 'కూర్పరి'నేర్పుకనబఱచెను. తప్పులు లేని అచ్చుకూర్పును విద్యార్థుల లెక్కకొక గుణముగా చెప్పక తప్పదు. 'గ్రేట్ ప్రైమరు'లో ఇంత తఱుచుగా 'ఆంటిక్' అక్షరాలు, ఒత్తులు దొరలకుండినచో ఇంపుకూడ ఇంకను అబాధితముగానుండెడిది.

కొం. జ.

(1938 మే భారతి)

ప్రబుద్ధాంధ్ర 15-2-1936 సంచికలో ఓ జాబితా ఉంది. అదేమంటే అప్పటికి పత్రికల్లోనూ - రచనల్లోనూ "వ్యావహారికభాష రచించినవారిపేళ్ళు"- దీన్ని నవ్యసాహిత్య పరిషత్తు పక్షాన తెలికచర్ల వెంకటరత్నంగారు తయారు చేశారు. వారి సంతకం 31-12-1935 తేదీతో ఉంది. ఈ జాబితాలో జనార్దనరావ్ కొంపెల్లను కూడా చేర్చాడు.

# వాఙ్మయవీథి

## భాగవతావతరణము

(పద్యనాటిక). కవి : నోరి నరసింహశాస్త్రి. సాహితీసమితి, గుంటూరు.

నరసింహశాస్త్రిగారి చేయి మరొక్క కళాకుశలమైన కృతి ప్రసవించింది. కావ్యవిలాసాలు పొల్లొత్తి ఔచితిని ముంచక, పద్యాత్మకమని వట్టి సంభాషణమే ఛందస్సుకట్టడమూ కాక, ఇంపైన 'నాట్యకావ్యము'గా కవి తెలివితో వస్తునిర్వహణము నెఱపినాడు.

'ఘోరారణ్యమువోలె దుర్గమము నై కోలాహలంబట్టు ల
ర్థారూఢస్వరవాక్యహీనమయి పారావారసంకాశ దు
ష్పారంబౌ శ్రుతి' -

దానిని ఉద్ధరించి వ్యాసించి "గంభీరోజ్జ్వలదివ్యరూపమయి" పరేశుని 'కంఠోద్గతంబౌ శ్రుతి'గా- తాను తెలుసుకొన్నరీతిని - సంభావించ శక్తి చాలని మనుష్య వ్రాతములను 'సత్క్రియారంభోదర్కుల జేయ భారత మహాగ్రంథానుసంధానము' చేసి; చాతుర్వర్ణ్యాన్ని ధర్మసూత్రాలతో సంధించి బంధించటానికి, 'శ్రౌతస్మార్త విధానజాతమును శిష్యవ్రాతముంగూర్చి యథాతథ్యంబు....తద్ధర్మంబు వేర్వేరుగా' పఠింపజేసి - ఇన్ని చేసిన వ్యాసునికి ఇన్ని సంరంభాలలో ఎన్నడూ లేనిది యిప్పుడు అశాంతి తన మనస్సును పీడించడంచూచి, జగద్రక్షకుని కేదో కొరత కలిగిఉన్న దనుకొన్నాడు : ఆతని వంకకు భుగ్నమయింది వ్యాసునిమనస్సు. కాని! 'సంక్షోభంబె వేభంగి విస్రబ్ధంబై ప్రతిశబ్ద మీనెడి' సమయాన, ఏకైకముగా ప్రత్యేక విద్యలు పఠించి, కర్మలుచేపట్టి, ఆ అర్థములు వశ్యములై ఉండేనిమిత్తమై గురువు వద్ద వాగ్వాదాలు నేర్చిన శిష్యవ్రాతమందు రేగిన వివాదనాదంలో వ్యాసునికి లోకమంతా కలతచెంది కలంకితమై కన్పట్టింది - తనవిద్యలో సమన్వయము లేక శాంతి చెడినట్టు. ఆ శిష్యులకు తానొక హితోపదేశం చేయగలిగినాడు : కర్మ లెన్నిగా ఉన్నా ధర్మమన్నది ఒక్కటే, అదే జగతికి మూలం, దానితత్త్వం తెలుసుకొండి — అని. కాని ఆతనికే తెలుసు, ఆతని ఉపదేశవాక్యాలు వారి చిత్తాలలో 'నానామార్గముల్ పొందెడిన్' —

'ద్యావాభూమిసమస్తభూతతతి చింతావ్యాకులంబయ్యె నా
భావంబం దుదయించి తెల్పగదవే వక్తవ్యకర్తవ్యముల్'

అని దేవుని వేడుకొంటాడు. ముల్లోకముల్లూ తిరిగే నారదుడు అవతరిస్తాడు -

నారాయణుడే ఆరూపాన వచ్చినట్టు. వేదము విభజించి ఐతిహ్యములు కూర్చినా మదిని వేదన విడువని వ్యాసుని మొర విని నారదుడు చేయగలిగినా డొక ఉపదేశం - ధర్మాధిక్యాన్ని ఉపదేశించిన వ్యాసునికి : "ధర్మములన్నీ వివరించి నావు కాని, నిష్కర్ములు యోగులు అకారణంగా నిరంతరమూ మ్రొక్కి కీర్తించు కొనే మాధవుని సన్నుతి చేసినావు కావు; నిజస్తుతివల్ల కాని అతడు ప్రీతుడు కాడు; అతడు ప్రీతుడు కాక మనశ్శాంతి లేదు. ధర్మ కర్మములు వివరించేటప్పుడు. 'వర్ణన ప్రేరిత రూపనామముల భేదములెంతురు మూఢమానవుల్; వారవి యీశ్వ రార్పణశుభంకరబుద్ధి నొనర్చునట్లు' నేర్వవలెను. "భాగవతసంహిత పలుకు" మన్నాడు. ఆ నారాయణపుణ్యకథాప్రారంభతవల్ల అత్మ ఆనందముతో నిండి, వెంటనే వ్యాసునికి భాగవతం ప్రత్యక్షమై, జిహ్వాగ్రముమీద వాక్స్రోతస్సు గంగా ప్రవాహంవలె ఉప్పొంగింది : "గంగాధరు డెవ్వడు?" అన్నాడు. నారదుడు శుకుని చెప్పి, "మోక్షకాంక్షాగురుబుద్ధి నీదుమది గాంచినవెంటనే తా గ్రహించు" నన్నాడు. శుకుడు, వ్యాసుని ఆత్మజుడు, హరికీర్తనలోలుడై, వ్యాసునివిద్యను పెక్కువిద్యలుగా వహించిన శిష్యులను భక్త్యావేశములో నడిపించుకొని, అటు వేంచేసి నాడు భాగవత ప్రభావంవల్ల; భాగవతజాహ్నవిని వ్యాసునిమనస్సునందే తన హరి కీర్తనంలో, హరిలీలా ప్రసంగంలో, ప్రవర్తింప చేసినాడు. నారాయణుడు 'వ్యాసభాగవతపర్ణితలీలా' శాలి అయినాడు. (వ్యాసుని విద్యలో సమన్వయం సిద్ధించింది.) భాగవతం అవతరించిన దయింది.

వ్యాసునికి మొదట వేదం దుర్గమంగా, కోలాహలంగా, దుష్పారంగా కన్పించి, అవగాహన చేసుకొన్న వెనుకటి అవస్థలో గంభీరోజ్జ్వలదివ్యరూపంగా అతడు పలికినట్టు చూపి, వ్యాసునిమనోవికాస క్రమం చిత్రించిన సౌందర్యం రచనతుదివరకూ పదను చెడక నిలిచింది. మానుష మనఃప్రవృత్తికి ప్రతినిధి ప్రాయమైన వ్యాసునికథ కావ్యానికి హృద్యత తేవడ మటుండగా, వ్యాసుని మనోగతులకు, భావాలకు, రూపమీయడానికే ఏ పాత్రమైనా మొలిచి, వస్తురచనకు, కావ్యత్వసంపత్తికి తీర్పు మెరిసింది. సందర్భోచితంగా ఛందోగతి మార్చుకొని వంచుకొనడమూ, శైథిల్యధారాళతా గుణాలలో చెప్పక విడువరాదు. హరిలీలా కథన భాగం భక్తిసంపాదకమైన గేయసౌందర్యం చూపుతుంది. రేకులువిరిగే వికాసం కులకకపోయినా, భాషాప్రయోగంలో—కొంత సాంస్కృతికమైన – మనోజ్ఞత ఉండనే ఉన్నది. శ్రీ శివశంకరశాస్త్రిగారి పద్యనాటికలు జ్ఞప్తికి రాకమానవు. వృత్తిచాకచక్యంలో శాస్త్రిగారు అందెవేసిన దెప్పుడూ తక్కువే; కాని మనస్వితకు, వస్తువిన్యాస కౌసలానికి వారు చూపుతూవచ్చిన పరిచయం ఇక్కడా వారికి గౌరవం సంపాదిస్తూనే ఉన్నది.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటి 1 సంచిక 1

## కిన్నెరసాని పాటలు: కోకిలమ్మ పెళ్లి

కవి : విశ్వనాథ సత్యనారాయణగారు, ఎమ్ ఏ., బందరు. రసతరంగిణీ గ్రంథమాల, వెల రు ౧.

ఆ దొరకి కూతుళ్ళు ఇద్దరు, చిలకతల్లీ కోకిలమ్మానూ. చిన్ననాడే పలుక మొదలెట్టి తండ్రికి మేను పులకరింపించిన చిలకతల్లి వేదపనసలు చెప్పుకొనే బ్రాహ్మణుణ్ణి తనలో నిలిపివేసింది. ఇంట్లో నిరాదరము పాలయి, చెప్పుకొనేటందుకు నోరయినా లేక ప్రకృతి అంతటా స్నేహం కోసమై తిరిగే కోకిలమ్మను పూలరేడే వలచాడు. ప్రకృతి తల్లితోపాటు తల్లీ వెదకుకుంటూ వచ్చి కౌగిలించింది; దీవించి పెళ్ళిచేసింది.

'చిలకతల్లి మహాన్వయంబున
నిలిచినవి సాంస్కృతికవాక్కులు
కోకిలమ్మా తెనుగుపలుకూ
కూడ బెట్టిందీ.'

కావ్యమంతా చెక్కినధ్వని యిక్కడ కోకిలమ్మ తెనుగుపలుకులో ముడివడి కావ్యం ముగిసింది. ఈ కథ [వొట్టిది] జరిగేటప్పటికి ఈ తెలుగులంతా గొప్ప

'దొంగ నాగరకతలో దేశం
తూలిపో లేదోయ్'

అందుకే యిద్దరు కూతుళ్లే అయినారు తెలుగురాజుకి ఇద్దరమ్మానూ వలపించగల యీ కవివాక్కు కోకిలమ్మ పెళ్ళికి తెలుగుతీపులు పట్టి అకివిసి, సెలయేరునూ, ఆలాటి సామగ్రిని తలపించే ప్రాకృతగతులతో మనస్సును గుంజుతూ నడిచింది. గురజాడ అప్పారావుగారి తీయని లేత నడకలు దాటి వీరి ముత్యాలసరం, కవితా సంపన్నమయిన్ని, పాకరహితమైన విరగబాటు చేపట్టింది, వస్తువు తలచి. అసలు సత్యనారాయణగారి కవిత జాగ్రత్తతోడి ఉద్దుబాటుకంటె ఉద్రేకముతోడి విరగబాటే యెక్కువ విందు పెటుతుంది. మరికొన్ని మెలకువలు ఈ పొంగులలో అందాలు తెరుస్తవి

'కోకిలమ్మ పెళ్ళి' కంటె విరివి అయిన 'కిన్నెరసాని పాటలు' వీరి కవితా సంపదను మిక్కిలిగా ప్రవహించినవి. అసలు కథాకల్పనమే హృద్యమైనది. అత్తగారి అపనిందకు అనిష్టయై అడవుల పరుగులువారి, ప్రేమకల మగని అనునయపు కౌగిలిలో కరగి నీరై పారిన భార్య కిన్నెరసానికై అతడు శిల అయిన క్రమము అంతా కవి చెప్పక, అతనినోటనే,

'ఈ యేడుపు రొదలోపల
నా యొడలే నే నెరుగను
నా యీ దేహ మదేమో
రాయివోలె నగుచున్నది'

అనిపించి చూపిన సొగసు వీరి విలక్షణమైన కళావిహార చాతుర్యమును చూపుతుంది. ఈ కావ్యములో ఈ దీనకథలో కొన్ని ఘట్టాలు కంట నీరు పెట్టకుండా చదవడం కష్టం; రసస్ఫూర్తిని గూర్చి మాటాడగల సహృదయానుభవమంతా ఇందలి కళాజ్యోతికి తృప్తిపడి తీరుతుంది. కిన్నెరసానిని ఒక వీరవనితగా, తెలుగు జాతి మనస్సులో ప్రవహించగల నాయికగా సృష్టిచేసి నిజమైన కావ్యసంపత్తి నిర్వహించినాడు కవి. నవ్యకవితలో మొదటి పంక్తిని నిలువగల కొలది కావ్యాలలో 'కిన్నెరసాని పాటలు' ఒకటి. ఇందు ప్రకృతి ఎంతో విస్తృతముగా జీవము పట్టి అనుభవానికి రసశుద్ధి తేగలుగుతున్నది.

'తలిరాకువంటి మె
త్తని యెఱ్ఱ పెదవితో
తార్చి నామోము నద్దగ రావు కాబోలు
నాయొడల్ మిగుల నందపుకుప్ప యని చెప్పి
ఎల్లతావులను ముద్దిడ రావు కాబోలు'

'అని సన్న గొంతుతో' పతికై వనరిన కిన్నెరసాని యేడ్పుతో ఎంతో సన్నిహితమై గాఢమైన అనుభవము సాధరణీకృతికి రావడమేకాక, రచనయున్నూ ఆస్వాద్యముగా నడిచింది. ఈ పాకములు కిన్నెరసానిలో తరుచుగా పూచినవి. 'కోకిలమ్మ పెళ్ళి'లో అడవీ, అక్కడ తిరిగే కోకిలా కనిపిస్తే ఇక్కడ కోకిలమ్మ పాటలు పుష్పించి ప్రకృతి అంతటా ప్రమోగించింది. 'కిన్నెరనడకలు' రసమయమై, 'గోదావరీ సంగమము' శిల్పవిలసితమై మరీ హృద్యములైనఘట్టాలు. అసలు గోదావరిలో కలిసిపోయిన కిన్నెర ప్రసంగములో సముద్రుని పాత్రము కల్పించడం కవి నాటకీయ ప్రతిభ చాటుతుంది. తన గొంతుతో కవి తాను పాడిన ఒక పాట కాక, ఎన్నో పాటలు రూపాలుకట్టి వచ్చి దీనికి మహాకావ్యత్వము సంపాదిస్తున్నవి

కొన్ని అతిధోరణులు (వీరు ముక్తసరుగా పాడరు,) పచ్చిగా ఎండుగా పడితే, అవీ వీరి ఉద్రేకము తాలూకు విశిష్టతను తెలుపుతవి. అట్టివికూడా కావ్యగతిలో విడిచిన విచ్చలవిడితనమే కొన్ని ఉన్ముక్తములైన సౌందర్య విభ్రమాలకు పూచీ వహిస్తుందని స్మరిస్తే అది కవిని అంతటా సమర్థించడంకాదు గమనించడం,

ఛందోగతుల అందాలు కలుపుకోడంలో స్వరకలితమైన సంగీతాభిజ్ఞత అవసరమని చెప్పేవాదము కవులు ఒప్పుకోనక్కరలేదు. చరిత్ర ఒప్పుకోదు - కాని, కొందరిపట్ల అజ్ఞానము అందుకు తోడ్పడ్డదవుతుందంటే ప్రతిఘటించ నక్కరలేదు. కవితయందు ఏర్పడే సంగీతమే గమనించినా, సత్యనారాయణ గారు పెళ్ళిపోకడలుగా ఛందోగతులు నడిపించి అందాలు కురిపించినారు.

ఈకవి తనప్రతిభ నాటకయోగ్యమని హక్కు ప్రకటిస్తాడు. అది సర్వశః కావ్యయోగ్యమున్నూ.

ఈసంపుటము ముద్దులు మూటగడుతున్నది. సృష్టిపరములైన అడివి బాపి రాజుగారి జాజిపాటలకు తగిన వింతైన భావుకసౌందర్యాలు వెల్లడిస్తున్నవి. కిన్నెరసానిబొమ్మ కవితామయమై, ....తిలో చూడగలమూర్తి యేదిన్ని కాక సూక్ష్మభావాల సమ్మేళనము కట్టిఉన్నది. కిన్నెరకై ఉబికిపడే సముద్రునిబొమ్మ కన్నులలో, ముద్రలో, భావము కుంభించి గంభీరముగా ఉన్నది.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని: సంపుటి 1. సంచిక 2.

* *

## ప్రభ

సచిత్ర పక్షపత్రిక. చందా సాలుకు రు. ౨. విడిప్రతి అణన్నర.

౫౦ పుటలు. సంపాదకులు ; గద్దె లింగయ్యగారు, ఖందరు.

ఈ పత్రిక చూస్తే ముఖ్యంగా జ్వాల జ్ఞాపకం వస్తుంది. చౌకగా ప్రజలకు అందుబాటయే ఈ సామ్యవాదం మొదలైన ప్రముఖమైన విషయా లనుగురించీ, లెనిన్, మాగ్జిమ్‌గోర్కీ మొదలైన మహానాయకుల జీవితవిశేషాలను గురించీ తేటతెలుగులో ప్రకటించి చాలా ఉపయోగకరంగా ఉంటూన్నది. మరికొన్ని ఇతరవిషయాల వ్యాసాలూ, కథలూ మొదలైన రక్తికూర్చే విష యాలు ఉంటున్నవి. సంపాదకీయ వ్యాసాలు తీవ్రంగా ఉండడమూ ఒక ఉద్దేశముతోనే కావచ్చు కాని, కొంత ప్రశాంతంగా నడిస్తే పత్రిక తదితర అంశాలు మరింత గాఢంగా నెరవేర్చుకో వీలవుతుందేమో.

ఉదయిని : సంపుటి 1 సంచిక 3

* *

## భాషామణి

మాసపత్రిక. చందా సాలుకు రు ౨. సంచికకు ౪౦ పుటలు

సంపాదకుడు : చెలికువాడ వేంకరామయ్యగారు, రాజమండ్రి.

"....ఈ పత్రికయందు పూర్వకవులయు ఆధునికకవులయు పురాణములు,

కావ్యములు, నాటకములు, నవలలు, శాస్త్రములు (*sciences*) మొదలగునవి ప్రకటింప" సంపాదకుల యోజన. కవిశేఖర సుబ్బరాయడుగారి 'భక్తచింతామణి' పద్యములు క్రొత్తవి, సంపాదకుల 'చెఱకు తునుకలు' అనే పద్యకథలు, భీమకవిచరితము నాధారముగా గొని సుప్రసిద్ధులు డాక్టరు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రచిస్తున్న 'శాపము' అనే నవల, శ్రీపాద కామేశ్వరరావుగారి 'సాహిత్యదీపిక' అనే వ్యుత్పన్నమైన గ్రంథమున్ను వరుసగా ప్రకటితము లౌతున్నవి. మరి ఒకటి రెండు గ్రంథములున్ను పడుతున్నవి. భిన్నతరహాగల పత్రిక యిది. ఉదయిని: సంపుటి 1 - సంచిక 3

* *

## కవిగారి మనుగడ

గ్రంథకర్త: జయంతి సుబ్బారావు. కవితాసమితి, విశాఖపట్నం. ౧౯౩౫. వెల ౮ అ. ౧౧౮ పుటలు.

బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారికి 'కవిగారు' అన్నదే విశాఖపట్టణ మండల మంతటా ప్రసిద్ధమైన పేరు. వీరు చిరకాలము పెక్కు సంస్కృతి శాఖలలో కృషిచేసిన పండిత ప్రవరులే కాని వీరి పేరు విశాఖమండలము దాటి దేశములో అంతగా పాకలేదు. కాని ఆ మండలమువారు, ముఖ్యముగా కవితా సమితివారు, వీరి విలువను లోకానికి చాటగల్గుతున్నారు. మంచి నడతవల్ల కవిగారు పూజితమునూ, ప్రఖ్యాతినీ బడసిన సంగతి కవిగారి కంటె ప్రసిద్ధమైనది. కాని వీరి 'తెనుగు, తోఁబుట్టువులు', రాబోయే నిఘంటువు మొదలైన ఉచ్చగ్రంథములు సారస్వత లోకములో వీరి పేరుకు స్థాయిత్వము చేకూర్చగలవు. ఇవికాక మరి యెన్నో గ్రంథములను వీరు రచించినారు. వీరి నిరంతరమైన కార్యదీక్ష, ఆదర్శపరత్వము, దేశసేవయందలి ఆసక్తి, భాషాసేవయందలి సిద్ధహస్తత మున్నగు అంశాలు, వారికి శిష్యులై చిరకాలము సాహచర్యము నెరపుతూ వారిని మేలుబంతిగా చూచుకొనే శ్రీ జయంతి సుబ్బారావుగారు ఈ గ్రంథములో వివరించిరి. గురువు మతమునుబట్టి గ్రంథకర్తయున్ను తెలుగుమాటలు వాడడములో రుచిగలవారయిన్నీ శైలి మిక్కిలి ధారాళముగా ఘుఘిగా నడపగలిగిరి

కొంపెల్ల జనార్దనరావు
ఉదయిని సంపుటి 1. సంచిక ౬

## సాహిత్యతత్త్వ విమర్శనము

రచయిత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎమ్.ఏ., బి.ఎల్. ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్, ౨౧ ఎర్రబాలుచెట్టి వీథి, జి.టి., మద్రాసు. డెమీ ౨౦౬ పుటలు. రు. ౧-౪-౦.

సాహితీ హృది, శైలి, మాతృభాష, లలితకళలు, నాట్యకళ మొదలైన వివిధ విషయాలను పట్టి యిందు పదుమూడు సారస్వత వ్యాసములున్నవి. 'ఉత్తమ సారస్వతమును, ఉత్తమ జీవనమును, ఉత్తమ మతమును వేఱుచేయుట అసాధ్యమని నా తలంపు' అన్న వీరి వాక్యమువల్ల సారస్వత ప్రయోజనముపై వీరి కెంతటి తాత్పర్యమో తెల్లమవుతున్నది. సృష్టియందూ, కవి హృదయమందూ కవి కృతియందూ కల శక్తి ఒక్కటే అనిన్నీ, అదే 'సాహితీహృది' అనిన్నీ వివరించడానికి వీరు వివిధ విషయాల తమకుగల విపుల పరిజ్ఞానమును వినియోగ పరిచినారు. ఇందలి వ్యాసము లన్నిటనూ ఏదోవిధముగా ఈ దృష్టి సూత్రముగా ఉన్నది. సాహిత్యాది కళలను పరిశీలించేటప్పుడు కూడా వీరు ఈ 'హృది' దృష్టితోనే చూచుటవల్ల, వానికిగల ఒక విశిష్టమైన స్వరూపము, విభిన్నత వీరికి గోచరించలేదు అనేక వ్యాసాలలోని గోష్ఠి ఒక్కటే ఐనది. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ (ఆంగ్ల) ఉపోద్ఘాతమున, వీరి వివిధ విషయముల పాండిత్యమును మెచ్చుకుంటూ, క్రమశః వీరికి విజ్ఞానము వికసించి, శైలి సాపుదేరి, విషయైక్యమున్ను, రచనాసౌందర్యమున్ను రాగలవని ఆశించి,'కష్టతరమైన విమర్శ కళయందు వీరి కసిగల పూనికకు' జయము నపేక్షించిరి. ఏ విషయము అవలంబించినా, విపులముగా ప్రసంగించగల సామర్థ్యము వీరికున్నది.

కొంపెల్ల జనార్దనరావు

ఉదయిని : సంపుటి 1 సంచిక 6

## గోలకొండ పత్రిక

పదునొకండవ సంవత్సరాది సంచిక. ట్రూపుబజారు, హైదరాబాదు, దక్కను. సంపాదకుడు కొండా బాలకృష్ణారెడ్డి.

ఇందు ప్రసిద్ధులైన మాడపాటి హనుమంతరావుగారు, సుసర్ల శ్రీరామ నరసింహంగారు, కురుగంటి సీతారామయ్యగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, సురవరం ప్రతాపరెడ్డిగారు, శేషాద్రి రమణకవులు మొదలైనవారు పలువిషయాలను గురించి పలువ్యాసాలు వ్రాసి ఉన్నారు. పత్రికలు తామున్న ప్రదేశానికి తగిన సేవ చేయగలిగితే దేశము మొత్తానికి ఒక ప్రత్యేకమైన సేవ చేసినట్లే. గోలకొండ

పత్రిక ఆంధ్రదేశ మంతటికీ పనికివచ్చే విషయాలలో శ్రద్ధ తీసుకొనడమే కాక, నిజాము రాష్ట్రమునకు అనల్పమైన సేవ చేయుచున్నది. నిజాము రాష్ట్రమందు సగభాగ మాక్రమించిన తెలంగాణపు తెలుగువారి శ్రేయోభివృద్ధులను గురించి తెలుగువారెల్లరు తెలిసికొనుట అవశ్యకము కనుక నిజామాంధ్రులు తలపెట్టుతున్న ఉద్యమాలకు, స్థాపిస్తున్న సంస్థలకు, ఇట్టి పత్రికలకు తగిన ప్రోత్సాహ మొసంగుట అవసరము. గోలకొండపత్రిక క్రమాభివృద్ధి జెందుట ఆనందదాయకము. ఈ పదునొకండవ సంవత్సరాది సంచిక అనేకములైన మంచి వ్యాసాలతో విరాజిల్లుతూ, వ్యావహారికములైనటువంటి, సాంఘికములైనటువంటి సమస్యలను పెక్కింటిని ముందు పెట్టుతున్నది.

ఉదయిని : సంపుటి 1. సంచిక 6

*  *

## ప్రతిభ

నవ్యసాహిత్య పరిషత్పత్రిక. మొట్టమొదటి సంచిక. సంపాదకుడు తెలికిచర్ల వెంకటరత్నం. నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు. వెల ౮ అణాలు. సంవత్సరపు చందా ౨ రూపాయలు. త్రైమాసికి.

నవ్యసాహిత్యపరిషత్కార్యాలలో ఒకటైన పత్రికా నిర్వహణము ప్రారంభమైనది. 'ప్రతిభ' తొలి సంచికలో సంపాదకులు నవ్యసాహిత్య పరిషత్తు చరిత్రము ౧౯౩౩ లో అది యేర్పడ్డది మొదలు వివరించి దాని లక్ష్యాలను, కార్యవిధానమును వివరించినారు. మరిన్ని వివిధ సారస్వత, విద్యావిషయాల పైని అభిప్రాయాలు వెల్లడించి పత్రికకు గొంతు ఉన్నదని చూపినారు. ఇందలి వివిధ వ్యాసాలున్ను నవ్యసాహిత్యపరములై పరిషత్కార్య పరాయణతకు ఆత్తిఉన్నవి. కాకినాడలో జరిగిన నాలుగవ పరిషత్సమావేశానికి అధ్యక్షులైన కావ్యవ్యాకరణ తీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి అధ్యక్షోపన్యాసము, 'ఆంధ్రవాఙ్మయం: పుట్టుపూర్వోత్తరాలు' అన్నది, పేరుకు తగి ముఖ్యంగా సాహిత్యచరిత్రాన్ని అంతను సంగ్రహముగా పరామర్శిస్తున్నది. '....పురాణాలు తెలుగులోనికి తర్జుమాలు చేసినా, లేక పురాణాల ఆధారాలమీద పెంచి ప్రబంధాలుగా మూటకట్టినా, ఫలితం ఒక్కవిధంగానే ఉంది కాబట్టి............ క్రీస్తుశకం 19వ శతాబ్ది ఆఖరుదాకా ఉన్నసాహిత్యం పురాణసాహిత్యం అన్నమాట' అని వీరు ఆ సాహిత్యమునంతనూ ఒక్కమూటకట్టి, 'పరిశేష న్యాయం చేత....పురాణసాహిత్యం కానిదంతా గాని, లేక, ఈ నవయుగంలో [పరిశేష న్యాయంచేత 19వ శతాబ్దికి ఇటీవల] ప్రాదుర్భవిస్తూఉన్న సాహిత్యంగాని, నవ్యసాహిత్యంగా మనం అనుకోవచ్చు' అని నవ్యసాహిత్యాన్ని విడదీసినారు.

ప్రబంధవాఙ్మయముపై వీరు పోసిన విమర్శనమును బట్టి సహాపురాణాలకంటె భిన్నమైన 'ఫలితం' వాటివల్ల కనబడుతున్నప్పటికి అవి పురాణయుగములోనే అణపబడ్డవి: 'ఫలితము'ను బట్టియే సాహితీలక్షణ నిరూపణము కాని, ఈ యుగా విభజనము కాని చేయుట ఒప్పిదమే అని వీరి అభిప్రాయముగా కన్పడుతున్నది. నవ్యసాహిత్యమునందు విశిష్టత వివరించ పూనుకొన్న వీరు దానిని ఆ విశిష్టతను బట్టి విడగొట్టితే బాగుండేది. కాని, ఆంధ్రసాహిత్యమున్నూ, సంస్కృత ప్రాకృతాది సాహిత్యములున్నూ విరివిగా తరిచిన శ్రీ శాస్త్రిలుగారు నవ్య సాహిత్యమును గర్హించేవారిని తీవ్రముగా విమర్శించి నవ్యసాహిత్యాన్ని సమ ర్థించడానికి తొలినుండీ పూనకొన్న ప్రఖ్యాతి సామర్థ్యాలకు వీరి అధ్యక్షోప న్యాసం తగియే ఉన్నది. కుందూరి ఈశ్వరదత్తుగారు 'శాసనములలోని తెలుగుభాష' అనే వ్యాసమునందు ఆ భాషనుండి మచ్చుకి కొన్ని విశేషాలను చూసి అవి వైయాకరణులకూ నిఘంటు నిర్మాతలకూ ఉపయోగకరములని చెప్పినారు. ఇందు ' "అందు" కళ అని వీరు చూపిన ఉదాహరణాలు తమ పని తాము చేయవు. కాని యిందు కొన్ని విశేషాలు (విరివిగా కాకపోయినా,) లేకపోలేదు. ఛందశ్శాస్త్రరహస్యాన్ని గాలించిన శ్రీ గిడుగు సీతాపతిగారు 'పద్యరచన' అనే ముచ్చటైన వ్యాసం వ్రాసినారు. వృత్తాదులలో సహా పాటలలోవలె 'తాళము', గుప్తముగా, ఉంటుందనీ, కేవలము మూడక్షరముల గణము ఏర్పరుచుకొని వాటి లెక్కతో కట్టిన పద్యలక్షణము లయగతులకు అనుకూలపడక వికట గతులుకూడా బోధించేది కావడానికి వీలుండడంచేత పద్యలక్షణం లయప్రధానంగా అవగాహన చేసుకోదగుననీ, మరిన్ని అక్షరాల ఊతను (*accent*) బట్టి నడక మారుతూ ఉంటుంది కాబట్టి, కేవల గణ ప్రాధాన్యమును పాటించక నడకను పాటిస్తూ, నడకలు ఎన్ని రకాలుగానో నడిపించుకోడానికి వీలుండగా, సంప్రదాయ విరుద్ధ మని జంకక ఆంగ్లకవులవలె వివిధ ఛ్ఛందోగతులు సృష్టించుకొని నవ్యకవులు రచన సాగించవలెననీ, కృతకభాషను వదలి వ్యావహారికము పాటలకూ పద్యా లకూ ఉపయోగపరుచుకో చెల్లుననీ, వాడుకభాషకు సహా ఛందస్సు ప్రతికూలమని యెంచనక్కరలేదనీ వీరు ఇంపుగా తెలిపినారు. ఆంగ్లమున మిస్ కాథరీన్ విల్సన్ వలె వీరు మన ఛందస్సును సంగీత శాస్త్రదృష్ట్యా పరిశీలించడానికి పూనుకొన్నారు. సంగీత శాస్త్రజ్ఞానము కవికి ఉపయోగపడే పరికరాలలో ఒకటి అన్నది నిజమే కాని, దానికి అమితప్రాముఖ్యము నిచ్చిన ప్రమాదమునకు పాల్పడకపోతే వీరి భావాలు ఛందస్సంస్కారానికీ, తదవగాహనానికీ చాలా మార్గదర్శకములు. మండపాక పార్వతీశ్వరశాస్త్రిలుగారు 'రాష్ట్రేతరాంధ్రులు : నవ్యసాహిత్యము' అనే వ్యాసం వ్రాసినారు. సంపాదకులు తెలికిచర్ల వెంకటరత్నంగారు 'భాషా

సంస్కరణము' అనే వ్యాసంలో మన భాషకు గల సంస్కరణావశ్యకతను గురించి చర్చించినారు. చింతా దీక్షితులు గారి 'సూపరెంటు కూతురు' అనే కథ, శ్రీరంగం శ్రీనివాసరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు, నోరి నరసింహశాస్త్రి ప్రభృతుల పద్యాలు మంచి సాహిత్యరచనములు. నవ్య సాహిత్యములో నవ్యతర గతులు చూపే శ్రీనివాసరావు గారి రచనలు మరికొన్ని రచనలతోపాటు ఈ సంచికకు తగిఉన్నవి బ్రహ్మశ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారున్ను, డాక్టరు బుర్రా శేషగిరిరావుగారున్ను వ్రాసిన జాబులు నవ్య సాహిత్యము గురించి ఉద్బోధము ఇస్తున్నవి. గ్రంథసమీక్షలతో, సంపాదకుల విజ్ఞాపనములతో, అందమైన తీర్పుతో ఇది మంచి పత్రికలలో ఒకటై ప్రవేశిస్తున్నది.

ఉదయిని సంపుటి 1. సంచిక 6

* *

## వీణ

మాసపత్రిక, సంపాదకుడు పాటిబండ మాధవశర్మ, ఎమ్.ఏ. (ఆనర్సు), తేల్రపోలు, కృష్ణాజిల్లా. వెల ౪ అణాలు. సాలుచందా రు ౨ లు.

ఇది సర్వవిషయాలూ ప్రసంగించే మాసపత్రిక. కాని లలితకళా విమర్శకూ, సాహిత్య రచనములకూ ప్రాధాన్య మిచ్చి చక్కని రచనములు వెలువరుస్తున్నది. దీనికి మంచి రచయితల తోడ్పాటు కలదనుటకు పెక్కు శాఖల కృషి చేస్తున్న సారస్వతులు దీని సంపాదక వర్గము నలంకరించడమే తార్కాణ. ముఖ్యముగా యువజనుల ఉత్సాహమునకు ముఖపత్రము కాగల సూచనలు దీనిలో కనబడుతుండడం ప్రశంసార్హము. అనేకవిధాల పత్రికా నిర్వహణము కష్టసాధ్యమైన యీ దేశాన, ఈ రోజులలో, తక్కిన అన్ని పత్రికలకంటె ఖరీదైన కాగితముతో, మంచి తీర్పుతో, ఏబదిపుటల గ్రంథము ఇంత తక్కువ చందాకు అందజేయ పూనుకొన్న యువజనుల పూనిక మిక్కిలి కొనియాడతగ్గది.

ఉదయిని: సంపుటి 1. సంచిక 6.

## ఆంధ్ర పత్రిక

ధాత సంవత్సరాది సంచిక. సంపాదకుడు కాశీనాథుని నాగేశ్వరరావు, 7, తంబుసెట్టివీధి, జి.టి. చెన్నపురి. ౨౬౦ పుటలు(డెమీక్వార్టో). వెల రు ౨.

ఎప్పటివలెనే ఆంధ్రపత్రిక ధాత ఉగాదిసంచిక, పది పదకొండు త్రివర్ణ చిత్రాలతో, అనేకములైన ఇతర చిత్రాలతో అలంకృతమై, ఎల్లవిషయాలకు

చెందిన వ్యాసాలు విద్వద్వర్యుల పేళ్లతో విలువకూర్చగా వెలువడింది. పది సంవత్సరాల క్రిందటివరకు ఉగాదిసంచికలలో ఆంధ్రులు అనేక విషయాలలో దీక్షతో కావించిన అధ్యయనము వ్యాసరూపాన కానవచ్చేది ఇటీవల కొంత తగ్గు దలచూపడం శోచనీయం. ఇటీవల పత్రికలు విరివిగా వచ్చి రచయితల దీక్షకు ప్రోత్సాహము కూర్చేవి కాకపోవడం సాధారణంగా రచయితలకూ పత్రికలకూ ఉండే అనుబంధాన్ని కొంత మార్చినదేమో. శ్రద్ధగా పరిశోధన సలిపే పండితులు పత్రికలయెడ కొంత విముఖులుగా ఉండడం ఉగాదిసంచికలు నిరూపిస్తున్నవి. ఏమయినా ఇప్పటికీ ఉత్కృష్ట రచయితల వ్యాసాలు దీనిలో విరివిగానే కాన వస్తున్నవి. చిత్రము లేలాగో వ్యాసాలూ ఆలాగు, ఆంధ్ర జీవితము నంతనూ సూచిస్తుండడం ఆంధ్రపత్రిక ఉగాది సంచికకు నిరూఢమైన లక్షణమే ఆయె.

ఉదయిని : సంపుటి 1. సంచిక 6.

## 'వేనరాజు'

### కీ.శే. కొంపెల్ల జనార్దనరావు

[సరిగా సంవత్సరమయింది సాహిత్యసేవకులు శ్రీ కొంపెల్ల జనార్దనరావు గారు తమ భౌతిక దేహము చాలించి. తమ జీవితమంతా నవ్య సాహిత్యాభ్యుదయానికి ధారవోసిన ఆయన వ్రాసిపెట్టిన గ్రంథా లేమీ లేవు. అమూల్యమైన ఒకటి రెండు విమర్శనములు మాత్రమున్నాయి. వాటిలో ఈ 'వేనరాజు' విమర్శ ఒకటి. ఈ విమర్శ పూర్తికాకుండానే ఆయన పరలోకగతులయినారు. అందువల్ల దీనిని సంపూర్ణంగా చదివి ఆనందించగలిగే భాగ్యం ఆంధ్ర సాహిత్యలోకానికి శాశ్వతంగా కొరవడి పోయింది. ఈ విమర్శను ఆయన తన 'ఉదయిని' రెండవ సంపుటం మొదటి సంచిక కిచ్చారు. కాని దురదృష్టవశంచేత అచ్చయివున్న ఆ సంచిక యిప్పటికీ బయటపడడానికి నోచుకోలేదు. ఆయన పరమపదించి సంవత్సరమవడంచేత ఆయన జ్ఞాపకార్థ మవుతుందనిన్నీ, ఆయనవ్రాసిన విమర్శలలో ఇది ముఖ్యమయినదనిన్నీ యెంచి, అసంపూర్తిగావున్నా దీనిని ప్రకటిస్తున్నాను.—మ.సో.శర్మ.]

మిక్కిలి చర్చకూ, సమాలోచనకూ పాల్పడ్డ యిటీవలి ప్రచురణాలలో విశ్వనాథ సత్యనారాయణగారి 'వేనరాజు' నాటకం ఒకటి. ఇందలి రచనకంటె కవిభావాలు, విశ్వాసాలు ఎక్కువ విమర్శ తెచ్చుకొన్నవి. ఏకవి అయినా తనకు మానసికముగా ఏర్పడ్డ ఒకానొక 'అవసరము'వల్ల ఒక గ్రంథము వ్రాయవచ్చు, అప్పుడా గ్రంథము, అది కళావీధికి చెందినదైనప్పుడు, కళాపరమైన సమాలోచనలో మొదట నిల్పదగును. అయితే కవిభావాలు కళాత్మకముగా రచనయందు ప్రవేశించనప్పుడు ఆభావాలు ప్రత్యేకముగా, స్వాధికారతః, విమర్శ పొందడమున్ను, కళాభంజకములని విమర్శ పొందడమూ సమంజసము కాకపోదు కాని, అవి తీవ్రతకలవై పాఠకుని మనస్సుకు నచ్చనివైనప్పుడు రచనలో అవి అతికినవో లేవో అనేఆలోచనకు తావని విమర్శ సాధారణముగా వెలువడుట

ఆశ్చర్యము కాదు. కాని అభినివేశములకు లొంగక రచనమును పరిశీలించుట సహృదయులకు మొదటి కర్తవ్యము.

వేనుడు ఆర్యఋషుల ఆలోచనకు విరుద్ధములైన ఆలోచనలు కలవాడు. ఆతడు తన నమ్మకములూ, ఆలోచనలూ తాను సాకుకొనడముతో ఆగక, భగవంతుడులేడని చెప్పుటతో ఆగక, సంఘమర్యాదలకు విరుద్ధముగా నడచెను; ఇతరులను బాధించి తన ఆశయములను లోకములో నెలకొల్పసాగెను: తండ్రి రాజ్యమును తా నాక్రమించి తాను రాజై ప్రజలను తన మతమున కనుకూల పడునట్లు దండింపసాగెను.

ఈతడు నాటకములోని వేనుడు. పురాణములలోని వేనుడు తండ్రిని వెడలగొట్టి రాజ్య మాక్రమించలేదు. తండ్రి అంగరాజు కొడుకు దుష్ప్రవర్తనకు ఖిన్నుడై తానే రాజ్యము వదలి అడవులు పట్టెను. మునులు, లోకక్షేమమును ఆపేక్షించేవారు కాబట్టి, రాజులేనిరాజ్యము ఉపద్రవముల పాల్పడునని అంగపుత్రుడైన వేనుని పట్టము గట్టిరి. ఆతడు రాజ్యమునకు వచ్చినందులకు, చోరసంఘములు భయత్రస్తములై గుహలు చొచ్చినవి. కాని ఆతడు సంఘమర్యాదలకు మాత్రము వ్యతిరిక్తముగా పోయినాడు. వానిని భంగపరుప యత్నించినాడు: అందులకు తన రాచరికమున్ను వినియోగపరిచినాడు.

దివ్యులు బెఱఁ గందఁగ, పృ
థ్వీవ్యోమము బగల, భేరిఁ వేయించె 'నయ
ష్టవ్య మహోతవ్య మదా
తవ్యం విప్రా' యనుచు నుదాత్తధ్వనులన్.

ఇది ఒక ఉపద్రవమే అయినది ఆర్యమతావలంబి అయిన సంఘానికి. కాని వేనుని వాద మొక్కటి : దేవాంశసంభూతుడైన రాజు ప్రజకు పూజ్యుడు; ప్రత్యక్ష దైవతము. అతని యిచ్ఛానుసారము, అతని ప్రీతికై ప్రజ ప్రవర్తిల్ల వలెనే కాని రాజుకంటె పూజ్యముగా ఈశ్వరుని నిలిపి వ్యభిచరించరాదు. రాజు దేవాంశసంభూతుడని దిక్పాలురు ఆతనిలో కళలు కలిపినారని ఆర్యులు చెప్పినట్టిదే: అదొక ఆయుధముగా వేనుడు వారి నెత్తికెత్తినాడు. ఈతనికి నహుషుని గతి వంటి గతి పట్టినది. తదంశసంభూతుని పూజించవలెనని బోధించగలిగితే, ఆ ఈశ్వరునే పరమముగా పూజించే పూనికలు ఖండించుట సమంజసము కాక పురాణ వేనుడు దుర్బలత కనబరిస్తే, నాటకవేనుడు అది తప్పుకొని, ఈశ్వరుడు లేడని ఒక కొత్త 'మతము'నే కట్టుకొని స్వతంత్రముగా నడవబూనినాడు. పురాణ వేనుడు చిన్నతనములో దుర్మార్గవర్తియై ప్రవర్తించినాడు; మునులాతని రాజును చేసిన తర్వాతను తన మార్గమును తన మార్గమున నడిపినాడు కాని, తాను రాజు

కా ప్రయత్నించలేదు; కాని నాటకవేనుడు స్వయముగా ఒక ప్రయత్నము చూపి, జిగీష కనఁజిచి, నాటక నాయకత్వమునకు సంస్కారము పొందినాడు.

.... .... ....

దురాశాపిశాచావేశపరుడనై నీవు పూర్వము నాతోఁ జెప్పిన సర్వ పాపములను జేసితిని.

(అంకము ౧౧, పుట ౧౩౭)

అని వేనుడు మరణవేళను గౌతమునితో పలికినాడు. నాయకుని యీ కాంక్ష నాటకమును నడిపిన ప్రధానభావ మని, 'నిమిత్త' మని (*motive*) యిందు వల్ల స్పష్టము. అడవులు పట్టిన అంగరాజు—పిచ్చిరాజు—వేనునీ, పృథువునూ కలిసినపుడెల్ల వేనుని దురాశాగ్రస్తతను ఉగ్గడిస్తాడు. ఆ దురాశాగ్రస్తత అంగరాజుకు తనయందు బాగా నాటిన అంశము. వేనుని దురాశ తొలినుండి కనిపట్టినాడు కనుకనే అంగరాజు పృథువును వేనునికి చెల్లెలుగానే ప్రకటించి అంతఃపురములో పెంపసాగినాడు. వేనుని యెదుటఁబడ్డ అంగరాజు వేనుడు తన మతముగా చెప్పుకొనే సిద్ధాంతాలను, భావాలను అసమంజసములని వెక్కిరించి, యింతకూ మూలము నిజమైన మతాభినివేశము కాక ఆదురాశ సుమా అని నిరూపిస్తూ వస్తాడు. ఆ దురాశ, ఆకాంక్ష, పైకి వెల్లడికాకుండా వుండగలందులకై యే ఒకానొక మతము జనకోటికి నచ్చచెప్పుతూ, అందులకందులకై తాను రాజ్యము చేపట్టినట్టు, ప్రజలకు సరియైన నడవడి నేర్పుతున్నట్టు అది వేనుని నటనమాత్రమే అని అంగరాజు వెల్లడిస్తూ వస్తాడు.

కాని గౌతమునికి వేనుని భావములతోనే ప్రసక్తి. గౌతముడు ఆర్షధర్మ పక్షపాతి. ప్రాణాధికమైన వేనుని ప్రీతికై ఆతని యిష్టము ననుసరించి తన మతమునకు తానే విరుద్ధముగా నడుచుకొంటూ ఉంటాడు; కావి వేనుని ప్రతిఘటించి వాదిస్తూనూ ఉంటాడు. వీరి యీ వాదముతోనే నాటకము ప్రారంభమవుతుంది. వేనుని బుద్ధి విపరీతపుత్రోవలు పోవుట, తనబుద్ధి సనాతనధర్మము పట్టుట వ్యక్తమైన గౌతముడు వేనుని తిరస్కరించి ప్రభువైన ఆతని కోపమును రెచ్చగొట్టి ఆతని మైత్రని స్నేహమునకు తుదిచీటి ఇచ్చిపోతాడు.

వేనునికి ఎవ్వరూ తనకు కైవారముచేయుట ఇష్టము లేదు. అట్లుచేస్తే అది పెద్ద నేరము. అది తప్పుపని అనేకంటే, ముఖ్యముగా అట్లుచేయుట రాజాజ్ఞను తిరస్కరించినట్టు. శ్రీధరభట్టు కుర్రవంది : దూరపు పల్లెటూరునుండి వచ్చినవాడు. అతడు రాజాజ్ఞలు తెలియక, చదువులలో తాను నేర్చిన ఆచారముం ననుసరించి రాజును కైవారము చేస్తాడు. ఉగ్రుడైన వేను డాతనికి మరణదండము విధిస్తాడు. శ్రీధరభట్టు తాత శివీశభట్టు వేనునిఆజ్ఞలు దాటనిభృత్యుడు. ఆతడు

మనుమని తెలియనితనము విన్నవించి, ఆతనిచావుతో తనచావున్ను తప్పదని బతిమాలినా వేనుడు క్షమ చూపడు : మాటలు చెవినేపెట్టడు. రెండు ప్రాణాలు ఆతని పట్టుదలలో నలిగినవి. తన అనుయాయి అయిన వినీతభట్టును పోగొట్టుకొన్న వేనుడు తన మతమునందు చాలా అభినివేశము, ప్రత్యయము కలవాడుగానే కానవచ్చినాడు. కాక, తన కంటికి అభినివేశమున్నట్టు జగత్తుకు ప్రకటించే నిమిత్తమై ఆలాగు చేసినాడా ? అసలు లోపలిదృష్టి రాజ్యకాంక్షయేనా ?

కుర్రవంది ఉద్ధతుడు కాడు. కాడని వేనునికి తెలియును, తెలియవలెను. తెలియదనుకొనుటకు వీలు లేదు. వేనుని ఆజ్ఞ రాజధానికి దూరపుపల్లెటూర నున్న కుర్ర వానికి తెలియ లేదన్నమాట. చదువులు పూర్వపువే అన్నమాట. అవి వేనునికి తెలుస్తున్నది. కుర్రవంది విద్యాప్రకాశన లోభమున తాతగారికి తెలియకుండ వేనునికి కైవారము చేయవచ్చినది ప్రమాదమని తన నమ్మినవారివల్లనే తెలిసినది వేనునికి. ఆ తాతగారున్ను అప్పుడు. ఆతడే వచ్చి బతిమాలుకొన్నాడు,— తన నిష్కళంకమైన అనుచరత్వము అర్హతగా చూపిన్ని, తన ప్రాణములు పోగల వన్నది విన్నవించిన్ని. కుర్రవంది కవితలోని పస మెచ్చినాడు వేనుడు.

"ఉత్తేజితమైన ప్రకృతినుండి రాదగిన కవిత్వము గూడ కులక్రమాగత విద్య యైనదే. ఆహా ! దివ్యమైన మానుషశక్తుల నన్నిటిని కులవిద్య అను సన్నని కృత్రిమపు బోదెలలో నొదిగించినారు !"

ఇందులకుగాను కుర్రవంది, పుచ్చప్రాయముగా వినీతిభట్టు, మరణించుట వేనునికి కంటినలక నలుపుకున్నట్టుకాదు. ఆ పల్లెటూర వేనుని ఆనతి తెలియక పోవుట వేనునికి ఆశ్చర్యమే అయి సిగ్గుపడవలె అంతటిపనికిపూనుకొన్న ఆతని ఔద్ధత్యము, పట్టుదలవలని క్రౌర్యము, నాటకవస్తునిర్వహణానికి ఉపకరించే మానుష దౌర్బల్యము అయినది. కాని అది దుర్బలమైన దౌర్బల్యము. ఇది కారణముగా ఒక ప్రతివాహిని ఊబికి చివరవరకు నడిచింది.

వేనుడు స్వయముగా చెప్పిన దేమయినా, ఆతని పనులేకాక, ఆతని ఆలోచనలు కూడా మనకు తెలుసు. ఆతనికి కొన్ని స్వతంత్రములైన భావము లున్నవి. ఆతని మనస్సులో గుప్తమైఉన్న రాజ్యకాంక్షను గుర్తించిన అంగరాజు ఒక ప్రతిద్వంద్వి ఉన్నాడు కాని, గౌతముడూ శ్రీధరభట్టుకోవామాత్రం ఆతని భావాల వల్ల లేచిన ప్రతిద్వంద్వులు.

అంతేకాదు. పృథువు వేనుని చెల్లెలుగా పెరుగుతుండెను. చెల్లెలంటే వేనుని కెంతో మక్కువ. వివాహము వలదని భావించినవేనుడు, పోసీ, తోబుట్టువును వివాహ మాడెదనంటాడు. 'వివాహము లేక జారత్వము లేదు, జారత్వము లేక పాపములేదు' అన్నవాదముతో వివాహమువలదన్నాడు, ఆస్త్రీవిషయమై భేదములు

రాకుండునని తోబుట్టువును చేపట్టెద నన్నందుకు గౌతము డింకొకసారి ప్రజ్వరిల్లి వెళ్ళిపోతాడు; అతని సిద్ధాంతములు నచ్చని పృథువు మృదువుగా ధిక్కరిస్తుంది. 'నీ సిద్ధాంతములకు నే నెన్నడు నొప్పుకొనలేదని నీకు తెలియును గదా' అని చెప్పినది పృథువు : అతనికి కొన్ని సిద్ధాంతము లున్నవి; వాటిని పృథువుకూడా ప్రతిఘటిస్తున్నది. కాని అంగరాజు మాత్రము వేనునికి దేనియందును నమ్మకము లేదనిన్ని, కొన్ని నమ్మకములు లోకమును మోసగించుటకు వెలిబుచ్చుననిన్ని నిరూపించక మానడు.

వేనుడు గౌతమునితో యుద్ధముచేస్తూ (అంకము నది), తాను గౌతమునిచేత చచ్చుటయే కోరికగా అందులకు పూనుకొనిన్ని, అతని పడవేయగలిగిన వీరావేశములో, 'నేను గౌతమునే చంపెదను. మరల నా రాజ్యము స్థాపించెదను పారిపోయిన సైన్యుల నందరిని పిలిపించి నా మతము మరల నిలువ ద్రొక్కెదను' అని విజృంభించినాడు. వేనునికి తన మత మొకటి ఉన్నది. దానియం దంతటి నమ్మకమూ, పట్టుదలా ఉన్నవన్న మాట. (లేదా, బూటకమే తిరిగి నెలకొల్ప నెంచినాడు.) కాని కొంచెము సేపటికే, తిరిగి వేనుడు తన భావమువల్ల ఏర్పడ్డవసి చెప్పదగ్గ పాపములే 'దురాశాపిశాచావేశ పరుడనై' చేసితినని వెల్లడించుట గమనిస్తే ఆ భావాలలో దాగి, ఆ భావాలు ఏర్పడుటకు కూడా కారణమైనది దురాశ ఉన్నదని స్ఫురిస్తుంది.కాని ఆభావములు అతనిఆశా నిర్వహణానికితోడుపడ్డవి కాని దానిని బలపరిచేవికాని కావు. వేను దేలాగూ రాజ్యము సంపాదించినాడు. తన చండశాసనత్వమువల్ల అది నిలద్రొక్కుకుంటున్నాడు. ఇక అంగరాజు పిచ్చివాడని చెప్పుటకు నూత్నభావజాలం ప్రజలచేత నమ్మించుటకు, ప్రజలున్ను పిచ్చివారే, అతని ప్రకారము కూడ. మరి రాజ్యము నిలద్రొక్కుకొంటకే కాక ఆనూత్న భావములు వ్యాపింపజేసి కొనుటకున్ను చండశాసనత, చండతరశాసనత కావలసి వస్తున్నది. తన చండశాసనత్వముతో ప్రజల నోరు మూసి రాజ్యమేలక, వారిని మరింత రెచ్చగొట్టి మరింత ప్రయత్నముతో అణగద్రొక్కుట, దురాశాపరత్వమే ఆతనితత్త్వమయితే, ఆవశ్యకముకాదు కాని ఆతడు తన భావాలు ప్రసారించి, తోడుగా చండశాసనత్వము పంపినాడు ప్రజలపైకి. దురాశకుతప్పిన స్వతంత్రములైన భావములాతనిని ఆవేశించి ఉన్నవి కనుక. క్రమముగా వేనమతము ప్రజలలో వ్యాపించి ప్రజ రెండుపక్షములైనది. ప్రజలు వేనుని అనుగ్రహముకై పాకులాడుటగూర్చి గౌతముడు ఖేదపడతాడు. ప్రభుప్రసాదముకై పాకులాడగల ప్రజనే అయితే, తన రాచరికము బలపరుచుకొనుటకే అయితే, ఈ నూత్న భావములు లేకుండా మరింత త్వరలో వశపరుచుకొని ఉండవచ్చు వేనుడు : అంగరాజు పిచ్చివాడు కాకపోతే మాత్ర మేమి ?

వేనునికీ గౌతమునికీ స్నేహమొకవంక, వైరమొకవంక లాగుతాడుతవి. వేనుడు గొప్పగాయకుడు. సౌందర్యమెరిగిన మనస్సువాడు. వేనాసురవధార్థము బయలుదేరి వచ్చిన గౌతముడు ఆతని సంగీతము విని కరిగిపోయినాడు మరెందుకూ వేనుడు బ్రదుక అనర్హుడైనను, ఆతని సంగీత, శిల్ప, కవిత్వ మాధుర్యములకైనా బ్రదుకతగిన వాడని కొనియాడినాడు. గౌతముని సుముఖతకై యేమి చేయుమన్నా చేయగలంతటి స్నేహము వేనునికి. వేనుని ఆజ్ఞ ధిక్కరించి తాను వివాహమాడిన సంగతి గౌతముడు వెల్లడిస్తాడు. రహస్యముగా దేశములో అట్టి వివాహములు పెక్కులు జరుగుతున్నవనిన్నీ. వేనుడు గౌతము నేమీఅనడు ఆతని భార్యకుగాను ఉంగరము కానుకయిస్తాడు. మరిన్నీ, తన భావమును సౌమ్యముగా వెల్లడించి, 'లోకము .... వినదు. పదిమంది నడచినదే త్రోవ. మన మేమి చేయగలము?' అని తన నిజమైన విశ్వాసము ప్రకటించి, గౌతముని మెప్పు పొందినాడు: 'నీవంటి దివ్యపురుషులు జన్మించనే జన్మించరు. జన్మించినను నీవంటి ప్రత్యేకతా లక్షణములు గలవారివలన లోకమునకు లాభములేదు' అన్న గౌతమునివాక్యము వేనుని నాయకత్వములోని ఒకఛాయ వెల్లడిస్తున్నది. వేనుడు కేవలము దురాశాపిశాచగ్రస్తుడై మాత్రమే ప్రవర్తించలేదు.

.... .... ....

వేనునితల్లి సునీథ అంగరాజు పదభ్రష్టుడైనపిదప కూడ అంతఃపురములోనే ఉండెను. అంగరాజు ఒకరాత్రి వచ్చి సునీథను తీసుకొనిపోయినాడు. 'కోట తలుపులు వానియంతట నవియే తెఱచుకొనిపోవును' అంగరాజునకు. ఆతనికి నమ్మిన బంట్లు ఉండనే ఉన్నారు రాజుకొలువులో ఇంకను. ఆతడు వేనుని పదభ్రంశమునకూ, పృథువు పట్టమునకూ ఎత్తులువేస్తూనే వుంటాడు. కౌషీతకుడు వేనుని భృత్యుడు అంగరాజునకు అనుకూలించే సూచనలు చూచి వేనుడాతని కురివిధించెను. కాని, అంగరాజును కారాగారబద్ధుని చేస్తే, సునీథ వెడలిపోయినందుకే చిక్కిసగమైన పృథువు మరింత భరించలేకపోతుందని ఊరకుటాడు పృథువూ, గౌతముడూ వేనుని స్నేహాత్మక మానుష దౌర్బల్యానికి ప్రతిరూపములు. శ్రీధరభట్టూ, వినీతభట్టూ మరణించిన వెనుక వారిబంధువు లొకరొకరుగా వేనునికి వైరములు కవితకట్టి ఆజ్ఞోల్లంఘనమునకు ప్రాణములిచ్చిరి. వారికవిత మెచ్చుతూ వేనుడు తన ప్రభుత్వమును మాత్రము ముద్రించుట మానడు. కాని గౌతముడు ధర్మాభినివేశముతో ప్రజలలో విప్లవము లేపుతున్నా, వేనుడాతని నేమీ చేయలేదు: చేసుకొంటే గౌతమునే పెళ్ళిచేసుకొంటానన్నవాడు మొదట: ఆ స్నేహము అతి గాఢమైనది. మరి పృథువుకోసమని అంగరాజునేమీ చేయడు. పృథువును పురస్కరించుకొని అంగరాజు ప్రతిక్రియ కొనలుసాగుతుంది వేనుని రాజ్యకాంక్ష

సూచనలు చిన్ననాటినుండీ పొడగట్టి అంగరాజు పృథువును మగబిడ్డను ఆడపిల్ల గానే పెంచినాడు. ఇప్పుడు వీలునుబట్టి ప్రజను తిరుగబెట్టి పృథువును రాజును చేయ అతని యత్నము. అప్పుడు పృథువుకాకపోతే అంగరాజు తానే రాజు కావచ్చును కాని, పృథువుకోసము కాకపోతే వేనుడు అంగరాజు తరవాయి చూచియే ఉండును.

అంగరాజొక విడ్డూరపు వ్యక్తి. ప్రత్యక్షవాదియైన వేనునికి అప్రత్యక్ష మూలాలనుండి ప్రతిఘటనము దింపినాడు. వేనునికి అట్టియెడ ఒక సహజమైన అచ్చెరుపాటు ఉన్నది. తొలిఅంకములో గౌతముని అమర్షమూ, శ్రీధరుని చావూ మాత్రమే కాదు ఏర్పడిన కాలువలు. అంగరాజు ప్రసంగము పృథువుతో వస్తుంది వేనునికి. అంగరాజు తోటలోని పూవులు కోసుకొని ఒడలంతా అలంకరించుకొని పోతూఉంటాడు. అతనికి కోటతలుపులు తీయరాదు కాని, తలుపులవే తెరచు కొంటవట. అతనిని చూచినవారు పట్టియీయవలయును వేనునికి. వేనుడే చూచి నాడు కాని మాటాడలేదు. ఏలో అతనికీ తెలియదు.... .... .... .... .....
ధరిస్తే త్రిలోకసుందరివలె ఉంటుందో అని అంగరాజు ఒడల బొమ్మికలవలె ఉంటవి. పువ్వొడి బూడిదవలె ఉంటుంది అవి బొమికలనుకొన్న శ్లథాంగుడు శ్లథ బుద్ధి - అవి పూవులు, వేనునికి తెలియును.

అయితే పృథువు రాజ్యశ్రీకి ఆటపట్టు అంగరాజులో కళలు జారినవి. వేనుడున్న పృథువు అలంకరించుకొంటేనే కాని ఆమె సౌందర్యము చూడనొల్లడు. పూవులు రాజ

రాజ్యలక్ష్మీదేవతయైన సునీథను తప్పించుకపోయి అంగరాజు పూవులు వదలివేసినాడు. అవి పృథువుకు శ్రీకరాలంకారములు. మొదట పూవులు కోసి కొనిపోయి నప్పుడున్న అంగరాజు ఒక్క మందారపూవు వదలిపోయినాడు. అది పృథువు తలకు పెట్టుకోవలసినదని వేనునియిచ్ఛ. అప్పుడు పృథువొకకథ చెప్పింది. ఆపూవు మాటాడి ఒక పాట పాడిందట: తాను తెగకొట్టబడ్డ రాజు తలకాయవలె నెత్తుట పొరలాడుతుండగా ఇంకా తనను త్రుంచడమెందుకు? - అని. ఇది విని పృథువుకు పిచ్చియెక్కిన దంటాడు వేనుడు. ఈ మందారపూవులో కవి ఒక ప్రతీకము (*Symbol*) రచించ నెంచినాడు. దానిలో భావ్యర్థసూచనము ఉద్దేశించి నాడు. కాని యిట కథాక్రమములో జరిగిపోయే అంశములో ధ్వని యిమడ్చడము కాక ప్రత్యేకము ఆ సూచననే వాచ్యపరిచి పూవుచేత పాటపాడించి భావ్యర్థము సంకేతించినాడు. ఒకమూల కుర్రవంది చావు వినవచ్చింది..... .... ........ ....

వేనుడు :—పృథూ ! నీవా మందారపుష్పము తలకు పెట్టుకొనుము.

పృథువు :— నేనా ! నీ పీక్కురవందితల మొలకు కట్టుకొనుము.

ఈ మాటలతో అంకము ముగుస్తుంది. రాజదండమున మరణించిన కుర్రవందితల రాజు మొలకు కట్టుకున్నట్టే. ప్రసంగశక్తి వల్ల, మందారమును పృథువున్ను తలకు పెట్టుకొన్నట్టే. అయితే ఆ మందారము తెగ కొట్టబడ్డ రాజు తలకాయవలె ఉన్నది. అది వేనుడు స్వయముగా పృథువును ధరించమని బలవంత పెట్టుతున్నాడు. వేనుడు తన అంతము తానే ఏర్పరచుకొనేలాగున ఉన్నాడు. మనుమని ప్రాణములు కాపాడ వేనుని వేడుకొన్న వినీతభట్టు 'మందారసుమము వంటివాడు. వాని మెడ యేల నులిమెదవు ?' అని కుర్రవందికికూడా మందారము ఉపమగా ఇచ్చి, యీ మందారమునకు ఇంకొక ప్రతీకముకై ఛాయ విసరుతాడు. మందారము అప్పుడే తెగకొట్టబడ్డ రాజు తలకాయకు ప్రతీకమై కూర్చున్నది. కుర్రవంది మెడ నులిమినాడు వేనుడు. రాజే రాజు తలకాయకు ముప్పు తెచ్చుకొన్నాడు !

వేరొకచోట (మూడవ అంకమున) అంగరాజు, వేనుడు, పృథువుల ప్రసంగములో ఒక పెంపుడు గోరవంక తన ప్రభువునకే అమంగళము పలుకుతుంది. ఆ మాటలు తనకు గౌతముడు నేర్పెనన్నది. గౌతమునికి వేనుడు నేర్పెనట 'ఆ వక్రపు గూఁతలు . కాబట్టి 'నీ ప్రాణములమీఁద నీకే విరోధమని తేలుచున్నది' అని పృథువు చదివినది. ఈ సూచన చివరంట మనసు తరుముతూనే ఉన్నది. చివరకు వేనుడు తత్త్వము తెలుసుకొన్నాడు. తన చేసికొన్న కర్మము తనచుట్టు సాలీనిగూ డల్లినదట; ఒక పెనుభూతముగా తన్ను నాశము చేయుటకై వేచియున్నది నారాయణుడట. ఆ నారాయణుడు లేడని తాను వాదించినందుకు అనుతపించినాడు.

అతడు నారాయణుడు లేడన్నాడు. ఒకసారి అతనికి గౌతమునియెడ స్నేహము ముంచినప్పుడు, అతని వాదము కొంతవరకు గంభీరముగా తోచినది. కాని తానిన్నాళ్లు కట్టిన సిద్ధాంతములు తప్పులని నమ్మకము కలుగలేదు. కౌషీతకుని మరణానంతరము అతని తమ్ముడు ద్యోషీతకుడు వేనుని భృత్యుడవుట చూచి గౌతముడు వేనుని స్వార్థపరత్వమునకు నిందిస్తాడు: ప్రజలలో కొందరు పరప్రత్యయనేయబుద్ధులు, అవివేకులు ఉండనే ఉందురు. వారిని స్వార్థాభిలాషియై వేనుడు రాజ్యము కట్టుకొంటున్నాడని

గౌతముడు సహా ఉగ్గడించిన యీ వేనుని స్వార్థపరత అతని సిద్ధాంతపరత్వముతో అన్వయించుకొంటే మేలు (అప్పుడు దానిని స్వార్థపరత అనడము కష్టమే కాని). అప్పుడు రాచరిక మొకపరికరము. అంగరాజు వేనుని చేత ఇడుములుగుడిచి రాజ్యము తొలగించబడ్డది నాటకములో జరిగిన తప్పిదము కాదు. నాటకములో వేనుడు కావించినవి భట్టుల ఉరి మొదలైనవి అతని సిద్ధాంతపరత్వ

మునకుచెందినవి ఈ నిమిత్తముననే వికసించిన నాటకమందు, నిర్మాణ వశము చేత, వేనుని రాజ్యకాంక్షకు బలి అయిన అంగరాజున్ను స్థానము పొందకపోడు.

వేనుని కర్మసూత్రములు ఏలాగు బహిర్గతములై అతని చుట్టినవో నిరూపించడమే ఇక్కడ వస్తుగతి. అయితే ఇది వేనుడనే ఒకానొక వ్యక్తి చరిత్రము చెప్పుట కాదు వేనుడనే పాత్రము కల్పించి రుచికి సానబెట్టిన నిర్మితి. అటుకాగా వేనునియందు ఒక తీర్చిన స్వరూపము కవివల్ల లభ్యము కావలె. కవి వేనునికంటె భిన్నభావుడై అతనిని తన భావాలతో విమర్శ కగ్గము చేసినదెల్ల ఆ పాత్రకు దారిద్ర్యమే. గౌతముడు, అంగరాజు, పృథువు అనేవారే కాక కవికూడా వేనునికి విరుద్ధముగా నిలిచి వారితో కుట్ర చేయడము గోచరిస్తూ వస్తుంది. వేనుని బుద్ధి యెంత పెడత్రోవ పట్టినా దాని నైశిత్య మప్రతిమానమైనది అని అంగరాజే చివర ప్రశంసిస్తాడు. కాని తొలినుండీ అతని సంభాషణలలో ఆనైశిత్య మంతగా గోచరించదు తద్విపరీతమైన మాటలు ఆడి ఓడిపోతాడుకూడా. కవి ఆ పాత్రను రచించేటప్పుడు తదుచితమైన మనః ప్రకృతి సాంగోపాంగముగా నిరూపించుకో గలిగితే ఫలితము వేరుగా ఉండేది. కాని గౌతమాదుల వాదమున్ను తెలివికంటె పట్టుదలయే ప్రధానముగా చూపుతుంది. ఈ పట్టుదలకు కవి అభినివేశము వెనుక నిలుస్తుంది. కాకపోతే వేనుడు వానిని ఎగురగొట్టి ఉండును. అతని బుద్ధినైశిత్య మప్రతిమానము కాబట్టి. గౌతమునియందు బుద్ధియన్నది ప్రధానముగా, నిశితముగా కానరాదు కాబట్టిన్ని.

కాదు. గౌతము డసలు వేనునికి తగినంత మాటాడ వీలీయడు. ఆడు గడుగునా మతాభినివేశపు టుద్రేకముతో గొంతెత్తుతాడు. వేనుడు వాదము రకముగా మాటాడడు స్నేహముపై మీటుతాడు. లేదా కోపములో ఉరుకుతాడు. ఇంకెవరు ఎదురు తిరిగినా వేనునికి లెక్క లేదు కాని. గౌతముడు ప్రతిఘటిస్తే అతడు భరించలేడు ఈ మానుష ప్రకృతి సౌందర్యవిశేషము తొలినుండీ వేనుని మనకు సన్నిహితము చేసినది. సంభాషణలయందలి లోపమునుండి ఈ సౌందర్యము ఒక ప్రక్క కాపాడుతుంది. అదిన్నీ నాటకోచితమైన మానుష దౌర్బల్యముగా అంకురించినదై ఒక అనుస్యూతి అవలంబిస్తున్నది.

.... .... ... .... .... .... ....

వేనునియెడ పగబిగిసిన గౌతముడు పిచ్చియెక్కి అడవులు పట్టిన అంగరాజును చూచినాడు. అతని పగ తాను తీర్చుతానని శపథముపట్టి అతని ననుసరిస్తాడు అతని ధోరణిలో అతని వద్ద ఏదో మహా రహస్యమున్నదని గ్రహించి, అతనిని వదలడు. వేనుడున్ను అంగరాజు నేమి చేయనొల్లడు సరే. అతనివద్ద రహస్య మొకటున్నదని గుర్తిస్తాడు. తనకు అతని వల్ల హాని లేదని యెంచినాడు.

కాని అతని వదలలేక పృథువు కోసమై సాకుపెట్టి అంతఃపురమున కాకర్షింప జూస్తాడు. వేనునికి కాని గౌతమునికి కాని అంగరాజు లొంగడు.

రాను రాను అంగరాజు తన విచిత్రమైన వ్యక్తిత్వముతో వేనుని సున్నితమైన మనోభావమును వశపరుచుకో గలిగినాడు. ఆమనస్సులోనే విప్లవము లేపినాడు. పిశాచము లున్నవేమో అని వేనునికే అనుమానము పుట్టెను. నిజముగా అతనికి పిశాచములు కన్పించినవికూడా. తనచేత చావుకోరి పడసిన వినీతభట్టు బంధువర్గము, కౌషీతకుడు పిశాచములై అతనికి ప్రత్యక్షము. అతనితో చర్చలు చేసినారు. తిరిగి అతనికి పనికిరాని కైవారములు చేసి తీరినారు. ఈ పిశాచములు అతని మనోవైకల్యములు రూపముగొన్న సూక్ష్మమూర్తులు కారు. ద్యోషీతకునికి కనబడలేదట కాని, అది వాటి తప్పుకాదు. పోనీ వేనుని కొక్కనికే కన్పించినా, అవి వేనుని భావములో భాగములని చెప్పలేము. వినీతభట్టు ముసలి వియ్యపురాలు కైవారము చేసి తన దుఃఖమును బాపుకొందా: ని వస్తే వేనుడామెను చంపడు. బంధిస్తాడు. ఆమెకూడా దయ్యమవుతుందని భయం. కాని ఆమెయే ఉరిపోసుకొని చనిపోయి దయ్యమై తీరినది. వేనుని యీ పిశాచ భీతికి గౌతము డాశ్చర్యపోయినాడు.

'హిమవంతమువంటి ధైర్యముకల వేనుడు భయపడెనా? కారణమేదియో పెద్దదే యుండవలయును.'

ఉన్నది కారణము

అంగరాజు తిరిగి తోటలోని పూవులన్నీ కోసుకొని పోయినాడు. వాటితో అతడు రాజ్యలక్ష్మీదేవి యైన సునీథాదేవి పాదములు పూజిస్తాడ. కాబోలు. పృథువుతో భూదేవి చెపుతుంది, సునీథాదేవియందు అంగరాజు రాజ్యలక్ష్మీదేవిని ఆరోపిస్తున్నాడు కాని, అసలు రాజ్యలక్ష్మి తానని - పృథువు ఆపూవులన్నీ తెచ్చి తన్ను పూజించదగునని. గోమూర్తిగా, స్త్రీమూర్తిగా భాసించి భూదేవి పృథువునందు పురుషత్వము రేపి తనయందు కాంక్ష కట్టింది. వేనుడు ఆ హృదయ పరిణామ వేళను పృథువును చూచి, 'ఇదేమి? పృథు పృథుగా లేదు. ఈమెలో నేగియో మార్పు కలుగుచున్నది. నాకు మిగిలిన బంధువీమె యొక్కతెయే? ఇది కూడ నన్ను త్రెంచుకొని పోవునా?' అని బెదరినాడు.

సంప్రదాయములు కిట్టని వేనునికి తనను అందరూ 'వేనా' అని పిలువవలసినదే కాని రాజనికాని, అన్న అనికాని అనుబంధ ద్యోతకమైన పేర పిలువరాదు. అతని సిద్ధాంతములకు ఒప్పకపోయినా తనవిషయములందు ఎదుర్కొననని వేనునికి వాగ్దానమిచ్చిన పృథువు వేనుడు తోబుట్టువును వివాహమాడెదనని గౌతమునితో స్వసిద్ధాంత సమర్థనములు చేసే ప్రసంగము విని అదిమొదలు తానా వాగ్దాన

ముపసంహరించుకొని ఆతనిని 'అన్నా' అని పిలుచుటయే నిజమని చెప్పి, ఆతని పూర్వానుబంధమునుండి ఒక అడుగు ఈవలకు వచ్చిఉండెను. భూదేవివల్ల తాను పురుషత్వము ప్రవేశిస్తూ, వేనుని పిలుపునకు 'వేనా' అని మారుపలికినపుడు, ఆతడు "నన్ను ఇంక 'అన్నా' యనియే పిలిచెద నంటివిగదా?" అని జ్ఞాపకము చేస్తే, "కాదు, 'వేనా' యనియే పిలిచెదను" అంటాడు పృథువు. వేనుడొకసారి తన అతిలోకమైన వీణావాదన సామర్థ్యము నెరపుకొని స్నేహమునిండిన మన స్సుతో దివ్యపురుషుని వంటివాడై, ఆ గానమాధురి కందని తృప్తియిచ్చే గౌత ముని సాన్నిధ్యమందు పృథువు 'వేనా' అని పలికితే, 'అన్నా' అనియే పిలువు మని స్నిగ్ధమైన అనుబంధములో పృథువునూ తననూ బిగించుకొని ఉండెను. ఇప్పుడు తిరిగి పృథువు అది భంగపరిచి 'వేనా' అనియే పిలుస్తాడు. ఈ పిలుపు మొదటపిలిచిన 'వేనా' అన్న పిలుపువంటిదికాదు. పృథువు వేనుని కట్టుతెంచు కొన్నాడు. సునీథలేదు సునీథను అంగరాజునుండి రక్షించుకోలేదు వేనుడు. అంగరాజామెను కడతేర్చినాడా అని బెంగకూడా ఆతనికి. తోటలో పూవులులేవు. పృథువులేదు. అణగిమణగిన రాజ్యలక్ష్మి విడి పృథువును వరించినది. వేనుని యందు కళలు జారినవి. హిమవంతమువంటి ధైర్యము సడలినది.

ఇందులకు పునాది, అధికారము, వేనుని ప్రకృతియందు ఉన్నది. వేనుని బుద్ధి నైశిత్యముకంటె, ఆతని మానవత్వమూ, అమానుషత్వమూ కొట్టవచ్చినట్టు కన్పడుతవి. రెంటనూ ఆతని కర్మసూత్రములు పెరిగి ఆతనిచుట్టు పెద్ద సాలీని కన్పరచినవి. కాని ఆ కర్మసూత్రాల అల్లిక తొలుత కన్పడ్డది ఒకానొక విచిత్ర మార్గాన. వేనరాజు స్నేహశాలి, కళాశాలి. ఆతని సున్నితమైన ప్రకృతిపై అంగరాజు అనే పెద్ద పిశాచము పనిచేసి, వేనుడు అమానుషముగా చంపిన వారికి ప్రాణము పోసి పిశాచములను చేసి, పిశాచములంటే వేనునికి భయమూ, అధ మము అనుమానమూ కల్పించినాడు అంతతో వేనునికి తన నమ్మకములు, ధైర్యము సడలసాగినవి. అసలు వేనరాజులోనే ఒక పిశాచమును పుట్టించినాడు అంగరాజు. ప్రజలధనమూ మతమూ ఆరగించి, అవే వారి ప్రాణములు కాన ప్రాణములారగించి, ఆతడు పిశాచమే అంటాడు. మాంసపు తృష్ణ ఎదదలో కల దట ఆతనికి. ఒంటరిగా విడువబడ్డ వేనుడు ప్రకృతియందు పిశాచచ్ఛాయలు ఊహించినాడు.

"అదిగో! ప్రొద్దుక్రుంకుచున్నది. కత్తితో నఱకఁబడిర క్తసిక్తమైన శిరస్సు వలె సూర్యుడు పశ్చిమశిఖరిఁ దోఁచుచున్నాఁడు. పిశాచములు తమ ముంగిళ్ళు నెత్తురులతో నలుకుకొన్నట్లు దిక్కులన్నియు నెఱ్ఱవడినవి. ఓహో! ఈవేగ యాకా శమునఁ దాను పక్షులనన్నిఁటిని వేఁటాడివేఁటాడి ప్రొద్దుకుంకుటచేఁ గనులు తెలి యక సత్త్వముడిగినట్లు వ్రాలఁబోవుచున్నది. క్రమముగాఁ జీఁకట్లు హెచ్చు

చున్నవి. ఇదిగో యీ గుడ్లగూబ పిశాచమువలె నాచెట్టుతొఱ్ఱలోఁ దొంగి చూచు చున్నది. నిజముగాఁ పిశాచములున్నవా? లేవు లేవు."

'ఉన్నవి ఉన్నవి' అని పిశాచములవల్లనే అతనికి సమాధానము వచ్చింది. పిశాచములంటే అతనికి నమ్మకములేదు. కాని వట్టి కవితాసామగ్రిగా అతడు పిశాచములమాట యెత్తుకొన్నాడు. అతడు కవి. అతని కవిత్వములో కవి కవిత్వము కలిసి వేనుని చరిత్రమునే చాలావరకు కీర్తించింది. వేనుని చరిత్ర ప్రౌఢ ప్రకుంకువేళ పిశాచములకు పనిఉన్నది.

కవితాధోరణిలో పిశాచములు వేనుని మనస్సులో లేచుటకుపూర్వము అంగ రాజు ప్రసంగములో పిశాచములను తాండవింప చేసిఉండెను.

ఒకపిశాచము కోటకొమ్మన నురిమిచూచినది.

ఒకపిశాచము కోటముందర నురుకుపెట్టినది.

ఒకపిశాచము రాజుగదిలోనుండి పోయినది.

ఈ పిశాచము రాజుముందర సీఁదులాడినది.

అంగరాజొక విడ్డూరపువ్యక్తి. విడ్డూరమైన వస్తువులయెడ, అట్టిభావముల యెడ వేనునికి సహజమైన విస్మితత్వమున్నది. ఒకసారి అంగరాజును గొలుసులతో బంధించినవాడు అతడు అద్భుతావహముగ విడిపించుకొనగా చూచి ఊరకున్నాడు. వేనుని యీ గుణమొకటి అతని ప్రకృతిని మెత్తగా చేలికందిస్తున్నది. ఈ గుణముపై వేనుని కళాచిత్తము శబలిత మవుతున్నది.

కవి యీనాటకములో కవితాశక్తివల్ల సాధారణీకృతి (*Universalization*) ఎక్కువగా సాధించినాడు. వేనుని కళాశాలిత ఇందుకు తోడుపడ్డది. ముఖ్యముగా ఈ పిశాచము అవరించిన ఘట్టములో వేనునినోట, మనసా వెలువడ్డ యీ చిన్న కవితా శకలమువల్ల వేనుడు కవియన్న అంశమూ, వేనుని విస్మితత్వమూ, కవితాప్రయోగ కౌశలమూ నాటకదృష్ట్యా సార్థకములైనవి. ఏమంటే, ఈ పిశాచావతరణము మిక్కిలిముఖ్యమైన సంఘటనము. అది యేర్పడుటకు ఈ కవితా శకలము తగిన పరిసర మేర్పరిచింది.

పిశాచముల ఉనికియందు నమ్మకము లేని వేనునికి పిశాచములస్థితి తెలియ వచ్చుటలో అతనికి ఆత్మప్రత్యయము సడలసాగింది. తన నమ్మకములయందు ధైర్యము ప్రీలసాగింది. తన కర్మసూత్రాలు కాబోలు అతనికి ప్రత్యక్షము కాజొచ్చినవి !

భారతి 1938 జులై

# 'వైతాళికులు'*

## కొంపెల్ల జనార్దనరావు

చివరకు ముద్దుకృష్ణగారు ఆధునిక కావ్యరత్నభండారం వెలువరిచారు. నేటి కవుల భండారం దీనిలో తెలుస్తుందట.

పెద్దకావ్యాలు విరివిగా రచించే యుగాలతాలూకు సాముదాయిక కళా సత్త్వం తెలియవలెనంటే అనేక గ్రంథాలు చదవవలసి ఉంటుంది కాని, యుగ ధోరణి సాధారణంగా ఏ ఒకటి రెండు కావ్యాలు చదివినా తెలుస్తుంది: జనుల ఆదర్శాలూ, అవి కవితలో ప్రతిబింబించిన రీతీ తెలియవస్తుంది. ఒక్క కావ్యము తత్కవితాలూకు సామర్థ్యాన్ని చాలావరకు ప్రకటించగలదు.

నేటి ఒకకవి సంగతి తెలియవలెనంటే అనేక ఖండకావ్యాలు పోగు చేసుకోవలసి ఉంటుంది తరుచు. యుగలక్షణాలు ఆలాటి అనేకకవుల రచనలు సేకరించుకుంటే కాని సుబోధములు కావు. ఖండకావ్యాలకు ఈలాటి సంకలనాలు అవసరమూ, వీలూకూడాను. సంపాదకులు పీఠికలో 'భూతభవిష్యత్తులు అతనికి (కవికి) ఎంత విలువగలవి అయినప్పటికీ అతని ఆందోళనా, యత్నమూ వర్తమానానికి చెందినవే—అతని హృదయం కొట్లాట వర్తమానంలోనే'అని చెప్పారు.

'ఈ కారణంచేతను, ఏ కవి రచనలలోనైనా సరే, తన సంఘపరిస్థితులు, తన కాలానికి చెందిన వాతావరణము ప్రతిబింబితము కాక మానవు. అంతే కాదు. నిజమైనకవి వీటిని రద్దు చేసుకొని జీవించడు'.

ఆలాగు కవిజీవితానికీ, సంఘానికీ, దేశానికీ, ఆతడు జీవించినకాలానికీ సన్నిహితం కాని కృతికి విలువ లేదని వివరించి వర్తమానయుగానికి చెందిన విలువగల కావ్యాలు ఏరజూచారు. కావ్యం యశస్సుకోసం, అశుభాన్ని పోగొట్టడం కోసం—అంటూ సంఘసంప్రదాయాన్ని సురక్షితంగా చూపుతూ ఉపదేశం ఈయగల వస్తువును ఆలంబనంగా చేసుకొని, పూర్వం కావ్యం ఆలపించారు కవులు. నేడు సంప్రదాయమునెడల భక్తివల్లకంటె, సంప్రదాయంతోడి రాపిడి వల్లనే ఎక్కువకవిత్వం పుట్టుతున్నది. వ్యక్తివాంఛలూ, సంఘంవాంఛలూ సమరసపరుచుకొనే నిరంతర వ్యాపారంలో నాగరకత సాగుతూండగా, కవి వ్యక్తి

---

* 'ముద్దుకృష్ణ సంకలితము. జ్వాల, బెజవాడ. క్రౌను ౨౮౪ పుటలు. వెల రు ౧-౮ అ.

తాలూకు ప్రవృత్తులు, నిగూఢములైన జీవితరహస్యాలు, స్వప్నాలుగా, ఆద్యభూతాలు కొత్తగా కలిసి రూపాలు కట్టుతున్నట్టు, భావోద్రేకముతో కావ్యముపలికి ఆలోచన రేపుతాడు. ఆ కావ్యం తాలూకు రమణీయతవల్ల ఆ ఆలోచన అనురోధముపాలై, హృద్యమైన అవగాహనంవల్ల ప్రసరిస్తుంది. సంపాదకులు పీఠికలో 'ఏనూతన దృష్టి అలవరుచుకుంటే సంఘానికి భావిలో ఎక్కువనీతి. ఉత్తమగతి కలుగుతుందో, దానిని కవి సూచిస్తాడు' అనీ, 'భవిష్యత్తులోకి ఉత్తమమార్గాన సంఘాన్ని నడిపించడం తన నిరంతర లక్ష్యంగా ఎంచుకుంటాడు' అనీ చెప్పారు. కవులు మొదలంట రేగి రేపే అనుభవసత్త్వంవల్ల సంఘం తాలూకు నీతికల్పంలో క్రమశః కొన్ని రేకులు విరియవచ్చు. కాని నిరంతరలక్ష్యంగా సంఘవిషయాలు కవి చేపట్టుతా డనే కంటె, సాంఘికప్రవృత్తి సహా తన వ్యక్తిగతమైన అనుభవముపరంగానే పలుకుతాడని యెంచవచ్చు. '*Poets are the unacknowledged legislators of the world*' అని షెల్లీకవి చెప్పినా, ప్రపంచమే కాదు, తాముకూడా కవులు తమ జగచ్ఛాసకత్వం మొదట గుర్తించరనే చెప్పవచ్చు. అది షెల్లీ లాక్షణికంగా—కవి తా నాపదవి పొందవలెననే లక్ష్యంతోనే కవిత చెప్పతాడని—ఉద్దేశించినట్టు భావించ నక్కరలేదు.

'It is not the poet's business to save man's soul but to make it worth saving'

అన్నాడు ఫ్లెక్కర్ (*James Elroy Flecker*) అనేకవి. మనిషిఆత్మకు ముక్తి నివ్వడం కాదు కవిపని, దానిని ముక్తి కర్హమైనదానినిగా కావించడం.

అతడే ఇంకా అన్నాడు:

'However, few poet's have written with a clear theory of art for art's sake, it is by that theory alone that their work has been, or can be, judged:-and rightly so if we remember that art embraces all life and all humanity, and sees in the temporary and fleeting doctrines of conservative and revolutionary only the human grandeur or passion that inspires them......'

అన్నాడు. కళ కళకోసమే—అది తనయందే పర్యవసిస్తుంది—అనే విషయం దృష్టిలో ఉంచుకొని వ్రాసిన కవులే చాలా తక్కువ: వారిరచన ఈ దృష్టితోనే పరిశీలించాలి. కళ జీవితాన్నంతనీ, మానుషలోకాన్నంతనీ తనలోకిదింపగలది. సంప్రదాయపరత్వమనీ విప్లవపరత్వమనీ తాత్కాలికములూ అస్థిరములూఅయిన సిద్ధాంతాలు ఏర్పడడంలో ప్రధాన చైతన్యమైన మానుషమహత్త్వాన్ని, ఉద్వేజనాన్ని నిరూపిస్తుంది కళ: ఇది జ్ఞాపకం చేస్తాడు ఫ్లెక్కరు. అనేకులు కళలో, కవితలో,

సందేశం, ఉపదేశం కావలెనని వెదుకుతారు. ఒకనీతి గణబద్ధముగా చెప్పినవాని కంటె అనుభవాన్ని హృద్యంగా ప్రతిపాదించినవాడు మంచి కళాశాలి అని ఒప్పుకోనివారు కళఅంటే ఉపదేశ మీయడమే అనుకుంటే చర్చ అక్కరలేదు. వారు పూర్వలాక్షణికులను మాత్రం తమతో ముడిపెట్టుకొని అగౌరవించకుండా ఉంటే సంతోషించాలి. పూర్వులు రసంమీద, రమణీయతమీద శ్రద్ధంగా నిలిచి కావ్య లక్షణం వివరించారు. ఆధునికులు చిన్నచిన్న భావాలనుసహా కవితగా కట్టజూడడం నిందాపాత్రముగా చూస్తారు కొందరు. పెద్దకావ్యం వ్రాసి అద్భుతపరిస్తే కాని ఒకరసం పరిణమించినట్లు కాదన్నది పొరపాటు ఈ చిల్లరభావాలంటే వ్యభిచారిభావము లన్నది పొరపాటు. అనంతములు భావములు, అనంతములు రసములు — అని మన లాక్షణికులు చెప్పకపోలేదు. భావముపట్ల వ్యభిచారిత సాకాంక్షము; ఒకస్థాయిని బట్టి ఒకభావం వ్యభిచారి అవుతుంది. అదేవేరొకచో స్థాయిముఖం కాగలది. కొన్ని భావాలు మాత్రమే స్థాయులనీ, తక్కినవి వ్యభిచారులనీ, ఆ కొన్ని స్థాయులూ మాత్రమే రసత్వం పొందగలవనీ, అవిమాత్రమే కావ్యములో ప్రయోజ్యములనీ, తక్కినవి అవలంబించిన సందర్భాలు కావ్యత్వం పొందవనీ యెంచడం లక్షణకల్పాన్నీ కావ్యశక్తినీ సంకుచితం చేయబోయే అసాధ్యమైన పూనిక. ఏ అనుభవమునుండి అయినా రసం ఉప్పతిల్లగలదు ఏ భావమూ స్థాయిత్వం పొందినపుడు ఆ రసాలపట్టికలో తొమ్మిదింట ఒకపేరు కింద నిలబడుతుంది. అయితే పూర్వం విభావాదులు విస్పష్టముగా వివరించి రస పరిణతి చేకూర్చితే, నేడు విభావాదులున్ను వ్యంగ్యములో ఇమిడ్చే కొత్త వ్యవస్థ వాడుకలోనికి వచ్చింది. విభావన, భావాన్ని నాట్యధర్మిగా ఎత్తడం అంతటా సమానమే. రసరచనానికి ఒక్కవిధం కాదు.

*Lyric Poetry* (భావకవిత్వం) అన్నది అసలైన కవిత్వానికే మరొక పేరు — అని స్మరించాడు *Edmund Gosse* అనే ఆయన. ఏ సత్కావ్యంలో కనిపించే రసఘట్టమైనా కవి ఉద్రిక్తుడై చెప్పినదే. అదే విభావాదికం వ్యంగ్యమాత్రంగా అవలంబించి భావకవిత్వం అనే పేరు కోరుకొంటుంది. ఇది సామాన్యముగా భావకవిత్వం కనబడే స్వరూపం. పూర్వం కవి ఒక కథలో రసం పండించి, తన భావాలూ అనుభవాలూ పరికర సామగ్రిలో ప్రయోగించే వాడు. ఒక్కొకపుడు తన అనుభవ విశేషాన్ని ఒక ఘట్టంలో, ఉపకథలో చెప్పడమూ విరళముగా కన్పిస్తుంది. 'కళాపూర్ణోదయము'లో సుగాత్రీశాలీనుల కథ విశిష్టమైన అనుభూతిని ప్రకటించే కావ్యఖండం — ఖండకావ్యమున్ను. నేటికవిన్నీ తన అనుభవాన్ని ఒక కథావస్తువున ఆరోపించి విషయముల భావకావ్యం (*objective lyric*) సంతరిస్తాడు. కాక విభావాదికం దాచి కేవల రసఘట్టములో ఉద్రిక్తుడై

కావ్యం పొంగించే ఫక్కీ తరుచైనది. ఉదాత్త కథావలంబనం మాని, వ్యక్తి స్వీయానుభవం రసీకరించుకొనడంలో అనేక అనుభవాలు నిత్యజీవితం నుండి కావ్యవస్తుత్వం పొందుతవి.

ఈలాటి కవితావేశంలో, సిద్ధహస్తులైన కొద్ది కవుల చేతినుండి వచ్చిన రచనమే కాక, ప్రయత్నాలు చేసే పెక్కురివల్ల భావసంపత్తి భాషా సౌష్ఠవములో రూపొంది కొన్ని మంచి కావ్యాలు సిద్ధించడం అనుభవ గోచరం అవుతున్న విషయం. మన్రో (*Harold Monro*) అనే ఆయన ***Twentieth Century Poetry Anthology*** సంకలితం చేస్తూ, వందమంది వల్ల ఐదువందల మంచి కావ్యాలు మనకు దొరుకుతవి, తక్కువులు శాశ్వతంగా నిలవగల ప్రతిభ లేని వారయినప్పటికిన్ని, అని చెప్పినాడు. ఎక్కడా అది నిజమే అవుతుంది తరుచు, భాషకవితకు సంబంధించినంతవఱకు. అనగా ఈలాటి సంకలనాలపట్ల కవులమీద కంటె కావ్యాల మీద ఎక్కువ దృష్టి నిలపవలసిన అవసరం ఉంటుంది. ముద్దుకృష్ణగారు కొందరు కవులను ప్రధానముగా మనసులో ఉంచుకొని ఈ సంకలనం చేసి ఉండకపోతే ఇంకా చాలా కావ్యాలు ఇందు ఔచిత్యంతో ప్రవేశం పొందగల్గి ఉండేవి. అయితే వీరు ముఖ్యులైన వైతాళికులను మాత్రమే ఏరుకొన్నారు.

"ప్రాచీనంలోనే యుగపరపరంగా విస్పష్టమైన మార్పులు కలుగుతూ వచ్చినప్పుడు, ఈనాడు ప్రతి దేశంలోని విజ్ఞానమూ, ఏ దేశంలో ఏ వ్యక్తికైనా ఇంత సులభంగా అందుబాటులోనికి వచ్చినప్పుడు, ఆధునిక సారస్వతంలో కలిగిన మార్పుకన్న రాదగినదే ఎక్కువ ఉన్నదేమో అనిపిస్తుంది'' అని ఊహించి సంపాదకులు దీనికి 'వైతాళికులు' అని పేరు పెట్టినారు. నిజంగా ఇది సంధి సమయమే. అదే అయితే, ఇది భాష సౌభాగ్యానికి ఎంత మంచి ప్రారంభం ఇస్తున్నదో అని ఆశ కలుగక మానదు— ఈ సంపుటము తిలకిస్తే. మరికొందరు వైతాళికులున్ను ఇందు చేరవలసినవారు లేకపోలేదు. ముఖ్యంగా పింగళి కాటూరి జంట. ఈలోటు ఏకారణం చేత వచ్చినదైనా, ఇందు కూర్చిన కవుల కావ్యాలవల్ల ఆధునిక కవితాసత్త్వం బాగా తెలియవస్తూనే ఉన్నది.

నవ్యకవితకు 'మానిషాద' ప్రాయమైన గురజాడవారి తొలి ముత్యాలసరం కావ్యం ఈలాటి సంకలనానికి మొదట నిలవవలసిందని చెప్పవచ్చు; కాని కథనాత్మకములైన కావ్యాలు సంపాదకు లిందు కూర్చ నెంచకపోవడంవల్ల, ఆ కావ్య మందలి కథనచ్ఛాయ దానికి ప్రవేశ మిచ్చి ఉండకపోవచ్చు. ముఖ్యముగా వ్యక్తిపరత — ఐకాంతికత (*individualism*) — విషయిముఖతయూ (*subjectivity*) — నవ్యకవిత యందు ప్రధానముగాను, ప్రబలముగాను బలిసి వచ్చినవి కాబట్టి, ఇందు ఎక్కువ ప్రవేశము పొందక తప్పదు.

'దేశమును ప్రేమించుమన్నా' అనీ, 'హృదయములు చీల్చి చదువుడో సదయులార' అనీ సోదరజనాన్ని ఉద్దేశించి చెప్పిన దేశ భక్తి కవిత్వమే, 'వేగి క్షేత్రము' అనే విశ్వనాథ వారి కావ్యములో కవి తనలో తాను ఉద్రిక్తుడై పలుకు కొన్నాడు. వేదులవారు సుమజన్మము ఆరోపించుకొని 'కాంక్ష' ఊరినారు. అదే భావమున, రామిరెడ్డిగారు, అబ్బూరి వారు మాతృమూర్తి దివ్యసందర్శనం పొంది నైవేద్యాలు పెట్టినారు. ఒక్కొక భావము ఎన్నెన్ని విధాలనో కావ్యరూపాన అందాలు తిరగగలదు. మరిన్ని కవి ఆ భావాన ఎంత తపించినాడో తెలియవస్తుంది: సముదాయానికి చెందిన భావమూ తన లోపలి సహజమైన అనుభవము మేరకు కవి నిరూపిస్తాడు.

మనః ప్రవృత్తులలో ప్రేమ ప్రధానమైనది కాగా, కవితలో ఆ భావము ప్రబలముగా అవతరిస్తుందని గమనించారు కళాకోవిదులు. అయితే అది ఉదాత్తమైన నిర్వహణం పొందుతున్నదా లేదా అనే పరీక్షలో ఆధునికులు కొంత వెగటు పుట్టిస్తున్నారు. శృంగారములో ప్రలపించిన కొందరు పూర్వులవలె, విప్రలంభములో, కరుణములో ప్రాకృతులై విలపించిన కొందరు ఆధునికుల కవితలు తాము చమత్కారకలితము లయిన్ని అనుకృతులలో - ఒక్కొకపుడు కవి తనను తానే అనుకరించుకొన్నాడు - సాగదీయబడ్డవి. కాని సాధారణముగా ఏ కావ్యము తీసుకొన్నా, తెలివి తేటలు, సంస్కారము, నాగరకత దాని భావ సామగ్రిని నిబిడితమై ఉండడం తరుచు చూస్తాము. అనుభవంకంటె అది రేపిన భావమే ప్రధానంగా చూచుకొంటాడు కవి. ఆ భావము పుష్టికి తోడుపడుతున్న సామగ్రి తాలూకు సంపన్నత మాత్రం ఉపేక్షించరానిది. అనుభవసంపత్తిపట్ల వచ్చే విమర్శాన్ని కవులు గుర్తించవలసినదే అని చెప్పినట్లే, వారి కళాసంపత్తిని లోకము గుర్తించవలెనని చెప్పడమూ ఉచితం.

చిత్తశుద్ధితోడి వీరి కవితావ్యాపారానికి లొంగిన వస్తువులు అనేకం. మూడు పద్యాలలో, ఒక్కపద్యములో కావ్యత్వం తొణకజేసేసర్పుతో వీరు భావంనడుమ తీవ్రంగా ఆలాపన అందుకుంటారు. 'స్వామి' తోడిది, ప్రేయసి తోడిది. ప్రకృతి దృశ్యాలతోడిది కవి అనుబంధాలు పెక్కువిధాలుగానడిచి సుందరమైనస్వరూపాలలో తమ్ము దించుకొన్నవి. (అద్భుతరసం ప్రాముఖ్యాన్ని గురించి కీర్తించినట్లు విశ్వనాథుడుదాహరించిన ఒక అగస్త్యభ్రాతతెలివి మెచ్చుకోతగ్గది.) కవితన భావోద్రేకములో ప్రకృతిని పునస్సృష్టి చేస్తాడు. ప్రేమానుభూతిలో నాయని సుబ్బారావుగారు కావించినసృష్టి అమోఘమైనది. ఆభావము కవితగా ఆ పరిపాకం పొందినది అరుదు. అసలువారి కవితయే ఉత్తమపదవిలో నిల్వగలది. ఒక్కొకచో ఈ తలము అంటుతూ, బుద్ధికలితమై నడిచే కృష్ణశాస్త్రిగారి ప్రేమ

కవితా, విషాదకవితా చేసిన విహారమూ ప్రశస్తం. ఆదర్శాన్ని భావించి రామి రెడ్డిగారు నడిపిన 'స్వాతంత్ర్యరథము' షెల్లీకవి '*Triumph of life*'ని కొంతగా జ్ఞప్తికి తెస్తుంది అబ్బూరివారి 'అప్రాప్తమనోహరికి' అనే కావ్యంలోనూ ఆదర్శ పరమైన హృదయద్రుతి కానవస్తుంది. కవి తన స్థితినే కాదు, అభీష్టస్థితిలో సహా తన్ను చూచుకొంటాడు. తన్నుతా దాటి విహరించేక్రమంలో, బాహ్యప్రకృతిని తన అనుభవపుటద్దాలలో చూచి తనభావంతో దానికి సామరస్యం కుదుర్చుకోడం తరుచైన అలావాటైనది కవులలో. కేవల బాహ్యదృశ్యంవల్ల విడివడ్డ భావమేఘాలూ మంచివర్షాలు కురిసినవి : విశ్వనాథవారి 'స్వాగతము', 'వేగిక్షేత్రము' ఈలాటివి. నాయనివారు వేదులవారు, సౌదామిని, బంగారమ్మ, బసవరాజు — ఎందరో రమణీయంగా పలికినారు ఈ విధాన. శ్రీశ్రీగారి 'ఒకనాటిరేయి' బహుళపంచమిజ్యోత్స్న వారినే కాదు, నిన్నూ నన్నూ భయ పెట్టుతుంది. సహజమైన భాషలో, అమాయికమయీ అంద మెరిగిన నడకతో వస్తువును భావమయంగా రచించే పద్ధతి. *Imagism* మొదలైన నవ్య రీతులు, ఈ గ్రంథాన కానవచ్చే కవులందరిలో చిన్నవాడైన ఈయనలో, మరి ఒకరిద్దరిలో, విరిసే సూచనలున్నవి. ఈ కొత్తపద్ధతులకే వీరు "జయభేరి" మ్రోగించారు. చిత్తశుద్ధిగల ఈ కవులకు భాషలోను, నడకలోను కూడా కొత్త స్వేచ్ఛలూ, అందువల్ల విలసనాలూ తొలినుండీ రుచించినవి. రాయప్రోలువారి సున్నితమైన కొత్త పాతల సమన్వయం క్రమశః వర్ధిల్లింది. బసవరాజువారి నగ్న మైన, కనుకనేమర్మజ్ఞమైన కవిత, "శివరాత్రి ప్రభ"వంటి ఉద్విగ్నమైన చిత్రము ఆకట్టిన కవికొండలవారికవిత,మరికొన్ని, ఒకవంక నవ్యతకు జయపెట్టగా,అబ్బూరి వారు నన్నయగాంభీర్యము పాతఛందస్సులా, కొత్త ఛందస్సులా కొత్తనడకలలో చూపి, వేదులవారు వృత్తరచనలో అప్రతిమానమైన పాకముచూపి, నాయనివారు గీత ములో కవితాపరిపాకము పారము ముట్టించి, విశ్వనాథవారు తమ సర్వతోముఖమైన చాతుర్యము విశిష్టగతులలో ప్రదర్శించి, కృష్ణశాస్త్రిగారు వివిధ సంప్రదాయాలూ తమశిల్పనైపుణిలో పాడించి పాతవారి మెప్పును సహా ఒడుచుకోగల సాఫల్యము చూపుతున్నారు. నండూరివారు పాతలను అవలంబించి భాష నాట్యోచితము చేసినా, అది కవితా సౌందర్యాన్ని మాత్రం మనకు చూరయిస్తున్నది. విశ్వసుందరమ్మ గారి "కుపితవిధి'', బంగారమ్మగారి 'తమస్సు' కోమలములయీ పురుషకవుల లోతు లందుకొంటున్నవి.

నవ్య కవితపట్ల వచ్చే విమర్శలు ఎన్నో దూసుకోసాగినవి. కాని అది సజీవమని చూపడానికి ఈ సంపుటము నిలుస్తున్నది. కాని కొందరు కవుల మరి కొన్ని కావ్యాలు ఇందు ప్రవేశము పొందవలసినది. విశ్వనాథవారి "కొండవీటి

పొగమబ్బులు" వారి సామర్థ్యాన్ని, విశిష్టతను కుంభితముగా పట్టిచూపడమే కాక, నేటి కవిత్వపు ఉన్నతి చూపగల కావ్యము— ఇది గొప్ప *ode*. పెనుమర్తి వారి "జన్మాంతరము" వారి మంచి కావ్యాలలో చేరుతుంది. కృష్ణశాస్త్రిగారి "శిథిలాలయమ్ములో శివుడు లేడోయి" అనే గేయం వారికి మంచి అభిజ్ఞానాలలో ఒకటి. కొన్ని కావ్యాలు ఇందలివి తొలగించీ ఉండవచ్చు. అందువల్ల ఆయాకవులను మరింత చక్కగా చూపి ఉండవచ్చునేమో!

ఇంచుమించు నవ్యకవులందరితోనూ చనువైన నెయ్యముగల ముద్దుకృష్ణ గారు వారి వారి కవితలను సాంగోపాంగముగా తరిచి ఒప్పిదమైన సంకలనం చేయడానికి తమకు గల అవకాశాన్ని బాగా వినియుక్తం చేశారు. ఆయాకవులను గురించి వీరు గ్రంథము చివరఇచ్చినవివరణాలు విమర్శదృష్టి, రసికతా నిండినవై చదువరికి చాలవరకు సరియైన బోధన ఈయగలిగి ఈ సంపుటానికి మంచి ప్రయోజనం సంపాదిస్తున్నవి.

1935 జూన్

ఉదయిని శివ సంచిక

# వ్యాసాలు

[జనార్దనరావ్ అభిరుచి వైవిధ్యం ఈ వ్యాసాల్లో చూడవచ్చు. వివిధాంశాలమీద రాసినవివి. ఆ రోజుల్లో ప్రచురితమయ్యే దాదాపు అన్ని పత్రికల్లోనూ రాస్తూండేవాడు. దొరికిన వివి. ఇంకా ఉండచ్చు ]

## కీ॥ శే॥ జనమంచి వేంకటరామయ్యగారు

1932 డిశంబరు 2వ తేదీ అఱువది వత్సరాల జీవితముగడచి, ఈ సంవత్సరము (1933) జనవరి 19వ తేది శ్రీ జనమంచి వేంకటరామయ్యగారు (రాజమహేంద్రవరము స్వగృహమున) పరమపదించినారు. అఱువది వత్సరాల మనిషి సారస్వతములో దీక్షితుడై ఉన్నాడంటే సాధారణముగా అతడు ఏ పూర్వ ఫక్కిప్రాతలోనో రుచిమరగి నవీన ధోరణులకు మడికట్టుకునే ఉంటాడని పిస్తుంది, మనము ప్రయత్నించకుండానే. కాని శ్రీ వేంకట రామయ్యగారు నవీనరచనలకు చవిగొనడమే కాకుండా తమరచనలలో నూతన ఫక్కికి సౌహార్దము ప్రసాదించారు. పూర్వ ఫక్కికి వైరుధ్యము నిలువనీక, వారిరచనలలో రూపుపట్టిన ఆధునికత కంటెనుకూడా, వారి సంభాషణలలో నిజముగా ఆధునిక సారస్వతగతుల గుడలా, వాని చిరసౌభాగ్యము నెడలా వారిసంభావన, ఆశఉజ్జ్వలముగా వెలుగుతూ కానవచ్చేది. వారు తెలుగులో కవి, పండితుడు కావడమేకాక, ఆంగ్లములో మంచి కావ్యపరిచయము వారి సంస్కృతికిగాను పెద్ద సంపత్తి. సంస్కృత భాషనుండి మాలతీమాధవము, ఉత్తరరామ చరితము, విద్ధసాలభంజిక, మేఘ సందేశము తెలుగులో తర్జుమాచేసినారు. ఇది వారి రచనలజాబితాగానే తీసుకోవలెనంటే ఇంకాచేర్చవలసి ఉంటుంది: తెలుగులో 'ననకుసుమాంజలి' అని ఒక స్వతంత్ర కావ్యాల సంపుటము. మఱి పదియేను కావ్యాలు ఒక సంపుటముగా రానున్నవట. నిజానికి సంస్కృత నాటకాల తర్జుమాలూ, కొన్ని యింకా ప్రకటితములు కాలేదు. వారి కావ్యరచన సరళము, ధారాళము, ప్రసన్నము; సౌమ్య సుందరమైన భావముతో అలరారుతూఉంటుంది. తర్జుమాలలో, అవి స్వతంత్ర రచనయేమో అనిపించే సామగ్రి వీరియెడ కన్పట్టేవి తరుచుగా దొరకదు.

కావ్యములలోనేకాక నాటకములోకూడా స్వతంత్రముగా చేయినడిపిద్దామనేది వీరి తుది ఉద్యమాలలో ఒకటి. ఈనడుమ భారతిలో ప్రకటించిన 'సతీపతుల సరస సల్లాపము' లను వెన్నంటి ఒక సాంఘిక నాటకము వ్రాయవలెనని సంకల్పించి ఉండిరి. ఈ సంచికలోపడ్డ 'ముగల్ సామ్రాజ్య పతనము' అనే కావ్యములో ఒకచోట 'బ్రిటిష్ సామ్రాజ్య వైభవము' అంటూ వ్రాయదలచు కొన్నట్టు చెప్పియున్నారు. కాని యివి రెండూ, బహుశః మఱికొన్ని సంకల్పాలతో పాటు, మనలోకములో నెఱవేఱదలచుకోలేదు.

రచించి ఉన్నవైనా ప్రకటించేయేర్పాట్లు జరిగితే ఒకకవి కావ్య జీవితము సంపుటముకట్టి భండారములో ఇక విసరివేయవచ్చును. తమ జీవితములో 42 సంవత్సరాలు పెక్కు తావుల వారు ఉపాధ్యాయులుగా ఉండిరి. ఉత్సవములలో ప్రసిద్ధులై ఉన్న ఆంధ్రులనేకులు వారికి శిష్యులు. అటుపైవారు కవిగా ఆంధ్ర లోకమునకు పరిచితులు. వీరి నిర్వాణము ఆంధ్రలోకమునకు శోకకారణము.

[ఫిబ్రవరి 1933 భారతి]

(మనవి మాటలు)

[దీన్ని కొంపెల్ల వారే రాశారని వెంకట రామయ్యగారి కుమారులు శ్రీ జనమంచి కామేశ్వరరావ్ గారన్నారు. కొంపెల్ల వారూ వీరూ చాలా సన్నిహితులు]

# డాక్టరు సండర్లాండు - భారతబంధువు

డాక్టరు సండర్లాండు భారత దేశమునకు గావించు సేవలు, నిస్స్వార్థము లగుట, నమూల్యములు. సత్యము, ధర్మము, స్వాతంత్ర్యము, సర్వసహోద రత్వము మున్నగు మహదాశయములకే యతడు తొలినుండియు తన జీవితము వినియోగపఱుచుచున్నాడు.

డాక్టరు సండర్ లాండు 1842 సం. ఫిబ్రవరి 11వ తేదిని జన్మించెను. ఇప్పుడెనుబదియేడవ వత్సరము గడచుచున్నది. ఇంతవయసు గడచియు నత డిప్పుడు గూడ తరుచుగ భారతీయుల సభల కధ్యక్షత వహించుచు, మిక్కిలి యుత్సాహముతో నుపన్యసించుచుండును.

చిన్నతనముననే యతని హృదయమున భారతదేశమునెడ ప్రేమయు, నభిరతియు నెలకొనెను. నాటనుండియు నతడు భారతదేశమును గూర్చిన యనేక విషయముల జదువుచు వినుచుండెను. భారతదేశము నుండి మగుడి వచ్చిన యిరువురు మిషనరీలతో నతడు పరిచయము గావించుకొని ఇచ్చటి విశేషముల దెలిసికొనెను. తానే యొక మిషనరీయయి భారతదేశమున వసింపవలెనను నిచ్ఛ శీఘ్రముగనే యతని హృదయమున మొలకెత్తెను. కళాశాల యందును, ధార్మిక శిక్షా మందిరమునను (*Theological Seminary*) గూడ ఈ కోర్కి, యీ స్వప్నము అతని వీడలేదు. ఆతడు తన విద్యాక్రమమంతయు భారతవాసమున కనుకూలించు రీతి నడపుకొనెను. అతని సోదరియు, కొందఱు మిత్రులును మిషనరీలయి భారత దేశమునకు వచ్చుట సంభవించెను గాని యాతడు మాత్రము సంకల్పము మాఱి మార్గాంతరము చేకొనెను. ఐన నాతని యగాధమగు భారత ప్రేమ సుంతయు కృశింపదాయె. భారత దేశపు గొప్ప గొప్ప మతములు, విశాల వాఙ్మయము, అమూల్య శాస్త్రములు, సుదీర్ఘమగు నితిహాసము, అన్నిటిని మించి హృదయ స్పర్శులగు నేటి సాంఘిక రాజకీయ సమస్యలు - వీనిని గూర్చి యతడు నలుబదియేండ్లు కెక్కువగ శ్రద్ధతో నధ్యయనము సేయుచున్నాడు. భారతీయ విషయములందు చిరపరిచయముగలవాడ గుటచే నతనిని బ్రిటిషు జాతీయా ద్వైతవాది మహాసంఘము (*British National Unitarian Association*) వారు 1895 - 96 సం.న మత, సంఘ, విద్యాది సంబంధములగు విషయముల నరసి రా స్పెషలు కమిషనరుగా నంపిరి. మరలిన వెనుక నాత డావిషయముల

గూర్చి లండను నగరమున విస్తృతమగువివరణమును ప్రకటించెను. 1913-14లో బ్రిటిషు అద్వైతవాది మహాసంఘమువారును, అమెరికను అద్వైతవాది మహా సంఘమువారును గలిసి అట్టి కమిషను మీదనే యతనిని తిరిగి భారతదేశమున కంపిరి. మిషనరీలను, ప్రభుత్వోద్యోగులను, ఆంగ్ల వాణిజ్య నిర్వాహకులను, భారతీయ ప్రముఖులను సందర్శించుచు, ప్రధాన నగరముల నుపన్యసించుచు, అన్ని మతములకును, రాజకీయ పక్షములకును జెందిన భారతీయ నాయకు లెల్ల రితో సంభాషించుచునప్పుడతడీ దేశమున 13,000 మైళ్ళకు పైగా ప్రయాణము చేసెను. పెద్ద నగరములందే కాక చిన్న పట్టణములందును, అమెరికనులు మున్నెవ్వరును త్రొక్కియెఱుగని మాఱుమూలల పల్లెలందు సయితము, కొన్ని వారములు గుఱ్ఱముపై పయనము చేసి, శ్రమపడుచు, నతడు తన పరిశోధ నాదికము సాగించెను. నాటికిచట నడచుచుండిన వివిధ పత్రికారాజముల కాతడు ముచ్చటపడి, అనేకములకు చందాలుగట్టి, తద్ద్వారమున పెక్కు విషయముల గ్రహింపదొడగెను. ఇట్టు లతడు భారతదేశ మందలి వాస్తవ పరిస్థితుల సాంగో పాంగముగ నరసి, యనేక ముఖ్య విషయముల బ్రిటిషుజనుల కెఱిగింపగల్గెను.

అఖిల భారత జాతీయ మహాసభ యొక్క రెండు వార్షి కాధివేశనముల యందును, భారత జాతీయ సాంఘిక సమాజమునందును నత డుపన్యసించెను; అఖిల భారతాస్తిక మహాసభ కధ్యక్షత కూడ వహించెను. ముఖ్యముగ సభల యందు వివిధ ప్రాంతముల రాజకీయ సాంఘికోద్యమ నాయకులతోడను, ఆర్య బ్రహ్మసమాజాద్యాస్తిక నాయకులతోడను అతడు పరిచయము గావించుకొనెను.

భారతదేశ స్వాతంత్ర్యము అతనికి పరమ ప్రియమగు వాంఛ; అగుటనే యత డీవయిసున సైతము, పెక్కురివలె విశ్రాంతితో గూరుచుండక, భారత దేశ మును గూర్చి యెల్లపుడు వ్రాయుచుండును.

భారత దేశము నెడతెగని దాస్యమున బంధించి, నాగరకలోకమున దాని నధోగతి పాల్సేయవలెనను ప్రతికూల భావములు బ్రిటిషు ప్రోద్బలమున నమెరికా మున్నగు దేశముల మిక్కుటముగ వ్యాపించుట గని, యాతని ధార్మికశక్తి వెచ్చగిలెను. ఆ ప్రతికూల ప్రచారమును ప్రతిఘటించుటకై అమెరికా యందును, ఇతర దేశములందును భారతీయప్రాతినిధ్యము నెలకొల్పుట యావశ్యకమని యాతడు తలంచెను. లాలా లజపతిరాయి అమెరికా యందున్న సమయమున (1914 - 1919) డాక్టరు అతని కెల్ల విధముల సాయమొనర్చెను. అది యొక మహాభాగ్యమని యాతడెంచెను. ఆట్లొనర్చుట హిందూ దేశముపక్షమున, అనగా మానవకోటిలో నైదవభాగము పక్షమున, లోకమునెదుట ధర్మబద్ధమగు న్యాయ వాదము సల్పుటయని యతడు తలంచెను. 'ఇండియా హోమ్‌రూల్ లీగ్'ను

సంస్థాపించుటయం దతడు లాలాజీతో పాల్గొనెను. 'యంగ్ ఇండియా' మాస పత్రిక సంపాదకీయకార్యమున తోడ్పడెను. లాలాజీ అమెరికాలో వ్రాసి ప్రకటించిన మూడు గ్రంథములకును ప్రూపులు దిద్దెను; అంతేకాక దానికి పీఠిక వ్రాసెను. ఇంక ననేక విధముల తోడ్పడెను. లాలాజీ భారతదేశమునకు మరలి వచ్చినపుడతను 'యంగ్ ఇండియా'కు సంపాదకుడయ్యెను; 'ఇండియా హోమ్ రూల్ లీగు' నకును, 'ఇండియా ఇన్ఫర్మేషన్ బ్యూరో' కును అధ్యక్షుడయ్యెను.

అతని వ్రాతలు ధార్మిక భారతపక్షమును లోకమున నమోఘముగ వ్యాపింపజేసెను. 1908లో డాక్టరు భారతదేశపుటశాంతికిగల కారణములను గూర్చి 'అట్లాంటిక్ మన్త్లీ' అను పత్రికయందు వ్యాసము వ్రాయ బ్రిటిషు పరిపాలనమునుగూర్చి హిందూదేశమున నది కల్గించిన విపరీతాభిప్రాయము కారణముగ, ఇట్టి వ్యాసములు ప్రకటించుట బ్రిటిషు పురోవృద్ధికి భంగకరమని కర్జను ప్రభువు స్వయముగ ఆ పత్రికకు వ్రాసెను.

అమెరికా సంయుక్తరాష్ట్రము లందును, కనడా యందును హిందూ దేశమునుగూర్చియు, అందలి మతములు, కళలు, వాఙ్మయము, సాంఘిక సమస్యలు, స్వాతంత్ర్యము మున్నగు విషయములగూర్చియు నతడు విపులముగ నుపన్యసించెను. అతడు రచించినవి రెండు గ్రంథములు భారతదేశమున ప్రకటితములయ్యెను.

అవి 'భారతీయదుర్భిక్షములకుగల గారణములు' 'భారతదేశము, అమెరికా, విశ్వమానవసోదరత్వము', 'భారత స్వాతంత్ర్యపు హక్కు' (ఇది అముద్రితము) అనునవి ప్రతి భారతీయ విద్యాసంపన్నుడును చదివితీరవలసిన యమూల్యగ్రంథములు. ఇందలి తుదిగ్రంథమిక ముద్రితము కానున్నది భారతదేశమున రమారమి నాల్గుమాసములు మాత్రము పర్యటనము చేసి సేకరించుకొన్న జ్ఞానము సాయమున, ఒక గొప్ప దేశమునకు తీరనియపకార మొనరించు దురుద్దేశముతో, స్వార్థపరతనుతృప్తిపఱుచుకొను నీచసంకల్పముతో, కేవలము పైశాచికభావములతో కల్లలు వ్రాసిన మేయో కన్య దుర్గ్రంథమును గొందఱు ప్రమాణముగ గైకొను నీయదనున డాక్టరుగారి యీ గ్రంథ రాజము భారతదేశమునకు గావించు నుపకారమనల్పము. ఈ గ్రంథము ననుబంధమున మేయో కన్య కాతని సంక్షిప్తసమాధానముండునట. ఇట్టి గ్రంథము రచించుట కాతడెంతయు నర్హుడు. ఎల్లపుడు నతడు డజను భారతీయ పత్రికలచదువుచు దేశపరిస్థితుల గమనించుచుండును. అంతియ కాక, భారతదేశ విషయమై ఆంగ్ల భాష యందు గల ముఖ్యగ్రంథములలో నొక్కటియు నాతడు చదువనిది లేదు. ఇంతటి పరిచయమునకు నాతని భారతప్రేమ చైతన్యము పోయుచున్నది; రక్షామంత్రముల వెల్లిగొలుపుచున్నది.

మేయోకన్యయు అమెరికనే; డాక్టరు సండర్లాండును అమెరికనే. ఇరువురును భారతదేశముతో రాజకీయ సంబంధము లేనివారే. కాని, వారు బుద్ధిపూర్వకముగ గల్పించుకొనిన సంబంధములం దెంత వ్యత్యాసమున్నది! ఈ సంబంధములకుగల ప్రోద్బలముల దిలకించినచో, శ్రీ తారకనాథదాస ప్రభృతులు సండర్లాండు పురాతన మహర్షులతో బోల్పదగిన మహనీయుడనుటలోని యాథార్థ్యము పొడగట్టును.

అతడు చిన్నతనముననే అమెరికా యందలి బానిస తనమును నిర్మూలింప సన్నద్ధుడై, నాటి విఖ్యాత నాయకులతో గలసిపనిచేసెను. సత్యప్రియుడై, ఆస్తిక క్రైస్తవ శిరోమణియై, వివిధ మతధర్మములసామరస్యమును గుర్తింపనతడు తన జీవితమును వినియోగింపజొచ్చెను. ఈ మహోన్న తాశయము నెఱవేర్చుకొనుటకే యతడు తూర్పు దేశముల సంచరించి, యిచటిజనులయెడ మక్కువ గని, విశ్వ మానవసోదరత్వమును బెంపొందింప నేటికిని నల పెఱుగక పాటుపడుచున్నాడు.

ఏనాటి ఋణానుబంధనముననో మనతల్లి దేశమున కాత డీపరమ సేవనము లొనరించుచున్నాడు! ఆ ప్రేమ మయుని యాశయముల దీపికలుగ చేబూని భారతసంతానము కాలపథమున తన దీర్ఘ యాత్ర జయశాలియై కొనసాగించు కొనుగాక! ఇదియె యామహాత్మునెడ కృతజ్ఞత వెల్లడింప యోగ్య మగుమార్గము!

తమ గాఢమగు భక్తికి చిహ్నముగ అమెరికాలోని భారతీయులును, భారతాభిమానులును న్యూయార్కు నగరమున ఇండియా సొసైటీ యాజమాన్యమున డాక్టరుగారి కొక విందు నొసంగియున్నారు. రవీంద్రు డొక ప్రసంసావార్తను, స్వలిఖితమగు నొక చిత్రమును డాక్టరుగారికి కానుకగా నంపెను. ఇంక ననేకులు ప్రశంసాపత్రముల నంపిరి.

ఆతడు సజీవుడై యుండగనే భారతదేశము స్వాతంత్ర్యమును బడసి, ప్రసన్నుడగు ఆతని ఆశీర్వచనములంగొని వర్ధిల్లుగాక!

(కొం. జ.)

1928 జులై, భారతి

# స్థానం నరసింహారావుగారు - 'సత్యభామ'

శ్రీ స్థానం నరసింహారావుగారు పేరెన్నికగన్న నటకావతంసులు.

వీరు తమ ధరించుపాత్రమున తమ్ము తాము చతురస్రముగ దిగగొట్టుకొందు రని శ్రీయుతవేలూరిశివరామశాస్త్రిగారు నుడివినది వీరి నటనమును విమర్శించుతఱి పెక్కుతావుల జ్ఞప్తికి వచ్చుచుండును. కాని వీరి సత్యభామాపాత్రము* మాత్ర మీపరిచయముతో సంతృప్తి నిడక యించుక యెక్కువ విమర్శనము నపేక్షించు చున్నది.

వీరి నటనమున నొక యమోఘమగు సమ్మోహన శక్తి యున్నది. ఎట్టి పాత్రమైన వీరు సజీవముగ, నుజ్జ్వలముగ ప్రదర్శింతురు. సత్యభామాపాత్రయు వీరు తాము భావించినతీరున సమగ్రసౌష్ఠవముతో ప్రదర్శింతురు.

వీరిభావన ననుసరించిన సత్యభామ యెట్టిదో పరామర్శించుటకు ముందు శ్రీకృష్ణ తులాభారమున సత్యభామ యెట్టిదో గుఱుతింపదగును.

సత్యభామ శ్రీకృష్ణుని సంపూర్ణముగ ప్రేమించినది: అతని సుందర మూర్తిని కామించినదియు, ఎల్లపుడు నతని సాన్నిధ్య మామెకు గావలెను. ఈఓరిమి లేని కూరిమిచే నామె తనహక్కునుగూడ నతిక్రమించి తోడి దేవేరులకు భర్తను పాలువెట్ట నొల్లదు. కనుకనే రుక్మిణికి గల అతిలోక ప్రేమకిది లౌక్యైక నది. భక్తియను పేరునకు యోగ్యత యీ ప్రేమకు చాలినదికాదు. ఐనను సత్య గొప్ప ప్రేమికురాలు. రాజస ప్రేమచే నామె మ త్తిల్లి పోయినది. ఆప్రేమ సామ్రాజ్యమునకు శ్రీకృష్ణుడు సార్వభౌముడు; తాను మహారాజ్ఞి. ఈశ్రీకృష్ణుడు భౌతికమూర్తి. తన్నా భౌతికమూర్తిపీడినచో నామెహృదయ మాక్రోశించును. ఆత్మ దమనము చేసికొను ధీరత యామెకు లేకపోలేదు: కాని, అతని సాన్నిధ్యమున తా నుపలాలిత యగుచు అతని నాశించుకొనుచున్న సమయమున తనసవతి తనపతి నెద బాప-తోడగొంపోవ-వచ్చినచో నామె యోర్వజాలదు. ఇందడచుకొనుధీరతయామెకు లేదాయనిన, సవతి మూలమున రెచ్చిన యభిమానము నడచుకొనుటకే యిచ్చగింపని రాజస ప్రకృతి యామెది. రుక్మిణి జన్మదినోత్సవమునకై పతి నాహ్వానించింది—

* ఆగస్టు ౯ వ తే. శ్రీదుర్గా ఎమెచూర్సువారు మదరాసునందు ప్రదర్శించిన శ్రీకృష్ణతులాభారమున వీరి 'సత్యభామ'ను నేను జూచితిని.

తగినంత హేతువున్నదియే: ఐనను సత్యభామ కిష్టముకాని సందర్భమునకు సవతి కారణభూతయైనది: ఆమె ఆత్మదమనము కావించుకొనదు.

ఇట్టియెడ శ్రీకృష్ణుడు తా నెవరియింటి కేగ దగునని అన్యుడగు నారదుని నాలోచన మడుగుట ఆమె కింకను వెగటగును. ఇక చివరకు తన యింటికి రాక యతడు సవతి రుక్మిణి యింటికే యేగినచో ఆమెకు గల్గు మనఃక్షోభమునకు మేర యేముండును ?

ఆసమయమున నారదు డామెకు వ్రత ముపదేశించి దాన నామె తన భర్తను తనకు వశవర్తి జేసికొనగల్గునని వచింప, నామె తన తప్తమానసము నా పేరాస యందు వోసికొన్నది. సరితూగు ధనాదికము నిచ్చిదానము పోయిన భర్తను బడయుటకై ఆమె తన సర్వస్వమును తూనిక యిడెను. 'రెండు నిమిషములు కళ్లుమూసికొన్నచో, నాభర్త యెప్పటికిని నావాడే' యని యామె కొనవ్రేళ్లపై నిలిచియుండెను. ఎన్నివైచినను ఆతడు తూగడాయె!- ఏమి పోయినను సరే, ఆతడు దక్కిన చాలును!- కాని, యేదీ సాఫల్యము ? ఎంతటి ఆశ !- ఉపహత మైపోయినది. ఎంతటిమూల్యము !- అపర్యాప్త మైపోయినది. ఏబరువున కాతడు తూగునో యామెకు తెలియదాయె! భౌతికమూర్తినే యామె తలచుకొనెను. శ్రీకృష్ణు డంతబరు వుండునని యామె యెఱుగదు; నారదుడు చెప్పనైనలేదట, ఏలయని యామె ప్రశ్నించినది. ఆమెకు తన యోచనయందు మూర్ఖత యేమియు కనబడదు. మానవబుద్ధిబలము మంతయు వినియోగించి చూచినను నది యర్థము కానిది. ఆమె కలహప్రియుని వంచనయని భావింప కేమిచేయును ? (కృష్ణుడు తన్ను వంచింపడని యామెకు నమ్మకమే కాబోలు.)

ఇక కృష్ణుడు నారదునికి దాసుడైపోయినాడు. సత్యభామకు భర్త తన దకలేకుండుటయేకాక, యొకరికి దాస్యముసేయుచున్నాడు: దుర్భరము! అటుపైతన మూలమున తోడిదేవేరులు భర్తను గోల్పడిరి. తాను గర్హ్యావస్థ నున్నది. అంతయు తనవల్ల నైనదే.

కడచినదాని కనుతాపము; కృష్ణుడు తనతో మాటాడుటనుగూడ వంచకుడు నారదుడు నిర్దయముగ నిషేధించినందులకు కినుక; తన నిస్సహాయతకు పరి తాపము - ఇంతయు భరించుచు, నెట్లయిన కృష్ణుని బడయుట కుపాయము నారయవలయును. ఇంతవ్యాకులత యామెహృదయమును కలచివైచుచున్నది. పాపము, అంతయు ప్రతికూలము కానా ?

ఈసత్యభామకంటె మానవహృదయమును సమీపించు పాత్రలు నాటక లోకమున నెన్నియోలేవు మానవప్రకృతి యామెయందు పూర్తిగ మూర్తీభ

వించినవి. ఆమెది లౌకికత్వమున నికృష్టస్థానముగాదు; అతిలోకత్వమునకు దగ్గర మెట్టే. ఆమె ప్రేమకొఱ కెంత త్యాగ మొనర్చినది!

ఇక నామెకు విశ్రాంతిలేదు. ఎట్లయిన పతిని బడయ నారదుని వెంటాడి నది. చివరకు దేవేరులుగూడ వచ్చినారు. ఎట్లు మాటదక్కుట?

భక్తులవలన నామెకు భర్త తిరిగి లభించునని నారదుడు పల్కెను. అట్టి భక్తు లెచ్చటనైన గలరాయని యామె తహతహతో నడిగినది. తత్పురముననే యున్నారని యాతడమృతోపమానమగుమాట తెల్పెను. భక్తిపద మామె హృదయ మును మీటలేదు. 'నాకంటె భక్తులెవ్వ' రని యామె యహంకృతి చూపలేదు. అట్టిభక్తు లెవ్వరో తెల్పినచో పాదములంటి తెచ్చుకొందునని చెప్పినది. ఆహా! ప్రేక్షకుల సానుభూతి బడయుట కీపాత్ర కెంతపాత్రత యున్నదో!

తన పల్కులకు నారదు డొసగినయుత్తరమామెకొక పెద్దపరీక్ష: ఆభక్తురాలు రుక్మిణియేయట!

భర్తను దాస్యమునుండి విడిపించి, తాను బడయవలయును. శుద్ధాంత జనముకడ తన మానము గాపాడుకోవలయును. దేవేరులహక్కు నిపుడామె తిరస్కరింపదు: తానిపుడు మానవతి; కర్తవ్య జ్ఞానిని: ప్రేమ పీడితయయ్యు ప్రేమ ప్రమత్తురాలు గాదు.

ఏరుక్మిణియెడ కక్షగట్టి యామె కృష్ణునిస్వవశము గావించుకొనుటకై విలక్షణచర్యల జేయబూనెనో, ఆరుక్మిణియే తనకిపుడాశ్రయణీయయైనది-ఆచర్యల దుష్పరిణతి సంస్కరించుటకే! భర్తను బడయుట కెట్టిదియైన జేయవలయును: అతడు పూర్తిగ తనకే కావలె ననిపించు పొంగుప్రేమ ఆమెది. తనయపరాధ మును సవరించుకొనుట తనవిధి. తాను ప్రార్థింపకయే రుక్మిణి వచ్చి యాతని విడిపించుట తన కవమానము. ఆమె యహంకారిణి కాదు: ఉత్కృష్టయగు నభి మానిని. సవతిని వేడుకొనుటకంటె వేడుకొనకుండుటయే యామె యభిమానమున కెక్కువయాఘాతము. రుక్మిణిని వేడుకొన్నది; భర్తను—తన ప్రయత్నమువల ననే - విముక్తు జేసి, పడసి, తన కర్తవ్యము నిర్వహించుకొన్నది; రుక్మిణి హృదయము తనహృదయముకంటె మహత్తరమగుట గ్రహించినది: ఏలయన— రుక్మిణి శ్రీకృష్ణుని మనసార భజించినది. అత డెక్కడనున్నను సరియే, భావ బద్ధుడగు ప్రేమమయుడు తనతోడనేయున్నాడు. తృప్తిమయమైన భక్తితో నామె తన పతిని భగవంతునిగ నుపాసించుకొన్నది.

సత్య శ్రీకృష్ణునకుపలెనే యెల్లరకును సానుభూతికి పాత్రురాలు. ఆమె యే మొనర్చినను కృష్ణునెడగల ప్రేమాతిశయమువలననే. పవిత్రమైనది కారణము: కార్యములమాత్రము హృదయదౌర్బల్యపు రక్కు లున్నవి.

ఇది యీనాటకమునందలి సత్యభామ.

శ్రీ నరసింహారావుగారి భావనమాత్ర మించుక భిన్నరూపముగల పాత్రను ప్రదర్శించెను.

నటకుడు కవిరచించిన పాత్రకు సంస్కారములు చేసికొనవచ్చునే కాక చేసికొనవలసిన సందర్భములు గూడ నుండును. ఐన నా సంస్కారములు నాటకమున కుపకరింపవలెను; నాటకముయొక్క నాటకత్వమునకువన్నె తేవలయును. నాయికా నాయకపాత్రములను నటకుడుగాని, కవిగాని ప్రేక్షకుల సానుభూతి కేంద్రమునకైనను సాధ్యమగునంత సమీపమునకు గొంపోవలయును.

ఈ నాటకమున సత్యభామయే కేంద్రవర్తిని — నాయిక. ఈ పాత్రము నరసింహారావుగారియందు నాటకప్రయోజనమున కెట్టు లుపకరించెనో గమనింప దగును.

నారదునకు శ్రీకృష్ణుని భార్యలు తక్కినవారు ప్రణమిల్ల, శ్రీరావుగారి సత్యభామమాత్రము వంగియే నమస్కరించును. కృష్ణుడు రుక్మిణి యింటి కేగిన పిదప తనభవనమున నారదుడు విచ్చేసినపుడు అతి విముఖతతో అడకువలేక వర్తించును. అతడామెకు భర్తను బడయునుపాయముగ వ్రత ముపదేశించినపిదప నామె యతనికి మోకటిల్లి నమస్కరించి, దాసిచే గూడ ప్రణమిల్ల జేయును.

తక్కిన దేవేరులకుకంటె సత్యభామకు నారదుని యెడగల భక్తి తక్కువయా ? వారితో సమముగ దేవర్షి యెదుట మోకటిల్లుట తన కవమానమని యెంచునంతటి దురభిమానినిగాని, మూర్ఖురాలుగాని కాదు. సత్య తన యింట నతనియెడ నంత వైముఖ్యమును, అవినయమును జూపుటకు అతనియెడ నామె కెంతచనవున్నను జాలదు; ఎచ్చట జూచినను ఆమె కావన వున్నట్లు కన్పడను లేదు. తనభర్త తనకడకు రాకుండ జేసినది నారదుడే యనుకోపమున నట్లు వర్తించెనన్న, ఎట్లయిన నతని సత్కరించునేకాని గౌరవాచారములు తప్పదు: కళావతి రాజపుత్రి, శ్రీకృష్ణునిదేవి: ఆమె కాతనియెడ గౌరవము లేకపోనులేదు. చివరకు తన కాతనివలన నొక ప్రయోజనమున్నదని భావించి ప్రణమిల్లుట దుఃస్వార్థపరతను, సంకుచిత మనస్కతను సూచించును. దేవర్షియెడ సత్యభామ కంతగౌరవము గల్గుట కిదియే మొదటిసారియా, ప్రయోజన మున్నపుడెల్ల నట్లు ప్రణమిల్లునా యనిపించును. పాత్రకు లేని నలుపులు గూర్పరాదు: అట్టి కళంకిత పాత్ర కిట నావశ్యకత లేదు.

శ్రీకృష్ణుని తూచునపుడు వీరి సత్యభామ తన యింటగల సర్వస్వమును త్రాసున వైచునుగాని తనయొడలి యా భూషణాదు లొక్కపూసయైన తొలగించి

వైవదు. చిట్టచివరి యత్నముగూడ చేయక యామె వీడునా? అంత పరితపించిన ప్రేమ కృష్ణుని నిమిత్తమై యా భూషణముల తొలగించివేయుటకు వెనుదీయ నిచ్చునా? ఇట సమంజసత తక్కువ. కృష్ణుడు సత్కరింప నెంచిన సత్యభామ హృదయము ప్రాపంచికతయం దింతక్రింద తేదు. సత్యభామ యిట్టిదన్నచో సహింపజాలదు.

కృష్ణుడు నారదునకు దాసుడై పోయినపుడు వీ రతి చతురతతో నటించిరి. పిదప గన్పఉపదగిన దైన్యపరిమాణము మాత్రము వీరియం దహంకారాతిశయ మున మట్టువడ్డది. పాత్రకు దైన్యము తనతో ప్రేక్షకుల సానుభూతిని కోలు పుచ్చినచో అహంకార మాస్థానమున ప్రేక్షకుల ప్రశంస నాకర్షింప లేదు.

మొత్తముమీద వీ రభిమానముకంటె నహంకారము నెక్కువయుపాసించిరి; రాజసముకంటె తామసము నెక్కువ యవలంబించిరి. వీరిసత్య కడుంగడు సాధారణ వనిత. ఈనాటకమునకు నాయికయగుట కనర్హగ నున్నది.

చివర సత్యభామకు సంస్కారము గల్గినది. లేనిచో పాత్రకు సరియగు పరిణతి యుండదు. రుక్మిణిని వేడుకొనుటనుండి వీరి సత్యభామ సంస్కారము నొందు యోగ్యతతోనే యున్నది. ఆస్థితికిని, పూర్వపు ప్రవృత్తులకును సామ రస్యము కుదురుకొనవలెను. అప్పుడు వీరి సత్య సత్యయగు సత్యయగును.

సత్యభామకంటె నెక్కువ యాకర్షకమగు పాత్ర మీయితివృత్తమున లేదు.

ఇట్టి సంస్కారములు కొలదిగ నిర్వహించుకొన్నచో, శ్రీ నరసింహారావు గారి యంతటి యాకర్షకముగ నీపాత్రను ప్రదర్శింపగలవా రరుదుగ నుందురు.

శ్రీ రావుగారు రంగమున ప్రవేశించినది మొదలు నిష్క్రమించువఱకును పాత్రగనే స్ఫురింతురు కాని యొక్క త్రుటియు తమవలె గన్పట్టరు. అటుపై వారి నటనమున నొకవిధమగు నగీషీసొంపు లున్నవి. పాత్ర నుజ్జ్వలముగ చూపుటయందు వా రసాధారణమగు నేర్పుగన్పఱుతురు. అట్టియెడ వా రిటనిట బాగుగ నటింతురని యెత్తి చెప్పుట యథార్థమగు ప్రశంస గాదు

నటనా కౌశలమునకు తీసిపోవని గాన ప్రావీణ్యమును వీరికున్నది. రసాను గుణమగు సంగీతము వీరియందొక పెద్దగుణము. పద్యముగాని, పాటగాని పాడు చున్నపుడు వచనమువలె భావమే వ్యక్తమగుచుండును. రస ముబ్బుగ చిందు చుండును. వారు గానప్రవీణు లనుమాట దూరమున గన్పడును. వీరి సంగీతము రసమును మఱింత ప్రస్ఫుటము చేయునే కాని పాత్రను విడిచి రంగమును కళంకిత మొనర్పదు. రంగమున సంగీత మావశ్యకమా యనుసమస్యను వీరి యభినయము అనుకూలముగ సమర్థించును ప్రతికూలవాదుల కది యొక గొప్ప ప్రతివాదము—

ఇట్టివా రరుదుగ నుండుటచే ఆసమస్య మాత్రము తలచూపుచునే యుండును గాని—

వీరి యనల్పనటనా కౌశలము నిదివరకు శ్రీయుతులు శివరామశాస్త్రిగారు తమ సుధామధుర ఫణితుల నుగ్గడించియే యున్నారు. కాక వీ రాంధ్రసామాన్యము నకు ప్రత్యక్ష పరిచితులగు నటకావతంసులు. తమ భావన ననుసరించి యేపాత్ర నైనను వీ రతికుశలముగ ప్రదర్శింతురు. ఈ పాత్ర విషయమున తమ భావన తిరుగవేసికొనునపుడు శ్రీ రావుగారు సహృదయముతో ఈ సూచనల గమనింతురు గాక. పాత్రశీలన కౌశలమును, భావనా బలమును వీరియం దింకను పెంపైనచో, తన నిగ్గైన నటులలో నొకరని వీరినిజూచి మనదేశము గర్వింపగలదు.

కొంపెల్ల జనార్దనరావు

భారతి, 1928 సెప్టెంబరు

# శ్రీ రాఘవాచార్యులుగారి ఉన్మాదనటన

'త్రివేణి' నవంబరు సంచికయందు శ్రీ పి. వి. రాజమన్నారు, (బి. యే. బి.యల్.) గారు నాట్యకళాప్రపూర్ణ శ్రీ రాఘవాచార్యులుగారి 'పఠాన్ రుస్తుమ్' పాత్రను గూర్చి యొక సవిమర్శవ్యాసము వ్రాయుచు, నందు వారి నటనమున నద్భుత చిత్రణము గాంచిన యొక ప్రవృత్తి ఉన్మాదమును గూర్చి విశ్లేషణ రూపమగు నొక చిన్న విలువగల వ్యాఖ్యానము నొనర్చినారు.

రాఘవాచారి ఉన్మాదమున వివిధగతులును, వివిధ జాతులును మనకు చిత్రించి చూపినాడు. హిరణ్యకశిపునందు ప్రతిహతాహంభావపుటున్మాదమును, కీచకునందు లాలసోన్మాదమును అతడు వివరించెను. దశరథునందు ఖేదోన్మాదము యొక్కయు, రామదాసునందు భక్తి భ్రమోన్మాదముయొక్కయు చిత్రరు వాత డొసంగెను. విజయనగరపతనమునం దాతడు అనుతాపోన్మాదపు సూక్ష్మానుశీలన మొసంగును. అది అద్వితీయమగు అనుశీలన. కావి అది వర్ణనకు లొంగదు: ఏలన, నిర్దిష్ట వ్యవచ్ఛేదనమునకు అనువుపడని సూక్ష్మతా వైవిధ్యము నేర్చరచు ఉత్పాదక ప్రకృతి రాఘవాచారి నటనయం దెల్లపుడు వెలయుచుండును.

ఈ 'ఉత్పాదక ప్రకృతి' నిశ్చయముగ రాఘవాచార్యులుగారికి నట శ్రేష్ఠతను సంపాదించు సామగ్రిలో చేరును.

శ్రీ రాఘవాచార్యులుగారు 'భావవిక్షోభతనయు'డగు పఠానుపాత్రమును నిర్వహింప నవలంబించిన తంతు శ్రీ రాజమన్నారుగారు విమర్శించి యందలి విలువను ప్రకటించుచు, నుదాహరణముగ నొసంగిన రెండు పాత్రవైఖరుల ఛాయాచిత్రము లిందుద్ధృతములైనవి.*

ఇందు మొదటి చిత్రమున పఠాను ఆషాబియెడ మోహాయత్తుడై, ఆమె తనను నిష్క్రియతకు నిందింప, హిందూ సామ్రాజ్యము నంతమొందింప తన ప్రతిన నామె కెఱిగించును. రెండవదానియందు ఆషాబి పఠానునకు కత్తినందించి తనకు పెండ్లికానుకగ తుచ్ఛుడగు రామరాజు శిరమును దెమ్మని యడుగ, నతడు నిశ్చేష్టుడై, "నేనేమియు యోజింపజాల" నని గొణగుకొనును. ఈ ఛాయా చిత్రములు శ్రీ ఆచార్యులవారి భావప్రకటనమును సమగ్రముగ ప్రదర్శించుటలేదు.

---

* ఈ చిత్రముల దిమ్మలను "త్రివేణి" సంపాదకులు మాకు దయతో నొసంగిరి.

శ్రీ రాఘవాచార్యులుగారి ఉన్మాదము రిక్తముకాక ఏయే భావముల సంఘర్ష ణోద్రేకముచే తాను పరిణమించెనో ఆ భావములనెల్ల సముద్రతరంగములవలె చిమ్ముచుండును. ఏకైకరసము, ఏకైకభావము సమగ్ర స్ఫురణము గాంచుట యటుండ, భిన్న రసములయు, వివిధ భావములయు సమ్మేళన వైరుధ్యములు వారి ముఖమున గొప్ప పలుకుబడి గాంచును.

శ్రీ ఆచార్యులవారు పాశ్చాత్య దేశముల పర్యటనము సల్పి పడసిన పాశ్చాత్య రంగ పరిచయమున పెంపుగన్న తమ విస్తృత కళాపరిజ్ఞానమును. స్వదేశీయరంగ గౌరవమును గుర్తింపగల్గిన యుత్సాహమును వినియోగించి భారతీయ రంగమునకును, ఆంధ్రరంగమునకును తగినయభివృద్ధి గూర్పదగుదురు. రంగమున నభినయరూపముననేకాక, సారస్వత రచనా మార్గమునగూడ వీరు నాటకరంగమున కుపచరింపవలయును. శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారు మున్నగు కళాభిమానులును, కళాభిజ్ఞులును నటకుడు నాటకము తాను వ్రాసి యభినయించినగాని నాటక రసానుభవము సమగ్రము గాంచదని యభి ప్రాయపడుటను శ్రీ ఆచార్యులవారు గుర్తించి, తమ సామర్థ్యము నీ తెరవున గూడ ప్రయోగింతురు గాక!

[కొం. జ.]

భారతి, విభవ

# అప్పారావు గురజాడ

(క్రీ. శ. ౧౮౬౨-౧౯౧౫)

తెలుఁగు 'నవ్యకవుల'లో మొట్టమొదటివాఁడు. క్రీ.శ. ౧౮౬౨-వ వంవత్సరమున విశాఖపట్నము జిల్లా, ఎలమంచిలి తాలూకాయందలి రాయవరము గ్రామమున జన్మించెను. ఈతని తండ్రిపేరు వేంకటరామదాసు. తల్లి గౌడవర్తివారి యాఁడుపడుచు; పేరు కౌసల్య. వీరు నియోగిబ్రాహ్మణులు. అప్పారావు కొంతవఱకు చీపురుపల్లియందు విద్యాభ్యాసము గావించి పిదప విజయనగరకలాశాలయందు పట్టభద్రుఁడై విజయనగర ప్రభువగు ఆనందగజపతిమహారాజు కొలువున ప్రాచీన లిపిపాఠకుఁడుగ ప్రవేశించి భారతదేశభాషల ఆనుషంగిక పరిశీలనము చేయుచు ముఖ్యముగ తెలుఁగుభాషను బాగుగ తరిచెను.

క్రీ.శ. ౧౮౯౩ సంవత్సరము ప్రాంతముల మహారాజు విశాఖపట్నము జిల్లాయందు ఆ మూఁడు సంవత్సరములలో జరిగిన కన్యాశుల్క వివాహముల లెక్కలు తీయింపఁగా, ఒకవేయి ముప్పదినాలుగు తేలెను. అది ప్రేరణగా, సంఘ సంస్కార ప్రియుఁడగు అప్పారావు 'కన్యాశుల్కము' అను సాంఘికనాటకమును వాడుకభాషయందు రచించెను. వాడుకభాషకు సాహిత్య ప్రతిష్ఠ అర్హ మను భావోజ్జృంభణమునకు అప్పారావు తొలుతగ సాహిత్య ప్రయోగనిర్వహణ మీ నాటకమునఁ గావించె ననుటకు పాత్రోచితగ్రామ్యభాషా ప్రయోగ మత మడ్డుపడి ఈ నాటకమును తానే స్వీకరింపఁ జూచును కాని, యీతని ఆశయము లంతమాత్రమున లొంగుటలేదు. సామాజికులకు గ్రాంథికభాషకంటె వాడుకభాష సులభార్థ మను మాటయుఁగాక, అసలు తెలుఁగున నాటకోచిత మైనది వాడుకభాషయే యనియు, అది గ్రంథరచనకు వినియోగించుట తీవి కాదనుకొనుట—భాషా శాస్త్రము వచ్చి భాషారూపముల ప్రయోజ్యతయు, విలువయు నిరూపించుటకు వేఱుగ మంచి ప్రమాణములు నిలిపిన యీ కాలమున,—శుష్కవైయాకరణుల ఆతిథ్యమునకు వదలవలయు ననియు, గ్రంథ ప్రయోజ్య మగుభాషను వ్యవహారమందుండు భాషకు సాధ్యమయినంత దగ్గఱకు తెచ్చుట సభ్యతాపహ మనియు మంచి అభినివేశముతో కవి ఇందు వాడుకభాష ప్రయోగించి సంఘసంస్కారముతో పాటు భాషాసంస్కారముగూడ గుఱిచూచినాఁడు. సంఘవృత్తమును చాల మనోజ్ఞముగను, మర్మజ్ఞముగను నిరూపించునదై దురాచారముల నపహాస్యతకు తెచ్చుచు రచనా

చమత్కారమున మిగుల సంపన్నమైన దగుటచే ఈ నాటకము దేశమున నెంతయు ప్రశంసకును, ఆదరమునకును పాత్రమై ౧౮౯౭-వ సంవత్సరమున ముద్రణ ప్రకాశనము కాంచినది. దీని ప్రకటనమునకు పూర్వమే కందుకూరి వీరేశలింగము పంతుల 'బ్రాహ్మవివాహ'మను రూపకము ప్రకటితమై యుండెను కాని, అది కేవలము ప్రహసన ప్రాయ మగుటచేతను, 'కన్యాశుల్కము'న అల్లికపద్ధవస్తువు, హాస్యరసపోషణము, పాత్రపరిణతి మున్నగు ఘనత రాంశములు ప్రవర్తిల్లి దీనికి నాటకత్వము చేకూర్చియుండుటచేతనుఁ గాని, రచనమున 'బ్రాహ్మవివాహము'న కంటె నిది పూర్వతరమై, రంగము చవిచూచియుండిన దగుటచేఁ గాని 'కన్యాశుల్కము' తెలుఁగున మొదటి సాంఘిక నాటకముగా నెన్నికఁ గన్నది. ఇది మొదటి ముద్రణమునకంటెను తరువాతి ముద్రణములందు పెక్కుమార్పులు పొందుచు వచ్చి సుమారు రెండింతలకు పెరిఁగినది. మొదటి గ్రంథమున కంటె నిశ్చయముగ తరువాతిసంస్కరణము సంపన్నతరమైనది. గిరీశము, మధుర వాణి మున్నగు పాత్రము లీసంస్కరణము పడయకుండిన, నింతటి అమరత్వ మును, ప్రత్యక్షత్వమును బడసియుండవు; నాటకమును నాటకరచనానైపుణికిఁ గాని, హాస్యరససంసిద్ధికిఁ గాని నేటి యున్నత ప్రశంసను కట్టుకొని యుండదు. కాని వస్తు వించుక యిమిడిక తప్పిన దనుట వాస్తవము.

పిదప అప్పారావు రాగతాళబద్ధములగు గేయములు కొన్ని చక్కనివాడుక తెలుఁగు శైలిని రచించి 'నీలగిరిపాట'లను పేరుతో సంపుటముగా ప్రకటించెను. ౧౯౧౦, ౧౯౧౧ సంవత్సరముల ఆంధ్రపత్రిక మొదటి రెండు సంవత్సరాది సంచికలయందు 'బిల్హణీయ' మను రూపకము రెం డంకములు ప్రకటించెను. రాజసభావృత్తస్వరూపమును పృథక్పాత్రవిస్ఫోటన మాలంబముగ ఆస్వాద్య పఱుచుచు, ఇట్టి కథావస్తువునుసహా హాస్యరసముద్వారా పరామర్శించుట యీతని యెడ విశిష్టతను చాటును. పత్రికలందు 'మాట-మంతి' అను శీర్షికతో హాస్య మయములగు వ్యాసములు కూడ అప్పారావు రచించుచుండెడివాఁడు.

అప్పారావు ఆంగ్లమునఁగూడ కవన మల్లువాఁడు. ఒకసారి అతఁడు కొన్ని ఆంగ్ల పద్యములు తనవి ఒక పత్రికకు పంపఁగా తత్సంపాదకుఁడు అప్పారావును మాతృభాషయందు కవనము సెప్ప ప్రోత్సహించుచు వ్రాసెను. 'నా భాష యనఁగా నేది' యను ప్రశ్నకు వ్యాకరణకృతక మైనది కాక 'నేను మాటాడు భాష నాభాష' యనియే అతని కంతరాత్మవలన లభించిన యుత్తరము గద్యముననే కాక దేశిఛందమునఁగూడ వాడుకభాష, నుడికారము మెఱయునది, ప్రయోగించుట అతనికి సమ్మతమై తోఁచెను.

ఒకసారి మనోహరమగు స్త్రీల ప్రాఁతపాట ఒకటి ఆతని చెవిసిఁబడి మనసున క్రొత్త సంగీతములు తిరుగఁగా, తెలుఁగున నొక క్రొత్త ఛందము నడపింపవలె నని ఆతనికి సంకల్ప ముదయించెను. క్రీ. శ. ౧౯౧౦-వ సంవత్స రమున బరంపురమున నానావర్ణ సహపఙ్క్తి భోజనము జరిగినది; ఇందు అప్పారావును బాల్గొనెను. ఆ సంవత్సరమే తోఁకచుక్క (*Hally's Comet*) పొడిచినది. ఒకవిచిత్రమైన భావమథనమున అప్పారావు రసిక చిత్తమిననుండి ఒక క్రొత్త కవితావేశము రూపుకట్టినది .

'గుత్తునా ముత్యాలసరములు,
కూర్చుకొని తేటైనమాటల,
కొత్తపాతల మేలుకలయిక
క్రొమ్మెఱుంగులు చిమ్మఁగా'

అని మొట్టమొదటి ముత్యాలసరము కావ్యము ఆతని ఆశయములు నిరూపించుచు నడచినది.

'మెచ్చ నంటా నీవు; నీ విక,
మెచ్చకుండే మించిపాయెను :
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలులసౌ రెక్కునా ?'

అన్న రెండవ పద్యము ఆ 'జీవద్భాష' ప్రతిష్ఠను వ్యాఖ్యానించినది. ఆతని మొదటి కావ్యము సంస్కారపఙ్క్తి భోజనము, ధూమకేతుదర్శనము మున్నగు సంఘటనములు హృద్యమగు గ్రామ్యకథయందు సంస్కారాశయములకు భిత్తిక పట్టి క్రొత్త, ప్రాఁత భావముల అన్యోన్య ప్రవృత్తి పదను చూపినది. ఈతఁడు ముత్యాలసరమున 'లవణరాజుకల', 'కన్యక' మున్నగు మనోహరములగు కథన కావ్యములును, ఒకటిరెండు 'వ్యక్తి' కావ్యములును రచించెను వేఱు గేయచ్ఛంద ములు గూడ పట్టి 'పూర్ణమ్మ' -ను ఆఁడుపిల్లలపాట మున్నగునవి కడుమంజు లముగ రచించెను. వీరేశలింగము పంతులు వీలగుచోట నెల్ల ఒక ధర్మవిధిగా సంఘ సంస్కారభావములు పాత్రములనోట యత్నతః పలికింపఁగా, ఈతని కావ్యముల పాత్రములు ఒక సహజభావోద్రేకముతో, ఈతనివలెనే, కావ్యౌచిత్యము కుంటువడక మెఱుఁగుదేఱునట్లు సంస్కారాశయములు వెలిపుచ్చును

క్రీ. శ. ౧౯౧౩-వ సంవత్సరమున అప్పారావు విజయనగర సంస్థానపు టుద్యోగము నుండి విరతి పొందెను, ఆ యేఁడే ప్రభుత్వమువా రాతనిని మద్రాసు విశ్వవిద్యాలయము సెనేటునందు శాశ్వత సభ్యునిఁగా నియమించిరి. ఇంటర్మీడియేటు

ఆంధ్ర వ్యాసరచనా సంఘమువారు వేదము వేంకటరాయశాస్త్రిని, కొమఱ్ఱాజు లక్ష్మణ రావును, అప్పారావును కలిపి తెలుఁగున ప్రాచీనార్వాచీన ప్రయోగములు వేఱు పఱిచి చూపుటకై ఒక ఉపసంఘముగా నేర్పఱిచిరి. అందు వేంకటరాయశాస్త్రియు, లక్ష్మణరావును సమ్మతపడి సిద్ధపఱిచిన పట్టికపై అప్పారావు తాను జోడించిన అసమ్మతి విజ్ఞప్తియందు నాఁటికే రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతుల అమేయమగు దీక్షావ్యవసాయముల ఫలముగ దేశమున ఉద్యమమున కట్టుచున్న 'వాడుకభాష'కు చాల సమర్థమగు సమర్థన మిచ్చెను. తుదిదినముల నీతఁడు 'కొంగుభట్టీయ' మని యొక సాంఘిక నాటకము రచించెను. అది నేఁటికిని ప్రకటితము కాలేదు. ఈతనివి రెండు చిన్న కథలుకూడ కలవు. అవియు ఆతని సంఘసంస్కారప్రియతను హాస్యరసము త్రోవలనే కలామయముగ వెల్లడించు చున్నవి. అప్పారావు ౧౯౧౫-వ సంవత్సరమున విజయనగరమున కాలధర్మము నొందెను.

అప్పారావు నడవడికను చాల రసికతకు, ఔదార్యమునకు పేరుపడిన వాఁడు. సమాజమున తన ప్రతిభచేతను, మంచితనముచేతను, చమత్కార కలితమగు సంభాషణముచేతను చాల చిత్తాకర్షణము చేయువాఁడు. ఎంత హాస్య ప్రియుడో అంత గంభీరుఁడు; ధీరుఁడు. తన కష్టస్థితులుసహా మిత్రులకైన తెలుపువాఁడు కాఁడు. ప్రభువునెడనైన ఇచ్చకము లాడునలవాటు లేక గౌరవ ముగ మెలఁగువాఁడు. జీవితము నున్నత లక్ష్యముగఁ బట్టుచు సంఘదురాచార ములను ఖండించి తన అమితమగు భావస్వాతంత్ర్యము ప్రకటించుకొనియు, తన విశాలమైనయాకాంక్షల కెంతో వెనుకఁబడియుండు సంఘవృత్తమును సహ నముతో చూచెడివాఁడు. కనుకనే సంఘవృత్త మీతనిచే సాహిత్యమున కెత్తఁ బడ్డపుడు హాస్యరస మంతహృద్యముగ వెలసినది. ఈతని హాస్యరచన మైనను ప్రహసనోచితముగ నొక్కలక్ష్యభావమునకు పరాధీనమై నడవక, నాటకోచి తముగ నడచును. పెక్కులగు పాత్రముల స్వాధీనములగు వ్యక్తివృత్తుల సాగుదలయందు ఇతివృత్తము వ్యంజన కాంచుచుండును. సంభాషణమందలి చమత్కారమును, వస్తువునందలి చాకచక్యమును చూపునుత్కృష్టతకు తోడు, ఈతని హాస్యము మౌఢ్యముమీఁదను గాక చాతుర్యముమీఁదను ఒత్తిడి చూపును. పాత్రముల వ్యక్తిత్వములు పట్టఁగల యీతని అనతిక్రాంతమగు 'నాటకీయ భావన' యీతని నాటకములందేమి, కథల యందేమి, కావ్యములందేమి నిరం తరముగ ఎఱిఁగి ప్రయుక్తమైనది. కావితావీథిని చూచిన, అప్పారావు ప్రతిభ భావనాజగత్తున జైత్రయాత్రలు సలిపినది లేదు కాని, మనోజ్ఞమై రసము చిందు హృదయోద్గతమైనది యీతనికవిత. పురాణములు చెప్పుటకై కాక,

యీతఁడు కావ్యమును, పాశ్చాత్యుల 'లిరికు' ఫక్కి చేకొని, జీవితవాణిగా పలికించినాఁడు. తన జీవితాశయములు నెత్తిపై దేవతలవలె మోసుకవచ్చి కావ్యపీఠిని దింపక, కావ్యసంకల్పమువేఁడిని కరఁగఁబోయ వచ్చినమట్టునకు కరఁగఁబోసినాఁడు. మఱి యీతని గ్రంథములు చాలకొలఁదిగ నున్నవి కాని, యీతని సాహిత్యప్రవృత్తి యంతయు విశిష్టమై, ప్రతిభాసంపన్నమై, నవ్యతరమై ప్రాముఖ్యగర్భమయినది. ఈతని నవ్యత యేర్పడిన చరిత్రము తడవునెడ ప్రత్యక్షసంస్కారము పాశ్చాత్య భావసంపర్కమున సిద్ధమయినట్టిదని యీతని కావ్యములే తెల్ల మొనర్చును కాని అది తనదేశకాలముల స్థితిగతుల కుచితమయి అత్తెడి 'కొత్తపాతలమేలుకలయిక' చూచిన ఈతని ప్రతిభా, సంకల్పములు ఈతని ప్రాముఖ్యమును నిర్వహించుచు నేఁటి ఆంధ్రకవితా నవయుగమునకు ఈతనిని సమ్మతముగ శకకర్తను చేసినవి.

(కొం. జ.)

# అప్పారావు బసవరాజు

(క్రీ. ౧౮౯౪ - ౧౯౩౩)

—తెలుఁగుకవి, విమర్శకుఁడు; క్రీ. శ. ౧౮౯౪ - వ సంవత్సరమున జన్మించెను; ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు; పిచ్చయ్యగారి కుమారుఁడు. వీరిది కృష్ణామండలము. చిన్నతనమున బెజవాడయందు ఆంగ్ల విద్యాభ్యాసము కావించు నపుడే సంస్కృతాంధ్ర సాహిత్యముల నధ్యయనము సేయుచు కవనోత్సుకత చూపుచుండెడివాఁడు. పిదప చెన్నపురి రాజధానీ కలాశాలయందు ప్రవేశించినవెనుక నాతఁడు ఆంగ్ల కవిత్వము నెంతయు మెచ్చుచు నట్టికవిత తెలుఁగున వికసింపవలె నని మనసుపడుచుండ, గురజాడ అప్పారావు నవ్యకవిత ప్రకటితమై యాతని నాకర్షించెను. గురజాడ అప్పారావున కితఁడు మొట్టమొదటి అనుయాయులలోనివాఁడైన తన క్రొత్తరచనములు 'సెలయేటిగాన' మనుపేర సంపుటముగ ప్రకటించెను (౧౯౧౨). కావ్యసత్త్వమంతగా లేక యిది గురజాడ అప్పారావు ననుసరించిన క్రొత్తఁదనము మాత్రమే తన విశిష్టలక్షణముగా చూపుకోఁగలది. దేశమునందలి అనేక పత్రికల కాతఁడు కావ్యములు, విమర్శములు వ్రాయుచు ప్రసిద్ధివడసెను. తన చక్కని సంగీతజ్ఞానమున కనువుగ నీతఁడనేక గేయములు రచించి తెలుఁగున గేయరచనము ప్రచలితము చేసెను. అందు కొన్ని చాల రంజకత యొప్పినవి. అమితమగు నితని స్వాతంత్ర్యప్రియత సాహిత్యమునను సువ్యక్తమై కావ్యమాధుర్య నియతులు దాఁటిన వట్టి ఉద్రేక ప్రకటనముగకూడ నవతరించెను. కవిత్వమునందుకంటె విమర్శమున నీతఁడెక్కువ వన్నె మెఱసెను. కాని, కవిగా కావలెనని యీతఁడు సాఁకికొనిన చిత్తోద్వేగ పక్షపాతాదులు ఈతనియందు విమర్శకుని తాటస్థ్యమును కుంటువఱిచినస్థితి 'యెంకిపాటల గాలిదుమారము' వంటి యుత్కృష్ట విమర్శములే వెల్లడిచేసినవి. కొంతకాల మీతఁడు కాశీనాథుని నాగేశ్వరరావుపంతుల దినపత్రిక యగు 'ఆంధ్రపత్రిక' యందును, మాసపత్రికయగు 'భారతి' యందును సంపాదకవర్గముల కార్యనిర్వహణము కావించెను. నాగేశ్వరరావు పంతుల నియోగమున నాతఁడు 'అరేబియన్ నైట్స్' అను గ్రంథము కొంతవఱకు (గద్యముగ) తెలిఁగించెను; అది అప్రకటితము. కొమర్రాజు లక్ష్మణరావుతో 'కళ సృష్టియా, అనుకరణమా?' అను విషయమున నీతఁడు పత్రికాముఖమునఁ గావించిన వాదమును, ఈతని తుదిదినముల ప్రకటితమైన 'ఆంధ్ర

కవిత్వచరిత్రము' అను కావ్యమీమాంసా గ్రంథమును, తక్కినవిమర్శలతో పాటు, ఈతని సాహిత్యతత్త్వజ్ఞతను తెలుపును. ఇందు తుదిగ్రంథము అతం డెన్నఁడో రచించి ప్రకాశకులకు అమ్మియుండినట్టిది, సంస్కృతసాహిత్యపరా మర్శాదికము చాలమిచే దొరలిన దోషములతో, ఆతని వృత్తప్రన్నతరదశ యందు ప్రకటితమై ఆతనిమనస్సును కలఁచినది.

జీవితమున అనేకకష్టముల కగ్గమై సహజమగు హృదయమార్దవమునను, ఉద్వేగశీలమునను కలఁతపడి పిచ్చియెక్కి, అప్పారావు కేవల మనస్సంతాప ముచే మరణించెను (జూను, ౧౯౩౩).

(కొం.జ.)

# కావ్యకల : ఆశయవైశిష్ట్యములు

## కొంపెల్ల జనార్దనరావు

నేడు ప్రజాచిత్తము ననుసరించి వ్రాస్తున్నారట కావ్యములు. పూర్వము ప్రభుచిత్తము ననుసరించి వ్రాసేవా రన్నమాటకు ఒక్కొకయెడ ప్రబంధములేకాక భారత రామాయణాదులుకూడ గురికాక తప్పించుకొనవాయెను. కాని ధర్మపర తంత్రములూ, సత్యపర తంత్రములూ అయిన పురాణేతిహాసాదులు (రామాయణము కూడా ఆకట్టలోనే కట్టివేతురు.) ప్రభు చిత్తమునకు తగిలి వంకరలు తిరగడము నింద్యమనే వచన పక్కిలో పరమ లక్ష్యములు అపాకృతములు కాక నిల్చినవి. పురాణాదులు ధర్మాదిపరతంత్రము లని అంగీకృత మైనది.

ప్రబంధ రచనమున, ప్రభువు వైష్ణవుడాయెనా కవి శివపక్షపాతి అయ్యు వైష్ణవపారమ్యమునకై తన కావ్యములో మళ్లవట్టినవంటి నిదర్శనాలతో ప్రభు ప్రీతి ఆ కావ్య పక్కిని పట్టి నడపించినదని అంకించుకొందురు. కాని ప్రబంధాలలో సహా, ఉత్తమ చరిత్రములు ఉదాత్త నాయకములుగా నిరూపించడము చూస్తే కవి తన ప్రభుని ముఖప్రీతికంటె ఆ ధర్మ విజయమునే - ధర్మ ప్రవృత్తికి రక్షాకింకరుడైన వీరవతంసుని వృత్తము పదనిడి - గురి చూచినట్టు తెలియవస్తుంది. కృతిస్వీకృతి కావించి కవికి మడిమాన్యములూ, జాంబూనదాంబర తాంబూలములూ (ఎప్పుడు ఇస్తే ఏమి) ఇచ్చే రాజు తనకు వినిపించే కావ్య వస్తువున ఎవ్వరో మనుమార్గవర్తియట, ఒకానొక ప్రభువు కీర్తితుడు కాగా తన అల్పతరత్వమునూ, అల్పత్వమునూ బట్టి కాబోలు తానా వస్తువున నిల్వతగని వాడై ఆట ఉపదేశము ఏరుకోవలసినప్పుడు, ముఖ ప్రీతి కొలతలతో చూస్తే, విముఖత పొందని రాజుకాని, అది అంచించని కవికాని, యిరువురూ కాని మూఢులని మనము గ్రహించ వలసి ఉంటుంది. ప్రబంధ యుగమంతా, అప్పటి లోకమంతా అట్టిదే కావలెను ! కాని, అదృష్టము బాగుండి, ఆ ప్రభువుకూడా తాను ఏ ధర్మ పరిరక్షకుగాను పీఠ మధిష్ఠించినట్టు ప్రజలు భావించకమానరో దానికే తత్పరుడై అంతమాత్రపు పదవితో అలరినవాడాయెను. కాని అట్టి కథలు అవి ప్రభున కిష్టమైనవి కనుకనే రచించిన కవులు తాము ప్రభుచిత్తము ననుసరించిన మాట అంచించినవారే అనవచ్చు. ఆ రుచి ప్రభువునకు నేర్పినవా రెవరు ? ప్రభువు తన ధర్మ పదవికి బద్ధుడై ఉండియే తీరుతున్నప్పుడు ఒక వేళ అతని ప్రీతికై చేసినది ధర్మము ప్రీతికై, ప్రజల క్షేమముకై కాకపోదని అంచించినారని స్వీకరించి, పూర్వ కవిత్వము ప్రభు ప్రీతికై అనగా ప్రభు ప్రీతికైకాదని

యెంచవచ్చును. సంఘచిత్తమే అంతటది! 'సరే, ప్రజాచిత్తము ప్రభుచిత్తమును అనుసరించి ఉండేది కనుకనే కావచ్చు కాని, ప్రబంధ కవిత్వము ప్రభుచిత్తము ననుసరించినదన్న మాట వాస్తవము కాకపోయినదా ? ఆ ప్రభుచిత్తము ననుసరించిన ప్రజాచిత్తము నేడు విడివడి తన దారిని తాను పోతున్నదన్నదే చెప్పే మాట; అలాగే కవితకూడా అట్లు ప్రజాచిత్తము ననుసరించిన దనియే చెప్పే మాట.' - ఇది, ఆ వాదములో మిగిలే సారాంశము.

(వంశరక్తము పేర ఒక్క నిసుగును శక్తి గాపట్టి, ఆశలూ, నిరాశలూ గద్దెకెక్కి యుద్ధాలు చేయించగల) ఆనాటి సంఘవృత్తమున అంత ప్రాముఖ్యము వహించిన ప్రభుమూర్తి యెదుట (పోనీ, ప్రభుమూర్తి యెదుటనే) ఆదర్శ ప్రభువృత్తము కాని, ఆదర్శమానవ వృత్తముకాని, రసికముగా ఆలపించడము, అది యెక్కువ సంఘచిత్తమును అనుసరించడమే అగునేమో ! ఆదర్శ మానవ వృత్తమన్నదే ప్రధానముకూడా – ఆ మానవుడు తరుచు ప్రభువవుతూ వచ్చెను; ప్రవృత్తి కాతడు శాసకుడు కనుక.

అయితే అధర్మబోధక యీ కావ్యము ఒడలువంచి వేసికోలేదు. ఉపదేశము ధరించినా కాంతాసమ్మితత్వములో విలసిల్లినది. ఆ రెండు మంత్రాలకూ కూడా ప్రజలూ, ప్రభువూ ఒక్కలాగున ముగ్ధులయిరి. ప్రభువు తన ప్రభుత్వము అట సంభావన పడసినందుకు కాదు; ప్రజ తన ప్రభువు కటాక్షము అందువల్ల మెత్తబడినదని కాదు; అటు ధర్మమూ, ఇటు కలా కలిసి

'సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మితతయోపదేశయుజే'

అన్న సూక్తి గుచ్ఛము మన్నన గాంచినది ప్రభువుకంటెను ఎక్కువగా,—ప్రభువు వల్లనూ ప్రజవల్లనూకూడా. ప్రభువు ప్రజలలో ఒక రసికుడై, రసికతకు సూదంటురాయియై నిలిచినాడు: - లోక ప్రవృత్తికే అతడు శాసకుడాయె. కేవలము ప్రభుచిత్తము రంజిల్లడమే ప్రచోదించిన కావ్యరచన కావలెనంటే, సంధియుగ మనిపించుకొన్న కాలమునందలి కావ్యములవంటివి అవతరించి ప్రబంధాలను తమ వ్యతిరేకతతో కాపాడుతూనే ఉన్నవి.

మన లాక్షణికులు ఉపదేశమన్నది ఒక విధిగా కావ్యమును చేపట్టమనలేదు. రసాత్మకతతోడనే, రమణీయముగనే, కావ్యమును లక్షించిరి. జీవితమునకు కృత్స్నత చూచి జీవితముకంటె కళ ఇతరమును ఉపాసించకపోతే ఉపదేశము తనంత తా వలచి వచ్చినది. నిజమయిన కళ కళకోసమే, కళగానే నిలిచి, కళ ఉపదేశాత్మకము కావలెనన్న వాదమును ఢీకొనడముకాదు. గర్భితము చేసికొం

టుంది; మింగివేస్తుంది. సర్వమునూ మిగిలే ఆ రసాత్మకతనే నాటివారూ ఉపాసించిరి.

'*Art is not one aspect of life, it is the whole of life seen in one aspect*' అన్న సత్యమునే వారూ ఒకవిధముగా వాస్తవపఱిచిరి. దీనికి నేడు, ఇందఱి అనుభవాల సమవాయము సమన్వయించడమె అక్కఱలేదు. ఇతరుల కథలు తిరవడమె అక్కఱ లేదు. ఒకవ్యక్తివి చిదానంద నిహితమైన నిండుబ్రతుకు కళవస్తువు కాగలదని వాస్తవీకరిస్తున్నారు. పూర్వలాక్షణికుల పరిశీలనము చూచినా, అతిలోక ప్రతిభాశాలి అయిన కవి అనే విశిష్టమానవుని సత్త్వోద్రేకమున నిలిచిన లోకవృత్తము—బ్రదుకు—రసీభవించి కావ్యము కట్టుతుందన్నది ఇప్పటికీ (లక్షణముగా) మారనొల్లదు. ఇపుడు కళాలోకాన రసాశ్రయములైన ఉపాధుల అర్హతలు మఱింత లోతులకు చూచి దిద్దినారు. భావనవల్ల చైతన్యము గొనే కళాసృష్టికి స్వతంత్రత చేకూరి ఇంకొక పరిణతి మెట్టు దొరకినది. (ఇదివఱకు సంస్కృతముననే కాక తెలుగున సహా ఇట్టిది లేనిదని కాదు; వ్యవస్థాసౌష్ఠవము, ప్రాచుర్యము దానికి నేడు సిద్ధించినది.)

నేడు పరిపాలనమూ, జీవితపథమూ ప్రజాచిత్తవృత్తుల విజయఘోషముతో నిండి ఉండడమె యీ మార్పునకు కారకమై కాని, యీ మార్పులో నిరూఢమై కాని నిల్చిన దని చెప్పడము స్థూలసార్థకతను తృప్తిపడవలెను. ప్రాభవము, ఆహోపురుషిక ఉట్టిపడ్డ పరిపాలకులనాడుసయితము (ఏ దేశమున అయితే ఏమి) గొప్ప 'లిరికు' కవులు విజృంభించినవి ఇట్టి ప్రోద్బలములవల్లనే అని చెప్పడానికి, ఆకవులసంఖ్యా, వారి రచనాపరిణతీ తాముకూడా ఎదురొడ్డుతవి. భావపరిపాకముగా అవతరించిన యీ నవ్యఫక్కికను పరిశీలించినపుడు సాంఘికములైన అవస్థలు ఎంతటి లెక్కకు వచ్చేవి ? అవకాశములు కల్పించేవిమాత్రము అవుతూవస్తవి. ధర్మము మాట దేవు డెఱుగు నని, అనుభవము నా మూలసందర్శనము మాత్రమే అవలంబించడముచేత నేడు పూర్వపు సంఘపరత విడినది.

సంఘపరత అనగా సంఘమనిపించుకొనే ప్రజాగ్రంథికి సాకల్యముగా శ్రద్దముద్ర చూపే మహదాశయనిధి అయిన వృత్తమును కావ్యకలయందు రంగరించే పూనిక; ఆసంఘములో మెదలే ప్రజల చిల్లరజీవితమునుండి కావ్యవస్తువు సంతరించుకొనే నేటి యత్నము ప్రజాపరత అని, సంఘపరతకంటె విశిష్టమైనట్టిదని, చదువుకో పీలు లేకపోలేదు. కాని అంతటితో గ్రంథము పూర్తికాదు.

కొందఱు విమర్శకులు, ఉపదేశముద్రలు మనసు వదలక, కళ ఉపదేశాత్మక మన్నది ఒక ప్రత్యేక విజయమతముగా పట్టి ఫలాన కవులు 'సందేశములు' పలుకుతున్న దివ్య తరులని వారికి జయలాంఛనములు విసర ఘూర్ణు.

కాని ఆ కవులు 'సందేశములు' పలకడమందే, ఉపదేశములు చిలకడమందే తమ విశిష్టత నిలుపుకున్నవారయితే వారికి కవులుగా జయలాంఛనములు నిరాకరించే సంసిద్ధత నేడు కలాభ్యాసనపరిపాకమునే చూపుతున్నది. అన్వేషణమే, జిజ్ఞాసయే నేడు కావ్యసత్త్వము; జీవితమే-తానే- సందేశమై కనబడుతున్నది వీరికి. ఇంతతో సంఘచిత్తమునుండి వ్యక్తిచిత్తము తనవిముక్తి పరిణతము చేసికొన్నది.

కావ్యకల ప్రభుసంఘ చిత్తముల ననుసరించినదన్నా, ప్రజాచిత్తము ననుసరించినదన్నా అసలు రసికమైన వ్యక్తిచిత్తమే తన అనుకంపతో మనసులోనికి తీసికొన్న లోకవృత్తమును పాడుతూ తన రాగచ్ఛాయలతో ఆయా చిత్తాను సరణములు చేసినదన్నమాట. ఆ వ్యక్తిచిత్తము నేడు (తన కంపము తాను చెప్పడము కాకపోతే) తనయెడ తన అనుకంపను వినియుక్తము చేసికొని, తనను తానే అనుసరించసాగినది. భుక్తికవితనుండి స్వచ్ఛపడి కావ్యకల వ్యక్తికవితగా జయిస్తున్నది.

భారతి ఫిబ్రవరి 1984

## సవరణ

'కావ్యకల : ఆశయవైశిష్ట్యములు' అనే వ్యాసములో (క్రిందటి 'భారతి' సంచికలో) : ౨౩౨-వ పుట, మొదటికాలము, ౨-వ పేరా ౪-వ పంక్తిలో 'మళ్లవట్టినవంటి-' అన్నది 'మళ్లుకట్టినవంటి-' అని; అదే పుట రెండవకాలము, ౧౫-వ పంక్తిలో, 'అంచించినవారే' అన్నది 'అందించినవారే' అని; ౨౩౩-వ పుట, మొదటికాలము, చివరిపేరా, మొదటిపంక్తిలో, 'అధర్మబోధక। యీ కావ్యము' అన్నచోట 'అ ధర్మబోధక యీ। కావ్యము' అని చదువుకోవలెను. ౨౩౬-వ పుట మొట్టమొదటి పేరా, ౬-వ పంక్తిలో, 'ఇందటి అనుభవాల సమవాయము' మొదలుకొని, ౮-వ పంక్తిలో, 'కళావస్తువు కాగలదు' వఱకు తల క్రింద కామాలలో ఉండవలెను; అదేపుట, తుట్టతుదిపేరా, ౩-వ పంక్తిలో, 'ప్రత్యేకవిజయమతముగా' అన్నది 'ప్రత్యేకవిజయిమతము' అని ఉండవలెను.

కొం. జ.

భారతి మార్చి 1984

# నాటికలు

[కొంపెల్ల చేపట్టని సాహిత్య ప్రక్రియ లేదనిపిస్తోంది. నాటికల్లో ప్రవేశించడానికి కారణం నీలంరాజువారి సాహచర్యమేమో ననిపిస్తుంది. 'మల్లిక పెళ్ళి' లేక 'పరువుకోసం' అన్న నాటిక రాశాడని అనేకచోట్ల దాఖలాలు కనిపిస్తున్నాయి. ప్రజామిత్ర పెట్టిన నాటికల పోటీకి పంపిందట. (1936 ఐహులా). శ్రీశ్రీ జాగ్రత్తపర్చానన్న సరంజామాలో కూడా దొరకలేదు. అయినా ఇంకా వెతకాల్సిన అవసరం ఉంది.]

## వెలుగు

### కొంపెల్ల జనార్ధనరావుగారు

పాత్రలు :

మూర్తి; బాలుడు; పురుషుడు; (పురుషుని) తల్లి; (పురుషుని) భార్య.

స్థలము :

అనంతపథ పరిసరము.

౧

బాలుడు

అమ్మా, అమ్మా! (ఏదో వినబడి, అమ్మ అనుకొని ఉలికిపడి) ఏదీ?. ఈ వెలుగేమిటి? అర్ధరాత్రి; సూర్యుడూ, చంద్రుడూ, దీపం - ఏమీలేదు: ఈ కాంతి యెక్కడిదీ?........ అందులో ధగధగమెరుస్తూ యెవరూ? - అమ్మా! అమ్మా!

మూర్తి

భయపడకు! ఈలా గెందుకు వచ్చావో తెలుసునా? ఏలాగున వచ్చావో తెలుసునా?

బాలుడు

ఏమో, తెలియదు.

మూ ర్తి

నీకు తెలియదు: నువ్వు తెలియకుండానే వస్తావు. ఇప్పుడు భయముందా?

బాలుడు

భయ మేమిటి? మా అమ్మేదీ?

మూ ర్తి

ఇటు రా. అటు చూడు: అదుగో—ఈ వెలుగులో వెళ్ళిపో.

[బాలుడు వెలుగులోకి వెళ్లతాడు]

బాలుడు

మళ్ళీ వస్తాను నాకు భయము లేదు.

మూ ర్తి

రోజూ రా!

[బాలుడు వెలుగులో వెళ్ళిపోతాడు]

౨

పురుషుడు

ఈ బాలుడు రోజూ రాత్రి వెళ్లతున్నా డెక్కడికి?

బాలుడు

(మూ ర్తితో) వచ్చాను!

మూ ర్తి

రా!

[బాలుడు వెలుగులోకి వెళ్లతాడు]

పురుషుడు

ఆ వెలు గేమిటి!—దుర్నిరీక్ష్యం! (బలవంతాన్ని కన్నీటితో చూస్తూ) వెలుగులోకి వెళ్లాడే! అందులో అస్ఫుటంగా యేమిటి? - అమేయం! అవాచ్యం! అచింత్యం! (జలదరించుకొని, కళ్లమూసుకు నమస్కరించి, మళ్ళీ చూస్తాడు.)

[ఏమీ కనబడదు.]

పురుషుడు

కుర్రవా డేడీ? వెలుగేదీ?

['రేపురా' అని వినబడుతుంది.]

౩

బాలుడు

వచ్చాను!

మూర్తి

నే పాడతాను: నువ్వాడు!

మొదలు తుదియును లేని తిమిరము
చదలె యదలగ నవ్వునవ్వున
పదిలముగ నీచాయగాంచుము
వలతు నీయెడదన్.

పురుషుడు

(పారవశ్యముతో) ఆహా! దివ్యగానము! దివ్యతాండవము! విశ్వమంతా ప్రతిధ్వనించి పోతూఉన్నది !!

[కొంతసే పాలాగే చూస్తూ ఉంటాడు. కళ్లుమూసుకుపోతాయి. మూర్తీ, వెలుగూ దగ్గరగా ఉండడము చూస్తాడు.]

మూర్తి

ఆ బాలుడు నన్ను మొదట పిలిచాడు. నేనూ పిలిచాను. నువ్వాలాగున పిలవలేవు. తెలియదా?

పురుషుడు

బాలుడు పిలిచాడా!—నేను పిలవలేనూ! (రెప్పవాల్చకుండా చూపులో చూస్తాడు.)

మూర్తి

ఇల్లారా!

పురుషుడు

(మహానందముతో) తెలిసింది!

[వెలుగులోకి వెడతాడు.]

మూర్తి

నే పాడతాను: ఆడు—

ప్రళయ ఝంఝూనిలార్భటిలో
పులకలిలు కలకంఠకూజిత
ముల ప్రతిధ్వని సలుపగలిగిన
పొలుతు నీయెడదన్!

౪

తల్లి

అబ్బాయీ! - ఎక్కడా కనబడదేమి?....

అమ్మయ్యో! (అని కళ్లుమూసుకొని తెరుస్తుంది.) అయ్యో! మళ్లీ ఆ వెలుగంతా? చీకటయిపోయింది! అదేమిటి—ఇదేమిటి?

భార్య

(ప్రవేశించి)

ఎక్కడా!....అదుగో, ఆ వెలుగులో!—నేనూ వస్తున్నాను!

తల్లి

చీకటిలో నువ్వూ వచ్చావా?

వెలు గదుగో!

(వెలుగులోకి పరుగెత్తుతుంది.)

[భగ్గున వెలుగు తల్లికి కనబడి, పోతుంది.]

పురుషుడు

(భార్యతో) ఎందుకు వచ్చావూ?

నాకు తెలియదు. (చిరునవ్వు)

పురుషుడు

(తల్లితో) ఎందుకు వచ్చా వమ్మా?

తల్లి

నీ కోసమే నాయనా — అదేమిటి?

పురుషుడు

చూచావు కాదూ?

తల్లి

అందుకే యేమిటని అడుగుతున్నాను.

పురుషుడు

(భార్యతో) నువ్వు చూచావా?

ఆ.

పురుషుడు

తెలిసిందా?

భార్య

ఆ.

తల్లి

ఏమి టమ్మా ?

భార్య

ఏమో, చెప్పలేను.

తల్లి

ఏమిటి నాయనా ?

పురుషుడు

ఏమో చెప్పలేను. .

ఏ

తల్లి

నాయనా! .......అదుగో వెలుగు! - వస్తున్నా.

(ఉద్యమిస్తుంది.)

పురుషుడు

రాగలవా!

తల్లి

రాలేనూ?

[చీకటి]

తల్లి

(తెల్లబోతుంది. కొంత సేపటికి ఆర్ద్రస్వరముతో) నువ్వా వెలుగులో ఉంటే చూస్తూ ఉంటాను. చాలు! అదే బాగుంది!

[వెలుగులో మూర్తితో కలిసి కనబడతారు పురుషుడూ, భార్యాను.]

తల్లి

దివ్యమంగళ దర్శనము!! - చాలు ఇదే ఆనందముగా ఉంది! ఎప్పుడూ ఈలాగుంటే....

[అందరిచుట్టూ వెలుగు.]

వెలుపల లోపల
        వెలిగెడి వెలుగుల
వెలుగు సత్యమయ
        వీథుల వెలుగు సుమీ!

[అని వినబడుతుంది. ఆస్వరములో అందరూ కరిగిపోతారు.]

-భారతి 1927 సెప్టెంబర్

# తాన్సేను

[తాన్సేన్ గురించి[స్వర్గీయుడు]మా కొంపెల్ల జనార్దనరావు ఒక చక్కని ఏకాంకిక వ్రాశారు. చాలా అందంగా నడిచింది కథ. ఆ కథలో, తాన్సేన్‌ను మంటలు క్రమ్ముకోవు. విపరీతపు దాహం ఆవరిస్తుంది అతనిని. చక్రవర్తి తెచ్చియిచ్చిన ఏ పానీయమూ ఆ దాహాన్ని తీర్చదు. ఆఖరుకు, ఒక అంచున నిలిచి, తోడుతున్న భక్తురాలు చేదతో చేదితెచ్చిన నీరే అతని దాహాన్ని తీరుస్తుంది. ఆమె మీరా! ఈ కథ ప్రారంభంలోనే ఒక అందాన్ని చూపారు జనార్దన రావు. అక్బరూ, తాన్సేన్, తాన్సేన్ గురువు హరదాస్ వద్దకు వెళతారు. హరదాస్ ఎన్నడూ ప్రభువుల సంతోషంకోసం పాడడు. అందుచేత అక్బర్ తన రాజచిహ్నాలు వదిలివేసి, ఒక భక్తునిగా, పాదచారిగా వస్తాడు తాన్సేన్‌తో ఆశ్రమానికి. అద్భుతమైన ఆ గానమును విని, ఆగ్రాకు తిరిగి వస్తూన్న అక్బర్, తాన్సేన్‌ను ప్రశ్నిస్తాడు, "అతనికంటె ఎక్కువ సాధన చేశావు నీవు, అతనికంటె ఎక్కువ ప్రతిభ ఉన్నది నీలో, మరి నీకంటె ఎక్కువగా అతనిపాటే నన్ను తన్మయుని చేసినదేమి?" అని. తాన్సేన్ అంటాడు: "ప్రభూ! అతను దేవుని ఉద్దేశించి, నేను చక్రవర్తిని ఉద్దేశించి గానము చేయుదుము. అందువలననే వ్యత్యాసం" అని!

**- ఆచంట జానకిరాం**

'నా స్మృతిపథంలో' నుంచి]

౧

## అక్బరు పాదుషా ఉద్యానవనము

అక్బరు సమక్షమున గాయనీగాయకులు పాడుచుందురు.

తాన్సేను ప్రవేశించును.

దాపున రసాలముపై కోకిల కూయును.

అక్బరు

ఓ యువకుఁడా! ఎవరవు నీవు?

తాన్సేను

రసికవతంసులు పాదుషావారిని దర్శింపవచ్చిన యొక గానకళార్చకుఁడను.

అక్బరు

నీ పేరేమి?

తాన్సేను

నన్ను 'తాన్సేను' అందురు.

అక్బరు

ఓహో! నీవేనా!—ఏదీ, నీనై పుణ్యమింత చవిచూపుము.

[కోకిల కూయును.]

[తాన్సేను పాడును. సభయంతయు పారవశ్యమున మున్గును.]

'ఏ యమృతపుఁ బోఁత బెరిఁగె నీ యుపవనముత్
ఈయెడ నెఱుకలును లొలుక నెలయు కవనముల్
కనుమూఁతలుపడియుపడవు నునువాతము లొడల నడర
తవిపోయిన మనసు తడియు తడవ తడవకుఞ
అందమ్ములు తావిగములు నక్కఁజపుంగులుకుఁదములు
విందు లొలయ వినుతించెడి విభువరు నొకనిన్.'

[నిశ్శబ్దత]

అక్బరు

(గద్దె దిగి తాన్సేనుచేతులు పట్టుకొని) గాయకాగ్రణివై నాయాస్థాని నలంకరింపుము తాన్సేన్!

[కోకిల కూయును.]

[తాన్సేను స్వీకారము చూపును. కోకిల ఎగిరిపోవును.]

ఓ ధన్యుఁడా! నీగురు వెవ్వరు? నీగానమే యింతమధురము. నీగురుని గాన మెంతలలిత మోహనమో కదా! నీగురు వెవ్వరు?

తాన్సేను

హరిదాసస్వామి మా గురువు. వారు బృందావన ప్రాంతమున వసింతురు. వారికీలోక మలఁతి. వారి గానము స్వర్గతుల్యము.

అక్బరు

నా కానందము గూర్ప నొల్లరా వారు?

తాన్సేను

దేవా, యెట్లు?

అక్బరు

ఇట్టే నేతెంచి.

తాన్సేను

దేవా, అది వీలుపడదు. ఒకరాజు నానతి కదఁకువ దాల్పని యమేయ ప్రాభవము నా గురునిది.

అక్బరు

నేనే వచ్చిన?

తాన్సేను

అట్లయినను సందియమే ప్రభూ! రాజ దర్శన మాతపోదర్పమును రెచ్చఁ గొట్టఁగలదు.

అక్బరు

మాఱువేసమున నీ ౙానిసగా వచ్చిన?

తాన్సేను

చక్రవర్తీ!—ఉపాయాంతర మగపడదు!

౨

## బృందావనప్రాంతము

పసరుచెట్లు, పూఁదీవలు నలంకరించిన యమునాతట వనప్రదేశము

[తాన్సేను, సేవకునివలె గుఱ్ఱమును నడపించుచు అక్బరును వత్తురు. ప్రశాంత నిశ్చలదృష్టితో శూన్యముఁ జూచుచు నిలిచియున్న హరిదాసస్వామి పాదముల కిరువురు నెఱఁగుదురు. అతఁడు వారిని దీవించును.]

తాన్సేను

(అంజలిబద్ధుఁడై, తల వంచి) సృష్టికంతకును దీవనమైన తమ జీవనామృత పూరమున నాకొక మునుక లభించినది: ధన్యుఁడను. పాటలీపుల కలరి ప్రకృతిసాగిఁలి మ్రొక్కుమృదుల పదపల్లవము లంటుభాగ్యము గలిగె, మరల నెన్నాళ్ళకో!

[పాదము లంటును]

నాద నిధానము, రసపరిప్లుతము, ఈశ్వరుని వాత్సల్య ప్రవాహ మన వెలయు మధురగానము మరల వినవలచి వచ్చిన యీ యంతే వాసి నను గ్రహింపుఁడు.

హరిదాసస్వామి

(అక్బరుదెసఁ జూచుచు) అక్బరు వేఱొక వేషమున వచ్చిన నాయాత్మ ప్రసన్నము గాకుండెడిది. అతని వినయము నచ్చినది. వచ్చినకోర్కి నెఱవేఱఁగలదు.

[నిండైన నిశ్శబ్దత ప్రబలును. కొంతవడికి తుమ్మెదరొదవలె నొక యుచ్చైర్నాదము వెలయును. స్వామికంఠము 'మాల్కౌసు' రాగమాలపింప దొడఁగును.

యమునాతరంగిణి ఆఁగిపోవును. అంతా నిర్మల మగును. పెనుగాలి సన్నగిలిపోవును. పిట్టపాటలు సద్దణఁగిపోవును. అడవిజంతువులు స్తబ్ధమయి పోవును. అక్బరు తాన్సేనులు మైమఱచిపోవుదురు. హరిదాసస్వామి తేలి తేలి తేలి, అదృశ్యుఁడై పోవును.

*                    *

అక్బరు

ప్రకృతిని శాసించినారు - యథార్థముగ చక్రవర్తి వీరు!

[తాన్సేను గుజ్జమును నడపును; ఇరువురును వెడలి పోవుదురు.]

## 3

## అక్బరు జనానా

[నాట్యము]

'నీ దరహసితము నిలుపు పొలుపుగన
        మనమున మొనకొను రా వలపుల్
జిలిబిలి పలుకుల జిలుఁగు సెలలలో
        జలజలజల నెద మలఁగి చనుణ
(ఝుణ ఝుణ ఝుణ ఝుణ ఝుణం) ప్రియా త్వ
        ద్గుణగణగణనము సంబర మౌ
ఫణి ఫణా రుచిర మణిగణచ్ఛవులె
        అణఁగి మణఁగి జోహారు లిడున్
(తకతై తకతై) లీలా లలితా!
        మధుర విలసన ముదాకలితా! — నీ
లాలన పాలన ఖేలనములు హృదిఁ
        గలయఁగఁ బులకలు చిలుకుఁ బ్రియా!
వెలుంగుగని తరఁగలు గట్టెడు
        చిఱు చిఱు వెలుతురు లురులు విరులవలె
విహంగముల నిరతము నరవర
        ప్రణయపు టేఖలు పాళ్ళనుగా !

కోకిల మృదు కోమలతలు సకలము
జీవకలితములు నీలోనన్
కరఁగి కరఁగి యొడ లెఱుఁగక యాడెడు
చిఱుతకన్నియలు జే జే జే'

[తాన్సేను గాయక బృందముతో ప్రవేశించును.]

అక్బరు

తాన్సేన్ ! మీ గురునివలె నొక్కటి పాడుము.

[తాన్సేన్ 'మాలోకౌసు' పాడును. అక్బరుతక్కనందఱును పరవశులగుదురు.]

[నిశ్శబ్దత]

అక్బరు

మీ గురునివలె నంతటి యానంద మేల జార్పవు ?

తాన్సేను

హుజూర్ ! నేను మీ కొఱకై పాడుదును. నా గురువు పరమేశ్వరుని కొఱకై పాడును.

అక్బరు

తాన్సేన్ ! 'దీపక' రాగము పాడుము.

తాన్సేను

దేవా ! అది అగ్నిమయము, క్షమింపుము.

అక్బరు

ఆ చిత్రము చూతము, ఏదీ !

తాన్సేను

ప్రభూ ! అది విక్షోభావహము !

అక్బరు

ఐనను వినవలతును.

[తాన్సేను గురునిఁ దలఁచుకొని 'దీపక' రాగము పాడ మొదలిడును. పైని వ్రేలాడుచున్న గులేబులలోని వత్తులన్నియు వెలిఁగి, కాంతులు వేశ్యల కపోలముల ప్రతిబింబించును. క్రమముగా తాన్సేను హృదయమున నగ్ని తగిలి యొడల మంటలు వెలువడును.]

తాన్సేను

ఓహో ! ఇది సౌందర్య దేవతయా, ప్రళయ దేవతయా !

(వెడలిపోవును.)

## నదియొడ్డున నించుక దూరముగ నొక బావి

[తాన్సేను మంటలతో వచ్చును. నగర స్త్రీలు బిందెలతో నదికి వచ్చుచు పోవుచుందురు. కన్య మీరా తన చెలికత్తెతో తొలుత నదియందు స్నానమాడి పిదప బావికడకు వచ్చును. చెలికత్తె మీరా బిందె నీళ్ళతో నింపును. తాన్సేను నూతికడకు వచ్చి నీరిడుమని వేఁడుకొనును. మీరా జాలిగొని యాతని చాఁచిన దోసిట నీరు పోయును. మంటలకు జడిసి చెలికత్తె మీరా నీవలకు లాగఁబోవును. తాన్సేను మీరా సౌందర్యము నచ్చెరువుతోఁ గాంచుచుండును. మీరా చల్లనిచూడ్కులతో ప్రత్యుత్తర మిడుచుండుచు.]

చెలికత్తె

(తత్తఱతో) మీరా ! ఇక్కడ జాగు చేసెద వేల ? ఈతఁ డిట్లు మండు చున్నాఁ డెందుచేత ?

మీరా

(జాలితో) 'దీపక' రాగాగ్నిచే మండుచున్నట్టున్నాడు, పాపము.

చెలికత్తె

ఐన నీవు 'మలహరి' పాడి శమింపఁజేయరాదా ?

మీరా

సూర్యునివలె ప్రకాశించుచున్నాఁ డితడు: చిన్నదానను. నేనేమి చేయగలను ?

చెలికత్తె

భయములేదు మీరా ! ఈతఁడు సూర్యునివలె ప్రకాశించుచో నీవు చందమామవలె వెలుఁగు చున్నావు.

[తుదకామె పాడ నంగీకరించి నూతి మెట్లపైఁ గూరుచుండి; చెలికత్తె మెడకు చేతులు చుట్టి, 'మలహరి' ఆలపించును. తాన్సేను తన్మయుఁడై వినుచుండును. మేఘములు గడలుకొనును, ఉఱుము లుఱుమును. మెఱుపులు మెఱయును. వాన కురియును. మంట లంతకంతకు చల్లారిపోవును.]

తాన్సేను

(మీరా యొద్దకు వచ్చి) తరుణీ ! నీ ఋణము తీర్చుకొన నాకడ నేమియు లేదు. నా యీ ఆర్ద్రి హృదయము మాత్రమింక నీయదియే.

[మీరా సిగ్గుతో మెత్తపడి కండ్లు వాల్చును ]

చెలికత్తె

అట్లు పలుకునేమి యతఁడు ?

[తాన్సేనింకను దగ్గఱి మీరా చిన్నిపాద మంటఁబోవును. మీరా వినయమున వారించును. అతఁడామె చేయి ముద్దుగొని తనయురమున నద్దుకొనును. మీరా సిగ్గుబరువున మొగ మావలికిఁ ద్రిప్పుకొనును. చెలికత్తె కంగారు పడియఱచును. పౌరులు వచ్చి చూతురు.]

పౌరులు

ఋషికన్యవలె నుండు మీరాయే ....

మీరా బంధువులు

ఎంతపని !

[మీరా ఒక చేతితో మొగము గప్పుకొనును. చెలికత్తె ఒకచేత నామెను బట్టుకొని, రెండవచేత కోపముతో తాన్సేనును జూపును. పౌరులాతని చుట్టుముట్టుదురు. తాన్సేను వారినాఁపును. ఇంతలో మఱికొందరు వత్తురు. వారెల్లరు తాన్సేనును బాధింప సమకట్టుదురు. మీరా చెలికత్తె చేతులందు మూర్ఛిల్లును. ఇంతలో అక్బరు తాన్సేనును వెదకఁ బంపిన సేవకులు చేరుకొని పౌరులఁ బోఁద్రోలి, తాన్సేనును గొనిపోవుదురు.

(తేఱిన వెనుక మీరాను చెలికత్తె తీసికొనిపోవును.)

## ద్వారక : కృష్ణాలయము

[సన్న్యాసిని మీరా ప్రార్థన సల్పుచుండును]

'నీ కంటికొనల నే నేరిన జా
 లులె నా యెడఁద వెలుంగులు దేవా !
నీ యోర్పు కొస మునింగిన నా గా
 నము తీపులు కాన్క గొనుము దేవా !
నీ తాఁకిన మధు నిభృత మధురభా
 వసుమము లివి యప్పనములు దేవా !
ఈ మలీమసపు టెడఁద యద్దమున
 నీ యందము గమనింపుము దేవా !'

[తాన్సేను వచ్చును.]

'ఎటఁ జూచిన నీ యిద్ధ తేజమే
 దోబూచుల కాంతు లొలుకు దేవా !
కడు భూతకోటి గండురొదల నీ
 నగు మంతనము వినంబడు దేవా !

నీదు రూపులేని మహత్త్విస్తితికి ను
పాధి వెదకు వెడభావము దేవా !
లోన నెలకొను వెలుంగుల చాయలు
వెలిం గని మది పలవించును దేవా !'

తాన్సేను

(మెల్లగ) ఓ సన్న్యాసినీ!

మీరా

'సంభ్రమముల పఱవు సామీ, నీ కృప!
దినమణుల దొంతి దేవా, నీ రుచి!
వెన్నెలలగుట్ట విభూ, నీ చలువ!
నీ సేవను మది నిలుచుటె నా సిరి! ....

తాన్సేను

ఓ సన్న్యాసినీ!- మీరా నా కెక్కడ లభించునో దివ్యదృష్టిని జూచి యెఱింగించి పుణ్యము గట్టుకొమ్ము!

మీరా

(తాన్సేనును గుర్తించి, ఒక క్షణకాలము కండ్లుమూసికొని, నెమ్మదిగ) మీరా చనిపోయినది.

తాన్సేను

(చకితుఁడై, నిట్టూర్పు పుచ్చి) హా!- మీరాలేని యీ బ్రదుకు వ్యర్థము. - నేనుకూడ మీరాకడకే పోయెదను.

మీరా

ఎట్లు పోఁగలవు?

తాన్సేను

మృత్యుద్వారమున.

మీరా

అటు నీకు మీరా చేకుఱదు.

తాన్సేను

మఱెట్లు చేకుఱును? మరణించిన మీరాను బ్రదికి యెట్లు పడయఁగలను? నన్ను మరణము తానే పొందునట్లున్నది.

మీరా

తారక మరణము నేల యుపాసించెదవు?

తాన్సేను

మీరా కొఱకు.

మీరా

దాన మీరా మఱింత దూరమగును. నీ జీవితమును వెచ్చించి, కొనఁదగినది మీరా సాన్నిధ్యము గాదు.

తాన్సేను

మఱేమి? ఇఁక నేను బ్రదికి చేయఁదగినదేమి?

మీరా

నీవు మీరా నెఱుఁగకపూర్వము మీరా కొఱకే జీవితము నర్పింపనెంచితివా?

తాన్సేను

జ్ఞప్తిలేదు. మీరాను నే నెఱుఁగని దెప్పుడో జ్ఞప్తిలేదు. మీరా నా కెట్లు లభించును? మీరా లేక నా బ్రదు కెందులకు?

మీరా

విశ్వవిభుని సేవకై నీ జీవితము నర్పింపుము తాన్సేన్?

తాన్సేను

(మీరామాట లించుక మననముచేసికొని) ఓ యోగినీ! నీ ఆశయ మేమి?

మీరా

తాన్సేన్! ఈ జీవితము నీదికాదు. నీవు నీవాఁడవని చెప్పుకొనుటకు నీ కేమధికారమున్నది? పుట్టకపూర్వము నీవు నీ వాఁడవా? చచ్చినవెనుక నీవాఁడ వగుదువా?

తాన్సేను

నే నెవ్వరివాఁడను? ఏల జన్మించితిని?

మీరా

నీ ప్రభువు విశ్వమంతకును ప్రభువైన వాఁడు. అతని యిచ్ఛాపూర్తికై నీవు జన్మించితివి.

తాన్సేను

నాయిచ్ఛాపూర్తికై జన్మింపలేదా నేను?

మీరా

నీ యిచ్ఛాపూర్తికై నీవు జన్మించితివేని నీకు మీరా దక్కియేయుండును.- నీ యిచ్ఛ అతని యిచ్ఛపరుగందుకొనఁ జాలదు.

తాన్సేను

(హృదయము కరఁగి) ఓ దేవీ! ఆ పరమేశ్వరుని యిచ్ఛ పవిత్రముగ నెఱవేర్చుటకే నాకుదారిఁ జూపుము! ఇటుపై స్వార్థమునకై జనింపను.

మీరా

(కాషాయవస్త్రము నిచ్చుచు)ఈ వినయవేషము దాల్పుము. ధనికులు నీ దారిద్ర్యమునకే మచ్చరింతురు గాక! దర్పవిలాసములు నీ సారళ్యపదముల ముద్దిడుకొనుఁ గాక! బ్రదుకుము పరమేశునకై!

(తాన్సేను తల వాంచును. మీరా కాషాయవస్త్రమును, రుద్రాక్షమాలికను ఆతనిపై నుంచి దీవనగా నతని భుజముపై చేయిడును.)

ఇఁక నిన్ను మిథ్యాజీవనము తాఁకదు. శాశ్వత సత్యజీవనము నీకు చేకూరినది!- మీరా నీకు దవ్వున లేదు; నీ వామెను విడిచిలేవు: కన్నెత్తి చూడుము - ఇదిగో మీరా!- నీవు భౌతిక జీవనమునకు చచ్చినవాఁడవు కానియెడల చచ్చి బ్రదికెడు దాని నెఱుఁగజాలియుండవు.

(సన్న్యాసులవలె వారొండొరుల గారవించుకొందురు. ఇంతలో అక్బరు వచ్చును.)

అక్బరు

ఓ హో! - తాన్సేన్!- గానతపోనిధి, ఇంకొక హరిదాసస్వామి!

(నమస్కరించును)

(మీరా సన్న్యాసముమాట విని యామె బంధువులామెను జూడవత్తురు. పూజచేసి మీరా పాడును. నిశ్చలుఁడగు తాన్సేను హృదయమున మీరా పాట ప్రతిధ్వనించును.)

'పితా! దేవ దేవా!

నీ రూపంబు అపారము భావజ
గం బక్షరగతిఁ గనియె నిరూపణ
నీ రూపుఁడవు అపారుఁడ వగు ని
న్నీ రూపంబున నిటు సేవింతుణ!-
నా వాణీఝురి పోవఁజాల దిఁక
నీ వేణుపదము వేములు దాటఁగ
నా యెద భావ విహాయస పరిని
స్థిత భవదంఘ్రి స్పృశించియు ఆఁగుణ!-

పారవశ్యముల భూరిపయోధుల
    నీ మహోన్మయత నీడలు గ్రక్కఁగ
ఆద మఱచి నా పేదయాత్మ నీ
    రుచులఁ గరఁగి నిర్ముక్తత వెలుఁగుఁగ!'-

తాన్సేను

'భావాతీతా! పావనమహిమా!
ప్రేమనిధీ! భవ విదళవనేతా!
విశ్వత్రాతా! శాశ్వత సత్త్వా!
తీతి నిరవధిక దివ్యప్రతిభా!'-

(ఎల్లరును మైమఱతురు.)

(దూరమున కోకిల గొంతెత్తి కూయును.)

భారతి 1928 డిశంబరు.

# స్వర్ణయోగి

## కొంపెల్ల జనార్దనరావు

(ప్రభువు, యోగి.)

ప్రభువు : రాష్ట్రము భాగ్యవంతము చేసి లోకులకు ఉన్నతి మార్గాలు కూర్చే నిమిత్తమై నేనీ గుప్తవిద్య వినియుక్తము చేస్తాను - శపథమే.

యోగి : కోరి నీ విధి యెరిగితివి. నీమరణ వేళను గాని ఇది యితరునికి తెలియరాదుసుమా,

ప్రభువు : అదేమి ?

యోగి : ఇద్దరిది యెరిగి మనరాదు.

* * *

ప్రభువు : ఏమి నా కిటు దృశ్యము మారివచ్చి మిరమిట్లు కొల్పుతున్నది! - ఎవరక్కడ? ఈ సన్యాసికి మరణదండము.

యోగి : ఏమంటివి ?

ప్రభువు : అడగక పూర్వమే యిస్తిమి జవాబు. ఇది స్వర్ణము ప్రసాదించిన తొలుశాపము కాబోలు! ఇదే నా రాజదండము చేయించే తుదికార్యమున్నూ.

యోగి : ఇది నా ఆశీఃకిరణము మొలిచిన ప్రభాతము, ఇదీ నా స్వర్ణ యోగము. నేనై యెరుగుదువులే.

ఉదయిని : సంపుటి 1 సంచిక 5

# విద్యార్థి

## కొంపెల్ల జనార్దనరావు

(రూపవతి, ఆజ్ మల్.)

ఆజ్ మల్ - అడుగో అక్కడ, ఆ యుద్ధ ఘోషలో మునిగి తేలుతున్నాడు.

రూపవతి - సౌందర్యము నిగ్గులు తెలిసినవాడు, తన కళాచాతురికి ఆట పట్టయిన నన్ను వదలి యీ వికారపు సన్నివేశము రుచిగా చూచుకొన్నాడేమి? విద్యార్థీ!

ఆజ్ మల్ - సౌందర్యము నిగ్గులు తెలిసినవాడు కనుక. అతని దిద్దుబాటు భరిస్తూ నిష్క్రియవై నిలిచే నీవు ఈ దృశ్యముతో సరివస్తావా?

రూపవతి - దీని కొక శ్రుతియా, రేఖయా - ఏ మున్నది? ఇది ప్రళయ ప్రాయము. సౌందర్యము కొల్లపోయే స్థితి కాదూ ఇది?

ఆజ్ మల్ - అవు నాతడు దానిని ఉద్ధరిస్తాడు.

రూపవతి - నే నీ యేడుపులో, భయములో నీరు విచ్చుతుండగా అతడు నన్ను మరింత వేధిస్తున్నవాడు సౌందర్యం ఏమి ఉద్ధరిస్తాడు! నే నాతని భావాలకు ఉత్తేజన మిచ్చి, అతని కళావిలాసాన్ని పొంగులెత్తించిన ప్రేమసీమను, నన్ను వదలి అతడు సౌందర్యదూరుడు కాదా అవుతున్నాడు?

ఆజ్ మల్ - నీవు ధన్యురాలవు - ఇది దూరసౌందర్యములే!

రూపవతి - మీ రిద్దరు కలిసి హిందూమహమ్మదీయుల, రెండు మతాల, రెండు జాతుల మైత్రిని పరిపక్వముచేసి ఒక్క జాతిని సృష్టించుకొన్న సౌందర్యాన్ని మీలో ప్రతిష్ఠించుకొన్నారు సరే. కాని యీ వైషమ్యాలలో, కుట్రలలో, దుఃడగాలలో విప్లవించిన యీ అర్థములేని ఘోషలో ఒడలు మరవడంలో ఏమి ప్రయోజనమున్నది? ఒక సౌందర్యప్రవాహాన్ని, ఈ మధురమైన జీవితగతిని భంగపరచడం ఎందుకని? నే నీతని తీసుకపోతాను!

ఆజ్ మల్ - ఈ ఘోషకై వెదుకుకొని పోలేదు విద్యార్థి. మా యిరువురి ఐక్యములో సౌందర్యమే ఉంటే ఇందరి ఐక్యం ఎంత అపేక్షణీయం! ఈ వైష

---

* గణేశ్ శంకర విద్యార్థి జీవితం ప్రేరణతో రాసిందిది.

మ్యాలు, దుండగాలు, కుట్రలు - ఇవి ఉన్నవి నిజమే : ఈవైరమే ఒక దివ్య మైనస్థితి లేవకుండా భంగపరుస్తున్నది: అది తొలగించడానికే అతడు అవసరము: అది తొలగించడం ఆ సౌందర్యానికి అవసరం. ఈ ఘోషకై వెదుకుకొనిపోలేదు విద్యార్థి ! ఈ వికారపు సన్నివేశమే ఆతని వెదుకుతున్నది, అతని స్పర్శకై తరవుతున్నది. సౌందర్యము నిగ్గు లెరిగిన ఆతడిది యేలాగున ఓర్వగలడు ?

రూపవతి - జగమంతటా వికారాలే. చేతనైన సౌందర్యము రచించు కొని భోగించక యిది యేమిటి ? తాను అనుసరిస్తున్న కోవను తెంపి, దీని కాత దంత కావలెనా ! ఆతనివల్ల ఏమవుతుంది ? నే నిది భరించలేను. నే నీతని తీసుక పోతాను - విద్యార్థీ !

ఆజ్ మల్ - ఆత డీ ఘోషను వెదుకుకొని రాలేదు. తనను చుట్టు కోవచ్చిన యీ వికారమునుండి అతడు పారిపోవలెనా ? ఆతడు జడజీవి కాడు. ఆతని సౌందర్యము ప్రళయతాండవమందలి బిందువును కోరేది. మహాత్ముడు భారతదేశాన్ని వదలి పోలేదు. ఈతడు వెనుదిరిగి ఒక అంగకము లోపింపజేసి, మరీ వికృత మేలాగు చేయగలడు ఈ దీనమైన సన్నివేశాన్ని ?

రూపవతి - మరి నామాట యేమిటి ? నా యీ స్వప్న సౌధాన్ని భంగ పరచి, రక్తాలు చీకట్లు చిమ్మే ఖండజీవితం నాకు మిగిల్చి, తన ప్రాణము పోయి ఏమి సాధించినట్టు ? నేను తీసుకపోవలెనోయీ ! విద్యార్థీ! ఆతని నింత అపేక్షించే నాగతి యేమిటి !

ఆజ్ మల్ - నీవు శాశ్వతముగా బ్రతుకు. సౌందర్యఖనివి - జీవితములో వైవిధ్యము, ఈ ఆహ్వానముపట్ల వైరుధ్యము చూచి బెదరే నీ చిన్నారిసోయగము దాచుకొని దైవికాలకు దుఃఖించి పోషించుకో !

రూపవతి - నే నీ కత్తులు భరించలేను. పోనీ నన్నాతడు రానీయడే : నే నేమి చేయను ? అతడు లేనిదే భూమిమీద నా కింక సౌందర్య మేమిటి ? నే నాతని తీసుకపోవలెనోయి - విద్యార్థీ ! పలక వేమి బాబూ !

ఆజ్ మల్ - విరిగిపడుతున్నారు ఆతని గుంపువంకకే భూతకోటి. భూమే ముక్కలయి తరగెత్తి వస్తున్నది.

రూపవతి - విద్యార్థీ ! - నన్ను చూచికూడా అవంకకే పరుగిడు తున్నాడు - డేగవలె, సర్పమువలె, విజయధ్వజమువలె. మరీ దూరమైపోతున్నాడు విద్యార్థీ !

ఆజ్ మల్ - ఆ సముద్రము పిలుస్తున్నది, ముంచెత్తుతున్నది. కత్తులు, కత్రలు - రక్తము, మంటలు. పీరి పెనుబొబ్బలు గాలినికంటె ఈ కళవళము కళ్లను ముందు చీలుస్తున్నది.

రూపవతి— నే నిది చూడలేను. ఒక్కక్షణములో కనపడ్డది యింకొక క్షణానికి చీల్చుకపోతున్నది. ఈ ప్రళయములో నా విద్యార్థి ఉరుకుతా దేమి? ఇది నేను చూడలేను! విద్యార్థి!- ఇంక లాభము లేదు. నాయెలుగు వినబడదు. నే నిదిచూడలేను.

అజ్‌మల్— నీవు చూడలేవమ్మా! ఉపాసకుడు లేనిదే నిలవజాలని సౌందర్యానివి నీవు: ఇది చూడలేవు. చైతన్యము నంతా విధ్వము చేయగల సౌందర్యోపాసన: సౌందర్య ప్రతిరావము. ఇది నీ అచలసౌందర్యానికి విరుద్ధమై, నిన్ను స్థిరగతిని పాటించిన మనస్సులో ప్రవహించి దానిని లోగొనవచ్చిన ద్రవ్యాల సంఘట్టము! నీ వేమి భరించినావు పో! నీవు దూరముకా- ఈ ఆవేశము నిన్ను పడనేసి పోతుంది!

రూపపతి— ఇదేమి నీ వింత సివమెత్తుతున్నావు - నన్ను భయపెట్ట కోయీ! నా కళ్ళలో రక్తాలు చిమ్ముతున్నవి. నా జీవనాళాలు తెగుతున్నవి!

అజ్‌మల్— నీకై నేనూ ఏడ్వగలను. కాని నీవు విద్యార్థికై ఏడ్చి లాభము లేదు.

రూపవతి— మరి నన్ను రానీయ రేమి? నేను నా విద్యార్థికి తోడు పోతాను.

అజ్‌మల్— నీ విందు చొరనూలేవు. ఇది నీకు కాదు. ఇది మహా భయంకరమైనది. నీ కిందు లొంగేది లేదు. నీవు వీరికై చచ్చి లాభము లేదు.

రూపవతి— అయ్యో! నన్ను భయపెట్టకోయీ! నీవు నా విద్యార్థికి తోడుపో. నన్ను ఇల్లు చేర్చండి!

అజ్‌మల్— ఇల్లెక్కడ? ఇళ్లు తగులపడ్డవి. తిరిగి నిర్మించవలె ఇళ్లు. ఇళ్లలో జీవము జారింది. జీవము పోసి కట్టవలె ఇళ్లు.

రూపవతి— నన్ను రానీ - నేను విద్యార్థిని విడవలేను. నేను పోలేను పోలేను. జీవము జారి సగము విరిగిన నాసౌధము నేను చూడలేను. నాగతి యేమిటి?

అజ్‌మల్— ఒక ఉపాసనలో వచ్చి కళామూర్తులు మీ రిద్దరు కలిసినారు సరే. అతనిని అనుసరించడమే నీ పని కాదు. నీవు పో. నీ విక్కడ ఆగలేవు. నీ వీ జనమునకై చచ్చి లాభము లేదు. అడుగో నీ విద్యార్థిని చూచి పో - ఇడుగో!

రూపవతి— అమ్మో - ఈదృశ్య మేమిటి! నే నిది భరించలేను: నా బ్రదుకు: నా విద్యార్థి! నన్ను రానీయరు: నాగతి యేమిటి?

[కొందరు మనుషులు పరుగెత్తుకవస్తారు. చంటిపిల్లలతో ఇద్దరు ముగ్గురు స్త్రీలున్నా. రూపవతి వారిలో చిక్కుకొంటుంది. అందరూ పారిపోతారు.]

అజ్మల్ — పొండి పొండి పాపం మీరందరు.

రూపవతి (లోపలనుండి).- అజ్మల్ !

అజ్మల్ — భయం లేదు! పో ! రాలేవు. పో!- విద్యార్థి నెత్తురులు కక్కుతున్నాడు ఒడలినుండి, నోటినుండి - ఒకచోట నేమిటి!- అధ్వని ఆతని తలపయినే! నెత్తురులా మంటలా అవి ! మంటలలో ఆతను దుమికినాడా, ఆతని ఒడల వెడలిన మంటలా అవి! ఆతడు హిందూమతపతాకలా ఎర్రనై రోదసిలో తాండవిస్తున్నాడు. నే నది కౌగిలించవలె. హృదయాన ధరించవలె. ఆతని తలపై చంద్రవంక చిందింది. ఈతడు నా విజయపతాక ! నా ధర్మపతాక ! మానవ కోటికి ఆశీః పతాక! వీరి శివమూర్తిని ఊహించగలను ! మరి నా కీ నరాలు సడలుతున్నవేమి ? — ఎందరిరక్షకై ఆతడు విస్తరిల్లుతున్నాడు ! ఆతని రక్షలో సర్వము ఉపాధులు భద్రపరుచుకో పరుగిడు తున్నది ! ఈ శకలాల, అవయవాల, స్వరాల ఐక్యములో మేళమై పరచిన యీ చైతన్యము నాలో మనస్సు పొంగిస్తున్నది ; ఆనందము కాబోలు పొంగివస్తున్నది. ఆతనితో వాదించిన నేను నేర్చినాను కాబోలు ఈ సౌందర్యము. ఆతడు సౌందర్యమై నాకు తన్ను నేర్పుతున్నాడు - దౌర్బల్యము కట్లు తెంపి. తెలిసింది స్వామీ నీ తాండవము ! జడసౌందర్యమునుండి పెరిగివచ్చిన నే నిది ఆస్వాదిస్తాను: ఈ కృత్స్న సౌందర్యలీలలో నేనూ లీనమౌతాను !- ఏడి నా విద్యార్థి !- ఓహూ, విద్యార్థి ఆత్మకు ఈ శరీరము చాలలేదు— ఆతడు విడివడుతున్నాడు ! ఏడి నా విద్యార్థి ! నా విద్యార్థి యేడీ !

[పరుగిడిపోతాడు.]

[కొందరు పౌరులు అటునుండే పరుగిడుతూ వస్తారు.]

మొదటి పౌరుడు - ఈత డెవరు ? విద్యార్థివలె ఈత డెవరు ?

రెండవ పౌరుడు - ఈత డెవరో మహమ్మదీయుడు మనల నందరినీ కాపాడుతున్నాడు, తనవారినే కాక.

మొదటి పౌరుడు - అందరూ తనవారే ఆతనికి.

మూడవ పౌరుడు - విద్యార్థి యీ సదమదములో ఉన్నాడా ?

మొదటి పౌరుడు - లేదు. ఆతడు కడతేరినాడు. ఈత డవతరించినాడు.

రెండవ పౌరుడు - రండి మనము పోదాము.

[పరుగిడతాడు.]

[అజ్‌మల్ వస్తాడు, ఇద్దరు గాయపడ్డవారిని తీసుకొని.]

అజ్‌మల్— మీరు కదలండి. ఈ గోడమాటు మీకు చాలదు.

[గాయపడ్డవారిని తీసుకొని అందరూ త్వరగా వెళ్ళిపోతారు.]

వీథి బడ్డ దుర్బలజనానికి రక్ష లేదు మీరు పొండి !— ఇంకా ఈజనము పోరాడ తారేమి? విద్యార్థి ఆత్మ వీరిపై విచ్చినది. ఆశక్తి వీరిలో ఆవహించదేమి? వే నొక్కడనేనా యీఐక్యానికి నోచుకొన్నది? వీరెప్పు డింకచూచేరు? [పరుగు.]

[మొదటి పౌరుడు మళ్ళీ వస్తాడు.]

మొదటి పౌరుడు— ఈత దేమి రోదసి నిండి యీ వీరవిహారము! మందరము లాగ, మేరువులాగ - నేను నిన్ను చూడలేకున్నానోయి!- ఈతడు తప్పించినవారు తమలో తామే చంపుకొంటున్నారు : అయ్యో !-

[గాఢముగా గాయపడ్డ అజ్‌మల్, మరికొందరు.]

అయ్యో! నేను నిన్ను చూడలేకున్నానోయి!

నాలుగవ పౌరుడు— ఎవరీ వింతమనిషి!

ఐదవ పౌరుడు— పాపం ఒడలంతా గాయాలు, కాల్పులు. ఏమి చేయవలె? ఎవరో ఈతడు?

అజ్‌మల్— నేను విద్యార్థిని.

నాలుగవ పౌరుడు— విద్యార్థిని నేను రక్తాలలో మంటలలో చూచేను.

మొదటి పౌరుడు— విద్యార్థి కడతేరినాడు. ఈత దెవరో మహానుభావుడు.

అజ్‌మల్— నేను విద్యార్థిని!

మొదటి పౌరుడు— అయ్యో! ఈతడు స్మృతి తప్పి పలవిస్తున్నాడు. ఇతనింక బ్రదుకడు కాబోలు. ఇతడు చావగా మనము ప్రాణాలు తప్పించుకొని పోవలె- అంతమంది ఆసంకులములో నలిగిపోతున్నారు! ఇత డింక బ్రతుకడు- విద్యార్థివలెనే.

అజ్‌మల్— అయ్యో వీరు నమ్మ రేమి. నేను విద్యార్థిని!

మొదటి పౌరుడు— అయ్యో! ఏడవనా? నవ్వనా? విద్యార్థి చనిపోయినా డనుకున్నాము : ఈతడు తాను విద్యార్థి నంటాడు.

నాలుగవ పౌరుడు— నమ్మవలెనా? మహమ్మదీయ వేషములో నీవు విద్యార్థి వేమిటి నాయనా!

అజ్‌మల్— అయ్యో వీరి కింత నమ్మకాలు లే వేమి! ఈ జనముకై బ్రతికి లాభము లేదు కాబోలు! బ్రతికి లాభము లేదు కాబోలు! [మృతి.]

మొదటి పౌరుడు—బ్రదికి లాభము లేదూ?-ఈ జనముకై బ్రదికి లాభము లేదూ? ఈ విడివడ్డప్రశ్న రోదసి నిండి కనబడుతున్నది నాకు!

(ఉదయిని సం.1 సం.6)

## కథ

# సతి

మూలం: ప్రేమచందు    అనువాదం: కొంపెల్ల జనార్దనరావు

[సతి అన్న ఈ కథను ప్రేంచంద్ మాధురి సాహిత్య మాస పత్రికకు రాశాడు. దీని రచనాశిల్పంచూస్తే ఆయన తొలికథల్లో దిగా కనిపిస్తోంది. దీన్ని తెలుగులోకి కొంపెల్ల అనువాదం చేసిం తర్వాత పలువురు చేసినట్టున్నారు. 'సహగమనము'-అన్న పేరుతో ఓ 26 పేజీల చిన్న గ్రంథంగా ప్రేంచంద్ పబ్లికేషన్స్ విజయవాడ వారు అచ్చేశారు. మొదటి ముద్రణ సంవత్సరం తెలీలేదుగాని-1934 లో తృతీయ ముద్రణ వెలువడింది. అనువాదకులు యన్.యన్.వి. సోమయాజులుగారు.]

౧

సుమారు రెండుశతాబ్దములు గడచిపోయినను చింతాదేవిపేరు మాయలేదు. బుందేలఖండమునందొక గతుకునేల నిప్పటికిని మంగళవారమునాఁడు వేనవేలు స్త్రీపురుషులు చింతాదేవిని బూజింప వచ్చుచుందురు. నాఁ డానిర్జన ప్రదేశము శ్రావ్యగీతముల మార్మోగుచుండును. గట్టులు, గుట్టలు రమణీమణుల రంగు రంగుల వస్త్రములచే రంజిలుచుండును, దేవియాలయమొక యెత్తైన గుట్టపై నున్నది. దానికలశముపై నెగురు నెఱ్ఱజండా చాలదూరమున కగపడుచుండును. గుడి చాల చిన్నది. ఇద్దరు మనుషులైనపట్టరు. లోపల విగ్రహ మేమియులేదు. ఒక చిన్న వేదికమాత్రమున్నది. క్రింది నుండి యాలయమువఱకు ఱాతి మెట్లున్నవి. సమ్మర్దమున జనులు గ్రిందఁ బడకుండుటకై యిరుప్రక్కల రాతి గోడకలదు. ఇక్కడనే చింతాదేవి సతియయ్యెను. లోకాచారము ననుసరించి యామె తనభర్త కళేబరముతోఁ జితి యెక్కలేదు. తన భర్త చేతులుజోడించు కొని యెదుట నిలిచియుండెను. ఆమె యతనివంకఁ గన్నెత్తి చూడనైన లేదు. ఆమె తనపతి శరీరముతోఁగాక ఆతనియాత్మతో సతియయ్యెను.

౨

యమునాతీరమున 'కాలపి' ఒక చిన్న నగరము. చింతాదేవి ఆనగరమందలి యొకబుందేలవీరుని కూఁతురు, చిన్నతనముననే తల్లి స్వర్గస్థురాలగుటచే తండ్రియే యామెను పెంచవలసివచ్చెను అది యుద్ధసమయము. యోధులకు నిద్రాహారములుగూడ గుఱ్ఱములమీఁదనే. చింతాదేవి బాల్యమును దండితో సమరక్షేత్రమునఁ గడచెను. తండ్రి యామె నొకగుహయందో చెట్టుచాటుననో దాఁచి, యుద్ధరంగమున కేఁగుచుండును. చింతాదేవి నిశ్శంకముగఁ గూరుచుండి మట్టితో దుర్గములు నిర్మించుచు, వెడఁగొట్టుచుండును. బొమ్మరిండ్లే ఆమెదుర్గములు. ఆమె బొమ్మలకు వస్త్రము లక్కఱలేదు. భటులను తయారుచేసి యామె యుద్ధరంగమున నిలుపుచుండును. ఒక్కొకపు డామెతండ్రి సంధ్యాసమయమునకైన మగుడిరాఁడు. కాని భయము చింతాదేవిచెంత కేనిచేరదు. ఆమె విజనస్థలమున అన్నపానములులేక రాత్రియంతయు కూరుచుండును. ముంగిసలయు నక్కలయుఁ గథ లామె యెన్నండును వినియుండలేదు. వీరవరుల ఆత్మోత్సర్జనకథారత్నములను, అదియు యోధాగ్రేసరుల ముఖమున, వినివిని యామె యాదర్శవాదిని యైపోయెను. ఒకసారి మూఁడుదినములవఱకు చింతాదేవికిఁ దనతండ్రి వార్త దెలియలేదు. ఆమె యొకకొండగుహయందుఁ గూరుచుండి మనముననే యెవ్విధముననను శత్రుభేద్యము గాని దుర్గ మొండు నిర్మించుకొనుచుండెను. పగలెల్ల నామె యాదుర్గ స్వరూపమును ధ్యానించును; రాత్రి యాదుర్గమునే కలగాంచును. మూఁడవనాఁటి సాయంతనము ఆమె జనకుని సహచరులు కొందఱు వచ్చి యామెయెదుట నేడువసాగిరి. "నాన్నగారేరీ ? మీరంద ఱేడ్చుచున్నారేమి?" యని చింతాదేవి యాశ్చర్యముతో నడిగెను.

ఎవ్వరును సమాధానము చెప్పరైరి. అందఱు గుండెబాఁదుకొని యేడ్చుచుండిరి. చింతాదేవి తనతండ్రి వీరస్వర్గ మలంకరించెనని తెలిసికొనెను. అపుడు మూడేండ్ల బాలిక కండ్లనుండి ఒక్కనీటిబొట్టయిన రాలలేదు. ముఖమేమాత్రము వికలతగాంచలేదు. ఒక్కనిట్టూరుపైన వెలువడలేదు. ఆమె నవ్వి యిట్లనెను :- "వారు వీరగతినొందిన మీరు విలపింతురేల ? వీరవరుల కింతకంటె గొప్ప మరణమేముండును ? వారివీరత్వమున కింతకన్న గొప్పబహుమానమేమి లభింపఁగలదు? ఈసమయము విచారింపఁదగినదికాదు. సంతోషింపఁదగినది."

ఒకయోధుఁడు చింతిల్లుచు నిట్లు పలికెను :- "నీవిప్పు డెక్కడ నుండెదవు ? ఇదియే మాచింత." అని.

చింతాదేవి గంభీరముగ నిట్లనెను:- "దీనికై మీరు చింతింపకుఁడు. నేను నాతండ్రికిఁ దగినకూఁతురను. వారుగావించినదే నేనును గావించెదను మాతృదేశ

మును బగవారిచేతినుండి విడిపించుకార్యమున వారు ప్రాణములర్పించిరి. నాయెదుట నున్నదిగూడ నదియే యాదర్శము. వీరోయిమీభటులను సన్నద్ధులఁగావించుకొనుఁడు. నాకై యొక గుఱ్ఱమును, ఆయుధములనుసిద్ధపఱుపుఁడు. ఈశ్వరకటాక్షమున్నచో, నెల్లరకు నేనగ్రగామినినై యుండఁగలను. నేనొకవేళ వెనుకంజవేయుట మీకన్నులఁ బడినచో నొక్కకత్తివ్రేటుతో బరిమార్పుఁడు. ఇదియే మీకు నావిన్నపము చనుఁడిఁకనాలస్యము వలదు."

చింతాదేవి వీరవచనములవిని 'యీసుకుమారకుమారి తన సంకల్పమున దృఢచిత్తురాలై యుండఁగలదా' యని యోధులు సందియ మందిరి.

## 3

ఐదువత్సరములు గడచెను. చింతాదేవి కీర్తి దశదిశల వ్యాపించిపోయెను. పగతుఱ పదపాటవము పెల్లగిలిపోయెను. ఆమె సజీవమగు విజయమూర్తిగ నుండెను. గుండ్లకును, దూపులకును నెదుట నామె నిర్భయముగ నిలుచుండుటఁ జూచి యుద్ధభటు లుత్తేజితు లగుచుండిరి. ఆమె చూచుచుండ వారెట్లు వెనుకంజ వేయఁగలరు ? కోమలాంగియగుజవ్వని ముందునకు సాగుచుండ నేపురుషుని పాదములు వెనుకాడం జూచును ? సుందరీమణుల సమక్షమున యోధుల విక్రమ మజేయమగును. కాంతామణివచనములు వీరుల కాత్మోత్సర్గన గుప్తసందేశములు. ఆమెముఖచర్య యొందు భీరువులందైనఁ బౌరుషమును బ్రవహింపజేయును. చింతాదేవి యశస్తేజముల నల్గడలనుండి విక్రమశాలులగు శూరులనాకర్షించి సేనను గైసేసెను. ప్రాణముల లెక్కగొనని యోధపుష్పంధయములు నలుదెసలనుండి యేతెంచి యీకుసుమమున విహరింపఁ దొడఁగెను

ఈవీరులలో రత్నసింహుఁ డనురాజపుత్రయువకుఁ డొకఁడు.

చింతాదేవిసైనికు లెల్లరు కృపాణధనులు; మాటకై ప్రాణము లర్పించువారు; ఆమె సంకేతమాత్రమున నగ్గిలో దుముకువారు; ఆమెయానతియైనచో నాకస మందలి చుక్కలనైన నొక్కమారుగ నేలఁ గూల్ప సిద్ధపడువారు అందు రత్నసింహుఁడందఱిని నియమించియుండెను. చింతాదేవియు లోలోన నతనిఁ బ్రేమించుచుండెను,రత్నసింహుఁడుతక్కినయోధులవలె నుద్ధతుఁడు, వాచాటుఁడు, గర్వితుఁడునుగాఁడు. మిగిలినవారు తమతమ ఘనతలను నిరర్గళముగ నగ్గడించు కొనువారు, వారియాత్మస్తుతి కద్దులేదు. వారేమొనర్చినను చింతాదేవికిఁ బ్రదర్శించుటకే. వారిలక్ష్యము కర్తవ్యము గాదు, చింతాదేవి. కాని రత్నసింహుని వర్తనము మాత్రము ప్రశాంతముగ నుండెను. ఆత్మస్తుతిలేదు సరికదా, తాను యథార్థముగ నొకసింహమును దునిమివచ్చినను, దానిప్రసంగమైన నెత్తఁడు. అతనివినయశీలత సంకోచసీమ నతిక్రమించిపోయెను. ఇతరుల ప్రేమయందు విలాసముఁడ్రెను.

రత్నసింహుని ప్రేమ తపస్త్యాగములు విలసిల్లుచుండెను; తక్కినవారు హాయిగ నిదురించుచుండ, రత్నసింహుడు చుక్కలలెక్కబెట్టుచు, రాతిరి పుచ్చుచుండును. ప్రతియోధుడును 'చింతాదేవి నాకే లభించును; రత్నసింహుని కాశ యడుగంటి నది; కావుననే యతని కెవ్వరియెడను రాగద్వేషములులేవు' అని భావించుచుండును. చింతాదేవియెదుట వారెల్లరుఁ బలుకు ఓలుకపలుకులఁ జూచి వారివాక్చాతుర్యము నకు రత్నసింహుఁ డచ్చెరువందుచుండును. అతని నిరాశాంధకార మంతకంతకు పెరుకొనిపోవుచుండును. ఒక్కొకపుడతఁడు స్త్రీమనోరంజకములగు గుణముల నీశ్వరుఁడుతనకేల ప్రసాదింప లేదని వగచుచుండును. అతనిమనోవ్యథ యెవ్వరి కెఱుక ? అతఁడు లోలోననే వేసారి యూరకుండును. ఆడంబర మాతనిచేతఁ గాదాయె.

సగమురాత్రి దాఁటిపోయెను. చింతాదేవి తనశిబిరమున నిదురించుచుండెను. దుర్లభమగు జయముఁబడసిన వెనుక నింతభుజించి సైనికులు మైమఱచి పడి యుండిరి. ఎదుటనొక దట్టమగు నరణ్యముండెను. అరణ్యమున కవ్వలితట్టున శత్రుదళమొకటి విడిసియుండెను. చింతాదేవివారి రాక నెఱిఁగి పరుగుపరుగున నచ్చటికివచ్చి, యుదయమున వారిపై దండెత్త నిశ్చయించుకొని యుండెను. తన రాక శత్రువులకుఁ దెలియదని యామె నమ్మిక. కాని పొరపడినది. ఆమె సైన్య ములో నొకఁడు శత్రువులతోఁజేరి, యిక్కడివార్త లక్కడ కెప్పటికప్పుడందించు చుండెను. ఇఁకఁ జింతాదేవిచింత బాపుకొందమని వారొకకుట్రఁబన్నిరి. ఆమెను జాటుగ హత్యసేయుటకై ముగ్గురుబటులు బయలుదేఱిరి. ముగ్గురును ఘాతుక మృగములవలె నడుగుచప్పుడు గాకుండ నరణ్యము దాఁటివచ్చి, చెట్ల మాటున చింతాదేవిశిబిర మేదియాయని యోజించుచునిల్చిరి. సైన్యమంతయు గాఢ నిద్ర పరవశమై యుండెను. వారికిఁ దమకార్యసిద్ధియందు నుంతయు శంకలేక పోయెను. చెట్లమాటు వెలువడి వారు మువ్వురును మొసళ్లవలెఁ ప్రాఁకుచు చింతా దేవి శిబిరము వెనకు సాగిరి.

సేనయంతయు నొడలెఱుఁగక నిద్రించుచుండెను; పహరాసిపాయిలు మిక్కిలి డస్సియుండుటచే నిదుర కొరగిరి. ఒక్క వ్యక్తి మాత్రము శిబిరము వెనుక చలిచే ముడిఁగి కూర్చుండియుండెను. అతఁడు రత్నసింహుఁడు. అతనికి నేఁడిది క్రొత్తగాదు. దాడులయందాతనిరాత్రులిట్లే, చింతాదేవి శిబిరమువెనుకఁ గూరుచుండుటయందే కడచిపోవుచుండును. ఆ దుర్మార్గుల యలికిడివిని యతఁడు చటాలునఁ గత్తి తీసి నిలిచెను. చూచునరికి ముగ్గురు మనుష్యులు వంగి వంగి నడచుచు వచ్చుచుండిరి. ఇపు డేమి చేయఁదగును? అఱచినచో సైన్యమున నలజడి పుట్టి అంధకారమున నొకరినొకరు నఱకుకొని చత్తురు. ఒంటరిగ

ముగ్గురితోఁ బోరుటకా ప్రాణభయము. ఆలోచించుటకు వ్యవధిలేదు. శీఘ్రకాలమున నెదిరిగరువ మదంపఁగల సామర్థ్య మాతనికిఁ గలదు; కావున వెంటనే కత్తిదూసి యతఁడాముగ్గురపైఁ బడెను. కొన్ని నిముసములు ఖడ్గములు తాండవించెను. పిదప నంతయు సద్దణఁగెను. అట్లు వారు ముగ్గురు నిహతులై పడిపోయిరి; ఇటు రత్నసింహుఁడును గాయములు తిని స్మృతి తప్పి పడియుండెను.

ఉదయమున చింతాదేవి ఆ నలుగురు యువకుల నాస్థితియందుఁ గాంచెను. గుండె గుబేలుమనెను. చెంతకుఁ బోయి చూడ ముగ్గురు ఘాతుకులును మరణించి యుండిరి; రత్నసింహునకుమాత్ర మూపిరి యాడుచుండెను. జరిగినదంతయు గోచరించెను. నారీత్వము వీరత్వముపై విజయము నొందెను. తండ్రి మరణించు నప్పు డొక్క బాష్పబిందువైన రాలని యామె కండ్లనుండి యశ్రువుల జడివాన గురిసెను. రత్నసింహుని శిరము తనతొడపై నిడికొని, హృదయమందిరమున రచించిన స్వయంవర మండపమున నామె యాతనికంఠమున జయమాల వైచెను.

౪

ఒక్కనెలపాటు రత్నసింహుని కండ్లు విడలేదు; చింతాదేవి కండ్లు మూఁతపడలేదు. చింతాదేవి ఒక్కక్షణమైన నతని విడిచిపోవుటలేదు. తన వ్యాపారముపై దృష్టిలేదు; శత్రువులు పైఁ బడుదురేమో యను చింత లేదు. తన సకలైశ్వర్యములు నామె రత్నసింహునికై బలిదాన మొసంగెను. నెల గడచిన పిదప రత్నసింహుని కన్ను విడెను. చూచుసరికిఁ దాను మంచముపైఁ బడి యుండుటయు, నెదుట చింతాదేవి విసనకఱ్ఱ జేకొని నిలిచియుండుటయు నతనికిఁ గానవచ్చెను. నీరసమగు కంఠస్వరముతో నతఁ డిట్లనెను—

"చింతా, విసనకఱ్ఱ యిటు తే, నీకు శ్రమ—"

చింతాదేవి హృదయ మిపుడు అఖండ స్వర్గసుఖము ననుభవింపసాగెను. ఒకనెలక్రిందట నెవనివిశీర్ణ శరీరమునకుఁ దలవైపునఁ గూరుచుండి యామె నైరాశ్యమున విలపించుచుండెనో, ఆతఁడు నేఁడు మాటాడుటఁజూడ నామె సంతోషమునకు మేరలేకపోయెను. ఆమె స్నేహార్ద్రస్వరమున నిట్లనెను:-

"ప్రాణనాథా ! ఇది శ్రమయైనచో నిఁక సుఖమేది?"

'ప్రాణనాథా' యను సంబోధనమున విలక్షణమగు సమ్మోహనశక్తి యున్నది. రత్నసింహుని కన్నులు తళుక్కు మనెను; జీర్ణముద్ర ప్రదీప్తమై పోయెను; ఒక నూతన జీవనము రక్తనాళములఁ బ్రవహింపఁ జొచ్చెను. ఆ జీవన మెంత యుజ్జ్వలము! అందెంత యుత్సాహము, ఎంత మాధుర్యము, ఎంత కులుకు, ఎంతజాలి నిండియుండెను! రత్నసింహుని ప్రత్యంగము నదరజొచ్చెను. అపార పరాక్రమ మాతని భుజముల నావహించినట్లయ్యెను. జగన్నాయకత్వము

దాల్చుటకును, ఎగసి వినువీథి నందుకొనుటకును. ఉద్దండపర్వతముల భేదించి వైచుటకును అతనికి సామర్థ్య మొదవిన ట్లయ్యెను. తన కోర్కు లన్నియు నీడేరిన ట్లతనికి, బరమసంతృప్తి యొకక్షణకాలము గలిగెను. ఆక్షణమున పరమ శివుఁడే వచ్చి యెట్టయెదుట నిలిచినను, నాతఁడు చూచి, వరమేమియుఁ గోరక, మొగమటు త్రిప్పి యూరకుండి యుండును. ఎట్టిసంపదయెడను, ఏవస్తువునెడను ఇప్పుడతనికి సుంతయుఁ గాంక్ష లేదు. లోకమునఁ దన్ను మించిన సుఖియు, భాగ్యశాలియు నుండఁడని యతనికి గర్వ మొదవసాగెను.

చింతాదేవి యింకను దనమాట ముగింపలేదు; ఆప్రసంగముననే యిట్లనెను: "కాని, నిక్కముగ నావలన మీ రెంతయో బాధపడవలసివచ్చినది!"

రత్నసింహుఁడు లేవ యత్నించుచు నిట్లనెను :- "తపము లేనిదే సిద్ధి చేకూరదు."

చింతాదేవి యతనిని తన మృదుహస్తములతోఁ బరుండఁబెట్టుచు నిట్లనెను:- "ఈసిద్ధికై మీరు తపము సేయలేదు; అసత్య మేల యాడెదరు? మీరు కేవల మొకయబలను గాపాడితిరి. నాస్థానమున వేఱొకస్త్రీ యుండినను మీ రిట్లే ప్రాణ మొడ్డి రక్షించియుందురు; నా కానమ్మిక యున్నది. - మీతో నిజము చెప్పు చున్నాను. నేనాజన్మాంతము బ్రహ్మచారిణినై యుండెదనని ప్రతిన గైకొని యుంటిని; కాని మీయాత్మోత్సర్గము నాప్రతిజ్ఞను విఱిచివైచినది. నేను వీరుల యొడులలోఁ బెరిగినదానను; ఏపురుషవతంసుఁడు తన ప్రాణములతోఁ బోరఁ గల్గునో యాతని చరణములనే నాహృదయకుసుమ మర్పించును. రసికుల హాస విలాసములకును, లంపటుల రూపరేఖలకును, మల్లుల కుస్తీపేచీలకును నా దృష్టియం దింతయు విలువ లేదు. వారియభినయవిద్య నొకవినోదముగాఁ గాంచు చుందును. మీ హృదయముననే నేను సత్యమగు నాత్మార్పణము గాంచి, దాసి నయిపోతిని, నేఁటినుండియే కాదు. చాలదినములనుండి."

❧

మొట్టమొదటి ప్రణయరాత్రి. ఎటఁ జూచిన నిశ్శబ్దము. ప్రేమికు లిరువురి హృదయములందును గోర్కులు తరఁగలు వేయుచుండెను. నలుదెసలఁ జెలిమి కలుముల వెన్నెల చిమ్ముకొని యుండెను. దాని నలువెలుంగులయందు వధూ వరులు ప్రణయాలాపము లాడుకొనుచుండిరి.

అప్పుడే వార్త వచ్చెను శత్రుదళ మొకటి దుర్గము దెసకు విజృంభించి వచ్చుచున్నదని. చింతాదేవి ఉలికి పడెను; రత్నసింహుఁడు నిశ్చేష్టుఁడై నిలిచి పోయెను, పిదప నతఁడు మేకున వ్రేలాడుచున్న ఖడ్గము నందుకొనెను.

చింతాదేవి కాతరదృష్టితో నతనివంకఁ జూచి "కొందఱు మనుష్యులఁ బంపుఁ దచటికి; మీరు పోనేల?" యనెను.

రత్నసింహుఁడు తుపాకి బుజానఁ బెట్టికొనుచు నిట్లనెను :-

"ఈసారి పెక్కుమంది వత్తురేమో యని శంకించుచున్నాను."

చింతా :- "అట్లయిన నేనుగూడ వచ్చెదను."

రత్న :- "వలదు, వారు నిలువజాలరని నాకు ధైర్యమున్నది. ఒక్క ధాటితో వారి నెత్తిపాఱవైచెదను. మన ప్రణయరాత్రి విజయరాత్రియగుట పరమేశ్వరుని యిచ్ఛ."

చింతా :- "ఏమోకాని, మనసు కలతఁజెందుచున్నది. పోనిచ్చుటకు ప్రాణ మొప్పుట లేదు."

రత్నసింహుఁ డీకోమల మగు ప్రేమానురోధమునఁ గరగిపోయి, చింతాదేవిని గౌఁగిలించుకొని "ఉదయమగుసరికి మఱలివచ్చెదను ప్రియా!" అనెను.

చింతాదేవి మగని కంఠమున బాహువు లిడి, కన్నుల నీరు నిండ నిట్లనెను—"మీరు చాలదినములకుగాని రారని భయమగుచున్నది. నామనస్సంతయు మీమీఁద నుండును—చనుఁడు—అనుదినము వార్తమాత్ర మంపుచుండవలయును. ఒకటి: మిమ్ము బతిమాలెదను, అవసరము కనిపట్టియె దాడి సలుపుచుండుఁడు సుండీ; శత్రువులఁ జూచుటతోడనే మైమఱచి మీఁదఁబడుట మీకలవాటు. అవసర మెఱిఁగి వర్తింపుఁడని మాత్రమే నే వేఁడునది దయసేయుఁడు ఎట్లేగుచున్నారో అట్లే తిరిగిరండు!"

చింతాదేవిహృదయము భయవిహ్వల మగుచుండెను. అందుఁ దొల్లి విజయ కాంక్ష మాత్రమే యధివసించుచుండెడిది; నేఁ డందు భోగలాలస ప్రధానత వహించెను. సింగమువలె గర్జించి శత్రుహృదయముల గడగడ వడఁకించివైచిన యా వీరబాల నేఁ డెంత దుర్బలయయ్యెను. రత్నసింహుఁడు గుఱ్ఱ మెక్కుసరికి ఆమె యతని క్షేమమునకై లోలోన దేవికి మ్రొక్కుకొనఁదొడఁగెను. దూరమున చెట్లయందు దతఁడు మఱుఁగుపడువఱకు నామె యాతనిఁ జూచుచుండి, పిదప దుర్గమందలి బురుజులన్నిటిలోఁ బెద్దదాని నెక్కి గంటలకొలఁది అట్లే ఆ దెసకుఁ దేఱిచూచుచు నుండిపోయెను. అక్కడ నేమియులేదు; పర్వతము లప్పుడే రత్నసిహుని దాచివైచినవి. చింతాదేవికి మాత్ర మాతఁ డెదురుగాఁ బోవుచున్నట్లే తోఁచుచుండెను.

ఉషఃకాలపు టరుణకాంతి చెట్లలోనుండి తొంగిచూడ మొదలిడెను: ఇప్పటికి చింతాదేవి మోహవిస్మృతి వదలెను; అంతయు శూన్యమని తెలిసెను. ఏడ్చుచు బురుజు దిగి సెజ్జపై ముగము కప్పుకొని యామె రోదనము మొదలిడెను,

౬

రత్నసింహునితో వందమందియైన నుండిరో, లేదో కాని ఉన్నవారందఱు నుత్సాహభరితులు; ఎట్టి సమయమైన, ఎంద ఱెదుర్కొనిన సరకు సేయనివారు; తమ ప్రాణములకు శత్రువులు. ఉల్లాసభరితులై వారొక వీరరసపూరితమగు గీతమును బాడుకొనుచు స్వారిచేయుచుండిరి.

వీరవేషము వేసినారలు
గౌరవము నిలుపుఁడు సిపాయిలు !
వైరమును మదిఁ బదనువెట్టుఁడు
వ్యర్థములు శస్త్రాస్త్రముల్.

ఈ వీరనాదములతోఁ బర్వతములు ప్రతిధ్వనించిపోయెను. అశ్వముల పదఘట్టనములు తాళము వేసెను. రాత్రిగడచిపోయెను. సూర్యుఁడు తనయరుణ నేత్రముల దెఱచి యా వీరులపైఁ దనస్వర్ణకాంతి వర్షింపఁదొడగెను.

సూర్యప్రకాశమున దగ్గఱనే యొకకొండపై శత్రుశిబిరము కానవచ్చెను.

రత్నసింహుఁడు తలవంచెను; విరహవ్యాకులమగు హృదయము నడచి కొనెను; మందగతిని బోవుచుండెను. అడుగు ముందుకు సాగుచుండెను. కాని మనసు వెనుకకు లాగుచుండెను. పుట్టిన యిన్నాళ్ళకు చెడుతలంపు లతనికి వెఱపు గొలుపసాగెను. యుద్ధమునఁ బర్యవసాన మేమగునో, యెవరు చెప్పగలరు ? తాను విడిచివచ్చిన ఆ యమేయస్వర్గసౌఖ్యస్మృతులు ఉండియుండి యతని మనమును పిండివైచుచుండెను. చింతాదేవి సజలనయనములు జ్ఞప్తికివచ్చి, గుఱ్ఱమును వెనుకకు మఱలుతునా యనుకోర్కి పుట్టుచుండెను. సమరోత్సాహ మంతకంతకు తఱఁగిపోవుచుండెను. అప్పుడొక సిపాయి సమీపించి యిట్లనెను:—

"అయ్యా ! చూడుఁ డాకొండపై శత్రువులు విడిసియున్నారు. ఇపుడు మీ యభిప్రాయమేమి ? తక్షణము దండెత్తుటయే మా కోరిక. నిదురించుచున్నారు. కావున వెంటనే పాఱిపోవుదురు జాగుచేసినచో వారును సన్నద్ధు లగుదురు; పదను చెడిపోవును. వేయిమందికి తక్కువ యుండరు."

రత్నసింహుఁడు చింతాక్రాంతుఁడై శత్రుశిబిరమువంక చూచి, "సరే, బాగున్నది" అనెను.

సిపాయి :—"దండెత్తుటయే యందురా ?"

రత్న :—"మీ యిష్టము, చాలమందియున్నారు; ఇది యాలోచింపుఁడు."

సిపాయి :—"భయము లేదు. ఇంతకంటె గొప్పసేనల తఱిమినారము."

రత్న :—"నిజమే; కాని తొందరపడి అగ్నిలో దుముకుట మంచిదికాదు."

సిపాయి :- "ఏమంటిరి! యోధులజీవనమే అగ్నిలో దుముకుటకు. మీ ఆజ్ఞతరవు; ఆపై మామగఁటిమి చూతురుగానీ !"

రత్న :- "చాల బడలియున్నాము. కొంచెముసేపు విశ్రమించిన బాగుండును."

సిపాయి :- "వలదు; మన జాడ తెలిసినచో వారింక దారిఁ బట్టుదురు."

రత్న :- "అట్లయిన దాడియె సలుపుఁడు."

ఒక్క క్షణములో యోధులు గుఱ్ఱముల దౌడాయించి, ఈఁటెల సవరించి కొని, శత్రుదళముపైఁ బడ నేఁగిరి, కాని కొండ యెక్కుసరికి శత్రుసేన అప్రమత్తయై యున్నదని వీరికి విదితమయ్యెను. వీరి తలంపే ప్రమాదము. శత్రువులు మేల్కొని యుండుటే కాక దుర్గముపై దాడి వెడలుటకు సన్నద్ధు లగుచుండిరి. వారెదురుగ వచ్చుచుండుట గాంచుసరికి తప్పు తెలిసినది, కాని యిఁక నప్పు డెదుర్కొనక వేఱుపాయము లేకుండెను. రత్న సింహుని విషయమున నెవ్వరికిని సంశయము లేకుండెను ఇంతకన్న విషమతరతరుణములందు సయితము తన పరాక్రమాతిశయముచే జయలక్ష్మిని జూఱకొన్న రత్న సింహుఁడు నేఁడు తన లక్షణము చూపకుండునా? నేత్రములన్నియు రత్న సింహుని వెదకసాగెను; కాని యెక్కడ నతని జాడ లేదు. ఎక్కడకుఁ బోయెనో యెవ్వరికిని దెలియదు.

'అతఁ డెచ్చటికిఁ బోఁగలఁడు? తన సహచరుల నీయవస్థయందు విడిచి యతఁ డెచ్చటికిఁ బోఁగలఁడు? అసంభవము. తప్పక యిచ్చటనే యున్నాఁడు. జయోపాయము లాలోచించుచున్నాఁడు.'

క్షణములో శత్రువు లెదురుపడిరి. అంత సేన యెదుట ఈ కొలఁదిమంది యేమి చేయఁగలరు? అందఱును రత్న సింహునిఁ బిలుచుటయే: 'ఎక్కడ కేఁగితివి? మా కేమి యానతి? వారప్పుడే వచ్చిపడిరి; నీ వింక నూరకుండు టేల? మాకు మార్గముఁ జూపుము! మా యుత్సాహము పెంపొందింపుము;' అని.

ఇప్పటికిని రత్న సింహుఁ డగపడలేదు. తుదకు శత్రువులు మీఁదకు వచ్చిరి. యుద్ధ మారంభమాయెను. బుందేలులు ప్రాణము లఱచేతఁ బట్టికొని పోర మొదలిడిరి. ఒక్కని కొక్కఁడే భారమై యుండ, నొక్కఁడు పదిమందితోఁ బోరు టెక్కడ? అది యుద్ధము గాదు ప్రాణముల జూదము. బుందేలులకు నిరాశ ప్రబలిపోయెను. వారు కసిగా పోరాడిరి; వెనుకంజ వేయ లేదు. వారిలో నిఁక సుంతయైనను సమ్మేళనము లేకపోయెను. ఎవ్వరిమట్టునకువారు సాధ్యమయినంత ముందునకుఁ బోవుచుండిరి. పర్యవసాన మేమగునని యెవ్వరికిని చింత లేదు. ఒకఁడు శత్రుపఙ్క్తులఁ జీల్చుకొనుచు సేనాపతి దండ కరిగెను. వేఱొకఁడతని

యేనుఁగుపై నెక్కఁబోవుచు వ్రేటుదిని కూలెను. వాని యసాధారణ సాహసమునకు శత్రువులు గూడ 'సౌరా' యనుచుఁడిరి.

ఆ వీరులు కీర్తి గడించిరి కాని జయము గడింప లేదు ఒక్క గంటలో రంగస్థలమున తెర జారెను. వినోదము సమాప్తమయ్యెను. పెద్ద తుపాను వచ్చినది; వృక్షములను పెకలించుకొనుచుఁ బోయినది. సమ్మేళన ముండినచో ఈ కొలఁదిమందియే శత్రువుల నురుమాడుటకు చాలియుందురు. కాని సమ్మేళన సూత్రధారుఁడు జాడలేఁడయ్యెను.

జయించిన మరాఠులు ప్రతి శవమును శ్రద్ధతోఁ జూచిరి. రత్న సింహుఁ డనిన, వారికి గన్నెఱ్ఱ. వారి గుఱి యంతయు వానిమీఁదనే యుండెను. రత్న సింహుఁడు బ్రదికి యుండ వారికి నిద్రపట్టదు. వారు పర్వతో పలము లన్నియు గాలించివైచిరి. కాని రత్న ప్రాప్తికాలేదు. జయము చిక్కినది. కాని యసమగ్రము.

౭

చింతాదేవి హృదయమున నేఁ, డేమో కాని, వివిధ సందేహము లుప్పతిల్లి సాగెను. ఆమె యెన్నఁడు నింత దుర్బల కాలేదు. బుందేలుల కపజయ మేల కలుగునో యామె కారణము చెప్పఁ జాలదు కాని, ఆ భావము మాత్ర మామె వికల మానసమును పీడదాయెను. ప్రేమానుభవమున కామెకు రేఖ యుండినచో, చిన్నతనముననే తల్లి మరణించునా! తండ్రితో నడవులన్నియుఁ దిరుగవలసి వచ్చునా! గుహలయందును లోయలయందును వసింప వలసివచ్చునా! ఆ శరణ్యము మాత్ర మెంత కాలము:- తండ్రియు నామెను దిగవిడిచి యేఁగెను. అప్పటి నుండియు నొక్కదినమైన నామె సుఖముగఁ గూర్చుండలేదు.

ఆమె దుర్బల హృదయమున నిపు డొక విచిత్ర భావ ముప్పతిల్లెను. పరమేశ్వరుఁ డామె మనోహరుని సురక్షితముగ నిలుపేర్చినచో, నాతనిఁ గొం పోయి యేదేనొక దూరగ్రామమున బసచేసి, పతిదేవుని యారాధమున జీవనము సార్థక మొనరించుకొన నెంచెను; ఈ యుద్ధమునకు స్వస్తి చెప్పనెంచెను. నారీభావ మామె యందు నేఁడే జాగృత మయ్యెను.

సంధ్యాకాల మాయెను సూర్యుడొక పరాజిత యోధునివలెఁ దలవంచి యేదేనొక మాటుకొఱకు వెదకు చుండెను. రిక్తహస్తముల తోడను, శూన్య పాదముల తోడను నిరాయుధుఁడగు యోధుఁడొకఁడామెయెదుటికి వచ్చి నిలిచెను. చింతాదేవికి పిడుగు పడినట్లయ్యెను. ఒక క్షణమట్లే కూర్చుండెను. పిదప లేచి, వ్యగ్రుఁడగు సిపాయి యొద్దకు వచ్చి ఆత్రముతో:

~~"ఎవరెవరు మిగిలిరి?" అని యడిగెను.~~

"ఎవ్వరును మిగుల లేదు." అని సిపాయి చెప్పెను.

"ఎవ్వరును మిగుల లేదు ! ఎవ్వరును మిగుల లేదు!!"

చింత తలపట్టుకొని నేలపైఁ గూలఁబడెను. సైనికుఁడు మరల నిట్లనెను:—"మరాతులు సమీపించినారు."

"సమీపించినారా!!"

"మిక్కిలి సమీపించినారు!"

"అయిన త్వరగా చితిపేర్పుఁడు! వ్యవధిలేదు"

"ఇంకను మేమున్నాము గదా, వారి ప్రాణములఁ దీయుటకు!"

"అది మీ యిష్టము. నాకర్తవ్యమున కిదే సమాప్తి."

"దుర్గము మూసి నెలలతరబడి పోరాడగలము మేము!"

"అట్లయిన పోయి పోరాడుఁడు. నేనెవ్వరితోడను పోరాడనక్కరలేదు"

ఒక దెసనుండి యంధకారము వెలుఁగును ద్రొక్కుకొనుచు వచ్చుచుండెను. వేరొక దెసనుండి మరాతులు తరంగాయితములగు చేలను ద్రొక్కుకొనుచు వచ్చుచుండిరి. దుర్గమున చితి సిద్ధమగు చుండెను. దీపములతోపాటు చితియు వెలిఁగెను. సమస్తాలంకారములు సింగారించుకొని చింతాసతి అసాధారణ శోభల వెదజల్లుచు ప్రసన్నవదనముతో, అగ్నిమార్గమున పతిలోకయాత్ర సలుపుటకై పోవుచుండెను.

౮

చితి చుట్టును స్త్రీపురుషు లెల్లరు కూడిరి. శత్రువులు దుర్గముచుట్టు ముట్టినను, ఎవ్వరికి నాగొడవ లేదు. దుఃఖ పరితాపములచే నెల్లరి ముఖములును వ్యాకులతతో నవనతములై యుండెను. నిన్న నీయంగణముననే కళ్యాణ మంటపముకై సేయఁబడెను. ఇపుడు చితి పేర్చిన చోటనే నిన్నను హోమకుండ ముండెను. నిన్ననుగూడ నిట్లే యగ్ని శిఖ లెగయు చుండెను. ఇట్లే జనులు గుమిగూడి యుండిరి. కాని నేఁటి దృశ్యమునకును నిన్నటి దృశ్యమునకును నెంత యంతరమున్నది! ఔను, స్థూల నేత్రముల కంతరము గన్పడును; కాని వాస్తవమున నిది ఆయజ్ఞమునకే పూర్ణాహుతి; ఆప్రతిజ్ఞకే నిర్వహణము.

గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినవచ్చెను; దాన నెవ్వఁడో యొక సిపాయి వేగముగ స్వారిచేయుచు వచ్చుచుండుట తెలియ వచ్చెను. క్షణములో ధ్వని విరమించెను. ఒక సైనికుఁడు పరుగు పరుగున నంగణము లోనికి వచ్చెను. అందఱు నాశ్చర్యమునఁ జూచిరి,— అతఁడు రత్నసింహుఁడు!

రత్న సింహుఁడు చితి కడకుఁబోయి వగర్చుకొనుచు నిట్లనెను.

"ప్రియా! నేనింకను బ్రదికియే యున్నాను! ఇదేమి పని!"

చితి యప్పుడే వెలుఁగు చుండెను! చింతాదేవి చెఱఁగు పొడుగునను జ్వాల వచ్చుచుండెను. రత్న సింహుఁ డున్మత్తుని వలెఁ జితిలోఁ జొరఁబడి, చింతాదేవి చేయిపట్టుకొని లేవఁ దీయఁ బోయెను. అందరు నన్నివైపులనుండి చితిలోని కాష్ఠములు లాగివేయ మొదలిడిరి. చింతాదేవి మాత్రము పతివైపు కన్నెత్తి చూడనైన లేదు. తప్పుకొమ్మని చేతితో సంజ్ఞ చేసెను.

రత్నసింహుఁడు నెత్తిమొత్తుకుని యిట్లనెను:— "హా ప్రియా! ఇదియేమి? నావైపు చూడవేమి? నేను జీవించి యున్నాను!"

"నీ పేరు రత్నసింహుఁడే. కాని నీవు నా రత్నసింహుఁడవు కావు" అని చితిలోనుండి ధ్వనివచ్చెను.

"నావైపు చూడుము; నీదాసుఁడను, నీయుపాసకుఁడను, నీపతిని నేనే సుమా!"

"నా పతిని వీరస్వర్గము నొందినాఁడు"

ఆహా? ఎట్లు నచ్చఁజెప్పను! "ఓ మహాజనులారా, యెట్లయిన నగ్ని నార్పుఁడు. ప్రియా, నేనే రత్నసింహుఁడను! గుర్తించుట లేదా?"

అగ్ని జ్వాల చింతాదేవి ముఖమున కంట నెక్కివచ్చెను. అగ్నియందుఁ గమలము వికసించెను! చింతాదేవి స్పష్టముగ నిట్లు చెప్పెను:—

"చక్కఁగ గుర్తించు చున్నాను; నీవు నా రత్నసింహుఁడవు కావు. నా రత్నసింహుఁడు వాస్తవిక వీరుఁడు! తుచ్ఛదేహము రక్షించు కొనుటకై యిట్లు క్షత్రియ ధర్మమును బరిత్యజింపఁడు, ఏపురుషునికి నేను చరణదాసినైతినో యాతఁడు దేవలోకమున భాసిల్లుచున్నాఁడు! రత్నసింహు నపకీర్తి పాలుసేయకుము. అతఁడు వీరరాజపుత్రుఁడు; రణక్షేత్రము నుండి పాఱిపోవు భీరుఁడు కాఁడు."

తుదిమాట ముగియుట తోడనే యగ్ని శిఖ చింతా శిఖ నధిష్ఠించెను. ఆ నిరుపమ సౌందర్యరాశి, ఆ ఆదర్శ వీరత్వము నుపాసించుసతీమణి క్షణములో నగ్ని రాశియందు లీనమైపోయెను.

హతబుద్ధియై రత్నసింహుఁ డీదుఃఖమయ దృశ్యము నీక్షించుచు నూరక నిలిచిపోయెను. పిదప, నొక పెద్ద నిట్టూర్పు పుచ్చి, హఠాత్తుగ నాచితి యందే దుమికెను.

భారతి 1928 ఏప్రియల్

# కొంపెల్ల కవితల్లోకి వెళ్ళేముందు....

## డా॥ కె. కె. రంగనాథాచార్యులు

ఆత్మాశ్రయ ప్రధానమైన ఊహాత్మక భావ కవిత్వం నవ్యకవిత్వంగా తెలుగుసాహిత్య ప్రపంచాన్ని ఏలుతున్న కాలంలో కొంపెల్ల జనార్దనరావు కవిత్వం రాశాడు. 1906లో పుట్టి 1937 జూన్‌లో ముగిసిన ముప్పయ్యొకటేళ్ళ పరిమిత జీవితంలో చివరిశ్వాసవరకు సాహిత్యోపజీవిగా గడిపిన జనార్దనరావు కవితలు చాలా పరిమిత సంఖ్యలోనే లభిస్తున్నాయి. సమగ్రమైన సామాజిక దృక్పథంతో 1910లో గురజాడతో ప్రారంభమైన ఆధునిక కవిత్వం నవ్యకవిత్వం పేరుతో భావకవితగా దాదాపు 1938 వరకు తెలుగు కవితాలోకాన్ని ఆవరించింది.

పెద్దెనిమిదవ శతాబ్దం చివర ఐరోపాలో ప్రారంభమైన కాల్పనిక కవిత్వం సుమారు నూటపది సంవత్సరాల తరువాతగాని తెలుగుసాహిత్యంలో ప్రతిధ్వనించ లేదు. ప్రణయం, విరహం, ప్రకృతి తన్మయత్వం, స్వేచ్ఛాగానం మొదలైన భావాలు ఊపిరిగా బతికిన భావకవిత్వంలో దేశభక్తి గీతాలు, ప్రశంసా గీతాలు, స్మృతి గీతాలు కూడా చోటుచేసుకున్నాయి. పునరుద్ధరణ ధోరణులుకూడా ఇదే కాలంలో బలపడ్డాయి. పునరుద్ధరణ ధోరణులు తప్ప తక్కినవన్నీ కొంత కొంత కొంపెల్ల కవిత్వంలో కనిపిస్తాయి. అనిర్వాచ్యమనోదశలలోని అనంతానంత ఛాయలను స్ఫుటాస్ఫుటంగా లలితశబ్ద చిత్రాలలో పొదగటం, పదాలకు రంగు, రుచి, వాసనలను సమకూర్చటం భావకవుల లక్షణం అనుకుంటే ఇవన్నీ జనార్దనరావు రాసిన పరిమితమైన ఖండికలలో కొంతమేరకైనా కనిపిస్తాయి.

శ్రీశ్రీ ఆవాహనం చేసి తన 'మహాప్రస్థా'నాన్ని అందించినవాడుగా కొంపెల్ల జనార్దనరావు చాలామందికి తెలుసు. శ్రీశ్రీ సాహిత్యజీవితం జనార్దన రావు జీవించి ఉన్నంతవరకు ఆయనతోనే పెనవేసుకొని పోయింది. అయితే శ్రీశ్రీ అభ్యుదయ కవితా ప్రస్థానం సాగిస్తున్న రోజులలో కూడా కొంపెల్ల భావకవితా మార్గంలోనే నడిచాడు. జనార్దనరావు కమ్యూనిజాన్ని హర్షించలేదుగాని అర్థంచేసు కోగలడని అంటాడు శ్రీశ్రీ. ఛాందసాలను అవహేళన చేస్తూ విశాల దృక్పథాన్ని ఆహ్వానించే ఉదారత మాత్రం ఉంది కొంపెల్లలో. తన పరిమితులలో ఆయన తనసాహిత్య పోరాటాన్ని సాగించాడు. అందుకే శ్రీశ్రీ జనార్దనరావుకోసం రాసిన

కవితలో 'నిన్న వదలిన పోరాటం, నేడు అందుకొనకతప్పదు' అంటాడు. పోరాటాన్ని అందుకొని శ్రీశ్రీ ముందుకు నడుస్తున్న తరుణంలో జనార్దనరావు జీవితం ముగిసింది. 'సాహిత్యమే సమస్తమూ అనుకొని, ఆకలి, నిద్రాలేక, ఎక్కడ ఉన్నామో, ఎక్కడకు పోతామో తెలియక, ఆవేశంతో' గడచిన శ్రీశ్రీ, కొంపెల్లల సాహిత్య స్నేహంకూడా ముగిసింది. జనార్దనరావు, ఇతర సాహితీమిత్రులతో చెన్నపట్టణం వీధులలో విశ్వసాహిత్యపు సరిగమపదనిసలు సవరించామని చెప్పుకున్నాడు శ్రీశ్రీ. ఈ సరిగమపదనిసలు కొంపెల్ల కవిత్వంలో దర్శనమిస్తాయి.

నిజానికి కవిగాకన్న విమర్శకుడుగా, సాహిత్యపరిజ్ఞాతగా, పత్రికాసంపాదకుడుగా, సాహిత్యసదస్సుల నిర్వాహకుడుగా, కవులను, రచయితలను ప్రోత్సహించినవాడుగా సాహిత్యలోకంలో కొంపెల్ల జనార్దనరావు స్థానం ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తుంది. 'ఎప్పటికప్పుడే జ్ఞానసంపదను పెంచుకొంటూ అతడు సారస్వతరంగంలో అనన్య సామాన్యమైన స్థానానికి చేయిచాచాడు విమర్శకుడుగా జనార్దనరావుది మహోన్నతస్థానం. ఆధునిక వాఙ్మయం సరిగా. అర్థంచేసుకొన్న కొద్దిమందిలో ముఖ్యుడు. 'నవీన సాహిత్యరీతులకు రుచివంతమైన అధ్యయనాలను చూపించడానికి సమర్థుడు' అన్న శ్రీశ్రీ మాటలు జనార్దనరావుకున్న సాహిత్య పరిజ్ఞానాన్ని, అధ్యయనాన్ని గురించి చెప్తాయి.

శ్రీశ్రీకి జనార్దనరావుతో పరిచయం 'ప్రభవ'కు ఆయనరాసిన సమీక్షతో. దేవులపల్లి కృష్ణశాస్త్రి మొదలైనవారి ప్రభావంతో 1927లో భావకవిగా దర్శనమిచ్చిన శ్రీశ్రీ 1928 ఏప్రిల్‌లో కవితాసమితి పక్షాన 'ప్రభవ' కవితా సంకలనాన్ని వెలువరించాడు అప్పుడు భారతిలో ఉపసంపాదకుడుగా పనిచేస్తున్న జనార్దనరావు 1928లో దానికి సమీక్ష రాశాడు శ్రీశ్రీని కవిగా ఆవాహనచేస్తూనే, ప్రకృతి తత్త్వాన్వేషకుడుగా ప్రశంసిస్తూనే, స్వేచ్ఛాభావాలకు వీవుచరుస్తూనే ఆయనకు దీర్ఘసంస్కృత సమాస విన్యాసంమీద ఉన్న మోజును విమర్శించాడు. తెలుగు తీయదనాలను వదలిన సంస్కృత పదఘటనా చాపల్యాన్ని ఎత్తిచూపాడు. ఆడంబర రచనా సంవిధానం మీద ఉన్న మమకారాన్ని వదులుకోవాలన్నాడు. అందుకే 'ప్రభవ' కవితాఖండికల రచనాకాలకలో శ్రీశ్రీలో కనిపించే 'అనూన భయప్రదాన శరభవేదండ భల్లూక హరి సమూహ ఘోర ఘోషాతిఘోర నిర్ఘోష పాటితాఖిల జనశ్రవణ పుటము', 'అస్మదీయ ప్రఫుల్ల హృదంతరాళ సంస్థిత పవిత్రతర భావసముదయ ప్రదర్శనోత్సుకమతి' వంటి దీర్ఘసమాసాల ప్రచండఘోషలు, శబ్దాడంబరం పరిమితంగానే కవిత్వంరాసిన కొంపెల్ల జనార్దనరావులో కనిపించవు. రాసిన కొద్దిపాటి కవితా నిరాడంబరంగా, సరళంగా, మృదుమధుర శబ్దశయ్యతో

అలరారుతుంటుంది. 'ప్రభవ' సమీక్షలో కొంపెల్లకు కవిత్వాన్ని గురించి ఉన్న దృక్పథం తెలుస్తుంది.

కొంపెల్ల కవితా ఖండికలు సంకలనంగా రాలేదు. భారతి, ఉదయిని మొదలైన పత్రికంలో 1926 వ సంవత్సరం మొదలుకొని ఆయన మరణించిన కాలం వరకు అవి దొరుకుతున్నాయి. ప్రకృతిగానం, తన్మయత్వం, ఆదర్శాలకై ఆవేదన, స్వేచ్ఛా భావాలు, ప్రణయం, హృదయార్పణం మొదలైన భావాలతోపాటు ప్రశంసాగీతాలు, స్నేహగీతాలు కొంపెల్ల కవితా ఖండికలలో ఉన్నాయి. ప్రకృతి పరిశీలన, సౌందర్య కాంక్ష, స్వేచ్ఛా ప్రియత్వం, అనుభూతి పారవశ్యం మొదలైన సుకుమార భావాలు ఆయన కవితా మర్మాలు. తెలుగులో భావ కవుల ప్రత్యేకత అయిన భాషలో, శయ్యలో, సౌకుమార్యం, మృదు మధుర పద బంధాలు, పద లాలిత్యం కొంపెల్ల కవిత్వంలోనూ కనిపిస్తాయి. మృదులతరు లతారవము, కలిత వాహినీ జలతరంగస్వనంబు, అంబరాంగన, దయాశీకరాసారము, మాధురీప్లుత నైరాశ్యమయ విలక్షణస్మృతులు, ఆర్ద్రిమోహన సురభి లతాంతిచయము, పరమ భక్తి పరిప్లుత భావచయము, హిమశీకర సంతతి, కన్నె తనంపుమై గగురుపాటు, ఆత్మ సమ్రాడభి దర్శనంబు వంటి కోమల పద బంధాలు ఆయన కవితలలో అడుగడుగునా కనిపిస్తాయి. అన్వేషణ, అనంతత, ఆవాహన, తన్మయత, నిశ్చలత, నిర్మలత, భక్తి, నైరాశ్యం, జాలి, అశ్రులు, వియోగ గీతికలు ఇవి జనార్దనరావు కవిత్వానికి ఊపిరిగా ప్రతిపాదంలో తొంగి చూస్తుంటాయి. తన కవితా రూపంగా తేట గీతులను ఎక్కువగా వాడాడు కొంపెల్ల. ఉత్పలమాల, చంపకమాల మొదలైన వృత్తాలూ ఉన్నాయి. కొన్ని కవితలు మాత్రం ఛందస్సులోనూ నడిచాయి. భావ కవులు, తరువాత అభ్యుదయ కవులు ఉపయోగించిన ముత్యాల సరాలను మాత్రం ఆయన ఉపయోగించు కున్నట్లు లేదు.

కొంపెల్ల జనార్దనరావు ఎక్కువ కవితలలో కనిపించే వస్తువు ప్రకృతి, ప్రకృతి తన్మయత్వం, ప్రకృతిలాస్యం. 'తన్మయత' అన్న కవితలో

గానము విపంచికను మీటెఁ గమల
సౌరభంబులుద్యాన సుమ సౌరభములఁ గలసె,
కలిత వాహినీ జల తరంగ స్వనంబు
మృదుల తరులతా రవముతో మేళవించె

అని ప్రారంభించి విశ్వంలోని సమస్తమూ ఐక్యమైన విధానాన్ని ఇలా వర్ణిస్తాడు.

అన్ని గానంబులైక్యమై యలరసాగె
నెల్ల భావాలు లీనమై యసఁగఁ గడఁగె
విశ్వమంతయు నవశమై వెలయుచుండె.
మానసంబున కాత్మ సంధాన మొదవె

మరోచోట ప్రకృతితో, 'సతత నూతన మృదు విలాస ప్రభూత లావక మనోజ్ఞ లాస్య సందర్శనమున' తన భావాలు, 'ఆనంద తన్మయత్వమున మునిగి' 'మధుర గానమ్ము' సలిపిందని అంటాడు. 'క్షణంలో దుఃఖచయ మెల్ల సమసిపోయె'నని కూడా అంటాడు కవి. ప్రకృతి తాదాత్మ్య భావనలో కవి ఆత్మాశ్రయ లక్షణాలుకూడా ఇందులో కనిపిస్తాయి.

'కొన్నాళ్ళకు' అన్న ఖండికలో జాలి, నైరాశ్యం, అశ్రువులు దర్శనమిస్తాయి.

ఎంత జాలియౌరాగాలో యివి ! అపార
మాధురీ ప్లుత నైరాశ్యమయ విలక్ష
ణస్మృతులఁ బాడుచున్నవి నా ప్రయత్న
ములను కుంఠీకరించి, అశ్రులకు మ్రొక్కి'

పని తీరిపోయిన తరువాత ఒడ్డు మీద పడవేసిన దోనెను గురించి కొంపెల్ల రాసిన 'ఉపేక్షితము' అన్న ఖండిక ఆయన కవితలలో విలక్షణమైంది....

ఒక ముసలి దోనె యిది, పడియున్నదిచట
ఊడిగము సేఁత సత్తువ లుడిగియుడిగి;
తనకుఁ దామృత స్మృతులు కల్పనము సేసి
కొనుచు, తనపయిఁ దాజాలిగొనుచు నిట్లు

అఖిల జనక వాత్సల్య సహార్థియగుట
తలఁపఁడు, స్వకీయ సౌఖ్య సంధాయియగుటె
అరయఁడునరుండ - కాట్టి కాన్నాఁడు, తరువు
నటకి, కంకాళమయమొక నావ తనకు.

చెన్నపట్టణంలో శ్రీశ్రీ, జనార్దనరావు మల్లంపల్లి సోమశేఖరశర్మ ఇంట్లో ఎంతోమంది కవులను కలుసుకుంటూ ఉండేవారు. యువ కవులను సోమశేఖరశర్మ ప్రోత్సహిస్తూ ఉండేవాడు. అందుకే 'వ్రాయుము వ్రాయుమంచు మధుర ప్రణ

యామృత వాహినీ తరంగాయితమైన' హృదయంగల శర్మగారి పేరిట 'సుధా జ్వాల' అన్న ఖండిక రాశాడు కొంపెల్ల. ప్రణయి కోటులకు ప్రణయ పావన కథా విధి దెసలు మసలి ఆరని ఆశ మెఱయించిన' బ్రౌనింగ్ మహాకవిని గురించి, తనకు కొంపెల్లను తనను ముడివేసిన భావా లోకాన్ని ప్రసాదించిన రవీంద్రుడి గురించి కొంపెల్ల కవితలు రాశాడు. 'నాపదము' 'సృష్టి' 'బామిక' మొదలైనవి ఆయన ఇతర కవితా ఖండికలు. 'రిక్తలైన, యత్నములు సలుప కోరికలులోఁ దరంగించుకొని, పరాధీనతను సహించిన తన పదమును గురించి, సృష్టిని గురించి ఆయన కవితలు రాశాడు. 'తలపుగా తడవి తడవి' తన బ్రతుకును గురించి చెప్పుకొనే 'బామిక'ను గురించి కవిత చెప్పాడు.

తన కవిత్వం మరింత వైవిధ్యాన్ని సంతరించుకొని, ఉన్నత శిఖరాలను చేరుకోవలసిన దశలో పిన్నవయస్సులోనే చాలించిన భౌతిక జీవితంతో పాటు కొంపెల్ల కవితా జీవితమూ ఆగిపోయింది. శ్రీశ్రీ చెప్పినట్లు "జనార్దనరావు మరణంతో తెలుగు సాహిత్యానికి హేమంతం ప్రాప్తించింది."

# కవితలు

## తన్మయత

గానము విపంచికనుమీటెఁ, గమలసౌర
భంబు లుద్యానసుమసౌరభములఁ గలసె.
కలితవాహినీ జలతరంగస్వనంబు
మృదుల తరులతారవముతో మేళవించె.

అంబరాంగన ప్రకృతియద్దంబులందు
నందమును జూచుకొని ప్రీతినొందుచుండె
సుందర పయోజమందిరమందుఁదేఁటి
మధురమధుపానమున మేను మఱచి యుండె.

క్షణము క్షణమును బెంపొందు కాలచరిత
గానముజ్జ్వలతారాని కాయమందు
నిర్మలతలో సకలము గన్పింపఁ దొడగె
నిశ్చలతలో నిఖిలము విన్పింపఁదొడఁగె.

అన్ని గానంబులైక్యమై యలరసాగె
నెల్ల భావాలు లీనమై యెసఁగఁ గడఁగె
విశ్వమంతయు నవశమై వెలయుచుండె
మానసంబున కాత్మసంధానమొదవె.

భారతి 1926 జూన్

# ప్రకృతిలాస్యము

సతత నూతన మృదు విలాసప్రభూత
తావక మనోజ్ఞలాస్య సందర్శనమున
నాదు భావాలు మధుర గానమ్ము సలిపెఁ
బ్రకృతీ! ఆనంద తన్మయత్వమున మునిఁగి.

క్షణములో దుఃఖచయ మెల్ల సమసిపోయె;
నెన్నియో లాలసలు—హరియించిపోయె;
స్మృతులు మెల్ల మెల్లన సొమ్మసిల్లిపోయె;
నీయెదుట విశ్రృంఖలత నేన నిలిచిపోతి.

ఆదయాశీకరాసార, మాపవిత్ర
విశ్వమోహనమైత్రి, యాప్రేమమధుర
మంగళాకార, మాతపోమహితముద్ర—
అహహ, ఎంతేసి కానుక లబ్బె నాకు !

నీ జగన్మోహనం బైన నృత్యమందు
మెప్పు లలసి పో, నేత్ర నిమీలనమున
దవ్వులను విన వచ్చె నెంతయుఁ బునీత
విశ్వసందేశతతుల గంభీరరుతులు.

ఎవరికొఱకు నీ నాట్యంబు. లేప్రపూత
గాన సంచార ఫణితు లేకాంత కాంత
నృత్య మై దర్శ్యమును బ్రసాదించె నీకు ?
అనుచు ధ్యానించినా నప్రయత్నముగను.

ధ్యాన మది గానమైపోయెఁ, దావకీన
ప్రణయ సౌభాగ్య మహిమ, నా ప్రశ్నములకు
నేని చూపట్టితిని సమాధానమనయి
నీవలన నాయనంతత నేర్చికొంటి !

భారతి 1927 జూన్

# కొన్నాళ్ళకు

ఎంత జాలియో రాగాలో యివి ! అపార
మాధురీప్లుత నైరాశ్యమయ విలక్ష
ణస్మృతులఁ బాడుచున్నవి నాప్రయత్న
ములను కుంఠీకరించి, అశ్రులకు మ్రొక్కి.

చిగురుఁ గన్నెతనంపు మైగగురుపాటు
మనసు గరఁగిన నీరు—ఆమధుర మధురి
మమును ముంచెత్తివచ్చిన మాయక్షణము
లెంత చీఁకటియేర్పడి యేలెనో కద !

తరవుదవ్వులనుండి వైతథ్యవిధుర
వాంఛితములు నా కీసదాభద్రపీఠి
నిలిపిన నివాళి వెలుఁగులఁ గళలు దేఱె
నెంత జాలియో రాగాలో యివి!—

భారతి 1928 జనవరి

# ఆవేదన

అంటి తొలగింపజాల మదర్పితములు
ముగ్ధకుసుమముల్ కసుగందిపోవునెమొ !
తహతహనడంపజాల - నీదర్శనమున
నొడలు పులకించు ధన్యత నొందవలయు !

అనుభ పవిత్రపూజ నావేశగరిమఁ
ద్వన్మధురమూర్తినే కప్పి వైచెఁదుదకు
ఆర్ద్రమోహన సురభిలతాంతచయము
పరమభక్తి పరిప్లుత భావచయము !

నీరసిల్లిన నిష్ఠావినీతి నిపుడు
మ్రొక్కుకొందు పేద మనస్సుబూరటిల్ల
తహ తహ నడంప జాల నీ దర్శనమున,
కంటి తొలగింపజాల ద్వదర్పితముల !

1928 ఆంధ్రపత్రిక ఉగాది సంచిక

# ఉదయభానుఁడు

సరసుల మానసాబ్జములు ఝల్లన, దిక్కులు తెప్ప లెత్తి యా
దరమున మ్రొక్క, 'విశ్వవిభు, తామసహారి, త్రిమూర్తిరూప'యం
చెఱఁగెడు భక్తసంఘముల కిమ్ము ఘటించుచు పద్మలోక సం
భరణచణాంశుఁడై యుదయభానుఁడు తొంగుచుఁ దోఁచెఁదూర్పునన్.

ప్రాఁతవిపంచి కూర్చికొని రాతిరి పాడు వియోగగీతికల్
సీతున పేరి రాలు హిమశీకరసంతతి జాలువాఱ, వే
దాతిశయార్ద్ర మేమి కల దంచునొ యేఱుకొనంగ వచ్చె ని
ర్యాతతమఃప్రభాకరుఁ డహర్పతి పాటలకాంతి పర్వఁగన్.

నీడలు సోగలై నిగిడె; నిద్దుర నిద్దుర కేఁగె; బిట్టు కో
రాడెను తూర్పుదేస్లు లుదయాద్రిని జేగుఱుగుట్ట లెల్లి; మో
మోడెఁ దొగల్; పయోజముల కుబ్బులువాఱెను మోద మాత్మ స
మ్రా డభిదర్శనం బొదవ; మంతనమాడెను భూమి స్వామితోన్.

భారతి 1928 నవంబరు

# నా పదము

దీని కనుపేక్ష్యయాత్ర కాదియని లేదు,
అంతమనిలేదుఁ గాఁ బోలు! అరిగి యరిగి
చూడఁ, దొలిఁగన్ను విచ్చిన చోటు చుట్టి
తిరుగుచుండుటె నాపద మెఱుఁగుచుండు!

దీని నిఁకముందు నిడకలేదేని, ఒకట
నిలుకడకుఁ బూని సాధింప నేరదేల
నాపదము? రిత్తలైన, యత్నములు సలుప
కోరికలు లోఁ దరంగించు కొనునొ యేమొ!

తన పరాధీనతకు నాపదము సహించి
వలవదంచును నెదురాడ వలవదింత
ఎటు లభించెనో అరయదు; ఇంతమధుర
మో యిది! తలంప దానికే యొదవు వింత.

ఉన్న వెఱతుదు కాంచదు; కన్నుమూసి
అడుగులిడు నాపదము కత మడుగఁ బడిన
'ఆపరాధీనతా సూత్రమందె కలవు
వెలుఁగు పెన్నిధు, లౌ, నవి విరియు' ననును.

భారతి 1929 జులై

## ఆ ది

ఆది కికురించు తీయని స్వప్నశకలమా?—
పొదువునే యిటు తారి పొదవు తడవులు మీఱి?

ఎద బ్రాఁదలంపుల యిరుల దానక మౌనె,
బ్రిదిలి రాలిన కోర్కి వేఁదుఖుల్ చలియింప!

ఆది స్వప్నశకలమే అయిన, తా వరియించి
మది మాధురులచాయ మలఁగిపో, నలరిపో,

సిగపూలదరుల వాసించి యా తలఁపులు
సెగలు తాఁకని యూర్పు సెలఁ దోఁగి, విరియవే?

ఆది కిత్తురించు, తీయని స్వప్నశకలమై,
మదిఁ బ్రామిపుచ్చి సమ్మదకైతవచ్ఛాయ:

తొలఁచి సత్యానుభూతులు నిజప్రాభవో
చ్ఛ్రిత తమోగీతికాదయము బ్రోసుకపోవు!

భారతి సెప్టెంబరు 1929

## పరిణామ దశలో జనార్దనరావు

ఆతను (జనార్దనరావు) క్రమక్రమంగా *Classsteist* అయిపోతూఉండే నేను అదే క్రమంలో విప్లవిష్టు నవుతూవచ్చాను. జనార్దనరావు తన కవిత్వాన్ని గ్రాంధికభాష నుంచి వాడుక భాషలోకి మళ్ళించాడు. గణబద్ధ ఛందస్సులు వదలి మాత్రా ఛందస్సులు చేబట్టాడు.

"....పదగెత్తి పాడుకుంటాను" 'అనుకో తథాస్తు' ఇత్యాదులు. తాను రాయబోయే కవితలకి "అబద్ధాలు' అని పేరు పెడతానన్నాడు. 'ఫివెర్స్'కి అతనిచ్చిన నిర్వచనం—అది!

శ్రీశ్రీ

ఏటా 1938 సెప్టెంబర్

# రవీంద్రునికి

నీవేదప్రభ లాకృతించు కను లున్నిద్రార్థ సంధాన దీ
క్షావై దగ్ధ్యము క్రోవి పట్ట, నొకచో చైతన్యముల్ విచ్చి, వి
శ్వావేశమ్ము గుణించుకోఁ దివురుచిత్రాంకమ్ము నాకండ్ల నీ
భావాలోకము, నీకు నాకు ముడిగా, పండించుకోఁ జొచ్చెడిన్.

ఒకలయకట్టు విశ్వమున కూపిరిపట్టు, అది వెన్న తీయనే
సకలకళాతపస్సు లవి జన్మములై చను తత్త్వబోధయాఁ
కకు మది కందళించుక వికాసమువిచ్చు తలంపుతీపు ల
ల్లికవడు నీదుదృష్టి కదలించెడు, రాతను గుండె లేపుచున్.

నీ చెయి సాఁగు ఒక్కొక వినిద్రము రేకకు, కల్పసూత్రముల్
పూఁటయు ఒక్కపొందిక తపుల్పఁగలేక తపించుతత్త్వపున్
వీచులు పాయవిచ్చి, తమ వేఁదుఱుపొంగుల కాత్మవాటికన్
వీచిన ఆమనుల్ పడి, దవిష్ఠము దారులు కట్టిపోయెడిన్.

ఎన్నియు పూలు విచ్చి తల కిద్ధ కదుల్వఁడఁబోదు నీదు భా
వోన్నతక్ప్తి : నాకు మది ఊర్చెడి వేఁడితలంపుసోఁగలన్
క్రొన్నిడుచల్వరేక కొసకోనకు నిల్పక వచ్చు, తానవో
లెన్; నెఱమబ్బువిచటను వెలింగెడి చిక్కనిప్రొద్దుమూడ్కి యై.

నీలయకట్టు నాయెదఁద నిండిన, నీ పయనించుత్రోవలఁ
నే లివ పట్టి నీయడుగునీడల నానడ లేలికొందు సన్
లాలస తాఁకి, సక్తి విడు నాతొలుపూనిక యానతుల్ స్మృతిన్
వ్రాలిన, ఐక్యముల్ విడియఁబడ్డవి నా జనురర్థమై చనుఁ

భారతి 1982 ఫిబ్రవరి

# ప్రతిగీత

'నేన - పాటసోనల నెఱనిగ్గు తెల్లి
దూసికొని రేకు విచ్చు మాధుర్య రుచిని;
సృష్టియెద మ్రోఁగు లయకట్టు చిక్కణించి
గుండె తేటల మోపఁ గల్గుదును - నేన -'

'దిగ్దిగంతాలు గిలిగింతఁ దేఱి మఱచు
నీపిలుపువిందు మది కిరణించుకొన్న,
నా వలపు వెచ్చనలకు నీనాట్యపటిమ
తలఁపులో రేక రేకలు తారసిల్లు.

ఆది పురాణించుకొనుచు, నృత్యావతార
కృత్స్నమూర్తిని నిను సంతరించి యిడును.
ఏను కొండలుపడ్డ కుంభితుఁడ నగుచు
లోఁతుదూరాల తనివి పొలులు భుజింతు.

నీకు కళలోన కళ దేఱు నేర్పు మెఱపు
మంతనము లాకళింతకు మసక వెట్టి,
నా యెద వెలుంగు లోకమ్మునకు కనల్పు,
ఋత్త్రికాన్కలు నీకేల బాహిరిల్లు.

ఇట రసాకృతివడ్డ వాంఛితము లొలసి
ఒక అణుత్వము పుక్కిలింతకు నడంగు;
ఇట పరంజ్యోతి ప్రణయ సంక్షిప్తిగుదులు
చుంబితములయి అద్దమ్ము చూచికొనును.

భారతి 1982 మే

# ఉదంతము

నాపుసిత జీవనము స్వప్నములు విరిసి,
దివ్యలావణ్యములు ప్రభాతిల్లు నీమ
నోజ్ఞభూతికి వెలుఁగులు నోమువెట్టి,
నీమహోమూర్తి వలపులు నిండికొలువ !

నీ స్వయంవంచితము కనీనికల మెఱుఁపు
విసరిపుచ్చు లేములకు కంపిలుచు, నాప్ర
సార మశ్రువార్ధితఁ గని బోరుకలఁగె;
నీవు నితృష్ణఅదవుల నిలిచి, జాలి
లేకమనకలు తెఱచి కోనీక నిలిచి.

నా ప్రసారము భీకరాంధతమసమ్ము
లై మొఱసికొనె నాజీవ సాంధ్యములను
అడుగడుగు రేఁగు ప్రశ్నము లెడల నీవు
మునిఁగి లోలోన నీలోకములె సుఖించి.

నా ప్రసారము విధురకాంతము, ప్రచండ
దావహము శాపమై నీసమస్తమునకు,
తన ప్రధూమించు ప్రణయసంతపన శరమె
పోసెడిదొ యేమొ; - నాతొలుపూఁ కదలి,-

అణుపణువు నాకు భద్రతయై వెలింగి,
నాయెద పవిత్రతలు నిండి, నామహత్త్వ
ములు వినిద్రములై, సర్వమునకు నొకమ
హాంత మయివెల్గు మంగళార్ద్రతయె గోచ
రించి, నాప్రసారము తానివర్తిల్లకున్న !

ఇపుడు నా యీవినూతన సృష్టి భాగ్య
ములు తరంగిల్లు త్రిజగత్ప్రపూత దివ్య
తీర్థములు, - నీకు మదిలోన తిరుగుడు పడి,
స్మృతిపథమ్ముల నా క్షమాశీఃప్రసార
చోదనములను యాత్రలు సురిఁగి వచ్చి, -

మునుక లిడి పోవుచుందు చప్పు డపు డీవు;
భూతమునె దిద్దికొన తలఁ పోడికొనుచు.

భారతి 1932 ఆగష్టు

# నివాళి

ఆకసముసాగునామది - ఆరనిలిచి
పొంగ పోసినవి వచఃపూర సుధలు
సడల త్రోసిన వికసద్విభూతి
మూఁతవిడిలోన మ్రోయబారు

ఒకటి కనులోతు లాచికొనులోన
చీకటి నీకనువడి
త్రవ్వ బహిరస్ఖలితము మదీయ
వృత్తి వెలార్చు నిజము నీకేమి తెలియు ?
కాక అది నా సమగ్రత కట్టుబడికె
ప్రాకునని త్రోవపట్టిన నీకను కవి
గురుతయే ఆవికొనుగాక-కోర్కి రుచి ని
వాళి పట్టి నా చెయి పట్టు తడియ !

19-8-33

(జనమంచి కామేశ్వరరావు గారు తన డైరీలో నోట్ చేసుకొన్నది.)

---

ఈ గేయాలు రచించింది కొంపెల్ల జనార్దనరావు సోదరి చావలి బంగారమ్మ. మా బంగారమ్మకు కవిత్వం ఉగ్గు పాలతో వచ్చింది; సాధన వల్ల వచ్చిందికాదు. అది మేలిమి బంగారమే - కొంపెల్ల వారి కుటుంబమే పండిత కుటుంబమూ, కవి కుటుంబమూను. సోదరుడు జనార్దనరావు చిన్న వయసులోనే అకాల మృత్యువు వాతబడినా అప్పటికే అంత చిన్నతనంలోనే గొప్ప సాహిత్యవేత్త అనీ, గొప్ప కవీ రచయితా అనే పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. ఆయుర్దాయమే ఉంటే నవ్యాంధ్ర కవితా రీతులకు వన్నెలు దిద్ది దారులు చక్క జేసేవాడు. అతని సోదరే శ్రీమతి బంగారమ్మ. ఆకుదిటిలో మొలచిన మొలక, అనికుంజములో పెరిగిన లత. ఆమెకు కవితా వాసన లేకుండా ఎట్లా పోతుంది? సోదర ప్రోత్సాహ సారమున పండిన బంగారు పంట ఆమె. ఈ గేయ కుసుమాలు సుమనో మనోహరాలు. పారిజాతపు పూవులు. వాయు కిశోర కేళికను

జల జల రాలినట్లు సోదర ప్రోత్సాహ సమీర కుమార స్పర్శమున అప్రయత్నంగా ఆ లతాంగి హృదయనికుంజం నుంచి ఈ కవితా లతాంతాలు గేయ రూపాన అవతరించాయి....

....ఇందులోని గేయాలన్నీ అనుకొంటాను లేదా చాలా భాగం మద్రాసులో మా యింట సోదరుడు జనార్దనరావుతో కలిసివున్నపుడు వ్రాసినవే; అన్నీ నేను విన్నవే.........

వాల్తేరు,
విళంబిశ్రావణం మల్లంపల్లి సోమశేఖరశర్మ
శాలివాహనశకం 1880 (1958)

(శ్రీమతి చావలి బంగారమ్మగారి "కాంచన విపంచి"కి "వక్తవ్యము" అనే పేరిట రాసిన పీఠికనుండి. ఈ గ్రంథం సుహృతపరిషత్, విస్సాకోడేరు, భీమవరం తాలూకా, ప.గో.జి. వారు ప్రచురించారు 1958లో)



## నేటి తెనుగు కవుల పట్టిక

1935లో కె. యమ్ మున్షీగారు భారతీయ భాషల్లోని రచయితల జాబితా తయారు చేస్తే బావుంటుందని ఓ సూచన విడుదల చేశారు. దాని ఆధారంగా కృష్ణాపత్రిక ముందుగా తెనుగు కవుల పట్టికను తయారు చేసి కొన్ని సంచికల్లో ప్రచురించింది. అందులో మొదట విడుదల చేసిన పట్టిక పానుగంటి వారి పేరుతో ఆరంభమైంది. కొంపెల్ల జనార్దనరావుగారి పేరు పదోదిగానూ, శ్రీశ్రీది యాభై రెండోదిగానూ కనిపిస్తుంది. దీన్ని అకారాదిగా తయారు చెయ్యలేదు.

కృష్ణాపత్రిక
1935 జూన్ 15 సంచిక

# .... తథాస్తు

అనుకో - తథాస్తు, నా
అనుభూతిలో ఒక్క-
లోటు తెచ్చేఒవు నీ
లోత తరిలుపోక -

అనుకోఒ ప్రకృతిబట్టి
అదలాడి, బెదరి, నా

ఈ నొప్పితడవులా
దేటిమైకాలలో
పోసీను సుమసుధల
పుట్టిల్లు నాపట్టు —
అనుకో - తథాస్తు -

నే నిల్వద్రొక్కేఒను
నే చిక్కబట్టేఒను
కన్నీటి గుడుల, పు
ల్కల లోతుముత్యాలు

అశ్రువొలికితె ఏమి
చిరునవ్వు వెలుగులో
ఆరపీసమేని చి
క్కనవో మొగిలురాదు

కదలికే లేని నా
కంఠార్థ నియతిబడి
తనసీద మెలకువే
ధారియిట నీ మదికి -

నీ రక్తములు శ్రీలు
నదుల అనుగీతాలు
వేదాలు మునుపు నిం
పిన గాలి మలి పంట -

చూతాములే పాదు

చుమ్మవోకలె నవ్వ
నీ గుండె పరవశ
మ్మయి కాలుబడకుండె
చూతాములే........
కాకపోతే పోయె
గాకన్న యీ వంక
కాకపోతే పోయె
గాని....చూతాములే.

[రాజమండ్రి నుండి మద్రాసెక్స్ప్రెస్ మెయిల్లో రాసిందంటూ శ్రీ జనమంచి కామేశ్వ
రావ్‌గారికి 24-9-39 న ఉత్తరంలో రాసింది.]

# ఆదర్శము

నా ప్రకృతీలో బాంధవాయువులు
ఒక్క పూవుకే చివురుటాసక్తి వీడి
నాదు సత్వ విస్మృతి గుంజుకొని
విడివడజూచు —

నా పరిసరము వాసించి నిలుచు నాప్రకృతి
ప్రతిమూర్తి నాడులో గొనగ
జాచి మాయవడిన బాహ్య ప్ర
సారము మార్చు, ఒక్క ప్రతి
మూర్తినాలోన తేవకునికి
కాదు మొదలది వెదకాడుకతన ....

## షరాబుకట్టిన ఖరీదు

కొంపెల్ల జనార్దనరావు కవితలను వస్తువునుబట్టి 1. ప్రణయం 2. ప్రకృతి 3. ఆధ్యాత్మికత 4. స్తుతి. 5. స్మృతి— అనే విభాగాలు చేయవచ్చు.

తన ప్రేయసి 'విజయలక్ష్మి'గా అవతరించి తనను 'ఆవహించాలని' ఆవాహనచేశారు 'నాదు జీవన' అన్న కవితలో.

ప్రణయం అంశంగా రాసిన కవితల్లో ప్రభాతిల్లు 'కిరణించుకొను' లాంటి పదప్రయోగాలు ఒకవిశిష్టతను చాటుతాయి.

అలానే ప్రకృతి 'మనోజ్ఞలాస్య సందర్శనం'వల్ల కొంపెల్లవారి హృదయం స్పందించి ఎన్నో కవితలుగా రూపుదిద్దు కున్నాయి. అంతేకాదు ప్రకృతి నుంచి ఒక పవిత్రమైన విశ్వ సందేశాన్ని విని 'ప్రణయ సౌభాగ్య మహిమనూ' 'అనం తత్వా'న్ని నేర్చుకున్నాడుకవి. 'ఉదయభానుడు' అన్న ఖండికలో "నిద్దుర నిద్దురకేగె' లాంటి భావాలు క్రొంగొత్తరుచులనువెలారుస్తాయి.

అంతేకాదు, 'బొమిక' అనే అల్పవస్తువును కూడా కావ్యత్వం సిద్ధింప చేస్తూ దాని స్థితిగతులను 'బొమిక' అన్న కవితలో వివరించాడు కవి.

(మిగతా 293వ పేజీలో)

అద్ది బుజ ప్రతిబింబము కాంతి
సమాకృతి నదంగునేమొ....
నా ప్రతిబింబము చూచు....
సమమైత్రి రేగి ఆట ....

ఈ నా ఆదర్శము దూరమవి
నాలోనె, నాతోడ ఒక తలాన....
నిలుపుకొందునుగాక - నా బింబ.
మనుచు నాలోనవె - నిల్కడ ....
చలికమ్ము వెక్కించు కొంత.

ఇది మఱి - నీదు ఇచ్ఛాకృతి
కొలత" కొలవక
ఏల చేపడరాదు ఊహించు
లోన -

నాప్రకృత్యంతరము ఎదురాగి
వెలుగు నేసినసెకాని జరగదో
ఈ ముకురము !

ఇక 'ఆధ్యాత్మిక' అంశానికొస్తే - తానొక 'మహాత్ముడు'గా భావించు కుంటూ "ఇది జనని.... ... బూరటిల్లు" అన్న కవితలో ఒక ఆధ్యాత్మిక తత్త్వాన్ని ప్రకటించాడు కవి.

స్తుతి - కింద 'బ్రౌనింగ్' అనే కవితను తీసుకోవచ్చు.

స్మృతిపక్షాన రవీంద్రుడికి స్మృత్యంజలి ఘటిస్తూ 'నీలయికట్టు' ఇత్యాదిగా అనడం పేర్కొన తగ్గది.

ఈ విధంగా జనార్దనరావుగారు పలువిధాలైన కవితలల్లినప్పటికి కొంత అస్పష్టత చోటుచేసుకోవడంతో తన ప్రతిభను చిన్న పద్యాలలో ప్రకటించినంతగా వృత్తాదులలో ఆవిష్కరించలేక పోయారనిపిస్తుంది. ఈ బేరీజువేసింది డాక్టర్ శివలెంక ప్రకాశరావుగారు తమ భావకవులు-ప్రతిభావిస్ఫూర్తి అన్న డాక్టరేట్ సిద్ధాంతగ్రంథంలో.

ఆస్థితిని స్థితి పట్టినిల్చి.... నె
నీ ప్రసారమదితర సుధలు
పిండుకొను కాని యేమి లేవు.

విశ్వమెల్ల పరిభ్రమించి వచ్చినది
మనసు ఈ ప్రతిబింబమున
ఆకట్టుపడెడి -

ఆ ఇచ్ఛావ్యాపృతి నాభావికి ప్రతి
బింబము తిరిగి తిరిగి -
ఈ అమూర్త మూర్తి విభ్రాంతి
తడవసకలమై తివురు -

ఆ అమూర్తము ఇచ్ఛావిహారమంకి
తమయై పురుషునకు (?)శాశ్వతత్వ
ముపూచు వీలు(ను) పట్టి

ఈ భౌతికమూర్తి తుడువబోవ
ఈ అమూర్త మూర్తికి శాశ్వతత్వ
మ్ము పులిమెదనను - మన....
ప్రతిబింబమగుచు స్మృతి....
నిలిచియతీరు - విస్మృతమయ్యె.

# ఉపేక్షితము

ఒక ముసలిదోనె యిది; పడియున్న దిచట,
ఊడిగము సేఁత సత్తువ లుడిగి యుడిగి;
తనకుఁదా మృతస్మృతులు కల్పనముసేసి
కొనుచు, తనపయిఁ దా జాలిగొనుచు నిట్లు.

అఖిలజనకవాత్సల్య సహార్థి యగుట
తలఁపఁడు; స్వకీయసౌఖ్యసంధాయి యగుటె
అరయఁడు నరుండు-కట్టికొన్నాఁడు, తరువు
నఱకి, కంకాళమయ మొకనావ తనకు.

కుపితజలరాశిఁ,-ప్రకృతిసంకులవిఘట్ట
నములఁదన కంగరక్షగా నవయఁజేసె,
స్వార్థసంపాదనములకై యడఁచి దీని :
చూచి యూర్వఁడు,-చూడనేచూడఁ డిపుడు.

నిరతయాత్రామితకాలచరణబహుళ
చిహ్న జీర్ణితసత్త్వ మీసికతరేణు
సముదయమునఁ గాయార్ధదఘ్నముగ నిలిపి
నేర్చుచున్నది యిది ధ్యాననిరతితాల్పు.

వాయువులుదీన గుప్తభావములు చదువ
గొడఁగుచున్నవి; చెడిన ప్రాగూటిసొదలు

పోసికొనియేడ్చుచున్న దీపులుఁగు;-జలము
లశ్రువులు చిందుకెలన, చిరానురక్తి.

గతకథాగళసారిగాద్గదికమాధు
రీగరిమ లోనడఁచుకొన్న పృథులకాంతి
అణు వణువునందు నాల్కఁవిస్ఫూరి, స్వాగ
తము విరాలించి యడుగు, శైన్యము వరించి.

భారతి నవంబర్ 1933

# అభయము

నా విముగ్ధైక శిఖము క్రౌందళుకు పోక
ప్రేలి చఱచిన అలహసజ్జ్వాలిక నను
జార్చుకొన్నది నీపదచ్ఛవుల, నీదు
అభయ హస్తమ్ము నీడల నక్షి తెఱవ.
ఒక క్షణదాగతము పునరుత్థ గగన
చకిత గతి మద్విహార కౌతుకము నీదు
అభయ హస్తమ్ము చలువ ఊర్పయి మెలంగు
టది అవశ్యము నీకు జ్ఞాపిత మొనర్తు.
అగును మఱి యేలో పౌనరుక్త్యమిటు ? కాని
నీ అభయ హస్తమిపుడు సంచిత మర్చము :
అంత, ‘బ్రదు’ కన్న దొకటి పరాస్త సకల
పూజ్యమని నా చెవుల రొదపుత్తు నీవు.

1984 ఆంధ్రపత్రిక ఉగాది

# స్వీకృతి

ఇటికలపు కోరగించినదో నీమది త్రోవ
ఒక తిట్టు ఒక తిరస్కృతి మీటిపుచ్చావు.

అది నీకు ఎడదసిరి
కదలి దూకాడింది
అది యెదలకట్టేటి
తంతిబడి మ్రోగింది
అని కడుపులోతులో
కౌగిలించాను.

అపుడొక్క మెరుపు మెరిసింది.

వెలుగులో తీండ్రించి
వెలుగు చించిన రేఖ

అపుడొక్క మెరుపు మెరిసింది.

అది నీవు భరియించ
గలవో లేవో కాని—

అపుడొక్క మెరుపు మెరిసింది.

1934 నవంబరు భారతి

# అన్వయము

౧

కాళ మతివిరిసి ఆకాశ మెద నవ్వింది;
తరఁగ వంపుల కదలి నురుఁగువడి రువ్వింది;
దెస లొక్క తెలివితేరినవి.

కొస లాగనిది వర్ష క్రుమ్మరించిన యేడ్పు,
చలితుపానులు దూసి చాని గ్రీష్మపుగాడ్పు
ఏల యిటు రాపిల్ల కడఁగు ?

బైలాను సుషమ బింబముకట్టి గాలులు
తడవి సాఁగిన ముహూర్తము కన్ను విచ్చఁగా,
ఏల యిటు రాపిల్ల విడవు ?

౨

కమలమ్మొ, కలువయే, కలల అందపునెలవె
ఆ బింబము మహస్సు లామనికి పట్టినా
మని నాకు తగుల మొక్కొకరు.

సుషమ ఆ వృతిలో ఉసురులు విదారించు
నెరసు లెందుండి ?—తరణిమహస్సు తొలిచి కాఁ
కలు కొప్పు ముడిచారు కాక !—

అది అభావ్యము వారికి : అటు ప్రాకృతము, సాజ
మగు రేకు విచ్చితే, అది నాకు చిచ్చులు వి
శోకించితే, ఎవరి దొసఁగు ?

౩

కూర్చిపెట్టినవి తగులము విశాకించు
రామనస్సులు నింగి రాపాడు పలుకులు
తరణీవెల్గుల కుద్దితారి.

అవి ప్రభుప్రభులు నా ఆత్మ నాటుక, వెన్నె
లలు పుట్టలుగఁ దూఱి అలజడి వెలార్చినది
యెవరి తప్పని దండడింతు ?

క్రొంబూచురేకు విఘూర్ణించు చిచ్చులు
కన్నీట విలిచి యెక్కటి నింద శిరమూఁగ,
ఆదెరేకు వలచు, తాఁరాడు.

౪

ఇటు వసంతశర ద్వరిష్మశోభలు గూడు
కట్టిన నిశాంతము వికాసమ్ము వలపందు
నెడ, అంచు లేమిటికి నాకు ?

ఋతుమాధురులు రంగరించి పదనారు నా
కిరణాల గుబురు రాగిల్లు, నెందొ పలుపు లై
గిలిగించు ప్రకృతికొంటెతకు.

అట ఒక్క అమృత హిమాని నా తొలులోఁతు
లంటె : మసక విదల్చు అచ్చవెల్గు పొరాడి
పడ గెత్తి పాడుకొంటాను.

# సృష్టి

ఎప్పుడో
జయము తేగల ముదమె,
మెచ్చులే జడివీచి
మనసు కదలించినా,
నా చంచు వది పదను
చూచుకో నేమరదు.

పాయవడి చాలు విడు
మనక లన్నీ ముసరి
నా ఖర్వనుల
రాగిల్లి రంగులు జారు—
నింగి ముట్టే కొండవనులు నెయ్యము లూరి
గాలి పెన్నిధు లూర్చిపోయ.

మబ్బులందము, చల్లదనము పులకించేటి
నా కలస్వాదురేఖకు బొమ్మ చెదరుట
అనుచు లేనే లేదు.

మనసె తా పాయవిచ్చినచోట, నాకలము
మనసె. సర్వమె, ఊతగా వ్రాసికొంటుంది—

అనురేఖ మదరు మెత్తని చిక్కదనముతో
నాకేల ననిచి సర్వము నర్తనము రేగ—
నా కలముచంచువు కలస్వాదుగీతి గుర్తులు
సర్గవుచ్చేటి వేళ.

ఉదయిని సంపుటి 1 సంచిక 2

---

జనార్దనరావు ఫక్తుపైదికపుకవి. అతని కావ్యభాష విశ్వనాథకే కొరుకుడు పడదు. తద్ధిత రూపాలు వగైరా "పండితైకవేద్యములే". అతనిభావం అతిలోకం. "ఉదయిని" సంస్థాపకుడుగా, మంచిమనిషిగానే తప్ప రచయితగా అతని నభిమానించగలగడం "అస్మదాదులకు" అలవిగానిపని.

కె. వి. రమణారెడ్డి

సృజన 1980 జనవరి

# వినిమయము

యోజనము కొల్చు దూరాల నుదికి త్వన్మ
త్రైకలక్ష్మమ్ము నెత్తురు లడఁచి చూతు:
ఉత్థశోకము మృతికి పట్టోడి పేరు
బరువు రెప్పల బ్రదుకు బోటొగ్గి లేపి.

* *

కట్టినది అగ్ర మొకటి: లక్ష్యశిథిలీకృ
త ప్రవృత్తిక మది వ్రీలి, తరుము వలిత
జైత్రవేదన నాఅంచు చలువ, మునిఁగి
బ్రదుకు పట్టు నాతలఁ గోర్కి కుదురుకట్టి.

1985 మార్చి భారతి

"చలవమిరియాలు" ఇదో కొత్త శీర్షిక. 1985 కృష్ణాపత్రికవాళ్ళు నిర్వహించారు. నిర్వాహకుడు "రేడియో". రెండు సంచికల్లో ఉందిది. ఆంధ్ర భారతీతీర్థ పీఠాధిపతి బుర్రా శేషగిరిరావ్‌గారిని అందరూ ఎరుగుదురు. ఆయన రచయితలకూ, కవులకూ బిరుదప్రదానాలు చేస్తూండేవారు. 1986లో వారిచ్చే బిరుద ప్రదానాలెలాగుంటాయో ఈ శీర్షికకింద 1985 సం॥రం డిసెంబరు 14 నాటి కృష్ణాపత్రిక సంచికలో ఓ జాబితా ఇచ్చారు. అందులో తెలుగునాట ప్రసిద్ధులైన 16గురున్నారు. వారిలో కొందరు. శ్రీశ్రీశ్రీశ్రీశ్రీగారు-కవిమహోత్కోపావర్త. కొంపల్లి (అని ఉంది) జనార్దనరావుగారు - చండప్రచండ గండ శిలాభినవకాళ్యాంత. కృష్ణశాస్త్రిగారు - బాష్పకవితా నయాగర. బహుశా ఈ 'రేడియో' చెఱుకువాడ వెంకటనరసింహ సిద్ధాంతిగారు కావచ్చు.

# బొమిక

౧

ఇది నిరూపించుకొనకిక వీడదు మనస్సు
తనను మాంసము, రక్తమ్ము, మనసుపట్టి
....రి తన్ను కనడిచిన తఱి, తలంపు
....ట్టినొంచిన స్వప్నమ్ము ఐరువులిపుడు
తానిఁక ప్రభుత్వమున నూర్చునేని?—
....నలు మాంసము, రక్తమ్ము, మనసునడచి
....రి మెట్టెదునను, పురాతథ్య శిథిల
....క్తి లింగమీ యెండిన బొమిక నొకట
....దవిమాచెదు, నామ్రొక్కి తరచి, తరణి.

-ఇదియు

తన వికృతసుందరత నవ్వి, తనపురాస్తి
తకు పితృత్వమె మండి, యీ ప్రకటజగము
దిద్దుకొనెదు నామది తెర తెరలు తానె
తలఁపుకట్టెదు—ఈ జగత్కశలు జార
ఇది జగము మెచ్చనిది వస్తువు!—ఎపుకొ నవసి
నవసి బూడిదకాన వజ్రఱడిఁగాక
ఈ నిరర్థక బీభత్స మిచట విడియ
నిచ్చిరే?—

—కాని యిదిమాత్ర మిది గణింపఁ
జనదు: కరఁగెడుమనసు మూర్తనిఖిలమ్ము
కరఁగి ఆవిరికట్టు లోకములఁజోపి
తాను బూడిదకాక, 'భూతమ్ము' 'సిపుడు'
పఱచిచూపిన వికృతసుందరత మెఱసి తీరు!—
తానొక్కమానవుతీరు,

తీరు—ఒకజీవియై యుఁటిరిగె నసుము :
నన్పరిసరించి కఱకు స్వప్నములు మొఱయు
ఎన్నిగడవవు నాదృష్టియెడలి?——మొఱఁగి
నదిసమస్తము, తానె నామదిఁ గరఁచి,——
తానవోలెనే స్మృతుల మెదలఁగ వరించి.

౨

ఎదలుచూపులుకలపి అంచించురూపు
తను నిరూపించుకొని, తృషితము స్వకీయ
మెద ప్రకృతిలోఁగు విందు వరించి మెలఁగి,
తనదు ఆవృత్తి దొరలి నిల్చినది——బ్రదుకు
తీపులకు లోఁగని వికారతృష్ణ మెఱయ
ఈ శిథిల కర్కశముగ—ఆకృష్టచేత
నార్చితపునః ప్రణీతభోగ్యమును— —తఱిమి

నాకొక సుఖప్లుతితలంపు నడచుచవుల
ధూతజని సాఁగి తివురు ఈ పొదవుపొడపు
విధురజిహ్వము కారియపెట్టు—ఈ త
లమ్ము సకలము జ్వాలాకులమ్ము మదికి
లేచి రూపించు తదకీ అలిప్తయష్టి,
ఈతరణి వెల్గుతుడుపులు, ఈ నిరుద్ధ
సక్తిచుంచితవృత్తి——

ఈ ప్రకృతివన్నెరుచులు నాయెద మరుత్తు
గమి తడవి ఋతుపుచ్చు శాపముల బ్రదుకు
బడి జ్వలన్మ్రదలిడు మృతిస్వాదములకు
కొంతతీపులు విచ్చియు కూర్మికలపు
ఈ బొమికనిల్పినది కాని—హృతసమస్త
జీవదనుకంపము, ప్రభూతచిత్స్వలసిత
మస్మదనుభూతియెడ, అట్టి అనుకృతియెడ,
ఒకట జీవన్నమది యెటులోర్చు ప్రీతి ?
(మునుపు మాంసము, రక్తమ్ము పసవికదలు
బ్రదుకు నామది శల్యము వడినిగ్రుచ్చి
లాగినదివోలు నిటు—ప్రాప్తలవ నిజాను
బంధబోద్యము.)—

మిత్రులతో జనార్దనరావు (మధ్య) 1931



ఎడమ నుండి : కీ. శే. కొమర్రాజు వినాయకరావు
కొంపెల్ల జనార్దనరావు
(శ్రీమతి శాంతి సుబ్బలక్ష్మిగారు గుర్తించింది)

అభినవాంధ్రకవి పండిత సభ - బరంపురం 1933



నిల్చున్నవారిలో రెండవ వరస (కుడి నుండి ఎడమకు)
1. శ్రీశ్రీ 2. జనార్దనరావు



జనమంచి కామేశ్వరరావుగారి చెల్లెలి వివాహ సదంర్భంలోది. 1934 (కాకినాడ)　　ఎడమ నుండి కుడికి:

నిల్చున్నవారు పైవరస : 1. కృష్ణశాస్త్రి (ఎత్తుకుంది బుజ్జాయి), 2. స్వామి శివశంకరులు, 3. ముద్దుకృష్ణ, 4. పిలకాగణపతిశాస్త్రి.

రెండో వరస : 1. తారకం, 2. పెద్దాడ రామస్వామి, 4. ఉల్లితిరుపతి, 5. జనార్దనరావు.

కుర్చీలలోని వారు : 1. రాజహంస (కృష్ణశాస్త్రిగారి భార్య) 2. రఘుపతి వెంకటరత్నంగారి కుమార్తె నగణమహాలక్ష్మి, 6. జనమంచి రామకృష్ణ 7. జనమంచి కామేశ్వరరావ్ 8. ఝాన్సీ (కామేశ్వరరావ్ గారి భార్య).

(శ్రీ జనమంచి కామేశ్వరరావ్ గుర్తించింది)

కవితాసమితి — విశాఖపట్నం



ఎడమ నుండి కుడికి :

కూర్చున్నవారు :— 2. తాపీ ధర్మారావు, 3. శెట్టి లక్ష్మీనరసింహం, 4. పురిపండా. 5. స్వామి శివశంకరులు. 6. మారేపల్లి రామచంద్రకవి, 7. ఉన్నవలక్ష్మీనారాయణ, 8. శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి, 9. కొంపెల్ల జనార్దనరావు.

నిల్చున్నవారు మధ్యవరస : 4. శ్రీరంగం శ్రీనివాసరావు (పురిపండా గుర్తించింది)

కాక, అస్మృతిరేఁగిన కదలికతతి
నాపదము తాఁకు నిది మదన్యము, నిరస్త
గోచరాకృతి, తన్ను నకు పడి విరిగె.
ఏను నొక్కఁడనని మెట్టి యేఁగఁజూతు
ఇది వికృత సుందరమొ : నాదు మది మలంగి
నానడలె అఁచి, చూడికి అని, నాదు
జిహ్వఁబడినె పల్కు. 'మొదల ?---చివర?'

[అనుదు.

అది విరిగిపడ్డ దిటు భస్మమగుట కొక్క
అడుగు మెట్టినదని చూచినాను నింగి :
పలుకమానదు, 'మొదల? - చివర ?' అట
వాసన—దినాలు తిరుగు నావాక్కె - హొ ....
నా మెదడు త్రోవ—

3

ప్రాకృతము నాసమస్త మవజ్ఞపాలు :
అట ప్రపుష్టము గూటి తొల్లిటిది కూర్పు
తనము దివ్యము తలఁపుగా తడవి తడవి,
నా బ్రదుకు చెప్పు బొమికల నర్తనమ్ము
నొక నటప్రభు గళమాల వికటసుంద
రతకు అఁచించు నిది భావి రగులనేసె,
నాయిపుడు నిల్చు బ్రదుకుమంటగమిచొచ్చి
నాసమస్తము తనకు నగ్నమని యావి
ముగ్ధ వికృతమ్ము విజయించు మునుపు నాదు
బ్రదుకు తనయందె ఒకజిత పడ్డరుచికి
వెదకులో, అధఃకృత మతివిధురమూర్తి
యిదియు నా వాక్కు పొదుపు ఆకృతికి మురియు
భస్మమయి, కాక, ఒకప్రాణి పదమెవెలిఁగి.

ధాత సం. జ్యేష్ఠమాసం

# బ్రౌనింగ్

బ్రౌనింగ్ మహాకవి
ప్రణయ పావనకథా
విధి దెసలు మసలి ఆ
రని ఆశ మెఱయించు
ప్రణయి కోటులకు.

మది వరించిన కోర్కి
ప్రిదులని బలిమి నో
మఁగ, వేయి త్రోవలు
మలఁగు కాలము గతుల్
మధురిమల్ మలిచె.

బ్రౌనింగ్ సతీమణి
పరలక్ష్య పరహృదం
తర మహత్త్వములు, స్వీ
య రహో గవేషణ
అరవోవని జనుస్సు.

ఒక పురాగత వాంఛ
కొదుగు భావము ద్విధా
గుప్తమై తననె చే
కొనవచ్చు తఱిపిచ్చె
కొనలు చూపని వెల్గు.

కవితా కళావిలా
స వికాసముల మన
స్పవనరోచులు తీయ
చాయలలో కాలు
లోకాన విరిసె.

ఈ దారులు స్మరించు
ఎద అలల్ పొరలి అం
దునా కోర్కియని జనిం
చిన ఆశ ప్రకృతికి
తనకు దీవన వోలు.

వీణ సంపుటి 3

సంచిక 1, 1937

# ప్రకృతి

## (భావాంజలి)

ఎంత ఆనంద దాయినివే! హృదయము
పులకరించెడి నీదు చూపులకె, ప్రకృతి!
నా ప్రసన్నత జుట్టి కొనంగ నెన్ని
యెన్ని సింగారము లుపచరింప గలవొ!

ఏది చూచిన నెద గుబాళించు వలపు;
తడఁ బడచు నీదు కౌగిలింతలకు పార
వశ్యమున ముగ్గు భావ విపంచి పాట,
నీ నయనములు ప్రతిబింబ మీనుచుండ.

ఆ చిలుప పాట కొసల నీ ఆర్ద్రహృదిని
చిరము మ్రోయ ననంత మాధురులలోని
ప్రణయ చిహ్నము లట్లు శంపా మనోజ్ఞ
తలు ఘటించు —

ఉదయిని

# సుధా జ్వాల

(శ్రీ సోమశేఖర శర్మకు)

(వ్రాయుము వ్రాయు మంచు మధుర ప్రణయామృత వాహినీతరం
గాయితమై త్వదీయ గళ గారిత నిస్వన రాజి నాదు క
ర్ణాయతనమ్ము సోకుటయ ఆదిగ, చక్కిలిగింత వడ్డ న
వ్వై యెద గల్గు భక్తి విరియంబడు ముంగిట పాట పాటలై)

వలచిన స్వప్న మెల్ల వలవంబడు రీతినె తారసిల్లె నం
చలయని ధన్యతా నియతమై విలసిల్లు ప్రసన్న తాచ్ఛటల్
వెలుగులు చిమ్మ నా హృదయ వీథిని శిష్టలవమ్మ ధీరతన్
తొలఁటితి పీవ; ఆశయతతుల్ ఫలియించెడి నాకు తోరమై.

అనిన నీదు నెయ్యపు పయస్సులు దిద్దిన తీయకైత లీ
లౌనని మౌగ్ధ్య గర్వముల లుప్తములై చన జూచు, బిట్టు ల
జ్జానిభృతమ్ము నా యెదద సాచెడి కోర్కులు మ్రోత వెట్టినన్
మౌనము బాయక మధురిమల్ కురియించెడి నీకు కాన్కగా !

లేజిరు పోడుముల్ చవుకళించు మదీయ కిశోరవాణి యెం
దే జని తప్పితోచిన భరించెడి నీ క్షమలోన దృప్తతల్
మైఁ జను, నేర్పు తీరనివి మక్కువతో యెలుగుల్ వెలార్చ, నీ
రాజన మెత్తి నీ పద పరాగములంటు నిజాను తాపముల్.

నీకిది పూవు గాన్క, కరుణింపుమి ఓ మధుమూర్తి ! సంతత
మ్మౌ కమనీయతల్ విరియునట్టిద, నీ తొలి సంజలూరు ప్రే
మా కృతి యొల్కు దీవనలకై యెద మూలము రేగి, సంపదల్
ప్రేకలు మూదలింప మధురించున దీపద సన్నిధిన్ చెలీ !

నీ మది రేప ఖడ్డ తమి నింపులు నాకయి ఆశిషాకృతుల్
నోమిన, మౌన దృగ్వలన లుబ్ధతలో బిగియించి కట్టి కో
నా మెడ జైత్ర హారము, అలినాకృత భావనచో మిథః ప్రచా
రామృత శైలి నాకు బరువై చివురాకున గొంతు కల్పునో !

1939 అక్టోబరు భారతి

# ఆ వా హ న ము

నా భావి పథము పంచలనెందు నొదుగుచును
వేచియుందువొ కాలవిభు చోదనము లెంచి !
　　అవతరింపుము దేవి, ఆవహింపుము నన్ను
　　నా గుండెలివియె ఈనాడె ఆశుభవేళ
　　ఓ విజయలక్ష్మి !

ఆకళింతలు మెలగి ఆవేశమయి పొంగి
నీ క్రమపద తపోనిరతి పెంపు వెలింగి
　　ఏ ననంత పథాలకే దాగికొని నిల్చి
　　అల దివ్యవాణి ఆజ్ఞలు మీటుకొన్నాను
　　అవతరింపుమి దేవి....

వింతలౌ నాక స్వప్న వీధీ విహాయస
ప్రాభవశ్రీలు శంపలులోన నిలబోసి
ఇటు మేలుకొల్పి జాగృతినే హరించియును
విశ్వమ్ము నాస్వప్న విజయమే వరియించు
　　అవతరింపుమి దేవి....

నాదు జీవన చేతనా వాటి లోతులన్
బ్రదుకు జల్లులు వీచి, ప్రాభవమ్ములె పూచి
సకలేశు నిచ్ఛాప్రసారమ్ములకు నోర్చి
పరపు నింపెడు సమత్వము నిట్ట నిలుపుకో
　　అవతరింపుము దేవి...

అదిగ్దిగంతమ్ము నవఘళించు రసైక
నిష్టా ప్రశాంతి కాంతితతిలో నిబిడించి
నా ప్రకృతి........ హృదంతరము కుంచించుకో
నా వచస్స్రితుల సోనలుసాగి ముంచుకో
అవతరింపుమి....

నా మహేచ్ఛాప్రభావము నాకె ఐక్యమై
విశ్వ వారిజము స్వావ్యత మహాసౌందర్య
పరిధి అంచులు తాక విరిసి భౌతిక భూతి
విరసిపో నాలోన విస్మృతి గుణించుకో
నవతరింపుమి....

నే కవిత్వము వెలింగిన రాపిళల్ వడి
ప్రకృతి హృత్ప్రణయ వైభవము నెద సూత్రించి
పరిమితుల్ వలచు తత్పర వృత్తి తెరవిచ్చి
ప్రళయ గర్భ పధాన వర సృష్టి మలుచుకో
నవతరింపుమిదేవి....

'మహోదదయ' కవితా సంకలనము
తల్లావఝుల శివశంకరస్వామి
ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్, కాకినాడ

# అంతర్వాహిని

1

నా యెదద విస్తరిల్లిన ఈయమేయ
తత్పరత యెంతలొ పవిత్రతల నెలవొ !
ఏ నొక మహాత్ముడనట : నాలోన నెడము
లేక ఉబికించుచున్నదిలే మహత్త.

2

ఏ నొక మహాత్ముడనట : ఆలించినంత
స్మృతి ప్రకంపితమగు : ఎన్ని యెడల సడలి
విచ్యుతి భుజించినానొ జ్ఞాపితము మదికి:
ఇది త్రపాభారగరిమ గ్రుంగించి వైచు.

3

అయిన ఈ తత్పరత యెంతలొ పవిత్ర
తలనెలవొకాని, పూర్వవృత్తముల తలపు
చీకటులు మదిసారింపనీక, ఐకమ
హత్త్వమిటు ప్రసాదించు, నాయందు విరియ.

4

ఇది జనని వత్సలత ప్రవహించినదియొ.
నాదొసగు లెల్లమ్రింగి ధన్యతలు నించు:
ఇది జగద్గురుతకు నాకె యిడినది వన
పూజనమొ నామహత్త్వమ్మెబూరటిల్లు.

మణి మకుటము సంకలనం నుండి

సం 1 శ్రీపూజా

# కడలిగట్టున

లోలోపల పేరుకొనే
నీలోపలి తలుపు కదిపి
ముందేకదలని కన్నియ
ముత్తైపుచూపుల పొలుపు—

నీ ఒక అనంతసంగము
నకు రేగేకోరిక, మఱి
నాలో నేనేవిరిసే
ఆలోకమువలపు-
ఒడ్డున విరిగే తరగవి
లాపము తెలినిగ్గు-
కడుపులోని లోతులపయి
వంపులలో తేలిచిచెదరే
నడితరగల బెదిరింపుల
రహస్సుందరతలు—
బడబాగ్ని ప్రభుత్వమునకు
శిఖపట్టే మణులసొగసు.
ఆకసమంతా మిలమిల
చూపులుగా వెదకులాడు
తారలు కళ్లు గఖ్లుగ
తరలించే యాదెస లో
కము సొంపులు
మెలసి—

లోకము తీపులలో శ్రుతి
పీడక, అందములోదక
నాకై కనుచూపులు కను
ఘూతలు ఒకెజ్యోతి నిలిపి

అమృతము తొలుకాడు మూర్తి
విశ్వముబ్రదుకెల్ల విరిసి
పూదెకట్టినది స్వప్నము
ఇంద్రియమధురాకృతి తర
ళించినది అతిలోకరోచి
నాకై యెప్పుడు మొలచు!
నాకై యెన్నడు నిలుచు!
అది ఆనునిమేషమనుకళ
మధ్యఫలితముగదూసి
ఉబికింతునో యిటడిగ్గివ
వ్యోమపావనిగపొంగిన
పాతాళము గంగగా—
కులికిన జాహ్నవిగా—
నాలోనికి
లోలోనికి.
ఇది ఒక దివ్యముకిరణము
నామతి సాగుడుమెట్టిన
నిబిడిత మొక చైతన్యము
రోదసిలో ఆటనిత్యవ
సంత మొకటిరేగుతుంది
ఆనందన సౌభాగ్యము
భోగ్యతకై లోగుతుంది
నాకై ప్రేకై
నేనిట నీకై
అంచుల నిలిచితి
తరగై నురుగై చిందిన
వరదలు నానుదురు పొడువ
మునిప్రేలను తుడిచి—
పదముల సారెకుసారెకు
పడికడిగిన తడిసి తడిసి
నెతురు పారుడు ముడిచి—

# తలపోతల కలపోతలు

['సొలిలక్వీ'లా మనిషి అంతరంగ తరంగాలను తెలియపర్చేవి ఉత్తరాలు. ఎలాంటి ముసుగులూ వేసుకోకుండా ఆత్మీయులకు గుండె లోతులను తెలియపర్చుకోడం చూస్తాం. కొంపెల్లకు ఉత్త రాలురాసే అలవాటు చాలా ఎక్కువగా ఉంది. చాలా మంది మిత్రులకు చాలా విపులమైన ఉత్తరాలు రాస్తూండేవాడు. అయితే ఉత్తరాలను దాచుకొనే అలవాటు మనకంతగా లేదు. దాని ఫలితం నాకు చాలా తక్కువ ఉత్తరాలే దొరికాయి. జనమంచి కామేశ్వరరావ్‌గారిల్లు కవులకు - రచయితలకు సత్రవు. వారింటి పేరులోనే ఉందా సూచన. అందుకే కొంపెల్ల వారింట్లోవాడయ్యాడు. కామేశ్వరరావుగారికి 30-40 ఉత్తరాలు రాశాడు. అందులో కొన్ని మాత్రమే నాకంద గల్గాయి. మిగిలినవి, మిత్రుడు శ్రీపతి ఓ చక్కటి గ్రంథంలా-కొంపెల్లకు శాశ్వతత్వం కల్పించే అతి సుందరమైన స్మారక చిహ్నంలా తేవాలనే ఉద్దేశంలో ఉండి భద్ర పర్చాడు. త్వరలో అది రాగలదని ఆశిద్దాం. అలాగే మల్లంపల్లి వారికి జనార్దనరావ్ రాసినవి కొన్ని సేకరించ గల్గాను శర్మగారి కోడలు చేసిన సాయంతో.]

కవరు

భారతి లెటర్ హెడ్. 7 - 1- 30

మద్రాసు

తంబీ,

ఇంత మాంద్యానికి నన్నుచూస్తే నాకే ఆశ్చర్యంగా ఉంది. నీ మనస్సు ఎంత నొచ్చుకుందోగదా! ఈ విషయంలో తరిచి తత్త్వానికి వెళ్ళడం నాకు మటీ

ఖేదావహం అవుతుందేమో. అయినా అలా వెళ్ళడమే నా అలవాటుకాని, ప్రస్తుతం మనస్సు దానికి ఆయత్తం కావడంలేదు. ఆఫీసు టైములో వ్రాస్తున్నాను కూడానూ ప్రస్తుతం. అదివరకు నీ ఉత్తరం చూడడంతోటే వ్రాసింది దీనితో జోడిస్తున్నాను.

నేను గంగలకుర్రినుంచి వ్రాసిన కవరు నీకు చేరలేదూ ? మళ్ళీ తర్వాత అక్కడికి వ్రాశావా ?

డబ్బు చిక్కు ఒక కారణం నా అస్వస్థతకి అయితే ఇదొక్కటే కాదు కారణం.

ఏమిటో గొడవగా ఉంది. మీ చిన్నతంబిలా రాయలేక పోతున్నాను. ఇప్పుడెందుకింక.

'చిన్నతంబి'

(ఈ కిందిది ఉత్తరానికి ఎడమ ఖాళీలో రాశాడు.)

తమ్ముడూ ! నీకు ముద్దు. ప్రస్తుతం ఇంతతో తృప్తిపడు. నేనల్లాగే తృప్తిపడుతున్నాను. న్యాయానికి నాకూ కడుపు నిండలేదు! వెఱ్ఱి ప్రేమ నిట్టూర్చుతూ ఉంది. ఇప్పుడు, ఇదే చాలుననుకుని మౌనంలో విశ్రమిస్తాను.

[దీన్ని భారతి లెటర్ హెడ్‌మీద రాశాడు. చివరి భాగం ఉత్తరం ఎడమవైపు ఖాళీలో రాశాడు]

* *

కార్డు

క్షేమం

గంగలకుఱ్ఱు
అంబాజీపేట పోస్టు.
17 - 5 - 30

తమ్ముడూ !

ఇంత కాలానికి ఉత్తరం వ్రాస్తున్నాను ! చూచారా నా పొగరు ? ఇంకా మా నాన్నగారు సుస్తీగానే ఉన్నారు. అందుచేతనే నేనింకా ఉండిపోవలసి వచ్చింది. త్వరలో సుఖపీయవచ్చు. వడిదుడుకు ఏమీ లేదు. ఇప్పుడే కొంత గుణముగా ఉంది.

ఆంధ్రపత్రికల్లో ఎంతసేపూ బి. ఏ. ఫలితాలే కాని యఫ్. ఏ. ఫలితాలు కనబడడంలేదు. వచ్చాయా ? మీ పరీక్ష యేమయింది ?

కొత్తగా మీరేమయినా వ్రాసినారా ? మీ పదార్థాలేమైనా పంపించరూ, వీలయితే ? నేను చదువుకుని సంతోషించుకుంటాను. మా 'తాన్సేను' వెదకాలి వెతికి పంపిస్తానులెండి.

ఈ ఊళ్లో హాయిగా ప్రశాంతంగా ఉంటుంది. మా అన్నయ్య సంగీతం, వాడి ప్రకృతీ నాకు ఆనందమూ సంస్కృతీ ఇస్తూ ఉంటాయి. వృద్ధుల వాత్సల్యమూ, వారిపట్ల మా సేవాపరాయణతా మనసులో ఆర్ష పవిత్రతలు వీచుతాయి. మా అన్నగారి అబ్బాయిక్కడ ఉన్నాడు. వాడి తారళ్యం పాత శోభలు చిలుకుతుంది. మీవంటి మిత్రుల మధుర స్మృతులు అమృతపు బుగ్గలు నెలకొల్పుతాయి. ప్రకృతి శోభలు మనసులో పరిమళిస్తాయి. నిత్యమూ మనసు ఈ వెలుగు చూపులే చూస్తే ఎంత బాగుండును ? జడత, విషాదము నా మనస్సుని ఇంత పరచిత పట్టుచుకుని ఏమి పరిణమిద్దామనో ! నాకు ఆత్మనిష్ఠ ఫలింపకపోదు. నేనులొంగిపోనులెండి చూస్తాను. నాన్నగారికి, రామచంద్రమూర్తిగారికి, పందిరివారికి నా నమస్కారాలు.

చిత్తగించండి
జనార్దనరావు.

* *

కార్డు మద్రాసు
శ్రీరస్తు క్షేమం 27-12-30

డియర్ బుల్లితంబి,

చిక్కటి ముద్దులు. ఒకటి రెండు రోజులుగా గట్టిగా అనుకుంటున్నాను. ఉత్తరం లక్ష వ్రాద్దామని. నిన్న, ఈవేళ తీరుబడి తక్కువ (అసలు ఈ మధ్యనే తక్కువయినా, ఇది చెప్పడం ముఖ్యం. అందుచేతనే ఈ వేళ కార్డు మాత్రమే వ్రాస్తున్నాను. సరే, నీ ఉత్తరము అందింది - అదికూడా దీనికి కొంతవ్యక్తి యిచ్చింది. నేనూ నిన్న, మొన్ననే అనుకున్నాను నీ దగ్గఱ నుండి'బొమ్మలు'వస్తాయని. నాకింకా అలవాటు పడలేదుగా ఈమూర్త సందేశము. అన్ని సంగతులకూ నా ప్రతిభావనము, ఝాన్సీకి, నీకూ నా దీవనలు పొందివచ్చినదీవనలు: గంట మ్రోతలు గర్వముగాభరించు పోనీ దానిసార్థకత! నాన్నగారికి అమ్మగారికి నమస్సులు, తమ్ముడికి చెల్లికి ఆశీస్సులు. పెద్ద ఉత్తరము గురించి నీకు ఆశలు - ఊరింపులు.

-చిన్నతంబి

కవర్

25-6-1931
మద్రాసు

ఏమోయ్!

మనం తన 'పెరియ' తనాన్నే సంభావిస్తూంటే ఇదే బాగుందిరా అని దాంట్లో దాక్కుని మఱీ దోబూచులాడుతున్నాడు పెరియతంబి ఇంతా చేస్తే తనూ 'తంబే' అనేమాట మఱిచిపోయాడు, 'పెద్దన్నయ్య' రకంలో మసలు తున్నాయి నడకలు. పెద్దవాడు మఱి తీరాను, ఏమనం. కుఱ్ఱవాడేనా అయితే చెప్పేటట్టు చెబుదుంమఱి (అన్నట్టు-ఆయనుంటే మంగలాణ్ణైనా పిలిచిపెట్టు నన్న ట్టుంది!) కానీ, ఏమాత్రం ఆడతాడో. ఎహె!! ఎఱగడు మఱి చిన్నతనంలోనూ, బుల్లితనంలోనూ ఎంత మజాఉందో? తను ఈవిధంగా దొంగిలించుకొనేందుకు లొంగనిది! మీసాలు పెద్దవుంటే, కమ్మగా నవ్వగలిగితే మఱిచేపోతాంగదా అంతానని లోకువ! మన కళ్లేమైపోతాయి: తనెఱగడేమిటి వీటిలో ఎంతతడిఉందో! తనహృదయం దానికోసం మఱింత తడితో పొంగలేదా లక్షసారులు. లక్షఅర్థాలు చదివి, ఆ చదివే పాట తీపులతో మఱింత పొంగించేస్తాం, మింటికంటాను-అడ్డాలు కూచుంటాయేమో చూస్తాను దోబూచులాడడానికి.

ఇంతకూ 'నీతైనవాడు' గదా! 'నీరసంచేతా' 'మోసగానితనం' చేతా తెచ్చుకున్న వంకరశేమాత్రం ఆగుతాయో చూద్దాం. నువ్వు నడుంకడుదూ!—

అయ్యో! నువ్వెంత సిద్ధంగా ఉన్నావో చూడకుండానే మాటాడేస్తున్నాను నేను. ఎదురుగా ఉన్న తంబిని మాత్రమే చూస్తాను. ఇదే! నా భావుకతకి కళ్ళ దగ్గిఱ పెట్టేశాడు తన లావణ్యంతెచ్చి నేను కళ్ళు మూసుకుంటానంతే. దూరాలు, దగ్గిఱలూ నన్నేం చేస్తాయి. కాసుకొండోయ్ ...నా స్వరాలు కావలసినవాళ్ళంతాను. మెలకువవచ్చిందా! ఉదయమవుతూంది! లేవండి! తంబీ! పెరియతంబీ!-బుల్లితంబీ! ఏదీ, నేనూ! నేనేదీ!

కె. జనార్దనరావు 7-8-1932
సబ్ ఎడిటర్: భారతి మద్రాసు
శ్రీరస్తు క్షేమం
తంబికి ఆశీర్వచనములు

పెరియతంబి రాజమండ్రిలో కలుసుకుంటాడు నిన్ను రెండు మూడు రోజులలో. ప్రత్యేకం నిన్ను చూడడంకోసం రాజమండ్రికి వస్తున్నాడన్నా అతిశయోక్తికాదు, ఎటొచ్చీ, ఏలాగూ వస్తాడు కనక మఱికొన్ని పనులుచూచుకో వచ్చునేమోకాని.

నాటకము చదివావా? చదవవలసిన రీతిగా? నాన్నగారు చదివారా? ఏమిటి విశేషాలు? వారము రోజులలో వ్రాస్తానన్నావు వ్రాయలేదేమీ? వీలయితే తంబి చేత పంపించు, తిరిగి సరిచూచి వ్రాస్తాను. నీ విమర్శము తప్పక కాకితముమీద పెట్టాలి. ఊరికే మాటాడుకొన్నప్పటి వ్రాసినప్పుడు లోతులు వచ్చి సంచరిస్తాయని చెప్పేదేమిటి? '*Synthesis of life*' - అని గూఢముగా చెప్పి ఊరుకున్నావేమో, నాన్నగారితో. నా ఆశయం, సులభముగా చూడడానికి నాటకములోనే దొరుకుతుంది. ''ఆసక్తి కంచికట్టుకు కూర్చుండి, 'ఆసక్తిని జయించుకొండో'యని సందేశము మఱిచా వటగా'' అంటుంది మల్లిక. ఈలాటి మాటలవల్ల ప్రయోజనముంటుందేమో చూడండి. అయితే, ఆ అనేది మల్లిక అనీ, ఇది విషాదాత్మక రూపకమనీ, మల్లిక నాయిక అనీ మఱవక ఉండడము కూడా అనావశ్యకము కాదు. ఈ విషయంలో - నాటకానికి విమర్శగా అన్నమాటే - చాలా వ్రాద్దునుగాని, నా భావనదానిలో (రచనలో) ఏ మాత్రము నిర్వాహము పొందినదో గమనించే కోరిక వల్లనున్నా, ఇంకాకొన్ని మెఱుగులు పెట్టదలచి ఉండడము చేతనున్నా ఇప్పుడు వ్యాఖ్యానము చెయ్యవలెననిలేదు. నాన్నగారు ఏమన్నారో కావాలి నాకు. నీ విమర్శా కావాలి. నాటకము కావాలి. త్వరలో దాని పని చేసేద్దామని ఉంది.

నా 'కృష్ణశాస్త్రి' మళ్ళీయెక్కడైనా చూచావా? నా విడిప్రతులు బైండు కాలేదు. అందుచేత పంపలేదు. తంబి చేతికి వట్టి పొరాలైనా ఇచ్చి పంపవలసినది, మఱచి పోయాను. ఇప్పటికి నీవు చదివి ఉండకపోతే, పంపమంటే బైండుకాకుండా పంపుతాను. లేదా, బైండు చేయించి పంపుతాను. నా శైలికి నన్ను అందఱూ ''తిట్టిపోస్తు''న్నారు. 'అసలు అర్థమేకాలేదు, బాగుందో ఓగుందోయేమి చెప్ప' నన్నవారు బహువచనాన్ని ఆశ్రయించి ఉన్నారు. ఎంతతమాషా చేశానోచూశావా?

నీ నాటకం ఎంతకువచ్చింది? ఎప్పుడు చూపిస్తావు?

ఇప్పుడు మళ్ళీ పత్రిక సంకల్పము పైకి వచ్చింది. ఈసారి చాలాతీవ్ర

ముగానూ, వివరముగానూ వచ్చేస్తూంది మంత్రణ. తంబి విపులంగా చెపుతాడు. నువ్వు, నాన్నగారు వగైరాలు బాగా ఆలోచించండి.చాలా సాహసికమైన తలంపు. కాని నిర్వహించవలెననే ఉన్నది చాలా దర్జా అయిన పత్రికవస్తూంది. కాసుకోండి! నువ్వేమరింత మంచి సరుకు తయారు చేస్తావోచూస్తాను కాదుమఱి! మేము పద్యాలు అట్టే వెయ్యము ఎక్కువ విమర్శనము ఆక్రమిస్తుంది. కాని, సారస్వత రచనలోఎన్ని 'పక్కి'లు ఉన్నాయో అన్నీ చూపుతూనే ఉండాలి, వీలయినంత మటుకు. వివిధ వాఙ్మయాల ఆనుషంగిక పరిశీలనములో ఆదర్శములు సాధించాలి. మీ మాటలన్నీ తంబిజేబులో వేసిపంపించు - బాగాచర్చ చేసి.

మీకు 80 రూ. ఇచ్చారు పంతులుగారు. అక్కడి విశేషాలు వ్రాయి. నమస్కృతులూ, ఆశీస్సులు యథోచితముగ.

చిన్నతంబి

పి. యస్. నేనువచ్చేటప్పుడు అమ్మతోను, చెల్లాయితోను, ఝాన్సితోను చెప్పలేకపోయాను. ఝాన్సీ మఱోదిక్కుకుచూస్తూ కూర్చోవడమేమి మఱి. పిలిచికూడా చెప్పగలనాయేమిటి మఱి! ఇంకా ఆలస్యమయి పోతుందని యింతే పోస్టు చేస్తున్నాను.

* *

కవర్

శ్రీరస్తు క్షేమము

*Beloved Bulli thambi -* 24-3-38

(అంతకంటె తెలుగునే అంటే బాగుంది) మద్రాసు

నా ముద్దుల బుల్లి తంబీ!

అనుక్షణమూ నీదగ్గఱ నుండి ఉత్తరమువస్తే చూచి సంతోషిద్దామన్న ఆశ ఇంత ప్రబలముగా ఉన్న మాత్రాన నువ్వు వ్రాయడం అప్పుడే ఆలస్యమయి పోయిందని ఫిర్యాదు చేస్తే నువ్వు ఒప్పుకొంటావా ? అసలు ఫిర్యాదేమిటి ? అలా అనుకుంటూ ఉండలేకపోతే కాదూ ? వస్తే సంతోషిస్తాను, లేకపోతే ఆరా దీనంగా తలచుకుంటూ ఉంటాను - అన్న మాటలు అసలు నాలో కలిసిపోతూ ఉంటాయి. ఈ అవస్థ సరిగా అర్థము పట్టుకొంటే ! కాని ఆ నిరవధికమైన ఆవృతిలోనే నిరంతమూ నిలవద్రొక్కుకొని ఉండగలనని నేనేలాగు చెప్పగలను ? అని వఱకు పొందిన లాగుదలలు కావలసినన్ని నాకనుభూతాలు అయితే దిగినా ఆ పదవికి తమ వినీత సంతరించిన అంచులు దిద్దుకొని అనుసరిస్తాయి. నా అనుభూతాలు-కాని, కాని యీ గుండె పీకుదలలు ఎలా అనుభవించగలుగుతున్నానో అనిపిస్తుంది.

ఎప్పుడో ఒక దివ్యమైన ప్రకృతియట నాకు పరివేషము పడుతుందట !—'ఇది ఒక శ్రుతి'..........

[కవరులో పెట్టి మళ్ళీ తీశాను. ఏమిటో ఈ అనుబంధము ఎంత ప్రయోగించు కున్నా నా చెవులకు తనివితీరడములేదు. నా జిహ్వ తాను పొందిన తీపికి మించిన తృష్ణలు చప్పరిస్తూంది. ఆ చరిత్ర ఇలా ఒకమాటు వ్రాసుకుంటే అది యేమి తృప్తో ! వ్రాసుకోకుండా ఉండలేక పోయానేమి ?]

నే నిప్పుడు నన్ను నేనే అల్లరి పెట్టుకుంటున్నాను, ఆఫీసులో కూర్చుని. ఒక్క సూత్రములో పోను కాబోలు! నా యిష్టం, ఏమిచేసినా అని ఒప్పుతూంది. సహకారముగా చేస్తాముగా ! మనది మహత్ప్రకృతిగా! అయితే చేసిన దానికంటె మ్రింగినది యెంతటిదో, అది యేమి వెలుగులు అమూర్తముగా ప్రసారిస్తుందో యెవరు గమనించారు ?—ఒకరిమాట మనకెందుకులే.

నా సాధనలో ఒకత్రోవ, ఒక ఆశయజ్యోతి గీత మూర్తి పట్టిన వ్యక్తివి నీవు—అని నిన్నిపుడు కీర్తించుకొంటున్నాను. ఆ తీపి నేను ఆస్వాదించుకోవలసిన చేదువచ్చింది.

నేను నీతోగడపిన ఆలాటి క్షణాలలోని అనంత కాలప్రతిష్ఠ. ఇక్కడ నాకు గవేషణ పిలిచే దూరాలకంటా కప్పువడిపోయింది. నే నిప్పుడు నాలోకి పరుగెత్తుకపోతున్నాను. నన్ను రమ్మంటారేమిటి, లోకానికేదో పనిఉన్నదని? నేను నాలోకి పరుగెత్తుకపోతాను. అందువల్ల అయ్యేపని కాకపోతే, లోకము సరియైన పని యేదో నేర్చుకుంటుందిలే—నే నిప్పుడు రాను........

ఈ దారిలో నేను వెదుక్కుంటున్నాను—నువ్వేదీ ! సర్వముఖాల అవతరించు ! ఎంత నాలో పోసికోగలవు ? చూస్తాను. నాకీమార్గాలలో ఒక చిత్స్వనము వినబడింది. అది నాలో మేళవించింది. అది అనుల్లంఘ్యమట ! నా భావానికి ఒక కిరణములాగ, నీ వంటి ఒక స్నేహవ్యక్తిలాగ ప్రత్యక్షమయింది. అది ఒక వ్యోమ స్పర్శిసౌధ శిఖాసారము మీద మెరిసింది—ఆ సౌధము నా అభయ నిధి. అక్కడ నీవు అనుబద్ధుడవట!

వెంటనే ఒకటి, అనేకము, అద్భుతమైన రచనలు, నీ ఉత్తమ ఉపాయనము, ఒకరకమో, అనేకరకాలో పంపుకో! ఇక్కడ ఒక పత్రిక వెలుస్తుందట. అది నాలో సృష్టి పొందుతుందట. ఇది యింకా గర్భగుడిలో ఘంటారావము. ఎవరికీ ప్రవేశములేదు.

మొదటి సంచిక 'ప్రెస్సు'కి యిచ్చేదాకా మనవంటివారికి తప్ప తెలియ నక్కఱలేదని ఆజ్ఞ. అవసరము చెప్పకుండా, అవసరమయితే చెప్పి వెల్లడి

కానీయకుండా, మంచి వ్యాసాలు సేకరించి పంపించాలట నువ్వు. ఈలాగు రహస్యముగా చెయ్యడము నాకు అసహజమైన పని. అలాగుకాకపోతే అసాధ్య మైనపని కాబోలు. అందుకేకాబోలు బాధ్యతవెళ్ళి జనాంతరాన్ని ఆవరించింది. నేనూ ఇట ఒక అర్థవ్యక్తమైన పరికరకల్పాన్ని. నేను చేసేపని నేను చెయ్యడమే నాపని. అయితే నేను కొంతకాలము మునిగి తపస్సు చేసుకుందామనుకున్నాను. అలాగే చేసుకుంటాను. ఇది దాని వ్యక్తియే అయితే నేనేమి చేయను?

నిన్నరాత్రి వ్రాసుకున్నానులే (అపరిష్కృతము)
'నా జగత్పరిధి పూర్ణ నిజాంక ముద్రణా
ర్పితయత్న భర పరీపిహిత చైతన్యార్తి
తరిమినది వోలు నంతగ నన్ను ఒక కోన
గా, వెల్గు విడు లోతుగా, గళత్తృణతిగా.
'మరి మున్గినాన ఆత్మకు తృప్తిగుడికట్టి,—
బద్ధసూత్రముల కంఠారావములు మోసి—,
మున్గినాన తపోవిముగ్ధ హృత్పరినిష్ఠ—
గజ్జె విప్పితిన లోకము శ్రవఃపుటిం ద్రోచి.
'ఇదయేమి మఱి ఓగంటాలన్న పిలుపు కొన
లే దాటు. సారిల్లు. పొడుచు నాకిరణాలె!
మెఱుపంపదేల నా మెడగాక, జయమాల?
ఇది యేమిటి.—విశాకిల్లు. రాగిలు మనసు!'
అని—

నా సంకల్పము అగ్రము నిలిచిందిలే. నా ఆత్మయెడ అనుబంధము తెలుచు కుందిలే ప్రకృతిని ఆ త్రోవలో జూడము 'నాజను రర్థమై చనున్'....

అది వివరించడాలు ఇప్పుడు కాదులే—

నువ్వువెంటనే ఉత్తరము వ్రాయాలి. వ్యాసాలు పంపాలి. ఆవేళ బండిలో చదివినవాటిని గురించి మాటాడుకోవడానికి నేనపేక్షించిన పరిసరాలు దొరకక మాటాడలేదు దిద్దుకొని కాని, ఆ పాళముగా కాని, నీ యిచ్చనుబట్టి అవి నాకు పంపించు. అందులో తప్పులు ఉన్నాయి. 'ధూళిధూసరితముంగురులు' లాంటి దేదో ఉందని జ్ఞాపకం. అందానికి భంగముతెచ్చే తప్పుకూడాను.

.... .... ....

ఈ సంకల్పము ఫిరంగి మ్రోయించుకున్న సంగతి నీకు తెలియదు. దానితో ఏవోగోడలు బద్దలయి పోతున్నాయట - తంబి చెప్పాడు. ఆ తేజము,

ఆ ఆవేశము ఆకాశానికి తెలుసు. నువ్వు దీక్షితుడవుకా. పరీక్షలంటావు. ఒక దానికి ఒకటి అడ్డేమిటి? అన్నీ సాగుతాయి. మనలో ఇరుకా లేదుగా! మన యిద్దఱి సంగతీ మన యిద్దఱికీ తెలుసును. తంబీ! నీతోచేర్చుకోవానన్ను? ఆ సౌందర్యము నీ కెక్కడిది? పోనీ, నీకు ఏలాగు నాలో మనోజ్ఞ దొరుకుతుందో నువ్వు చేసుకో ఏం? నేను ఒక రసత్వములో నీ ముందు, నీ చేతులో - గుండెలో అని ధైర్యపడ గలిగితే బాగుండును - కరిగి నిలిచాను. నీ యిష్టము! ఓస్! నేను మహా-దీనుణ్ణను కున్నావేమిటి? మహా మహా సంగతులు నన్ను గొప్పవాణ్ణిగానే చూచాయి. (అయితే, *perhaps I'sumbit to conquer*! - *I know not, for I just do but know not what I do*!-*Is it true*! *What a fine fantasy*!) ఎంతో వికారముగా వ్రాశాను కాదూ? చాలా వికటమైన పోట్లాట జరుగుతూ ఉంటుంది నాకు ఎప్పుడూ - సాధారణంగా - ఈలాటి పరిసరాల్లో బాహ్యం తరాలకు. పాపం, ఒక పాట పాడుతానుండు - (ఆవేశ వచ్చేటప్పుడు రాత్రి మెయిలులో వ్రాసింది):

'అనుకో - తథాస్తు, నా
అనుభూతిలో ఒక్క
లోటు తెచ్చేవు నీ
లోత త్తరిలుపోక -

అనుకో - ప్రకృతిఁబట్టి
అదలాడి, బెదరి, నా
యెద ర క్తపుంగ్రోవు
లై చీరువారింది.
(ఈ నొప్పితడవులా
దేటి మైకాలలో
పోసీను సుమసుధల
పుట్టిల్లు నాపట్టు)—

అనుకో - తథాస్తు -
నే నిల్వద్రొక్కెఁను
నే చిక్కబట్టెఁను
కన్నీటి గుడుల, పు
ల్కల లోతుముత్తాలు
ఆశ్రువొలికితె ఏమి
చిఱునవ్వు వెలుగులో

అరవీసమేని చి
క్కినచో మొగిలురాదు -
కదలికే లేని నా
కంఠార్థ నియతిబడి
తన నీడ మేలకువే
దారియట నీ మనికి -
నా రక్తములు ప్రీలు
నదుల అనుగీతాలు
వేదాలు మునుపు నిం
పిన గాలి మలి పంట -
చూతాములే, నాదు
చుమ్మవోకలె నవ్వు,
నీ గుండె పరవశ
మ్మయి కాలబడకుంటె -
చూతాములే........
కాకపోతే పోయె
గాకన్న యీ వంక
కాకపోతే పోయె
గాని....చూతాములే

సి దగ్గఱ ఉన్నవీ షవీ. అన్నీ చూచి యేమైనావ్రాయి, తెలుసుకుంటాను.
సంతకము పెట్టి మఱీ వెళ్ళాలి కాబోలు—

'చిన్నతంబి'

(అదే నా పేరు)

కె. జనార్దనరావ్ మద్రాసు
సబ్-ఎడిటర్, భారతి. 14-4-1933.

బుల్లితంబికి - ఆశీస్సులు

నేను మహాత్వరగా వ్రాస్తాననుకున్నావా ? అయితే ఒకటి. నేను మాత్రం అనుకోలేదాయేమిటిలే ? వెంటనే వ్రాసేద్దామనుకున్నాను. ఇలా టేకిపోవడానికి ముఖ్యకారణం ఏమిటంటే మా అప్ప మోషాఆసుపత్రిలో పడుకుంది ఈ మధ్య.

ఆపరేషను అయింది. అ స్తమానం (తరుచు) ఆసుపత్రికి వెళుతూ వస్తూ ఉండడము. ఇప్పుడు నింపాదిగా ఉన్నది. రెండు మూడు రోజులలో లేస్తుంది బహుశః.

చాలా మంచికవిత్వం వ్రాసేస్తూ ఉంది అప్ప ఈ మధ్య చాలా త్వరగా వ్రాస్తూందికూడానూ- వ్రాస్తుంది కూడాను, అనాలిలే అసలు.

నేనే ఎన్నో భావాలు అరని మెరపులలాగ, అరనిజ్యోతిలాగ మనసునుపట్టి పీకుతూ ఉంటే, భౌతికత బరువు వితలోముడుచుకోలేక, పరిసరము రొదలో శ్రుతిపట్టినా అడుగుచాలులో కొట్టలేక, నిస్సత్త్వుడనై, గళితవీర్యుడనై, ప్రేమ వెలుగులు వెక్కిరించి రోచించే సౌందర్యములాగ, తంత్రులకు తహతహపడే కొయ్యనగట్టి - చనుబాలురసము పిల్చడానికి చప్పరించేవాడుచేరి - త్రిప్పలు పడుతున్నాను, -అడుగులో తొంబై మడతలుగా. మఱికలవుసుమా, చీకట్లుమూసుక వచ్చి ప్రకృతిమహత్వాన్ని అడవులలాగు గర్జించవచ్చే క్షణాల నడకలో .... ఆలాటి వెలుగు వేళలలో.... బ్రహ్మాండమైన ప్రాసాద మండపాల పరిసరాలలో పూలసౌరభమూ, ఆకుల పచ్చదనమూ, మ్రాకులనీడలూ, సముద్రపు దూర ప్రాభవస్వరాల వెల్లమేఘాలలో తేజాలుకట్టుకున్న మేళవింపులలో, కలవు సుమా, ఒక్కచో ఒక్క అణువులోనే అణువులు కలియజూచి సృష్టిసారము కన్నుమూసి మనసులో విచ్చుకొనేపట్లు ! మఱి అది ప్రభవిల్లదేమి నా జీవితము సడలనీకుండా మాత్రము పట్టడానికి ! నేనిది ఒల్లను ఆ! అఒల్లక పోవడము చాలకే ఈ అతృప్తిక పొడుపులు ! మఱేమి ఫరవాలేదోయి. 'సర్దుబాటు కోసము సృష్టి ఊగిపోతూ ఉంటుంది'- మనము ఫిర్యాదు చెయ్యడమేమిటి ప్రకృతిమీద ? అంతా బాగా ఉంది - భేషుగ్గా ఉంది! మనకంటె ధన్యులేమిటోయి! నువ్వేమిటి అన్నావు ? నాప్రతి అక్షరమూ యిప్పుడు కవిత్వపుజల్లులే వీస్తూంది అనా ? నా ప్రతిపదము అమృతజీవ ప్రతిభల విరిసిపోతున్నదనా ? భేష్; మహబాగా అన్నావు. నువ్వంత ప్రత్యయముతో అంటూ ఉంటే నేను కాదనడమెందుకు ? మఱి నీ సంస్కృతిలోనూ రీసనులోనూ (?) నీకు నమ్మకము తక్కువ అని ఎలా అనుకోను ? కాని, ఈ ప్రశంసలో స్నేహానుబంధము చిమ్మిన మోహవర్ణ మున్నదేమో నీ అమాయిక చిత్తములో అనే సందేహముతో ఈ స్వప్నముఊదను. ఒక వేళ ఈ గిలిగింతలో నేను వికసించకూడదూ ? కాని నేను గిలిగింతలు చాలా పట్టేసుకున్నానుసుమా తంబీ ! మఱి అది సత్యచ్ఛాయ అయితే, అది తన ఉచిత భిత్తిక పట్టినదై తే లయపట్టి నాట్యమాడుతానట : నా ప్రకృతి నా ఆత్మ ఆజ్ఞలను ఆఛాయకు జీర్ణించుకున్నది కాబోలు. జీర్ణించుకునే ఉన్నది కావడముచేత

నేను ''ముడుత మదియింపు తరంగలు ముసరనీకు" అని నన్ను నేను అర్థించుకో నక్కరలేదు.

'నా మనసు విప్పు తుది వంపునకు వెలార్చి
బూరటింతువుగాక విహారముదము'-

అని నాయాత్రలోని ఊతపాట- తెచ్చిపెట్టుకున్నదికాక మనసు విప్పి పాడినపాట.

కాని, మఱి నాకు తెలిసియింతలోపము నాకావ్య విచ్ఛిత్తిలో కనబడుతూ ఉండగా నీ ప్రశంస పుష్పమై వచ్చిపడితే, (సరే, నేను మురియడమేమిటి - అనే మాట అటుంచు! నేను ఆలాగుఅనను - అది 'యెడదసిరికదలి దూకాడింది'- పరమార్థమున్నది దానిలో, నా విలాసము ఆత్మపరమై అడుగడుగునా వికాసమే స్వప్న సమర్థకముగా పూచుకొనిమూస్తూ, తన సంకల్పము తుది బిందువులో ఈ సృష్టి, ఈ విశ్వము, నాతో ఏ పొందికలో ఉంటుంది ?

ఇది ఒక ఆదర్శమనుకో, దానికొక గర్వముతోకాదు, ఒక దీక్షతో, ఒక వాత్సల్య పరాధికతతో, ఒక ప్రణయ నిర్వహణముతో, పయనిద్దామనుకో. ఈ ఆత్మస్తుతులు లోకముభరించలేదు. అది నాలోనే ఉంటే లోకమునకు భద్రతలు చేపగలను. ఏమంటే ఇప్పుడు దాని పేరు వేరు- ఆత్మస్తుతి కాదు. అది లేకపోతే, నైరాశ్యములో, దుర్బలతలో, వినయ లక్షణాలు రచించుకొన్న ఆత్మవంచనలో, ఈశ్వరుడంటే నమ్మకములేదన్న సత్యము మనలో తాదాత్మ్యముఒడిచిపట్టివస్తుంది. ఈ మహద్విశ్వాసము మనకు ఊపిరిపట్టు. అది మహర్షుల అనుభవముపట్ల నిర్విశేషము అని నా అంతరాత్మ.

తంబీ! ఈ వేళ నేను జబ్బుతో పడుకున్నాను. ఇంటి దగ్గఱ, సెలవపెట్టా. అప్పకి ఖులాసాగా ఉంది. రెండు మూడురోజులలో ఇంటికి వచ్చేస్తుంది. ఆసుపత్రి రాకపోకలలో ఉత్తరము త్వరగా వేయలేకపోయినాను. ప్రస్తుతము నేను చాలా నిరుత్సాహముగా ఉన్నాను ఎందుకో-ఒక-స్మృతులు చాలా బాధపెడుతున్నాయి ఈవేళ. ఈ ఒక్క వాక్యముల్రాతలో నీతలనొప్పి చద్రుమంది. నీవద్ద నుండి మళ్ళీ ఉత్తరము కాంక్షిస్తున్నా"

పెరియతంబి- మీ శర్మగారికి వెంటనే జాబు వ్రాసేశాడు. ***Free Contributions List*** లో నీపేరు వేయించాను. అమ్మాయీ, రామకృష్ణా పరీక్షలు బాగా వ్రాసినందుకు చాలా సంతోషించాను. అమ్మగారికి సంతోషం కలిగించేది ఏదైనా మనకి సంతోషావహమే.

ధర్మారావుగారికి జాబు వ్రాశాను ఇంటికి. వారిపత్రికమాట యేమిటి ? శివశంకరశాస్త్రిగారుకూడా ఇక్కడ ఒకరికి, శ్రీనివాస శిరోమణిగారికి ఉత్తరము వ్రాశారట పత్రిక పెట్టబోతున్నామని.

నువ్వు (నాతో చెప్పుకోవలెనంటూ) సూచించిన విశేషము తెలుసుకుందా మని ఉంది. అది నన్ను కంగారు పెట్టిందికూడా. ఏమంటే, ఆ ఉన్న వాక్యాలలో అది నా ఊహకందలేదు - నా యిష్టమువచ్చిన ఊహకు అందలేదని చెప్పవచ్చు చే అనీ, అది నన్ను ఏ విధముగా తాకుతుందో అనీ తెలియడములేదు. అందులో ఇప్పుడు బెంగలు ఎక్కువగా ఉన్నాయి నాకు. అని యేమి ఆలోచించగలను?

నీ ఉత్తరం ఒకటి చూడాలని ఉంది. ఇది ఒక నిరోధించుకోని ఇచ్చనాది.

అమ్మగారికి నమస్కారాలు చెప్పు. అమ్మాయిని, రామకృష్ణని, ఝాన్సీని అడిగినానని చెప్పు. దీక్షితులుగారికి ప్రణామాలు. శ్రీరామమూర్తి, సుబ్రమణ్యం, ప్రకాశరావుగార్లవంటి స్నేహిత వర్గానికి నమస్కారములు. నా కింక ఓపిక లేదు చేతి ఓపికకాదు. అది నాకొక లెక్కకాదు. నేనిప్పుడు జబ్బుగా ఉన్నాను తంబీ! ఒంటి జబ్బు నాకొక లెక్కకాదు. నేను జబ్బుగా ఉన్నాను. సెలవుపుచ్చుకున్నాను'

— చిన్నతంబి.

* *

కార్డు

*Dear Brother*,

నేనిక్కడ—.... *ection* చెయ్య లేకపోవడం వల్ల *1st Week* దాకా ఆగి పోవలసి వచ్చింది- ఒకటి రెండు రోజులు *extra.* కొత్త వాళ్ళని మాత్రం చేర్చుతున్నాను. ఈవేళ అందరికీ జీతాలు వస్తాయి. రేపు కాని యెల్లుండి కాని జేబు కొంత బరువెక్కించుకొని బయలుదేరి రాజమండ్రి చేరుతాను. నీ వద్ద నుండి యిక్కడికేమో జాబు లేదు. *Proof* కూడా అట్టే....గా రాలేదు. *1 form* పద్య.... మాత్రం వచ్చాయి. పంపించే .... అప్పలస్వామిగారి పద్యం మా....చారు. అది నువ్వే *Proof*.... కట్టించు. ఎక్కువ అయి .... అనుమానం లేకపోలేదు .... భద్రరావుగారిది నిలిపేశాను .... వాలి. *Please finish print*....

(ఈ కార్డు కవితా సమితి పురిపండా అప్పలసామి గారి పేరున్నది. అక్కడక్కడ చినిగి పోయింది. విశాఖ నుండి మద్రాసు మల్లంపల్లి సోమశేఖర శర్మ గారికి రాసింది. తేదీ సరిగా లేదు. ఉదయిని అచ్చయే కాలం. బహుశా 1935ది కావచ్చు.)

కవరు

UDAYINI

A TELUGU LITERARY BI-MONTHLY

*Editor*
*K. JANARDANA RAO*
*Camp. Gangalakurru*
*P.O. Ambajipeta*

15, *Audiappa Modali St.*
*Purusawalkam, Madras*
3-2-36

*Dear Brother,*

నిన్న ఆదివారం మా అన్నగారి రెండో అబ్బాయి వసంతానికి ఉపనయనం. నాకు కాకినాడలో తెలిసి మొన్న రాత్రికి ఇక్కడికి వచ్చాను. మళ్ళీ ఎల్లుండి వెళ్ళి పోతాను కాకినాడ. కాకినాడలో కృష్ణశాస్త్రిగారు దీక్షగా పని చేస్తున్నారు ఈ వేడిలో నా చేత పని చేయించేసుకోండి. పాతిక మందిని చేర్పించేద్దాం. వంద రూపాయలు మీకు ముట్ట చెప్పేస్తానంటున్నారు. ఈ వొడుక్కి కూడా వెళ్ళడం మానెయ్యగలిగితే మానెయ్యమన్నారు. పోనీ వెళ్ళి వెంటనే రమ్మన్నారు. మాన వీలు లేక పో.... తిరిగి త్వరగా వెళ్ళి పోతా .... వెడదామను కొని వెళ్ళి .... ఒక వారములో డబ్బు .... కొంత మందిని చేర్పించారు. *List* పంపుతున్నాను. ఒకరో ఇద్దరో *donors* అవుతారు దానిలో. డబ్బు త్వరలో వస్తుంది.

పత్రికకి *matter* సరిపోయిందనుకుంటాను. *V.N.* భూషన్, రామిరెడ్డి, వెంకటచలం, వెంకట రమణయ్య గార్ల వ్యాసాలతో, నువ్వు ఒకటైనా *review* వ్రాస్తావా! శ్రీ శ్రీ రెండు మూడు రోజులలో పంపుతాడు .... నేను శృంగాటకం, కిరణాలు పంపితే చాలా సంతోషించు. అవి త్వరలో పంప యత్నిస్తాను. కాకినాడలో కూర్చుని - *sure.*

నవ్య సాహిత్య పరిషత్తు గురించి వ్రాయవలసి ఉంది ముఖ్యంగా ఒక విశేషం. 'ఉదయిని'ని పరిషత్పత్రికగా తీసికొనే విషయమై తీవ్రమై జరిగింది. చివరకు జారిపో.... విచారించడం కంటె .... చవలసిందనే కొందరి .... అలా జరిగితే బాగుండును కృష్ణశాస్త్రి, దీక్షితులు ప్రభృతుల అభిప్రాయం, ఉన్న పరిస్థితులలో అలా జరగబడింది కాదు.

వచన మంతా వాడుక భాషలో వెయ్యాలన్న మాట మళ్ళీ వచ్చింది. దీక్షితులుగారూ, ఆదినారాయణశాస్త్రిగారూ, వెంకటరత్నంగారూ, శివశంకర శాస్త్రిగారూ, మొక్కపాటివారూ, నేనూ ఉన్నాము ఆ చర్చలప్పుడు. దీక్షితులు గారూ, ఆదినారాయణశాస్త్రిగారూ ఆనియమాన్ని చాలా తీవ్రంగా ప్రతిఘటించారు,

అంత తీవ్రంగానూ శాస్త్రిగారూ, వెంకటరత్నంగారూ ఉన్నారు. "ఆ *fundamental Point* లో భేదం వస్తే మనకి కుదరదండీ" అన్నారు వెంకటరత్నం గారు.... దీక్షితులుగారినీ, ఆదినారాయణశాస్త్రిగారినీ *ignore* చేసి - కొంచెం .... *matic* గా అని చెప్పాలి, వారు .... దీక్షితులుగారు .... పరిషత్తులో.... అలాగే .... అనలేను. —

ఈ చిన్న గుంపులో కంటె పది మందిలోనూ మళ్ళీ *discuss* చేయించ వచ్చునని, అది కూడా దీక్షితులుగారికిబ్బంది లేనట్టు కన్పించింది. కాని శాస్త్రి గారు, పరిషత్తు *policy* పైకి చెప్పనక్కరలేదు; అందువల్ల కొంత కష్టం ఉంది-కొందఱు జారిపోతారు..... .... .... .... ....

మీరైనా *written* గా నివ్వనక్కఱలేదు. *Oral* గా అనేసి అలాచేసేస్తే సరి అన్నారు వ్రాసియిచ్చినా *Oral* గా చెప్పినా ఒకటే. పరిషత్తుకే కష్టంఉంటే అలా చెయ్యడంవల్ల పత్రికకి మాత్రం కాదా అని మేము మళ్ళీ ఎదురు తిరిగాము: అది తేలకుండానే యింకో కొమ్మ పుచ్చుకున్నారు [ఉత్తరంలో ఈ వాక్యం కొట్టేసివుంది. ॥సం॥] పద్యాలలో ఎలా ఉండాలంటారన్నారు దీక్షితులుగారు.... వల్లనే. ఇంకా అవి అలా....అంటారు శాస్త్రిగారు. 'కాదు,'........ నే గ్రాంధిక భాష వ్రాస్తున్నారు. *Weakness* వల్లకాదు, అని చెప్పాను నేను. కృష్ణశాస్త్రి ప్రభృతుల పద్యాలు కూడా వీలైతే మానెయ్యమనే శాస్త్రిగారి సలహా. అలా జరగదన్నాను. అవి అలావుండగా ఇంకో కొమ్మమీదికి దూకేరు వెంకటరత్నంగారు. అసలు *property* పరిషత్తుదేనా, మీదా అని ఒక విషయం అన్నారు. పత్రిక పరిషత్తుదే అయితే బాగుంటుంది. మీరే *editor* గా ఉండవచ్చు — అది *hand over* చేసి అని. పత్రిక మీదే అయే పక్షంలో ఇప్పటి వరకూ జరిగిన చర్చ అంతా ఎందుకు. ఆ చర్చ అంతా జరిగిందీ అంటే నా పత్రిక మీరు *authorise* చెయ్యడానికి పూనుకున్నారనే అర్థం - మీరు వేరే పత్రిక .... నా పత్రిక *hand over* చేసి

ఈ ఉత్తరం జనార్దనరావ్ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి రాసింది మద్రాసు చిరునామాకు తంబిత్రయం అని జనమంచి కామేశ్వర్రావు, జనార్దన రావ్, మల్లంపల్లి వాళ్ళు ప్రసిద్ధి వాళ్ళలో వాళ్ళకు. జనమంచి బుల్లి తంబి, మల్లంపల్లి పెరియ తంబి. కొంపెల్ల తంబి, ఈ ఉత్తరంలో కొంత భాగం చినిగి పోయింది. ఉత్తరంలో ఉదయిని వర్గానికీ - నవ్యసాహిత్య పరిషత్తుకీ జరిగిన వాగ్వివాదం కనిపిస్తుంది. ఎవరు ఎటు కొమ్ము కాశారో తెలుస్తుంది. ॥సం॥

.... ప్రసక్తం కావు అన్నారు. నేనేది ....న్నానని పరిషత్తు అన్నది .... వెంకటరత్నం గనుక అయితే ఇంత *discussion* ఎందుకు! పరిషత్తు తరఫునే కదా జరుగుతూంది. అంతా పాల్గొన్నారు (ఇదీ మీరు *personal* గా అన్నదే కదా అయితే) .... చివరకు పరిషత్తు వేరే పత్రిక పెట్టడమా, ఇది తీసుకోవడమా దీనిని *authorise* చెయ్యడమా, అన్న మూడు విషయాలు లేచాయి - ముక్కపాటి వారు పరిషత్తే ఒక పత్రిక పెట్టాలి, *individual* తో పరిషత్తుకలవదని సెలవిచ్చారులే. అసలీ *proposal* ఎందుకు తెచ్చారు- ఉద్దేశం ఏమిటని శాస్త్రిగారి చేత చెప్పించారు; మీరు కూడా పరిషత్తులో ముఖ్యులు కనకా, మీదొక పత్రిక ఎలాగా ఉంది కదా మా అందరికీ ఇంచు మించుగా వచ్చిన పత్రిక అనీ నేను తెచ్చానన్నారు. అందువల్ల ఆ *grounds* మీదనే ఇంక....సాగితే బాగుంటుంది, పరిషత్తు .... పెట్టుకొనే శక్తి ఉందా లే... చోటు లేదు! (అదిమా .... షత్తు నడుపుకో గలదా పత్రిక అని ముక్కపాటివారూ, శక్తి లేదని దీక్షితులుగారూ ఆ *issue* తడివేరు). ఇంకా చిల్లర్లు చాలా లేచేయి. శక్తి వచ్చేదాకా ఇది *takeup* చెయ్యడం మాట వచ్చింది. ఇది అన్యాయం అన్నాం. ఇష్టమైతే *takeup* చెయ్యడం, కాని శక్తి లేక *takeup* చెయ్యడం, శక్తి వచ్చేక మానడం అనేది బాగుండదన్నారు .... పరిషత్తుకే పత్రిక కావాలంటే ఒక పద్ధతి చెప్పాను నేను. 'ఉదయిని' ఒక *limited concern* చేసి నన్ను *permanent editor* ని చేస్తే ఇద్దరి *interests* కాపాడిన వాళ్ళమవుతాము (నావీ పరిషత్తువీ) అంటే *editor* కి *pass* చెయ్యగల శక్తి లేదు పరిషత్తుకి అన్నారు వెంకటరత్నంగారు. ఆ పక్షంలో దాన్ని .... య్యడం బాగుంటుంది. *prop* .... న్నాను. చివర .... ములతో చాలా *discussions* జరుపు కొన్నారు. దీక్షితులుగారూ, ఆదినారాయణశాస్త్రిగారూ ఒక పక్షంగానూ, శివశంకర శాస్త్రిగారూ, వెంకటరత్నంగారూ ఒక పక్షంగానూ- ముక్కపాటి వారు అసలు అతకదు కనుక వేరే పెట్టడమే మంచిది, పరిషత్తు కదో లెక్క కాదని అంటించారు. దీక్షితులుగారు ఆ శక్తి ఉండడాన్ని బట్టి ఆలోచించినా "ఉదయిని". *authorise* చెయ్యడమే మంచిది, పరిషత్తుకి శక్తి లేదు- ఇది జరగదు అంటారు.... దేశం ఇన్ని భరించలేదనిన్నీ- కృష్ణ శాస్త్రిగారు వీటిలో పాల్గొనలేదు కాని వారి అభిప్రాయం అదే....

తర్వాత కొంత సేపటికి *general body meeting* జరిగింది. *constitution* వచ్చింది. .... *register* చేయిస్తారట. దానిలో ....ట వచ్చింది కాని, 'ఉదయిని' .... ఒక *quarterly* పెట్ట.... శివశంకర శాస్త్రిగారు *branch secretary* (*and Editor*) (అదినా *proposal* ఏ - *in preference to Venkataratnam* గారు.) చివరకి వెంకటరత్నంగారు కాని, శి. శాస్త్రిగారు కాని

మళ్ళీ పత్రిక మాట నాతో తలపెట్ట లేదు — పోనీ ఇలా అయింది అని కూడా. ఆదినారాయణశాస్త్రిగారూ, దీక్షితులుగారూ వాళ్ళు చెప్పారు చాలా మందితో మాటాడేము, కొందరు ఒప్పుకోడం లేదు - అలాగ ఇలాగ అని - ఇదే బాగుంది అని అనుకున్నారు చివరకి - 'ఉదయిని' *interest* లో మనకు *relieving* గానే ఉందేమో.

పరిషత్తు *constitution discuss* అయేలోపుగా *youger group* తో కొంచెం కబుర్లు లేపి మాటాడు కొన్నాము. ప్రత్యేకం మేమొక .... కూర్చుని *constitution* .... విశ్వం, శ్రీ శ్రీ, తంబి .... మేమంతా వాళ్ళ .... విశ్వం అభిప్రాయంలో అవసరమైతే విడిపోవడానికి సిద్ధపడి కూడా మా అభిప్రాయాలు గుద్ది చెపుదామనే, ముఖ్యంగా వాడుక భాష మాటవస్తే గ్రంథం నడిచేదే. 'ఉదయిని' మాట రాలేదు సరిగదా, వాడుక భాషలో ఉండే గ్రంథాలే ప్రకటించాలి అని రాజమండ్రిలో చేయించిన తీర్మానం కూడా రాలేదు; చెప్పారుగా శాస్త్రిగారు కలుషితంగా ఉంచుతామని. *For the promotion of modern Telugu* పాటు పడాలని పెట్టారు. *Negative* గా కాకుండా, చేసేదేదో చల్లగా చేస్తారు, కాని ఆక్షేపించడానికేముంది? *that is politics* .... ... అయినా కొన్ని ఘట్టాలు మోహమాటమని తెలియ జేసేవి జరిగేయి.

## ఓ సిద్ధాంత గ్రంథంలో 'ఉదయిని'

డా॥ యస్వీ రామారావుగారు తమ డాక్టరేటు పరిశోధనా గ్రంథంలో 'ఉదయిని' పత్రికను గురించి ఇలా అభిప్రాయపడ్డారు.

ఉత్తమ స్థాయిలో కొనసాగిన ఉదయిని కొంపెల్ల జనార్దనరావు సంపాద కత్వములో మదరాసు నుండి ద్వైమాసిక పత్రికగా (1935) ప్రకటితము.

దీక్షితులు నాటికలు (పిలకా), సీత - కుందమాల (విశ్వనాథ), అభినవాంధ్ర సాహిత్యము (దువ్వూరి), ఆధునిక కవిత్వము (శ్రీ గోపాల కృష్ణ మూర్తి) ఏకవీర (ఆచంట జానకిరాం), మున్నగు ఉత్తమ విమర్శ లిందు కలవు. 'వాఙ్మయ వీధి'లోని సమీక్షలు, 'కిరణాలు' లోని సంపాదకీయములు ఎన్నదగినవి.

తెలుగులో సాహిత్య విమర్శ
ఆవతరణ - వికాసములు 1974.

ఇంకొక విశేషం నేనూ, శ్రీశ్రీ, విశ్వం, తంబి గణపతి .... వంటి వారం అంతా దీక్షగా.... ఇలాగ వ్రాస్తాము, వ్రాయడ ....ధానం. కొన్ని శాఖలుగా.... ఉపయోగించుకోడం —

*List* ....

ఇవి త్వరగా *post* చెయ్యాలి
మళ్ళీ కాకినాడకే వ్రాయి.

*Janardan*

అంతా క్షేమమని తలుస్తాను. ఇక్కడంతా క్షేమం.... *exchange* పంపుతున్నారా? .... ష్ట శాస్త్రిగారు ఇంకా తిరు .... బహుశా నేను అక్కడ.

*  *  *

Madias, May, '36.

Dear Thambi,

Your silence is dreadful.

I feel so wretched and for born within myself that I break into spasmodic sobs and fits of lifeless weeping. I can't bear the thought of my being shunned by you. But I must bear this punishment. I won't question your discretion. How can I hope to fruitfully pologise or even explain, as I don't want to bring additional strain upon you. For those things are worse than themselves, when once exploded, and every breath adds to the fire. But when I was moving with you, moving in the household, it was not with any motive-not for any possession that I might get at through you; and when I think of you I think of nothing else: You are supreme there And the chief aspect of our association has never failed to inspire

---

కృష్ణా పత్రిక 7-12-1935 నాటి సంచిక ఇలా నమోదు చేసింది.

విశాఖపట్నం రహదారి బంగళాలో జరిగిన సమావేశంలో నవ్యసాహిత్య రజతోత్సవం 1933 ఏప్రిల్ రాజమండ్రిలో జరపాలని హాజరైన సభ్యులు తీర్మానించారు. స్వామి శివశంకరులు, తెలికచర్ల వెంకటరత్నం, శ్రీశ్రీ, కొంపెల్ల జనార్దనరావు, పురిపండా అప్పలస్వామి, మల్లవరపు విశ్వేశ్వరరావు. ఆచంట జానకిరాంగారలు ఈ నవ్య సాహిత్య పరిషత్ సభకు హాజరైనారు.

my consciousness as anything else than high, idealistic and artistic. Only the unfortunate thing came off like and awalanche. The complex complexes were at play from below. The data were rendered into miscomprehension. The pointers were misread - or they tottered and oxillated wrong ways. At last,- A moment - and with wreck - the wreck of spheres! An abyss opened before me, under me. The whole grove around declared its beauty into a frown. Mother Age came down with her blissful curse which relieved me in my stifled loneliness in the chill air. I was awaiting youth to crown me with its blessings too, in that gloomy festivity, while I felt old before I was young. What all you found in my lineamants at the time of my departure was nothing but an eagerness for a confession before you and an understanding with you- Though I did not know how to conduct it I was already mutely talking to you shapelessly. But you had "no time" for me. I thought of writing to you, but the moment I stepped in Madras I was physically engrossed in work, though I was hunted with myself and you in that night.

Two days and I was to start back to Rajhmundry inspite of myself. I'm sorry I couldn't help you from my face, though I am so glad to be able to see you so soon again. I thought of writing the letter, somehow but I could not sit at And your letter came- And the bottom of the botomless abyss - For I could not feel even my way down. For the air froze into rock. My tears were rock. I found I burried the friend and was haunting the abyss alone. I had no strength nor desire to break through the meshes of shame that had woven over me. But a ghost escaped me and was caught in the meshes. But an angel too escaped me and lured itself out beyond my shame. I'm torn between the two. The flames are bright around me, cought from my own kindled heart. From my own blood I have reaped this mental calamity that has broken upon

me, but how unawares ! I never knew I was going to be so ungrateful and dangerous ! I never consciously stated my obligations ! I never intended to be the brute, but I was wrought into the frame. As for morals of conduct I am undone, but if there is a thing like the internal morality or consistency of an event, well I'm undone there to; I am not able to understand the thing myself ! And I'm sorry to the core how I have been responsible for these and these repurcussions. I've polluted your innocent enjoyment of association with friends, that's what ails me most and brought shame upon you. But no "satitva" could be profound unless it had profound itself first. Only spit fire from every nerve upon these profare hands, but let it not suffer. My heartfelt apologies to you all, though they only go by gasping.

And I am - this forborn wretch, carrying my own wreck into this roaring wind. But let me beg you not to identify me with these low clouds. Let not the fact of our high skies and the sun ignored. Please protcet me as you would a child. Inspire me for the better and higher ways of life that we were dreaming of together. Let our friendship be tight there, while personally I would try to forget my sweet contacts with your affectinate heart in order to atone for my sin. But let me not shake you off my being for I so much fine for you. Please don't shun me thus - if you can keep. I weep like a child for you. I'm writing with this great sorrow. I reiterate, this is verily calamity for me......

But I feel so Indebted to you for the lofty promise of retaining your interest in the journal - and also me. Impersonally !

Let not "Udayani" suffer for this littleness And you must all the more take care of it. But why should I beseech you when you promise of it yourself ?...

The printing is over and the copies will be ready by Monday. Some of them - even tomorrow. Also the press bill for about Rs. 150/- we have only a few advertisements this time. And the postage will come upto about a forty or so. We must pay the press atleast Rs. 60/- now. That means we need a hundred on hand, so that we can finish despatching this number and commence the next soon......

Sorry you did not send me the correction in your price. We will put it next time. Hope Viswam is there. How far has he done with his book? How is "Pratibha"!

Blessings to Ganapathi.

Please reply,

Yours Ever loving,
Dr. Hogg.

నీ ఉత్తరం మూలాన

దాట బెట్టుకున్నాను ఇల్లాంటివి కొత్తేముంది.

For instance I lost two
birds or more in the hand
for one in the bush, which
I lost equally and got
Thorns in the skin instead.

*Dr.* హాగ్ షెల్లీ మిత్రుడు సన్నిహితులుగా జీవించేవారు. హాగ్ షెల్లీ భార్యతో ప్రేమ కలాపాలు సాగిస్తున్నాడన్న అనుమానం కల్గింది. ఈ సందర్భంలో షెల్లీ *'My friend had clay feat'*, అని హాగ్‌ను కమెంట్ చేశాడు. *Psychology of Shelly - by Edward Carpenten* అన్న పుస్తకంలో ఈ ఉదంతం ఉంది. తన్నిలా సంబోధించుకోడానికి కారణాలేం కనిపించడంలేదు.

*   *   *

ఉదయిని
తెలుగు సాహిత్య ద్వైమాసిక
సం॥ కె. జనార్దనరావు

15. అదెప్పముదలి వీధి,
పరశువాకం, మద్రాసు.
1-10-36

*Dear Bro....*

ఒకటో అక్టోబరు వచ్చింది. 'ఉదయిని' మొదటి ప్రూఫు వచ్చింది. అచ్చు ప్రారంభమయింది. పాత ప్రతులు చాలా మటుకు వెళ్ళిపోయినాయి. పాత బాకీ మాత్రం కొండలా ఎదురు నిలిచి ఉంది. తెలికిచెర్ల కృష్ణమూర్తిగారికి కట్టలోకాపీ పెట్టలేదా నేను? ఇక్కడమళ్ళీ కలుసుకోడం పడలేదు నీ వద్ద (గోపతి వద్దనైనా) విడిగా ఒక ప్రతి ఉంటే అందిస్తావా? పంపించూ? ఆది నారాయణ శాస్త్రి గారికిశర్మ గారిచేత కూడా వ్రాయిస్తున్నాను. ఆని యెక్కువ *Obligation* కాకపోతే నాన్నగారు తప్పక చేస్తారు. .... ...

'మాలతీ మాధవము' భారతి ప్రతి అప్పుడే ఎవరికో ఇచ్చారు విమర్శ కోసం. ఉదయినిలో సుబ్బరామయ్యగారు చేస్తారు. విశేషాలులేవు. కాదు, ఉన్నాయి. ఏమిటో అని జ్ఞాపకం చేసుకోవాలి. ఉన్నాయని మాత్రం తెలుసు నాకు. లేవని పించింది కాని.

నీ పద్యం ఈసారి వెయ్యకేం. కిందటి సారే వేద్దును. ఎన్నిసార్లుపొడిచినా నువ్వు మాటాడందే. నేనే దిద్దివేద్దును. ఎందుకైనా మంచిది. కవిగారి అభి ప్రాయం కనుక్కుంటేనని నా ఉద్దేశం. చివరికి ఉన్న కాస్తచోటూ పొర్లెత్తి పోయింది. పద్యాలతో. మరికొన్ని నిలిచి పోయాయికూడా. అంతా అయాక అక్షింతలు పుచ్చుకుని తయారైనావు. లోకువకట్టు· నీయిష్ట మేనయి కానీ!

జానకిరామ్‌కి కాకినాడ "ఉదయిని" పంపించేను. విపులంగా అంతా వర్ణిస్తూ పెద్ద ఉత్తరం వ్రాశాను. అంతకు పూర్వమే ఆయన 'ఉదయిని' చూచి ఉంటారు. అయినా అప్పటికీ ఇప్పటికీ ఆయన ఉత్తరమే వ్రాయలేదు.

నేనొక విచిత్రమైన ఘట్టంలో ఉన్నానులే, అందరినీ అడిగానని చెప్పు. 'అదొ పూజ్యోనగణాధిపః' అంతా క్షేమం(ఈలాంటి విషయాల్లో అట్టే శ్రద్ధలేదులే.)

జనార్దనరావు

*Renewals* ఏమైనా జరుగుతాయా. అక్కడ (*Subscribers* తోని! కడుపునిండా ఒక ఉత్తరం రాద్దూ. మహదాహంగా ఉంది. నేనెంత రాద్దామను కున్నా రాయడమే చేత కావడం లేదు. ఏముంది కాని రాయడానికి! ఏమిటో తృప్తిలేదు!

Madras,
5-2-1937.

Dear Brother,

Your letter and Shastri's, Later Ganapati also wrote to me.

My hand is already aching but I want to write to you and Shastri Garu at least now to Ganapati. I shall try later. Meanwhile tell him about my safty.

I am improving satisfactorily. I am definitely out of danger. I have picked up strength enough to get up and walk a few steps. I am not at fit for a journey within a week or so I may be allowed to start. My brother Mr. Surya Rao is here. He wiil take me to my village, where I shall be obliged to take rest for few months in order to become "normal" man. Meanwhile we are also trying to obtain expert opinion. Yesterday I was recommended for rhe X ray photograph and it was done. The result will be known on Monday. I have felt fresh strength for your kind love and I am sorry for this delay in acknowledging, but I could not help it. I am very happy over the luck that you could secure that sort-of a fine job in Rajmandri itself. How are you getting on.

There are chances of "UDAYANI" not being suspended only it may be coming as a bi-monthly as before.

(If possible send a few chips).

Yours effectionately,
(JANARDAN)

# ఉదయిని - రచయితల - రచనలసూచి

క్రీ :- క-కవిత; సం-సంచిక; పు-పుట; అభి-అభిప్రాయాలు; సమీ-సమీక్ష; నా-నాటిక; వ్యా-వ్యాసం, వ్యాఖ్య, సంపా-సంపాదకీయం; సంభా-సంభాషణ; సమీ. వ్యా-సమీక్షా వ్యాసం; స్కె-స్కెచ్; లే-లేఖ..

నోట్

ఉదయినిలో లేని పేజీలు

సంచిక-1 లో 41 నుంచి 46 వరకు

సంచిక- 4 లో 315 నుంచి 318 వరకు.

అప్పలస్వామి పురిపండా, భైరవి, క. సం. 4 పు. 260-61

అప్పలస్వామి పురిపండా, వేకువ యామిని, క. సం. 3 పు. 184

అప్పలస్వామి పురిపండా, ప్రేతభూమి, క. సం. 6 పు 432

అభిప్రాయాలు - గృహలక్ష్మి, ఆంధ్రభూమి, ప్రజామిత్ర, భారతి, వినోదిని, *The Hindu*, సం-2 పు. 164 (*ii* - *iii*)

అభిప్రాయాలు - ఆంధ్ర పత్రిక, సం - 5 పు. 412 (*ii*)

ఆంజనేయులు కొడాలి, అభిమన్యుడు, క. సం. 6 పు. 431

ఆదినారాయణశాస్త్రి, పంచాగ్నుల, అభిప్రాయాలు, ఉదయిని మీద అభి - సం - 2 పు. 164 (*i* - *ii*)

కరుణ కుమార, కొత్త చెప్పులు, కథ. సం - 6. పు. 433-49

కామేశ్వరరావు జనమంచి, విరహము, క. సం. 3. పు. 180

కామేశ్వరరావు జనమంచి, అదృష్టము, క. సం. 4 పు. 256

కామేశ్వరరావు జనమంచి, ఆ కొండ, క. సం. 1. పు. 23-24

కామేశ్వరరావు జనమంచి, వాఙ్మయవీధి, తెనుగువీణ, - ఇంద్ర కంటి హనుమచ్ఛాస్త్రి, సమీ. సం. 4. పు. 322

కామేశ్వరరావు జనమంచి, ఆరనిజ్యోతి, కథ, సం. 4. పు. 291-93
కేశవరావు తేజోమూర్తుల, పావురాలు, దారుచిత్రము, సం. 4. పు. 306
కృష్ణా పత్రిక, *Triveni* (*K. R*), అభి - సం - 3, పు. 240. (*ii*)
కృష్ణమూర్తి తెలికిచెర్ల, పద్యాలు, క. సం. 5. పు. 338.
కృష్ణశాస్త్రి, ఒకనాటి రేయి, క. సం. 6. పు. 421
కృష్ణశాస్త్రి, మధూదయము, క. సం. 3. పు. 173
గణపతి శాస్త్రి పిలకా, వాఙ్మయ వీధి, 1, అలంకారమంజరి - శే. వేం.
రాఘవయ్యంగారు, 2, వ్యాసావళి - ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, సమీ.
సం. 3. పు. 236 - 38
గణపతి శాస్త్రి పిలకా, పరిత్యాగం, నాటి, సం. 2, పు. 133-139
గణపతి శాస్త్రి పిలకా, శ్రీ దీక్షితులు గారి నాటికలు, వ్యా, సం. 4
పు. 268 - 74
గిరి, దృక్పథం, కథ. సం. 5, పు. 399-404
గోపాలకృష్ణమూర్తి శ్రీపాద, ఆధునిక కవిత్వము, వ్యా. సం 5. పు. 384-94
చలం, మృత్యువు, నా. సం. 3. పు. 201-22, ఇంగ్లీషులో ఉత్తరం కూడా,
సంపాదకునికి వ్రాసింది వుంది. పు. 200
చలం, శేషమ్మ - *A study*, కథ - సం - 6. పు. 495-99
చలం, ఆనందం, వ్యా, సం. 1. పు. 50 - 58.
చలం, ప్రేమ పర్యవసానం, కథ, సం - 2, పు. 98 (1) - 120
చలం, భానుమతి, నా, సం. 5. పు. 373-83
జనార్దనరావు కొంపెల్ల, వాఙ్మయ వీధి, కిన్నెరసాని పాటలు,
కోకిలమ్మ పెళ్ళి - విశ్వనాథ సత్యనారాయణ, సమీ-సం - 2, పు. 161 - 62
జనార్దనరావు కొంపెల్ల- శృంగాటకం, 1. 'కళానిధి' కథల పత్రిక 2. పత్రికలు,
3 ప్రబుద్ధాంధ్ర సంపాదకులు లేవదీసిన భాషా సమస్య, 4. మద్రాసులో
వేనరాజు నాటక ప్రదర్శన. 5. బళ్ళారి రాఘవాచార్యులు. వ్యా. సం. 2
పు. 163 - 64
జనార్దనరావు, కొంపెల్ల, కిరణాలు సం. 3 పు. 169 - 172
జనార్దనరావు కొంపెల్ల, శృంగాటకం సంపా. 1. పావురాలు - దారుచిత్రం
2. చిన్నయసూరి పాండిత్యం, 3. భారత పరిషత్తు 4. జయంతి,
రామయ్య పంతులు, వ్యాఖ్య సం. 4 పు. 323 - 24

జనార్దనరావు కొంపెల్ల, కిరణాలు, సంపా. సం. 5 పు. 329 - 32

జనార్దనరావు కొంపెల్ల, వాఙ్మయవీధి 1. సాహిత్య తత్వ విమర్శనము జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి 2. గోలకొండ పత్రిక 11వ సంవత్సరాది సంచిక 3. ప్రతిభ - నవ్యసాహిత్య పరిషత్పత్రిక, మొట్ట మొదటి సంచిక 4. వీణ - మాసపత్రిక, సం॥ పా. మాధవ శర్మ, సమీ. సం. 6 పు. 511 - 13

జనార్దనరావు కొంపెల్ల, శృంగాటకం. 1. త్రివేణి 2. ప్రబుద్ధాంధ్ర 3. మదామ్ సోఫియావాడియా - *P. E. N.* 4. *International Association of writers for the Defence of Culture.*

5. హంస — హిందీ మాసపత్రిక

6. చెస్టర్టన్, గోర్కి, ఋషి కావ్యకంఠ అయ్యల సోమయాజుల గణపతిశాస్త్రి ఆంధ్రవాల్మీకి వాసుదాసు మరణాలు, వ్యాఖ్య. సం. 6. పు. 514-16

జనార్దనరావు కొంపెల్ల, విద్యార్థి, నా. సం. 6. పు. 489-94

జనార్దనరావు కొంపెల్ల, కిరణాలు, సంపా, సం. 6. పు. 417-20

జనార్దనరావు కొంపెల్ల, వాఙ్మయ వీధి, కవిగారి మనుగడ - జయంతి సుబ్బారావు, సమీ సం. 5. పు. 409

జనార్దనరావు కొంపెల్ల, వాఙ్మయ వీధి, ఆంధ్రపత్రిక దాత సంవత్సరాది సంచిక, సమీ. సం. 5. పు. 410

జనార్దనరావు కొంపెల్ల, శృంగాటకం.

1. ఉదయిని,
2. నవ్యకవిత,
3. రాజమహేంద్రవరము.
4. గిడుగు వెంకటరామమూర్తి, వ్యాఖ్య. సం. 5. పు. 411–12.

జనార్దనరావు కొంపెల్ల, స్వర్ణయోగి, సంభా. సం. 5. పు. 348

జనార్దనరావు కొంపెల్ల, కిరణాలు, సంపా, సం. 4. పు. 245-48

జనార్దనరావు కొంపెల్ల, శృంగాటకం.

1. ప్రజామిత్రలోని చెణుకులు,
2. చలం ప్రేమ పర్యవసానం కథ

3. ప్రబుద్ధాంధ్రకి సమాధానం. వ్యా. సం. 3. పు. 239-40.

జనార్దనరావు కొంపెల్ల, వాఙ్మయ వీధి

1. ప్రభ - సచిత్ర పక్ష పత్రిక, సం॥ గద్దె లింగయ్య.

2. భాషామణి - మాసపత్రిక, సం॥ చెఱకువాడ వెంకటరామయ్య

సమీ. సం. 3. పు. 238

జనార్దనరావు కొంపెల్ల, సృష్టి, క. సం - 2. పు. 97

జనార్దనరావు కొంపెల్ల, కిరణాలు, సంపా॥ సం. 1. పు. 5-10

జనార్దనరావు కొంపెల్ల, శృంగాటకం.

1. చావలి బంగారమ్మ, పుంతలో ముసలమ్మ.

2. టాగూరు, మద్రాసు కళాప్రసంగాలు.

3. ఆంధ్ర నాటక కళాపరిషత్తు.

4. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు బహుమానాలు. వ్యా. సం. 1. పు. 73-74

జనార్దనరావు కొంపెల్ల, కిరణాలు. సంపా. సం-2. పు. 79-82

జనార్దనరావు కొంపెల్ల, వాఙ్మయ వీధి భాగవతావతరణము -

(పద్య నాటిక) - నోరి నరసింహ శాస్త్రి. సమీ-సం- 1. పు 71-72

జనార్దనరావు కొంపెల్ల, అన్వయము. క. సం - 1. పు. 18-19

జానకిరామ్ ఆచంట, ఏకవీర. సమీ. వ్యా. సం. 6. పు 481-88.

జానకిరామ్ ఆచంట, వాఙ్మయవీధి. హిందూదేశము-క్రైస్తవ-ప్రభుత్వ

నిర్మాణతత్వము - అనువాదం - మహీధర జగన్నాధరావు. సమీ. సం. 6. పు. 509

జానకిరామ్ ఆచంట, వాఙ్మయ వీధి

1. ఉపాధ్యాయుడు - మునిమాణిక్యం నరసింహారావు.

2. నేనూ మా కాంతం - మునిమాణిక్యం నరసింహారావు.

సమీ. సం. 4. పు. 320-22

జానకిరామ్ ఆచంట, ఈ వియోగ జలధి, కథ. సం-2. పు. 121-132

దీక్షితులు చింతా, శంపాలత, కథ - సం-5. పు. 349-65

దీక్షితులు చింతా, ఆంధ్ర - దోమల సభ, కథ - సం. 3 పు. 185-198

దీక్షితులు చింతా, అభిప్రాయాలు, ఉదయిని మీద, అభి - సం. 2,

పు. 164 - (*i*)

దీక్షితులు చింతా, చిన్న, క. సం. 1, పు. 21-22
నరసింహశాస్త్రి నోరి, అభిప్రాయాలు, ఉదయిని మీద అభి - సం. 3
పు 240 - (i)
నరసింహశాస్త్రి నోరి (నో. న. శా), అవరోధము, క. సం. 1. పు. 15
నరసింహశాస్త్రి నోరి, ఇద్దరు నవ కవి మిత్రులకు, క.సం. 6. పు.430
నరసింహశాస్త్రి నోరి, రెండుకావ్యాలు, క. సం. 5. పు. 344
నరసింహశాస్త్రి నోరి, పిలుపు, క. సం. 3. పు. 176
నాగభూషణం వెంపటి, ఆద్యంతాలు, నా. సం. 6. పు. 450-61
నారాయణబాబు శ్రీరంగం, మిణుగురు మీటు, క. సం. 1. పు. 25
పురుషోత్తమ శర్మ మంగిపూడి; రచన, క. సం. 3. పు. 178
పురుషోత్తమ శర్మ మంగిపూడి, ఆక్షణము, స్కె. సం. 4. పు. 275-76
ప్రభాకరశాస్త్రి వేటూరి, అభిప్రాయాలు, ఉదయిని మీద, అభి. సం. 2
పు. 164 (ii)
బంగారమ్మ చావలి, అన్న, క. సం. 5. పు. 342
బంగారమ్మ చావలి, నీడ, క. సం. 4. పు. 259
బంగారమ్మ చావలి, ఫోటోలో, క. సం. 2. పు.
బంగారమ్మ చావలి, పుంతలో ముసలమ్మ, క. సం. 1. పు. 20
బాపిరాజు అడవి, శైలబాల, కథ. సం. 4. పు. 294-305
బాపిరాజు అడవి, హరిజన సుందరి, క. సం. 5. పు. 335-36
బాపిరాజు అడవి, వీణ, కథ. సం. 1. పు. 32-(?)
(?) ముక్తి - ప్రేమ, సం. 1. పు. (?) - 49
ముద్దుకృష్ణ, కావ్యం, క. సం. 5. పు. 343
ముద్దుకృష్ణ, కావ్యం, క. సం. 3. పు. 179-80
ముద్దుకృష్ణ క. సం. 1. పు. 14
ముద్దుకృష్ణ, వైతాళికులు, సమీ. వ్యా. సం. 3. పు. 229-34
రంగాచార్యులు. ఎమ్. వి. వి.కె., 'జగత్కథ' విమర్శనము. లేఖ-
సం 6. పు. 500-4
రాజగోపాలరావు దామెర, ప్రవాసి ప్రణయగీతాలు, క. సం. 3. పు. 177

రాజమన్నారు. పా. వే.. వాఙ్మయ వీధి, అనార్కలీ -విశ్వనాథ సత్యనారాయణ, సమీ. సం. 2. పు. 60-61
రాజమన్నారు. పి. వి. ట్రాజడీ, వ్యా. సం. 1. పు. 59-62
రామిరెడ్డి దువ్వూరి, అభినవాంధ్ర సాహిత్యము, వ్యా. సం. 5. పు. 366-72
రామిరెడ్డి దువ్వూరి, అభిప్రాయాలు, ఉదయినిమీద, అభి. సం. 3. పు. 240-(i)
రామభద్రరావు కందుకూరి, ఆశ, క. సం 5. పు. 345
రామలింగశాస్త్రి హరి, గోపాలరావు కొండపల్లి, బ్రతుకు, క. సం. 5. పు. 337-38
లక్ష్మీకాంతం పింగళి, వెంకటేశ్వరరావు కాటూరి, ఉపహారము, క.సం.6 పు.424
వినాయకరావు కొమఱ్ఱాజు, కళ, క. సం. 5, పు. 343
విశ్వం, వాఙ్మయ వీధి, వసంతగీత- రామచంద్ర అప్పారావు, సమీ. సం. 4 పు. 319, 20.
విశ్వేశ్వరరావు మల్లవరపు, స్త్రీ, క. సం. 6, పు. 425-29
విశ్వేశ్వరరావు మల్లవరపు, స్వర్ణకింకిణి, క. సం. 4, పు. 255
విశ్వేశ్వరరావు మల్లవరపు, గడ్డిపువ్వు, క. సం-2. పు. 98
వెంకటరామమూర్తి గిడుగు, ఆశీస్సు-, ఉదయినికి. లే. సం. 4
వెంకటరమణయ్య నేలటూరి, పదునాలవ శతాబ్ది తెలుగు వాఙ్మయము, వ్యా. సం. 3. పు. 223-28
వెంకటరావు కవికొండల, గీతికలు, క. సం-2, పు. 87
వెంకటరావు కవికొండల, ప్రేమతత్వం, కథ, సం-1, పు. 26-31
వెంకట నరసింగరావు కాటూరి, ప్రబోధము-వనవాసి, క. సం-1. పు. 24
వెంకట రామారావు రావిపాటి, సమస్య, కథ. సం. 4. పు. 262-67
వెంకటరావు కవికొండల, కొన్ని గీతికలు, క. సం. 5. పు. 339-40
వెంకటరమణయ్య నేలటూరి, సర్వదేవుడు, వ్యా. సం. 5. పు. 395-98
శివశంకరశాస్త్రి, లోపాముద్ర, క. సం. 4. పు. 253—54
శివశంకరశాస్త్రి, ఆశావాన్, క. సం-2, పు. 91-95
శివశంకరశాస్త్రి, *PETRARCA*, క. సం. 5, పు. 346-47
శ్రీనివాసరావు శ్రీరంగం, హ్రస్వగీతాలు, 1. అవతలిగట్టు 2. పరాజితులు 3. ఆః ! క. సం. 5. పు. 341—42.
శ్రీనివాసరావు శ్రీరంగం, సాహసి, క, సం. 2. పు. 90
శ్రీనివాసరావు శ్రీరంగం, ముత్యాలసరం-ఒక కృషి, వ్యా, సం—2, పు. 140—159.

శ్రీనివాసరావు శ్రీరంగం, జయభేరి, క. సం-1, పు. 16–17
శ్రీనివాసరావు శ్రీరంగం, ఉదయిని సంపాదకులకు, లే. సం.3. పు. 285.
శ్రీనివాసాచార్యులు పుట్టపర్తి, వాఙ్మయవీధి, కోపదారి మొగుడు - చేకుమళ్ళ కామేశ్వరరావు, సమీ. సం॥ 6. పు. 509–11
శ్రీనివాసాచార్యులు పుట్టపర్తి, జగత్కథ విమర్శకి సమాధానం లేఖ. సం. 6 పు. 504-8.
శ్రీనివాసాచార్యులు పుట్టపర్తి, నాటకములు-నాటకకళ. వ్యా.సం.6.పు.462-80
శ్రీనివాసాచార్యులు పుట్టపర్తి, వాఙ్మయ వీధి, జగత్కథ (హెచ్. జి. వెల్సుకి అనువాదం), కొమండూరు శఠకోపాచార్యులు, సమీ. సం.5 పు. 405–9
సత్యనారాయణరావు ఊటుకూరు, ప్రభాతసుందరి, క. సం. 4. పు. 257
సత్యనారాయణమూర్తి జొన్నలగడ్డ, మాతృభాష, వ్యా. సం-1, పు. 63—70
సత్యనారాయణ విశ్వనాథ, సీతాకోకచిలుక క. సం-2. పు. 83-86
సత్యనారాయణ విశ్వనాథ, అస్థిప్రసాదనము. క. సం. 6. పు. 422-23
సత్యనారాయణ విశ్వనాథ, శరత్తు క. సం. 3. పు. 181-83
సత్యనారాయణ విశ్వనాథ, రాధ స్వప్నము, క. సం. 5, పు. 383-84
సత్యనారాయణ విశ్వనాథ, శశిదూతము, క. సం. 4. పు. 249-52
సత్యనారాయణ విశ్వనాథ, సీత-(కుందమాల) వ్యా. సం.4 పు. 277-90
సత్యనారాయణశాస్త్రి వేదుల, శరదుత్సవము, యాత్ర, కృతజ్ఞత, క. సం. 1 పు. 11-14.
సుబ్బారావు కొండేపూడి, నవోదయము, క. సం. 5. పు. 334
సుబ్బరామయ్య గన్నవరపు, అభిప్రాయాలు, ఉదయినిమీద అభి- సం. 5 పు. 412-(i).
సుబ్బారావు నాయని, ఫలశ్రుతి, క. సం—2, పు. 96
సుబ్బారావు రాయప్రోలు, చిన్నిచిలక, క. సం. 3. పు. 174–75
సూర్యనారాయణమూర్తి అత్తిలి, గోగీతి, క. సం. 4. పు. 258
సోమశేఖరశర్మ మల్లంపల్లి, ప్రాకృతము – నన్నయకు పూర్వపు సాహిత్యము; వ్యా. సం. 4. పు. 307-18.
హనుమచ్ఛాస్త్రి ఇంద్రకంటి, కళ-నీతి, వ్యా. సం. 3. పు. 194-99.

ఈ గ్రంథంలో ప్రస్తావనకొచ్చిన

# కొందరు వ్యక్తుల - కొన్ని అంశాల వివరణ

జనార్దనరావూ, ఈ పుస్తకంలోని ఇతర వ్యాసకర్తలూ, ఆయా సందర్భాల్లో పలువురు వ్యక్తులనూ, అంశాలనూ ప్రస్తావించారు. ఆయా వ్యక్తులగురించి- కొందరినైనా—కొంతైనా పరిచయంచేస్తే బావుంటుంది పాఠకులకు - అన్న ఆలోచనతో ఈ వివరణ ఇవ్వడం జరిగింది. ఇది సమగ్రం కాదన్న అభిప్రాయం నాకుంది. ॥సం॥

## అప్పలస్వామి పురిపండా

ఒక సంస్థగా జీవించారు. విశాఖలో కవితా సమితి స్థాపించినవారిలో ఒకరు. ప్రముఖ రచయితలనూ, కవులనూ ఓగొడుగుకింద తీసుకొనివచ్చిన ఘనుడు. ఒరియా, బెంగాలీ, హిందీలాంటి భాషలు తెలుసు. వ్యావహారిక భాషాఉద్యమాన్ని గిడుగు తర్వాత ముందుకు తీసికెళ్ళిన ప్రముఖుల్లో ఒకరు. ఎలాంటి రచయితల సంఘాల్లోని సభ్యులైనా వీరికి మిత్రులే. గాంధేయవాదిగా ఆరంభమై మార్క్సిజాన్ని అంగీకరించే దశకు చేరుకొన్నారు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షవర్గ అధ్యక్షులుగా ఉన్నారు సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. పులిపంజా, సౌదామిని వంటి కవితలనూ వ్యావహారికాంధ్ర మహాభారతాన్ని, రామాయణాన్ని, వీరభారతం - ఇంకా అనేక వ్యాసాలనూ రాశారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం కళా ప్రపూర్ణ బిరుదిచ్చింది. శ్రీకాకుళంజిల్లా సాలూరులో 1904లో జన్మించారు 1985లో విశాఖలో మరణించారు.

## అప్పారావు గురజాడ

అంతర్జాతీయ గీతం స్థాయిలో దేశ భక్తి గీతాన్నందించారు. వాడుక భాషకు సాహిత్యంలో పట్టం కట్టిన వ్యక్తి. కవిత్వం పండితుల ప్రత్యేక నిధి కాకుండా అందరికీ పంచి పెట్టే మార్గాన్ని సూచించారు. కన్యాశుల్కం వంటి ఉత్తమ నాటకాన్ని తెలుగు సాహిత్యానికి అలంకారంగా పొదిగారు. సాహిత్యంలో సౌందర్యాన్నీ - సంస్కార భావాలనూ అందించారు.

ముత్యాల సరాలతో తెలుగు కవిత్వాన్ని, సాహిత్యాన్ని ఉన్నత పథాలకు తీసికెళ్ళాడు. చిన్న కథకు అద్యుడు. ముత్యాల సరాలు-నీలగిరి పాటలు-కన్యాశుల్కం-కొండు భట్టీయం-మాటా మంతీ-డిసెంటు పత్రం వీరి రచనలు.

విశాఖ జిల్లా రాయవరంలో 1862లో జన్మించారు. విజయనగరం మహారాజా వారి కొలువులో పన్జేశారు. విజయనగరం కళాశాలలో అధ్యాపకుడుగా ఉన్నారు. 1915 లో మరణించారు.

## అప్పారావు బసవరాజు

1920 దశకంలో భావ కవుల్లో గీతానికి ప్రాధాన్యం ఇచ్చారు. ఆవేశం - ఉద్వేగం పుణికి పుచ్చుకొన్నారు. 'లిరికల్ పొయిట్రీ' – కి ఉదాహరణ ప్రాయంగా వీరి రచనలను చెప్పవచ్చు. నల్లవాడే గొల్ల పిల్లవాడే, కొల్లాయి గట్టితే నేమి, మా గాంధి వంటి జనం నాలుకల మీదున్న రచనలు చాలా చేశారు. సంప్రదాయం అంటే మక్కువ - కొత్త వైపు పరుగూ రెండూ జమిలిగా వీరి రచనల్లో కనిపిస్తాయి. కథలు - జీవిత చరిత - గీతాలు వంటి ప్రక్రియల్లో రచనలు చేశారు.

కృష్ణా జిల్లా పటమటలో 1894 లో పుట్టారు. న్యాయవాదిగా పన్జేశారు. ఆంధ్ర పత్రిక - భారతి పత్రికల్లో కొంత కాలం ఉన్నారు. వీరి రచనల్లో మంచిని ముద్దు కృష్ణ చెప్తే - చలం రెండో పార్శ్వం చూపాడు. గాంధేయ మార్గానుయాయిగా ఉంటూ 1933 లోనే మరణించారు.

## ఆదినారాయణశాస్త్రి పంచాగ్నుల

మంచి పండితులు. సంప్రదాయ వాది. ఆర్య భారతీ గ్రంథ మాల నిర్వహించారు (1930). యెంకి పాటలను బాగా సమర్థించిన వారిలో ఒకరు. నవ్య సాహిత్యానికీ, వ్యావహారిక భాషోద్యమానికి చేయూతనిచ్చారు. వాత్స్యాయన కామ సూత్రాలకూ, గౌతమధర్మ సూత్రాలకూ, రాజశేఖరుడి కావ్య మీమాంసకూ చక్కని సరళమైన తెలుగులో వివరణ రాశారు. జైనుల మత కథలు సరళంగా కూర్చారు

ముక్తి నూతలపాడులో 1890లో జన్మించి 1951 లో బరంపురంలో మరణించారు.

## ఆంధ్ర భూమి

ఆంధ్ర శేషగిరిరావు గారి సంపాదకత్వంలో 1933 నుండి సుమారు పది సంవత్సరాలు వెలువడిన మాస పత్రిక. మద్రాసు వేపేరిలో దాని కార్య స్థానం

ఉండేది. కథలు - గ్రంథ సమీక్షలు - సాహిత్య చర్చలు ఉంటూండేవి. ప్రతి నెలా 25వ తేదీన వెలువడేది. దీని సంపాదకులైన ఆంధ్ర శేషగిరిరావు గారు ప్రస్తుతం విశాఖపట్నంలో ఉంటున్నారు.

## ఇలియట్. టి. యస్.

ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిగా డాక్టరేట్ పొందాడు. అతడి మిత్రుడు పౌండ్ ప్రోత్సాహంతో రచనలు సాగించడం ఆరంభించాడు. "ది లౌసాంగ్ ఆఫ్ జె. ఆల్‌ఫ్రెడ్ ప్రుఫ్రాక్" అన్న తొలి కవిత 'పొయట్రీ' అన్న పత్రికలో పడింది. యుద్ధ సమయంలో కొంత కాలం అధ్యాపక వృత్తి స్వీకరించాడు. తర్వాత లాయడ్స్ బాంకులో పన్జేశాడు. 'ది ఇగోయిస్ట్' అన్న పత్రికకు ఉప సంపాదకుడుగా ఉన్నాడు. అతడి మొదటి కవితా సంకలనం 1917లో ప్రుఫ్రాక్ అండ్ అదర్ పోయమ్స్ వచ్చింది. 'క్రైటీరియన్' అన్న త్రైమాసికను 1922లో స్థాపించాడు. 'ది వేస్ట్ లాండ్' - అతనికి బాగా పేరు తెచ్చింది. ఫేబర్ బుక్ ఆఫ్ మోడరన్ వర్స్ — ద్వారా ఆధునిక ఆంగ్ల సాహిత్యంలో ప్రముఖ విమర్శకుడుగా పేరు పొందాడు. ఇతడికి 1938లో నోబెల్ బహుమానం వచ్చింది.

సెయింట్‌లూయీలో 1888 లో జన్మించి అనేక రచనలు చేస్తూ 1965 లో మరణించాడు.

## ఈశ్వరదత్తు కుందుర్తి

సి. వై. చింతామణి, కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు, ఎం చలపతిరావువంటి అఖిల భారత ప్రశస్తి పొందిన ఆంధ్రులైన ఆంగ్ల పత్రికా సంపాదకుల శ్రేణిలోని వారు కుందుర్తి ఈశ్వరదత్తుగారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రారంభ దశలో; దానిలో కొద్దికాలం పనిచేసి, తర్వాత ఉత్తర భారతదేశానికి తరలి వెళ్ళి, జీవితాంతం అక్కడే వుండి పోయారు. దత్తు 'లీడర్', 'సెర్చ్‌లైట్', 'హిందూస్తాన్ టైమ్స్' మొదలైన ఆంగ్ల దినపత్రికలలో సంపాదక పదవులలో వున్నారు. 'పీపుల్స్ వాయిస్' అన్న పిఠాపురం రాజుగారి మద్రాను ఆంగ్ల దినపత్రికకు (1938) స్వల్ప కాలం సంపాదకుడుగా ఆయన దక్షిణ భారతదేశంలో వున్నారు.

'స్పార్క్స్ అండ్ ఫ్యూమ్స్', 'అండ్ ఆల్‌దట్', 'స్ట్రీట్ ఆఫ్ ఇంక్' అన్నవి ఆయన గ్రంథాలలో కొన్ని (చివరిది ఆయన ఆత్మకథ). 'వీక్ఎండ్' (వారపత్రిక), 'ట్వంటీయత్ సెంచరీ' ఆయన నిర్వహించిన స్వంత పత్రికలు.

'నేషనల్ బుక్ ట్రస్ట్' స్థాపింప బడినప్పుడు, ఆయన దాని తొలి సంపాదకుడు.

## కన్హైయలాల్ మానిక్‌లాల్ మున్షీ

## [కె. యం. మున్షీ]

ప్రముఖ జాతీయవాది. అనేక పర్యాయాలు కారాగార వాసం అనుభ వించారు. భారతీయ సాహిత్య పరిషద్ కార్యదర్శి. కాంగ్రెసువాది. భారతీయ విద్యాభవన్ ట్రస్టీ సభ్యులు. గుజరాత్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు. బరోడా, ఆగ్రా, అలహాబాద్, గోరఖపూర్ విశ్వవిద్యాలయాలకు ఉపాధ్యక్షులుగా ఉన్నారు. కేంద్రంలో వ్యవసాయశాఖ మంత్రిగా ఉన్నారు. గుజరాతీలో 5 నవలలు, 9 నాట కాలు, 5 జీవితచరిత్రలు రాశారు. ఆంగ్లంలో 2 పుస్తకాలు రాశారు.

వీరు 1887 లో గుజరాత్‌లో జన్మించారు. ప్రస్తుతం కీర్తిశేషులు.

## కామేశ్వర్రావు జనమంచి

కథకులు — విమర్శకులు - కవి. ప్రతిభ - జ్వాల-భారతి - ఉదయిని వంటి నాటి పత్రికల్లో చాలా రచనలు పడ్డాయి. వీరి కుటుంబం కొంపెల్ల కుటుంబం చాలా సన్నిహితంగా ఉండేవి. ఉపాధ్యాయుడుగానూ - విద్యాశాఖలో ఇన్‌స్పెక్టరుగాను పన్జేశారు. వీరి తండ్రి వెంకటరామయ్యగారి రచనలను వీరు చాలావరకు ప్రకటించారు. సరళమైన భాషలో కవితలల్లేవారు.

1911 లో రాజమండ్రిలో జన్మించారు. ప్రస్తుతం అక్కడే విశ్రాంతి తీసు కు టున్నారు. వీరిది పండిత కుటుంబం.

## కీట్స్ జాన్

తన తొలి రచనలను 1814 లో ఆరంభించాడు. చిన్నతనంలో తల్లి దండ్రులను పోగొట్టుకున్నాడు. గేస్ ఆస్పత్రిలో డాక్టరు విద్యార్థిగా చేరి పని నేర్చుకొన్నాడు. ఆ రోజుల్లోనే 'ఓడ్ టు అపోలో' రాశాడు. ఆర్థిక బాధలతో వృత్తికి స్వస్తి చెప్పి కవిత్వాని కంకిత మయ్యాడు. 1817 లో అతని కవితల మొదటి సంపుటం వెలువడింది. 'ఎండిమియాన్' బాగా పేరు తెచ్చింది. అలానే 'ఇసబెల్లా'! ఎండిమియాన్ మీద వచ్చిన విమర్శల ధాటికి తట్టుకోలేకపోయాడు. 1819 లో క్షయ వ్యాధికి గురయ్యాడు. షెల్లీ ఆహ్వానంతో 1820 లో రోమ్‌కు వెళ్ళి స్థిరపడ్డాడు. కాల్పనిక కవితోద్యమంలో ప్రముఖుడు.

1795 లో జన్మించిన కీట్సు 1821 లో చనిపోయాడు.

## కృష్ణమూర్తి తెలికచర్ల

వ్యావహారిక భాషకు దగ్గరగా ఉండే వచనం వీరిది. సంస్కృత పదాల నుపయోగిస్తూనే పైలాగా అనిపించే శైలితో 'వ్యాసమంజరి' రాశారు. భావ కవిగా ప్రాచ్య పాశ్చాత్య కవితా రీతుల కలగలుపు రచయిత అని అనచ్చు. మార్మికత ఎక్కువ - వియోగ గీతిక, రహస్యము కాబోలు వంటి ఖండ కావ్య రచనలు చేశారు.

1903 లో జన్మించారు. ప్రస్తుతం మద్రాసులో ఉన్నారు.

## కృష్ణశర్మ దేశిరాజు

కవి. విమర్శకులు. సాహితీసమితి సభ్యులు. ప్రతిభ, భారతి పత్రికల్లో వీరి రచనలొచ్చాయి. అరవిందతత్త్వం అనుసరించారు. నర్సరావుపేటలో నవ్య కళాపరిషత్తు స్థాపించారు. శిఖరదీపం, నీడలు, అరవిందదర్శనం వీరి రచనలు.

గుంటూరుజిల్లా చేబ్రోలులో 1912 లో జన్మించారు. గుంటూరు, నర్స రావ్‌పేటలలో నివసించారు. 1981 లో హైదరాబాదులో కీర్తిశేషులైనారు.

## గణపతిశాస్త్రిగారు అయల సోమయాజుల [కావ్యకంఠ గణపతి శాస్త్రి]

కవి, పండితుడు, మేధావి. చిన్నతనంలోనే కవితలు రాశారు. ఉమాస హస్రము, భారతీ విమర్శ వంటి అనేకం సంస్కృతంలో రాశారు. 'పూర్ణ' అనే పేరుతో 200 ప్రకరణాల బృహదితిహాసిక నవల సంకల్పించి 80 ప్రకరణాలు మాత్రం వ్రాశారు. (1907) రమణమహర్షికి రమణ అన్న నామాన్నుంచింది వీరే! 'కావ్యకంఠ' వీరి బిరుదు.

బొబ్బిలి తాలూకా కలువరాయి అగ్రహారంలో 1878 లో జన్మించి 1936 లో చనిపోయారు.

## గణపతిశాస్త్రి పిలకా

కాల్పనిక సాహిత్య ప్రభావం కల్గిన కవితలు రాశారు. పద్యాలూ—గేయాలూ — కథలూ రాశారు. భావోద్వేగం ఎక్కువ. 'వాన' — 'మాదాకబళం' చక్కని కవితలు. అభ్యుదయ కవిత్వ ఉద్యమాన్ని కూడా స్వీకరించారు. పత్రికారచన చేశారు. చాలా నవలలూ రాశారు. 'విశాల నేత్రాలు' నవలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమానం వచ్చింది.

సాహిత్య శిరోమణి చదివారు. ఇంగ్లీషు ఫ్రెంచి భాషలు తెలుసు. ఆంధ్రశిల్పి పత్రికను - వి. ఆర్. చిత్రాతో కలిసి నడిపారు. కొంతకాలం అధ్యాపకుడుగా పనిచేశారు. గోదావరిజిల్లా కట్టుంగలో 1911లో జన్మించారు. 1983లో విశాఖ పట్నంలో మరణించారు.

## గాల్స్‌వర్దీ జాన్

న్యాయశాస్త్రం చదివాడు. గాల్స్‌వర్దీ రచయితగా రూపుదిద్దు కోవడానికి కోనార్డ్ అనేమిత్రుడి పరిచయం ఎంతో దోహదకారి అయింది. 'ఫ్రంది, ఫోర్‌విండ్' అన్నది అతడి మొదటికథాసంకలనం. (1897) 'జోసిలిన్' అన్నది అతడి మొదటి నవల (1898) నాటక రచయితగా 'ది సిల్వర్‌బాక్స్' అన్న నాటకం (1906)తో ఆంగ్లసాహిత్య లోకానికి పరిచయమైనాడు. 1932లో ఇతనికి సాహిత్యంలో నోబుల్ బహుమానం వచ్చింది.

1867లో జన్మించి గాల్స్‌వర్దీ 1933లో చనిపోయాడు.

## గెథే

జర్మన్ దేశీయుడు. న్యాయశాస్త్రం చదివాడు. అనేక కళల్లో ప్రవేశం సంపాదించాడు. 'ఫాస్ట్' అన్న నాటకం రాశాడు. కొన్ని నవలలు కూడా రచించాడు. సామాజిక భావనాత్మక సమస్యలను తన రచనల్లో ప్రతిబింబించాడు. అతడి పాటలు చాలా వరకు జర్మన్ కాల్పనిక వాదానికి ప్రతీకలు. ప్రపంచం లోని అనేక భాషల్లోకి అనువాదం పొందాయి. ఇతడి అసలుపేరు జాన్ వుల్ఫ్ గాంగ్ వాన్.

ఇతడు 1749లో జన్మించి 1832లో చనిపోయాడు.

## గోపాలరావు కాళ్ళకూరి (గోపాలరాయకవి)

విషయానికి ప్రాధాన్యమిచ్చిన భావకవి. 'కవితోపాయనం' పద్యరచన. వాల్మీకి నాటకం మన తత్వ నిరూపక నాటకాలకు దారి చూపింది. సరళమైన శైలిలో నాటకాలు - ఖండకావ్యాలు రాశారు. సౌందర్యమంజరి (కవిత), తిమ్మరుసు (నాటకం) వీరి యితర రచనలు.

1890 దశకంలో జన్మించారు. మద్రాసులో నివసించేవారు.

## గోర్కీ మాక్సిం
## (అలెక్సీమాక్సిమోవిచ్ పెష్కోవ్)

గోర్కీ అనగానే 'అమ్మ' నవల ముందుగా వెంటనే గుర్తుకొస్తుంది. రష్యాలోని సుప్రసిద్ధ వచన రచయితల్లోనూ, నాటక రచయితల్లోనూ అగ్రగణ్యుడు. సోషలిస్టు విప్లవం సృష్టించిన గొప్పరచయిత. సోషలిస్టు వాస్తవికతకు రచనల్లో పట్టంగట్టిన వ్యక్తి. కష్టాలకొలిమి నుండి వన్నె తేరిన వజ్రం. సోవియట్ రచయితల సంఘానికి తొలి అధ్యక్షుడుగా ఉన్నారు. పలురచనలు చేశారు.

1868లో రష్యాలో జన్మించి 1936లో మరణించారు.

## గోవర్ధనరావు శీలంశెట్టి

ఆచంట జానకిరాంగారి ద్వారా జనార్ధనరావ్‌కు పరిచయమయ్యారు. విజయవాడలో వ్యాపారం చేసేవారు. ఇన్సూరెన్స్ వ్యవహారాలూ చూస్తుండేవారు. ధనవంతులు. ఉదయిని కోసం జనార్ధనరావ్‌కు చాలా ఆర్థిక సాయంచేశారు.

## గోసే ఎడ్మండ్ విలియం

స్విన్‌బర్న్ మిత్రుడు. ఇబ్సన్‌ను రచయితగా ఇంగ్లండు ప్రజలకు మొదటిసారి పరిచయం చేశాడు. పూర్వరాఫలైట్ ఉద్యమకారుడు. రెండు తరాల మధ్య భావ సంఘర్షణలను తననూ తన తండ్రి జీవితాలను ఆధారంగా చేసుకొని- "ఫాదర్ అండ్ సన్" అన్న రచనలో చిత్రీకరించాడు. స్కాండినేవియన్ సారస్వతంలో విశేషంగా కృషి చేశాడు. చాలా మంది కవుల-రచనల జీవితాలను అధ్యయనం చేసి గ్రంథాలుగా రాశాడు. "హౌస్ ఆఫ్ లార్డ్స్" సభలో గ్రంథాలయాధికారిగా చాలా కాలం పనిచేశాడు. చనిపోయేంత వరకు 'సన్‌డే టైమ్స్' పత్రికలో వ్యాసాలు రాస్తూండేవాడు.

1849లో 'దేవన్'లో జన్మించి లండన్ నగరంలో స్థిరపడ్డాడు. అనువాదకుడుగా కొంత కాలం పనిచేశాడు. 1928లో చనిపోయాడు.

## చలం
## (గుడిపాటి వెంకట చలం)

కలంబలంతో సమాజాన్ని కుదిపిన వ్యక్తి. ఆధునిక తెలుగు సాహిత్యంలో చాలా వివాదాలకు మూలమైన రచనలు చేశారు. వచనానికున్న బలాన్ని నిరూపించారు. విద్యా శాఖలో పనిచేశారు. అన్ని సాహితీ ప్రక్రియలను చేపట్టారు.

ఠాగూర్ రచనలను అనువదించారు. అనేకానేక రచనలను చేసి చివరకు రమణ స్థాన్ చేరారు. మైదానం, దైవమిచ్చిన భార్య వంటివి ఆయన నవలల్లో ప్రాచుర్యం పొందాయి. 1894లో మద్రాసులో జన్మించి 1979 రమణస్థాన్‌లో మరణించారు.

## చిన్నయసూరి పరవస్తు

చిన్నయ పేరు. సంస్కృతాంధ్ర ప్రాకృత ద్రవిడ భాషల్లో పాండిత్యం ఉంది. షట్ శాస్త్రిలూ నేర్చాడు. ఆంగ్లం అభ్యసించాడు. పచ్చయప్ప కళాశాల మద్రాసులో ఆంధ్ర పండితుడుగా ఉన్నాడు. అర్బత్ నాట్ దొర 'సూరి' అన్న బిరుదాన్నిచ్చాడు. 'సుజన రంజని' అనే సారస్వత మాస పత్రిక నిర్వహించాడు. నీతి చంద్రిక, బాలవ్యాకరణము, ఆంధ్రశబ్దాను శాసనం లాంటి అనేక గ్రంధాలు రాశాడు. శ్రీ పెరుంబుదూరులో 1809లో జన్మించి 1862లో చనిపోయారు.

## చెస్టర్ టన్ జి. కె.

జర్నలిజంలో మంచి పేరు సంపాదించాడు. 'ది స్పీకర్' అనే పత్రికలో 'బెల్లక్' 'చెస్టర్‌టన్' రచనలు చాలా వస్తూండేవి. బెర్నార్డ్‌షా 'చెస్టర్‌బెల్లక్' అని పిలుస్తూండేవాడు వీళ్ళను. మొదటి నవల 'ది నెపోలియన్ ఆఫ్ నాటింగ్ హిల్' (1904) మంచి పేరు తెచ్చింది. చాలా కథలు రాశాడు. 'ఫాదర్ బ్రౌన్' పాత్ర చిరస్మరణీయమైంది. ఇతడు రాసిన అనేక కవితల్లో 'ది డాంకీ' లాంటివి తప్ప అనేక రచనల్లో ఆంగ్ల సమాజంలోని రెండు పార్శ్వాలనూ చూడగలం. శ్లేషకూ - అధిక్షేపానికీ, ఆశావాదానికీ ఇతడి రచనలు అద్దం పట్టాయి. సాహిత్య విమర్శకుడుగా షా, బ్రౌనింగ్, డికిన్స్‌లమీద రచనలు చెస్టర్‌టన్‌కు సాహిత్యంలో స్థిర స్థానం కల్పిస్తాయి.

లండన్‌లోని కాండెన్‌హిల్‌లో 1874లో జన్మించి 1936లో చనిపోయాడు.

## జగన్నాధ పండితరాయలు

రస గంగాధరం రాశాడు. మంచి కవి. అందుకని రసగంగాధరంలో ఉదాహరణకు తన కావ్యాల్లో పద్యాలనే వాడుకొన్నాడు. అమృతలహరి, జగదాభరణం లాంటి అనేక గ్రంధాలు రాశాడు. రాజస్థాన్‌లో విద్యాధికారిగా ఉండేవాడు. షాజహాన్ "పండితరాజు" బిరుదాన్నిచ్చాడు. 'లవంగి'తో పండితరాయలను ముడేస్తారు. 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం' అన్నది ఇతడి సిద్ధాంతము.

ఇతడు కోనసీమలో 'ముంగండ' గ్రామవాసి. 1600 - 1666 వరకూ ఇతడు జీవించి ఉంటాడని అంటారు

## జానకిరాం ఆచంట

రచయిత - చిత్రకారుడు. కథలు - నాటకాలు - వ్యాసాలు - విమర్శలు రాశారు. ఇంగ్లీషులో కూడా పద్యాలు రాశారు. ఆకాశవాణిలో పని చేశారు. తమ పుస్తకాలు కొన్నిటిని కొంపెల్లకు అంకితం చేశారు. 'ఉదయిని' పత్రికకు ఉప సంపాదకులుగా ఉన్నారు. 'స్వర్ణసీత' — వీరి కవితా సంకలనం.

1904లో పశ్చిమ గోదావరి జిల్లా ఆకుతీగలపాడులో జన్మించారు. నా స్మృతి పథంలో, సాగుతున్న యాత్ర — వీరి స్వీయ చరిత్రను తెలియ చేస్తాయి. ప్రస్తుతం మద్రాసులో ఉంటున్నారు.

## దండి

కావ్యాదర్శ రచయిత. కావ్యానికి గుణాలే ఆదవశ్యకాలని చెప్పాడు. ఈ గుణాలే వైదర్భిగౌడీ రీతులుగా ఏర్పడతాయని చెప్పాడు. రసానికేం ప్రాధాన్యం లేదంటాడితడు. కావ్యం రమణీయార్థభూషితంగా ఉండాలంటాడు.

ఇతడు 6వ శతాబ్దంలో ఉన్నాడు.

## దీక్షితులు చింతా

కథలు - గేయాలు రాశారు. బాల గేయవాఙ్మయంలో చక్కని కృషి చేశారు. 'లక్కపిడతలు' - అందుకు సాక్షి. సూరి-సీతి-వెంకిపాత్రలు చిరస్మరణీయాలయ్యాయి. నాటికలు - ఏకాంకిలూ రాశారు. చక్కని కథకుడుగా తెలుగు సాహిత్యంలో పేరుంది. వటీరావ్‌పాత్రను సృష్టించిందివీరే! సాహితీ సమితి సభ్యులు. మొదట్లో చింతా శంకర దీక్షితులుతో కలిసి జంట కవిత్వం రాశారు. బి.ఏ.ఎల్.టి పాసై విద్యాశాఖలో పన్జేశారు. చలానికి మంచిమిత్రుడు. 1891 లో తూర్పు గోదావరిజిల్లా దంగేరులో జన్మించారు. 1960 లో చనిపోయారు.

## ధర్మారావు కొల్లూరి

కథ - నాటికలు - ఖండకావ్యాలు - గేయాలూ రాశారు. ప్రకృతివర్ణన-ఆరాధన వీరిరచనల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ప్రాక్టికల్ కవిత్వం, చాకిరేవు, ప్రణయగీతం, మృత కవులకు లేఖ, జ్యోతిర్మయివంటివి వీరి రచనలు. బర్మాలో

ఒక పత్రికనూ నడిపారు. వీరి రచన సంప్రదాయరీతిలో నడిచినా భావంలో నవ్యతను స్వీకరించారు.

విజయనగరంలో 1905 లో జన్మించారు.

## థియొడోర్ వాట్స్-డంటన్

ఇంగ్లీషు పత్రికలు 'ఎగ్జామినర్', 'ఎథెనేయం'లలో విమర్శకుడుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. ఎక్కువగా కవిత్వాన్ని విమర్శిస్తూండేవాడు. రేఫలైట్ ఉద్యమానికి ముందున్న కవులను సమర్థిస్తూండేవాడు. ఇతనికవిత్వంలో ఎక్కువగా కాల్పనిక మార్మికత కనిపిస్తుంది. రోసెటి, టెన్నిసన్ లాంటి రచయితల జీవితాలను 'ఓల్డ్ ఫెమిలియర్ ఫేసెస్' అన్న గ్రంథంగానూ, 'పొయిట్రీ' అంటూ ఓ విమర్శనూ ప్రకటించాడు. 'స్విన్‌బర్న్'ను కష్టకాలంలో ఆదుకొన్న మిత్రుడు.

ఇతడు 1832 లో జన్మించి 1914 లో చనిపోయాడు.

## నరసింహారావు స్థానం

సత్యభామ పాత్ర తెలుగునాట వీరి నటనలోనే జీవించింది. రోషనార, చిత్రాంగి, మురు, మధురవాణి పాత్రలను ధరించి ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేసేవారు. తెనాలి కేంద్రంగా రామవిలాస సభను నాటకచరిత్రలో సువర్ణాక్షరాలతో రాయదగ్గఘనతను కల్పించారు. చంద్రమతి పాత్రతో ఆకస్మికంగా నాటకరంగస్థలం మీదకొచ్చి 82 సం॥లలో సుమారు 15 వందల ప్రదర్శనలిచ్చారు. గుసగుసలనుకూడా అందంగా వాచికంలో అభినయించగల సమర్థులు.

బాపట్లలో 1902 లో జన్మించారు. స్కూలు ఫైనల్‌వరకూ చదివారు. చిత్రకళ, ఫోటోగ్రఫీలలో చక్కని సామర్థ్యం సంపాదించారు. చక్కనివక్త. రచయిత. రేడియోలో ప్రయోక్తగా కొన్నాళ్లు పనిచేశారు. అనేక బహుమానాలు పొందారు. 1956 లో పద్మశ్రీ పొందారు. 1971 లో కీర్తిశేషులైనారు.

## నరసింహశాస్త్రి నోరి

చారిత్రక నవల్లు రాసిన వారిలో వీరుముందు పీటీనుంటారు. బాపిరాజు గారిలో లాలిత్యం కనిపిస్తే; వీరిలో సన్నివేశ నిర్వహణ - ఆర్ష సంప్రదాయం ఎక్కువగా చూస్తాం. సాహితీ సమితిలో ప్రముఖుడు. సరళ గ్రాంధికాభిమాని. రుద్రమదేవి, నారాయణభట్టు, మల్లారెడ్డి, కవిద్వయం, కవిసార్వభౌముడు వంటి

నవలలు బహుళ ప్రచారం పొందాయి. నవలాకాలంనాటి జనజీవన చిత్రణ చాలాచక్కగా నిర్వహిస్తారు. చాలా వ్యాసాలూ - నాటకాలూ రాశారు గుంటూరు జిల్లా రేపల్లెలో న్యాయవాదిగా పన్జేశారు. 1900 సం॥లో జన్మించి 1978 లో మరణించారు.

## నవ్య సాహిత్య పరిషత్తు

'అభినవాంధ్ర కవి పండితసభ' - అంటూ బరంపురంలో 1933 మార్చి 10,11,12 తేదీల్లో రచయితల సభలు జరిగాయి. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, గురు భాగవతుల ధర్మారావు గారలు దీని సంధానకర్తలు. ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు ఎదురెత్తుగా సాగిందీ సంస్థ. అక్కడక్కడ చిన్నా పొన్నా సమావేశాలు జరుపుకుంటూ 1936 నాటికి నవ్యసాహిత్య పరిషత్తుగా అవతరించింది. నాడు తెలుగులో అధునిక భావప్రచారానికి తోడ్పడే రచనలు సాగించే వాళ్ళందరూ ఇందులో సభ్యులుగా ఉండేవారు. నవ్యసాహిత్య పరిషత్తు తరపున 1933 నుండి 1946 వరకూ సుమారు 11 మహాసభలు వివిధ నగరాల్లో జరిగాయి. తెలికచర్ల వెంకటరత్నంగారు ప్రధాన నిర్వాహకులుగా ఉండేవారు. 1936 నుండి "ప్రతిభ" సంచికలను ప్రచురించింది. అభ్యుదయ రచయితల ఉద్యమం 1943లో నిర్మాణరూపం సంతరించుకోగానే ఇది అందులో అంతర్లీనమైనట్లుగా ఎంచవచ్చు.

## నాగేంద్రరావు పింగళి

నాటక రచయితగా, సినిమా రచయితగా ప్రసిద్ధులు. జేబున్నీసా. మేవాడు పతనం మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించాయి. వీటన్నిటనీమించి 'వింధ్యారాణి' నాటకంలో వీరి సరళమైన - సహజమైన రచనాశైలి మనకు కనిపిస్తుంది. వ్యావహారిక భాషను వాడి - ప్రచారం చేసిన పండితులు.

1901 లో 'రాజాం'లో జన్మించిన వీరు మద్రాసులో 1978 లో చనిపోయారు.

## నాగేశ్వరరావు పంతులు కాశీనాథుని

జాతీయవాది. ఆంధ్రరాష్ట్ర ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. చారిత్రక ప్రాధాన్యంఉన్న "శ్రీభాగ్ ఒడంబడిక" - అన్నది వీరింట్లో జరిగింది. హి దూదేశ శాసన నిర్మాణ సభసభ్యులుగా ఉన్నారు. ఆంధ్రపత్రికను, భారతిని నెలకొల్పారు. కొమర్రాజువారి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంపుటాలను 1926-1932 లో పునర్ముద్రించారు. నటులను - సమాజాలను - ప్రోత్సహించారు.

భగవద్గీతకు వ్యాఖ్యానం తెలుగులో రాశారు. ఆంధ్ర వాఙ్మయసూచిక తయారు చేశారు. సంఘ సంస్కర్త. 'దేశోద్ధారక' బిరుదు ఉంది.

వీరు కృష్ణాజిల్లా ఎలకుర్రులో 1867 లో జన్మించారు. 1938 లో చనిపోయారు.

## నారాయణరావు చిలుకూరి

కాల్డ్వెల్ ద్రావిడభాషా సిద్ధాంతాన్ని ఖండించినవ్యక్తి. శతాధిక గ్రంథకర్త. హరిజనులకు పాఠశాలలు నడిపారు. కొన్ని గ్రంథాలు ఆంగ్లంలో రాశారు. గుజరాతీ వాఙ్మయ చరిత్రం రాశారు. ఆంధ్ర భాషాచరిత్ర రచించారు. సంస్కృత లోకోక్తులు చక్కని గ్రంథంగా రాశారు. వ్యవసాయంలో పరిశోధన చేశారు. మాత్రా ఛందస్సు మీద ఓ పరిశీలన వ్యాసం రాశారు. ఉమర్‌ఖయ్యాం అనువాదం చేశారు. వ్యావహారిక భాషావాదిగా కృషిచేశారు. మహామహోపాధ్యాయలాంటి అనేక బిరుదులు సంపాదించారు.

1890లో అనంతపురం జిల్లా ఆనందపురంలో జన్మించారు. 1952లో చనిపోయారు.

## ప్రతిభ

1936 మే నుండి నవ్యసాహిత్య పరిషత్తు పక్షాన వెలువడింది. గుంటూరు కార్యస్థానం. తెలికచర్ల వెంకటరత్నంగారు ముఖ్య సంపాదకులుగా ఉండేవారు. త్రైమాసికగా వచ్చింది. 6 సంవత్సరాలలో మొత్తం 9 సంపుటాలొచ్చాయి. గిడుగుస్మారకసంచిక చాలా ప్రసిద్ధం. అలాగే చెళ్ళపిళ్ళ సన్మానసంచికా వచ్చింది.

## ఫ్లెక్కర్ జేమ్స్ ఎల్‌రాయ్

ఆంగ్ల కాల్పనిక కవి. "ది గోల్డెన్ జర్నీ టు సమర్‌ఖండ్" ఇతడి ప్రసిద్ధ కావ్య సంకలనాల్లో ఒకటి (1913). కాల్పనికవాదాన్ని బలపరుస్తూ ఉదాహరణప్రాయంగా "జార్జియన్ పొయిట్రీ" లాటి అనేక కవితా సంకలనాలను వెలువర్చాడు. 'ది కింగ్ ఆఫ్ ఆల్‌సొడర్' అన్న ఓ ప్రయోగాత్మక నవల రాశాడు. ఇతడి ప్రసిద్ధమైన మరోరచన "డాన్‌జువాన్" (1925). నాటకాలు కూడా రాశాడు (హసన్ 1922).

1884లో జన్మించి ట్రినిటీ కాలేజ్, ఆక్స్‌ఫర్డ్ కాలేజీల్లో చదివి క్షయ వ్యాధితో 1915లో చనిపోయాడు.

## బంగారమ్మ చావలి

చక్కని తెలుగులో కమ్మని కవితల్లారు. 'కాంచన విపంచి' వీరి కవితా సంకలనం. కొంపెల్ల జనార్దనరావు వీరి తమ్ముడు. బంగారమ్మగారు మంచి కవిత్వం అందిస్తున్నారని తెలుగు సాహితీలోకం అనుకుంటూండగా మరణించారు. 1897లో మోదేకుర్రులో జన్మించారు.

## బనారసీదాస్ చతుర్వేది

శాంతినికేతన్ 1914-20 వరకూ సి. యఫ్ ఆండ్రూస్, దీనబంధులతో కలిసి పనిచేశారు. ఆర్యమిత్ర, అభ్యుదయ పత్రికలకు సంపాదకవర్గ సభ్యులుగా 1921–1925 వరకూ ఉన్నారు. తర్వాత 'విశాల భారత్' పత్రిక నడిపారు. 'మధుకర్' (1937) పత్రిక నడిపారు. 1931-36లో దక్షిణాఫ్రికాలో కాంగ్రెసు కార్యకర్తగా పన్జేశారు. 'ఫిజీ'కి చెందిన అనేక సమస్యలమీద గ్రంథాలు రాశారు. 'ప్రతిజ్ఞాబద్ధ', 'కూలీప్రథా' అన్న సంకలనాలను వెలువర్చారు. విప్లవకారుడు క్రొపాట్కిన్ జీవిత విశేషాలను పుస్తకంగా తెచ్చారు. అఖిలభారత హిందీ పత్రికారచయితల సంఘానికి, పత్రికా కార్మికుల సంఘాలకు ప్రతినిధిగా పన్జేశారు. 'అమరవీరుల' శ్రద్ధాంజలి అంటూ ఓ 13 గ్రంథాలను రాశారు. సోవియట్ యూనియన్‌లో 1959లో పర్యటించారు.

1924లో ఉత్తరప్రదేశ్ ఆగ్రాలో జన్మించారు. ప్రస్తుతం కీర్తిశేషులు.

## బాపిరాజు అడవి

భావుకుడు– చిత్రకారుడు అయినవాడు కవీ - రచయితా అయితే అతడే బాపిబావ. జాతీయవాది. భారతీయ ఆధ్యాత్మికత పుడిసిలించారు. కథలు, గేయాలు, నవలలు రాశాడు. సంగీతజ్ఞుడు కూడా కావడం మూలాన రచనల్లో శబ్దసౌందర్యం లాలిత్యం కనిపిస్తుంది. చిత్రకారుడుగా ఎంత ఖ్యాతిని సంపాదించారో నవలా రచయితగా అంతకుమించి గౌరవించింది తెలుగు పాఠకలోకం. స్వాతంత్ర్య సముపార్జనా పోరాటంలో కారాగారవాసం చేశారు. హిమబిందు అక్కడారంభమైందే! ఈనవల 1923లో శారద పత్రికలో ధారావాహికంగా వచ్చింది. చారిత్రక నవలలు రాయడంలో అందెవేసినచెయ్యి. హిమబిందు, గోన గన్నారెడ్డి, అడవి శాంతిశ్రీ వంటివే దానికి ఉదాహరణలు. 1934లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నిర్వహించిన పోటీలో విశ్వనాథ వేయిపడగలతో బహుమతి పంచుకొన్నది వీరి 'నారాయణరావు' నవల. బాపిరాజుగారి జాతీయ దృక్పథం ఇందులో కనిపిస్తుంది. బి.ఏ., బి.యల్ పాసైన రచయితా చిత్రకారుడు. 1939లో

సినిమాల్లో కొన్ని చిత్రాలకు కళాదర్శకత్వం నిర్వహించారు. ఎంకిపాటలు, కిన్నెరసాని పాటలకు బొమ్మలు రాశారు. 'ఉదయిని' పత్రికకు ముఖచిత్రం వేశారు. 1944-47 వరకూ హైదరాబాద్‌లో 'మీజాన్' పత్రికకు సంపాదకులుగా ఉన్నారు. పశ్చిమ గోదావరిజిల్లా సరిపెల్ల గ్రామంలో 1895లో జన్మించి 1952లో మద్రాసులో మరణించారు.

## బైరన్

బైరన్ ఇంగ్లీషు కాల్పనిక కవుల్లో ప్రముఖుడు. 'డాన్‌జువాన్' రచయితగా మంచి ప్రసిద్ధిపొందాడు. డా॥ టి.యస్. ఇలియట్ ఇతణ్ణిగురించి భాషకు గానీ భావానికిగానీ కొత్తదనం తేకుండా అద్భుతమైన కవిత్వం ఇతడిలా రాసేవాళ్లు అరుదు అంటాడు. అనేకమందికి బైరన్ మార్గదర్శకుడు.

1788లో లండన్‌లో జన్మించి 1824లో గ్రీసుదేశంలో చనిపోయాడు.

## బ్రౌనింగ్ రాబర్ట్

ఇంగ్లీషులో ప్రసిద్ధుడైనకవి. కవిత్వంలో నాటకీయ లక్షణాలను ప్రవేశపెట్టాడు. ఆ రోజుల్లో మనోభావాలను కవిత్వంలో ప్రవేశపెట్టిన వాళ్ళలో ఒకడు. శ్రీశ్రీకి ఇష్టుడు. పలువురు తెలుగు కవులమీద బ్రౌనింగ్ ప్రభావాన్ని చూడచ్చు. శ్రీశ్రీ జనార్దనరావు బ్రౌనింగ్‌ను గ్రమేరియన్ అంటూ వర్ణిస్తాడు. తన 12వ సం॥ రంనుండే కవిత్వం రాయడం మొదలెట్టాడు. దీని పేరు 'ఇన్‌కాన్‌డిటా'. ఇంగ్లండ్‌లో పుట్టినా చాలాకాలం ఇటలీలో ఉన్నాడు. ఆయనకు బాగా పేరు తెచ్చిన కావ్యం 'ఎస్కెలస్ సాలిలక్వీ'. ఇతడి మీద చిన్న తనంలో షెల్లీ, కీట్సు, బైరన్‌ల కవిత్వప్రభావం ఉండేది.

1812లో జన్మించి 1889లో మరణించాడు.

## మమ్మటుడు

కావ్యశరీరాన్ని వివరిస్తూ దోషాలు లేనిదీ, గుణాలూ అలంకారాలూ ఉన్న శబ్దార్థాలే నిజమైంది అంటాడితడు ఈ శరీరానికి ధ్వని అదే వ్యంగ్యం ఆత్మలాటిదనీ, దీని ప్రాధాన్యాన్నిబట్టి కావ్యాన్ని ఉత్తమం, మధ్యమం, అధమం అని విభజించవచ్చునంటాడు. ఆనందవర్ధనుడికిచాలా సన్నిహితంగా ఉంటుందీతని సిద్ధాంతం.

ఇతడూ 9వ శతాబ్దంలోనివాడే.

## మా ధు రి

1921 నవల్‌కిశోర్ ప్రెస్, లక్నోలో ఆరంభమైన హిందీ మాసపత్రిక. సంపాదకుడుగా కృష్ణ విహారీమిశ్ర ఉండేవాడు. కొన్నాళ్ళు ప్రేంచంద్, మాతాదీన్ శుక్లకూడా సంపాదకత్వం వహించారు. ఇది కవిత్వం-కథలకు చాలా ప్రాధాన్యం ఇచ్చేది. ప్రేంచంద్ కథలు ఇందులో వస్తూండేవి.

## ముద్దు కృష్ణ
## (సామినేని ముదుకృష్ణ)

సాహితీ లోకంలో 'వైతాళికులు' కవితా సంకలన కర్తగా (1935) ముద్దుకృష్ణను అందరూ ఎరుగుదురు. 1934లో జ్వాల పత్రికను నిర్వహించారు. నవ్యకవిత్వానికి ప్రాధాన్యం ఇచ్చారు. అశోకం - అనార్కలి వంటి నాటికల్లో గత గాథలకు కొత్త వ్యాఖ్యానాన్నిచ్చారు. 'టీకప్పులో తుఫాను' లాంటి నాటకాలు రాశారు.

తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రిలో 1899లో జన్మించారు. 1973లో మరణించారు. కథలూ, కవితలూ, వ్యాసాలూ చాలా రాశారు. కొన్ని సినిమాల్లో కూడా రచనలు చేశారు.

## మున్నంగి...శర్మ
(మున్నంగి లక్ష్మీనరసింహ శర్మ)

అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకా తిమ్మనాయని పేటలో 1884లో జన్మించారు. 1910 ప్రాంతంలో ఏలూరు కొచ్చారు. 1912లో హితకారిణి యుగంధర అనే వారపత్రికలు నడిపారు. 1933లో దేవదత్తం అనే చిన్న వారపత్రిక నిర్వహించారు. కొన్నాళ్ళు 'గాండీవం' అన్న పత్రిక తెచ్చారు. భారతి - ఆంధ్ర పత్రికల్లో పన్జేశారు. అనేక వ్యాసాలు రాశారు. మాధవ వర్మ (నాటకం) శ్రీనాథ వైభవం (వ్యాసం), భారతంలో కొన్ని 9 పర్వాల పరిష్కరణం మొదలుగా అనేక రచనలు చేశారు. సంస్కరణాభిలాషి. వితంతు వివాహాన్ని చేసుకొన్నారు. వాఙ్మయ సేవ - ప్రజాసేవలను జమిలిగా చేసిన వ్యక్తిపీరు. కొద్దిపాటి పాఠశాల విద్యను నేర్చిన జీవితంలో విశేషపాండిత్యాన్ని సంపాదించారు. సంగీతం అభ్యసించారు. నాటకలాడేవారు. క్షయ వ్యాధితో 1937లో గుత్తిలో చనిపోయారు.

## మెర్క్యూరీ

పుస్తకాల జాబితానూ - పుస్తక విక్రేతల జాబితాను ప్రకటించే పత్రిక. 1668లో జాన్ స్టార్కీ-రాబర్ట్ క్లావెల్ అనే విక్రేతలు ఇంగ్లండ్‌లో ప్రారంభించారు. ఇంగ్లండ్‌లో వెలువడ్డ మొదటి సాహిత్య మాసపత్రికగా దీన్ని పరిగణిస్తారు. ఇది 1709 వరకూ నడిచి ఆగిపోయింది. దీని రిప్రింట్‌ను 'ఆర్బర్' సంపాదకుడుగా 1903 నుండి అచ్చేశాడు. ఇతడు ఆంగ్లభాషలో ఆచార్యుడు.

## రంగాచార్యులు ప్రతివాది భయంకర

బాల్‌చంద్ నానా చంద్ షావకీలు హిందీలో రాసిన ఛత్రపాలుడు నవలను కొంపెల్లతో కలిసి అనువదించారు. కాకినాడవాసి. ఆంధ్ర పత్రిక, భారతీ పత్రికల్లో పన్జేశారు.

## రత్నాజీరావు కె.

జనార్ధనరావుకు కుటుంబ మిత్రులు. ఉదయిని నడవడానికి చాలా ఆర్థిక సాయంచేశాడు. వీరి కుమారుడు కృష్ణారావు జనార్ధనరావుగారి పెద్దన్న కొమార్తెను పెళ్ళాడారు. మద్రాసులో నివసించేవారు. ఈయన ఇప్పుడు లేరు. కృష్ణారావు గారి కుటుంబం ఇప్పుడు మద్రాసులో ఉంది.

## రవీంద్రనాథ్ టాగూర్

ప్రసిద్ధ బెంగాలీ రచయిత 'జనగణమన' గేయరచయిత. మార్మికత ఇతనిరచనల్లో చూడగలం. అనేక సాహితీ ప్రక్రియల్లో బెంగాలీలో రచనలు చేశాడు. విద్యకున్న ఉపయోగాన్ని దృష్టిలో ఉంచుకొని తనభావాలకనుగుణంగా 'శాంతినికేతన్'ను స్థాపించాడు. 'గోరా' నవలలో రవీంద్రుడు తన భావాలను చక్కగా వివరించాడు.సంగీతంలో చిత్రలేఖనంలోకూడాబాగా ప్రవేశంఉన్నవాడు. సంగీతరూపకాలు చాలా రచించాడు. వీరిగీతాంజలికి నోబుల్ బహుమతివచ్చింది.

1861 లో జన్మించి మంచివిమర్శకుడుగా, కథకుడుగా, నవలారచయితగా ప్రసిద్ధిపొంది 1941 లో మరణించాడు.

## రాఘవాచార్యులు తాడిపత్రి [బళ్ళారి రాఘవ]

తెలుగు నాటకరంగంలో 'విప్లవం' తెచ్చిన వ్యక్తి. న్యాయవాది. రచయిత. నటుడు. కన్నడం - హిందీ - సంస్కృతం - తమిళభాషలతో పరిచయం ఉంది.

బసప్ప అనే సిద్ధపురుషుడి పేరున ఈయనకు బసప్పఅనే పేరుపెట్టారు తల్లిదండ్రులు. కాని తాడిపత్రి రాఘవాచార్యులు అయిన ఈయన బళ్ళారిరాఘవగా ప్రసిద్ధుడైనాడు. ఇంగ్లండ్, ఫ్రాంస్, జర్మనీ, స్విట్జర్లండ్‌లలో పర్యటించి భారత నాటకకళపై ఉపన్యాసాలిచ్చారు. 'సరిపడని సంగతులు' నాటకం రాశారు. రామదాసు,పఠాన్, కీచకుడు, యుగంధర, చాణక్య పాత్రలను నటించేవారు.

అనంతపురంజిల్లా తాడిపత్రిలో 1880 లో జన్మించారు. 1946 లో చనిపోయారు.

## రాజమన్నారు పాకాల వెంకట (సుధాకరుడు)

వాస్తవికతావాది. సంస్కరణశీలి న్యాయవాది. 'కళ' పత్రికను నిర్వహించారు. తప్పెవరిది, తెగనిసమస్య, మనోరమవంటి నాటికలనూ నాటకాలనూ రాశారు. సామాజిక సమస్యలను ప్రతిబింబించారు. మద్రాసు హైకోర్టు ప్రధానన్యాయమూర్తిగా పన్జేశారు. అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధాలుంచుకున్నారు

రాజమండ్రిలో 1901 లో జన్మించారు. కీర్తిశేషులు.

## రామకృష్ణారావు అబ్బూరి

భావకవుల్లో ఒకరు. జాతీయభావాలున్న వ్యక్తి. వామపక్ష రాజకీయాల నభిమానిస్తూ రాయిస్టుగా పరిణమించారు. సాహిత్యంలో అనేక ప్రక్రియల్లో రచనలుచేశారు. సూర్యరాజు కథలు రాశారు నదీసుందరి కావ్యం రాశారు. 'జలాంజలి' వీరిరచనే! సంస్కృతం, బెంగాలీ సాహిత్యాల్లో మంచి ప్రవేశంఉంది. కన్యాశుల్కం నాటకప్రయోక్తగా మంచిపేరు సంపాదించారు. సంభాషణా కుశలురు. తొలి అఖి భారత అభ్యుదయ రచయితల మహాసభలకు హాజరయ్యారు. 'ఇండియన్ లిటరేచర్' పత్రిక సంపాదకవర్గ సభ్యులు. 'నటాలి' సంస్థద్వారా మంచి నాటకాలాడించి ప్రసిద్ధిని పొందారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు గ్రంథాలయ శాఖాధ్యక్షులుగా చాలాకాలం పనిచేశారు. రవీంద్రుని రచనలు కొన్ని తెలుగు చేశారు. శ్రీశ్రీకి గురువు,

1896 లో తెనాలితాలూకా అనంతవరంలో జన్మించారు. 1979 లో చనిపోయారు.

## రామకోటేశ్వరరావు కోలవెన్ను

'త్రివేణి' ఆంగ్ల సాహిత్య మాసపత్రిక సంపాదకులు. తెనుగుసాహిత్యాన్ని ఇతర భాషలవారికి అందించిన ఖ్యాతి వీరిది. కొన్నాళ్లు ఐందరు జాతీయకళాశాల ప్రిన్సిపాలుగా పనిచేశారు. కృష్ణాపత్రిక సంపాదకులుగా, సౌత్ ఇండియన్ బుక్ ట్రస్ట్‌లో తెలుగు ప్రచురణ విభాగ సంపాదకులుగా ఉన్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ సలహాసంఘ సభ్యులుగా ఉన్నారు. జాతీయవాది. బి.ఏ,బి.ఎల్ అయిం తర్వాత నర్సరావుపేటలో న్యాయవాది వృత్తి చేశారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని కారాగారవాసం అనుభవించారు. ప్రకాశంగారి స్వరాజ్యపత్రికలో సహాయ సంపాదకులుగా పనిచేశారు. 1927 నుండీ త్రివేణి నిర్వహించారు. సరళం — సుబోధకంగా ఉండే ఇంగ్లీషురచన వీరిది. విమర్శలో తీక్ష్ణత వీరికి స్వభావసిద్ధం.

1894 నరసారావుపేటలో పుట్టి 1970లో చనిపోయారు.

## రామచంద్రశాస్త్రి మారేపల్లి

కళలు-సాహిత్యం-దేశం-భాష వీటికోసం జీవితమంతా శ్రమించారు. అనేక గ్రంథాలు రాశారు. జాతీయవాదిగా జైళ్ళ పాలయ్యారు నాటకకర్త, నటుడు. అనేక ప్రాచీనకావ్యాలను పరిష్కరించారు. వీరిని జనం 'కవి'గారనే పిలిచేవారు. 'తెలుగు నుడికడలి' అన్నది వీరు కూర్చిన గ్రంథం. ఆర్యదండయాత్ర అసం పూర్తి రచన. 'కవితాసమితి'లో ఉండేవారు.

1874 లో వీరు కృష్ణాజిల్లా కనకవల్లి అగ్రహారంలో జన్మించారు. విశాఖ పట్టణం వీరినివాసంగా ఎంచుకొన్నారు. 1951 లో వీరు మరణించారు.

## రామయ్యపంతులు జయంతి

శాసన పరిశోధకులు. నిఘంటు నిర్మాతలు. గ్రాంధికవాది, విమర్శకులు. చాలాభాషలు తెలిసిన వ్యక్తి. 1200ల శాసనాలను పరిశోధించి ప్రకటించారు గిడుగువారికి ప్రతిద్వంది‌గా నిలిచారు. 'ఆంధ్రవాఙ్మయ వికాస వైఖరి' వీరి విమర్శనాత్మక రచన. అసిస్టెంటు, డిప్యూటీ కలెక్టరుగా ఉద్యోగాలు చేశారు. 'కళాప్రపూర్ణ' బిరుదుంది.

1860లో తూ.గో. జిల్లా ముక్తేశ్వరంలో జన్మించారు. 1941లో చనిపోయారు.

## రామలింగారెడ్డి కట్టమంచి

కవి, విద్యావేత్త, విమర్శకులు. మంచి వక్త. జాతీయవాది. తెలుగులో ఆంగ్ల విమర్శనారీతులను ప్రవేశపెట్టారనవచ్చు. విస్తృతంగా విదేశాలు పర్యటించి జ్ఞానార్జన చేశారు. అనేక ప్రముఖ కళాశాలల్లో ఆచార్యులుగా ప్రధాన ఆచార్యులుగా, గౌరవ ఆచార్యులుగా పనిచేశారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం తొలి ఉపాధ్యక్షులు. మైసూరు విశ్వవిద్యాలయం ప్రొచాన్సలర్.

వీరి 'ముసలమ్మ మరణం' కొత్తదారులు తొక్కిన నవకవిత. కళాపూర్ణో దయానికి వీరు రాసిన పీఠిక సంచలనం కల్గించింది. 'వ్యాసమంజరి' వీరి వ్యాస సంకలనం. 'నవయామిని' ఖండకావ్యం.

1880లో చిత్తూరుజిల్లా కట్టమంచిలో జన్మించి 1951లో చనిపోయారు.

## రామస్వామిచౌదరి త్రిపురనేని

సాహిత్యం ద్వారా హేతువాదాన్ని ప్రచారంచేశారు. సాంఘిక విప్లవాన్ని ఆశించారు. మానవతావాది. మూఢాచారాలను, మత విశ్వాసాలను నిర్మూలించ డానికి కృషిచేశారు. జాతీయవాది. బారిస్టర్ చదివి తెనాలిలో న్యాయవాదిగా స్థిర పడ్డారు. 'వీరగంధము తెచ్చినారము - వీరుడెవ్వడొ తెల్పుడీ' అన్న గేయం రాసి ప్రసిద్ధిపొందారు "ఖూనీ" నాటకం చాలా ప్రాముఖ్యం పొందింది. అలానే 'శంబుక వధ' సాంఘిక అధర్మాన్ని వెల్లడించే రచన. పాత పురాణాలను చెండాడే రచన వీరి "సూతపురాణం" పెళ్ళిళ్ళలో సంస్కరణ ఆశించి అలా నిర్వర్తించారు "వివాహవిధి" రాశారు. ప్రచారంచేశారు తీవ్రభావోద్వేగం వీరి రచనల్లో చూడగలం. వీరికి చాలా బిరుదులున్నా "కవిరాజు" అన్నదే వీరికి ప్రసిద్ధి.

కృష్ణాజిల్లా అంగలూరులో 1886లో జన్మించి 1943లో చనిపోయారు.

## రామిరెడ్డి దువ్వూరి

కవి కోకిల బిరుదాంకితులు. అనేక భాషల్లో పాండిత్యం ఉంది. చాలా వ్యాసాలు కవితలూ రాశారు. పానశాల బాగా పేరు సంపాదించింది. వనకుమారి, కృషీవలుడు, జలదాంగనవంటి చాలా రచనలు చేశారు. ఆంగ్లంలో కూడా కొన్ని రచనలున్నాయి. "చిత్రనళీయం" సినిమాకు దర్శకత్వం వహించారు. చిత్ర రచన, శిల్పరచనల్లో అభిరుచి ఉండేది వీరికి.

1895లో గూడూరులో జన్మించి 1947లో చనిపోయారు.

## లక్ష్మీనారాయణ ఉన్నవ

'మాలపల్లి' నవలను రాశారు. నాయకురాలు నాటకం రాశారు. తిక్కన నవల అసంపూర్తిగా ఉంది. హరిజన నాటకం రాశారు. గాంధేయవాది. సంఘ సంస్కర్త. గుంటూరులో ఉన్నవ దంపతులు శారదానికేతన్ స్థాపించి నిర్వహించారు. గ్రామప్రజల జీవితాల బాగుకు కృషిచేశారు. తెలుగు అతిచక్కగా రాయగల నేర్పున్నవారు.

1878లో గుంటూరు జిల్లా మేములూరుపాడులో జన్మించారు. 1958లో చనిపోయారు.

## లింగయ్య గద్దె

జాతీయవాది. సాంఘిక రాజకీయ ఉద్యమాలలో పాల్గొన్నారు. కారాగార వాసం చేశారు. ఆదర్శగ్రంథ మండలి స్థాపించి అభ్యుదయ సాహిత్యాన్ని ప్రచురించారు. అనేక దేశాలకథలను అనువదించారు. మాలపల్లి, జోన్ ఆఫ్ ఆర్క్, విప్లవయుగము, విప్లవవీరులు వీరి రచనలు.

కృష్ణా జిల్లా యలమర్రులో 1912లో జన్మించారు

## వామనుడు

ఇతడి గ్రంథం కావ్యాలంకార సంగ్రహం. భామహుని అలంకార సిద్ధాంతాన్ని, దండి గుణసిద్ధాంతాన్నీ సమన్వయంచేసి రీతి సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. కావ్యానికి ఆత్మ రీతి అంటాడు.

వామనుడు 8వ శతాబ్దంవాడు.

## విద్యానాథుడు

కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు కాలమువాడు. అగస్త్యుడన్నది నిజ నామము విద్యానాథుడన్నది బిరుదము. ప్రతాపరుద్ర యశోభూషణమన్న అలంకారశాస్త్రం ఇతడేరాశాడు. ఇతడు సుమారు డెబ్భై గ్రంథాలు రాశాడని ప్రతీతి. బాలభారతం, కృష్ణచరితము ప్రసిద్ధ రచనలు. తన అలంకారశాస్త్రాన్ని ప్రతాపరుద్రుడికి అంకితం చేశాడు.

అతడి ఆస్థానంలో ఉన్న ఇతడు 1292—1318 సంవత్సరముల మధ్య జీవించాడు.

## విశ్వేశ్వర్రావు మల్లవరపు

గీతాలు రాయడంలో ప్రసిద్ధులు జనార్ధనరావ్‌కున్న మంచిమిత్రుల్లో ఒకరు, శాంతినికేతన్‌లో విద్యార్థి. మధుకీల, కళ్యాణకింకిణి వీరి సంకలనాలు. పేరుకోసం ఆర్భాటాలెరుగని వ్యక్తి. జనార్ధనరావ్. తన ఉత్తరాల్లో 'విశ్వం' అంటూంటాడు. 1904లో జన్మించారు. 1986లో హైద్రాబాద్‌లో మరణించారు.

## విద్వాన్ విశ్వం (విశ్వరూపాచారి)

నవ్య సాహిత్యమాల సంపాదకులు, కవి, రచయిత, సంపాదకులు. స్వాతంత్రోద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. మీజాన్, ప్రజాశక్తి, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభల్లో పనిచేశారు. పెన్నేటిపాట చక్కని కవిత. సంస్కృతంనుంచి మేఘసందేశం, రఘువంశంలాంటి వనేకం తెలుగులోకి అనువదించారు. రోమరోలా, ఇబ్సన్, చెకోవ్‌ల రచనలనూ అనువదించారు. 'నాహృదయం' మంచి కవితాసంకలనం. 'మాణిక్య వీణ' లాంటి శీర్షికలను పత్రికల్లో నిర్వహించారు. అభ్యుదయ రచయితల సంఘంలో 1955కు పూర్వం సభ్యులుగా ఉన్నారు.

అనంతపురం జిల్లా తరిమెలలో 1915లో జన్మించారు. ప్రస్తుతం తిరుపతి దేవస్థానంవారి ప్రచురణల సంపాదకులుగా ఉంటున్నారు.

## వినాయకరావు కొమర్రాజు

కొమర్రాజు లక్ష్మణరావుగారి కుమారుడు. వినాయకరావుగారు నవ్యసాహిత్యాభిమాని. కొన్ని గీతాలు, తదితర సాహిత్యరచనలు చేశారు. జ్వాల, అభ్యుదయల్లో ఉన్నాయి. అభ్యుదయ రచయితల సంఘం స్థాపనానంతరం కొన్ని సంవత్సరాలు ఆయన ముఖ్య కార్యకర్తగా సంఘ కార్యకలాపాలలో పాల్గొన్నారు. అభ్యుదయ సాహిత్య ప్రాచుర్యానికి తోడ్పడేందుకు ముద్రణాలయం పెట్టారు. ఉత్పల లక్ష్మణరావుగారి 'అతడు-ఆమె' వెలువడింది యీ ముద్రణాలయంనుండే.

## వినోదిని

1932లో మాస పత్రికగా మద్రాసు నుండి కొన్నాళ్లు వెలువడింది. బుక్క పట్నం తిరుమల నరసింహాచార్యులు సంపాదకుడు. పి. గోపాలస్వామి నాయుడు స్థాపించారు. హాస్య కథలకు స్థాన మిచ్చిన సాహిత్య పత్రిక. "ఇంక్ శాస్త్రి" పేరడీలు కొన్నిందులో వచ్చాయి.

సాహిత్య మాసపత్రిక. 1935లో ఆరంభమై కొన్నాళ్లొచ్చింది. తెల

ప్రోలు కార్యస్థానం. పాటిబండ మాధవశర్మ, రాజగోపాల్ గారలు సంపాదకులు. శ్రీశ్రీ తరుచు రాస్తుండేవారిందులో. భావకవిత్వాన్ని ప్రచారంచేసింది కవితలు, విమర్శలు, వ్యాసాలు ప్రముఖస్థానం ఆక్రమించుకొనేవి. చలం మ్యూజింగ్స్ ఈ పత్రికలోనే ప్రచురితం.

## వీరభద్రయ్య హోతా

జనార్దనరావు బంధువులు. చాలా స్థితిమంతులు. వీరి పూర్వులు బర్మా, మలయా, ఇతర తూర్పుదేశాలలో వర్తకం చేసేవాళ్లు. గంగోలు ఎస్టేటు కొన్నారు. దానధర్మాలకింద ఆస్తి హారతికర్పూరం అయినంత రాజమండ్రిలో విద్యాభ్యాసం చేశారు. పలువురు విద్యార్థులకు స్కాలర్‌షిపులిచ్చి చదివించేవారు. ప్రకాశంపంతులుగారికి కూడా ఆర్థిక సహకారమందించిన కుటుంబం వీరిది. వీరి బావగారు బులుసు పాపయ్య శాస్త్రిగారు. వేదంలో నిధి. జనార్దనరావు తండ్రి వసంతంగారు వీరి అల్లుడు. జనార్దనరావ్ చదువు సంధ్యలకూ, ఆపైనా వీరి కుటుంబం బాగా ఆదుకొంది. వీరభద్రయ్యగారు కీర్తిశేషులు. వీరి కుమారులు శివరామశాస్త్రిగారి కుటుంబం రాజమండ్రిలోఉంది.

## వెంకటకృష్ణశాస్త్రి దేవులపల్లి

భావకవిత్వాన్ని ఆకాశం అంచులకు చేరవేసినవ్యక్తి. 1922లో కృష్ణపక్షం అచ్చయింది. ప్రవాసం, ఊర్వశి 1929లో ముద్దుకృష్ణ అచ్చేయించాడు. బ్రహ్మసమాజ ప్రభావితుడు. 'మహతి' అనే గీతాలసంపుటి దీనికాధారం. కవిత్వాన్ని చక్కగాపాడి ప్రచారంచేసినవారు. సమస్త సాహితీ ప్రక్రియలనూ చేపట్టారు. భావకవుల వేషభాషలకు మూసపోసినవాడు. తెలుగుదనం ఒలికే రచనల్తో సినిమారంగాన్ని ప్రభావితం చేశాడు. మల్లీశ్వరి - వీరి సినిమా రచనలలో కలికితురాయి.

అందంగాఉంటూ అందంగా కవిత్వం చెప్పినవాళ్ళలో ముందుంటారు. 1897లో తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం దగ్గర చంద్రంపాలెంలో పుట్టారు. రేడియోలో చాలాకాలం పన్జేశారు. పండితకుటుంబం వీరిది. కళాప్రపూర్ణ బిరుదం ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రసాదించింది. మద్రాసులో 1980లో చనిపోయారు.

## వెంకటరత్నం తెలికచర్ల

నవ్య సాహిత్య పరిషత్ నిర్వాహకులు, ప్రతిభ సంపాదకులు. 'గిడుగు'ను గూర్చి ధన్యజీవి అన్న రచనా, 'మాతృ భాష – పర భాష' – అన్నవీ చాలా చక్కనివి. గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ప్రాచ్య భాషా విభాగం అధిపతిగా పన్జేశారు. ఎక్కువగా వ్యాసాలు రాశారు.

శ్రీకాకుళం జిల్లా కరవంజలో 20వ శతాబ్దం, చివరలో జన్మించారు. రాజమండ్రి, గుంటూరులలో ఎక్కువ కాలం నివసించారు.

## వెంకటరామమూర్తి గిడుగు

"ప్రజల్లో విద్య వ్యాపిస్తేనే గాని సంఘము వృద్ధిలోకి రాదు" - అని నమ్మిన మహా పండితుడు గిడుగు. భాషా విషయికంగా పాదుకొన్న ప్యూడలిజం మీద కత్తి గట్టారు. వ్యావహారిక భాషా ఉద్యమాన్ని నిర్మించి - నిర్వహించారు. విద్యార్థులకుపయోగకరంగా ఉండే భాషను వ్యాప్తి చెయ్యడానికి నాటి పండితులతో శిగ పట్టు పట్టారు. అనేక వ్యాసాలు - విమర్శలు రాశారు. బాల కవి శరణ్యం - ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం, వ్యాసావళి వంటి రచనలు చేశారు. సవర కథలు — పాటలు ప్రచురించారు. సవర భాష మీద పరిశోధన చేశారు. సవర - తెలుగు; తెలుగు — సవర నిఘంటువులు కూర్చారు. తన ఉద్యమం ద్వారా తెలుగు వాడికి నోరిచ్చారు. పర్లాకిమిడి రాజా వారి కళాశాలలో అధ్యాపకుడుగా ఉన్నారు. 1863 లో జన్మించి 1940 వరకూ జీవించారు. ఇప్పుడు ఒరిస్సా ఉన్న పర్లాకిమిడి ప్రాంతాలు ఆంధ్ర రాష్ట్రంలోనే చేరాలని అప్పట్లో పోరాడిన మనత వీరిది.

## వెంకటరత్నం కొక్కొండ

గ్రాంథిక భాషా వాది. 'మహా మహోపాధ్యాయ' బిరుదు పొందిన తెలుగు వారిలో ప్రథములు. మద్రాసు, రాజమహేంద్రవరం కళాశాలలలో తెలుగు అధ్యాపకులుగా పనిచేశారు. 'ఆంధ్ర భాషా సంజీవని' పత్రికను నడిపారు. వీరిది చాలా ప్రౌఢమైన శైలి. నిత్య వ్యవహారంలో సైతం గ్రాంథికాంధ్ర భాష ప్రాస యుక్తంగా మాట్లాడే వారు. చాలా రచనలు చేశారు. అనేక బిరుదులు పొందారు.

1842 లో వినుకొండలో జన్మించి 1915 లో చనిపోయారు.

## వెంకటరమణయ్య నేలటూరి

చరిత్ర పరిశోధకులు. సాహితీ వేత్త. ఆంగ్లం - సంస్కృతం బాగా వచ్చిన వ్యక్తి — కన్నడం, తమిళం, ప్రాకృతాలలో ప్రవేశముంది. కడప, వరంగల్ జిల్లాల్లో అనేక శాసనాలను వెలికి తీసి ప్రకటించారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో చరిత్రలో మొదటి డాక్టరేట్ వీరు. యక్ష గానాలు పాల్కురికి సోమనాథుని కాలం-వంటి వాటి మీద బాగా శ్రమించి విషయ సేకరణ చేశారు. తెలుగు శాస్త్రీయుల్లో

సుమారు 200 వ్యాసాలు రాశారు మధుమావతి ప్రతీకారం, పశ్చాత్తాపం, చామర గ్రాహిణి వంటి రచనలు చేశారు. వాఙ్మయ వ్యాస మంజరి, నాయక రాజుల నాటి దక్షిణాత్యాంధ్ర సాహిత్యం, ఆంధ్రుల చరిత్ర వీరి యితర గ్రంథాలు.

1891 లో నెల్లూరు జిల్లా నేలటూరులో జన్మించారు. 1977 లో చనిపోయారు. మద్రాసు హైదరాబాద్‌లలో ఎక్కువ కాలం నివసించారు.

## వెంకట్రామయ్య జనమంచి

సాంప్రదాయక విద్యాభ్యాసం చేశారు. నూతన విద్యా విధానాన్ని చవి చూశారు. సంస్కృత పాండిత్యం విశేషం. విద్ధ సాలభంజికను తెలుగులోకి అనువదించారు. నవకుసుమాంజలి, దారితోడులాంటి ఖండ కావ్యాలు ప్రకటించారు. రాజమండ్రి మ్యునిసిపల్ పాఠశాలలో తెలుగు పండితులుగా పని చేశారు. భావం - భాష సరళంగా ఉండే రచన వీరిది. జనమంచి కామేశ్వర్రావ్, రామ కృష్ణలు వీరి కుమారులు - ఇద్దరూ మంచి సాహితీ వేత్తలు. 1872 సం॥లో జన్మించిన వెంకట్రామయ్యగారు 1933 లో మరణించారు.

## వెంకట సీతాపతి గిడుగు

సంస్కృతం, గ్రీకు, లాటిన్ లాంటి చాలా భాషల్లో ప్రవేశం ఉంది. వాఙ్మయ పరిశోధకులు. వ్యక్తిరీత్యా తండ్రి గారిలా చరిత్ర ఉపన్యాసకులు. వ్యావహారిక భాషా ఉద్యమంలో తీవ్రంగా కృషి చేశారు. సవర భాషా పరిశ్రమ వీరి అభిమానాంశం. నటన - చదరంగం — కుస్తీలలో చాలా ఆసక్తి. తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వానికి సంపాదకులుగా ఉన్నారు. సూర్యరాయాంధ్ర నిఘంటు పునర్ముద్రణలో సంపాదకులుగా ఉన్నారు. ఇంగ్లీషులో వీరు రాసిన సవర పాటలకు "డాక్టర్ ఆఫ్ లెటర్స్" బిరుదొచ్చింది. హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్ — ఆంగ్లంలో రాశారు. "రాయల నీతి కథలు" మూడు భాగాలుగా రాశారు. వీరికి "కళాప్రపూర్ణ" బిరుదుంది.

1886లో విశాఖ జిల్లా భీమునిపట్నంలో జన్మించారు. పర్లాకిమిడి, మద్రాసు, హైదరాబాద్‌లలో నివసించారు. 1969లో చనిపోయారు.

## వెంకట హనుమంతరావు పిల్లలమర్రి

విమర్శకులు. పత్రికారచయిత. వత్సల, దీపకళిక, సాహిత్య సంపదలాంటి చాలా గ్రంథాలు రాశారు. సాహిత్య విమర్శలో ప్రత్యేక కృషి చేశారు. కురు

గంటి సీతారామభట్టా చార్య గారూ వీరూ "నవ్యాంధ్రసాహిత్య వీధుల"ను రచించారు. గుంటూరు హిందూ కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేశారు.

1918లో గుంటూరు జిల్లా బ్రాహ్మణ కోడూరులో జన్మించారు. 1971లో గుంటూరులో మరణించారు.

## వెల్స్, హెచ్. జి.

ఓ చిన్న వ్యాపారి కొడుకు. మిధర్స్ గ్రామర్ / స్కూలులో ఉపాధ్యాయుడుగా ఉంటూ రాత్రి పాఠశాలల్లో చదువు కొనసాగించాడు. తరచు అనారోగ్యంతో బాధపడుతుండేవాడు. ఫేబియన్ సొసైటీలో సభ్యుడుగా ఉంటూ బెర్నార్డ్ సిడ్నీలతో తగదాపడి బయటకొచ్చాడు. సైన్స్ నవలా రచయితగా పేరు సంపాదించాడు. 1895లో వచ్చిన "ది టైం మెషీన్" వెల్స్‌కు బాగా పేరు సంపాదించడమే కాదు, ఆ సం॥రం అమ్మకాలలో 802701 కాపీలమ్మి ఓ కొత్త రికార్డు నెలకొల్పింది. 'ది హిస్టరీ ఆఫ్ మిస్టర్‌పోలి'-లాంటి నవలల ద్వారా హాస్య నవలా రచయితగా పేరు సంపాదించాడు. పలు రచనలు సాగించిన వెల్స్ ఇంగ్లండ్‌లో 'బ్రూంలీ'లో 1866లో జన్మించాడు. 1946లో మరణించాడు.

## శారద

మాస పత్రికగా నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెం నుండి 1896లో ఆరంభమైంది. ఎడవల్లి కామశాస్త్రి సంపాదకులు. తెలుగు భాషా వ్యాప్తి దీని ఆశయం. ప్రాచీన శతకాలు, చిన్న కథలు, విమర్శలను ప్రకటించేది.

## శాఫో

గ్రీకు కవి. ప్రణయం ఇతివృత్తంగా ఈమె చాలా కవితలు వ్రాసింది. అయితే వీటిలో కేవలం 12 మాత్రమే లభ్యమవుతున్నాయి. కాల్పనికత ఎక్కువ. జాతీయాలూ - పదబంధాలూ చక్కగా ఉపయోగిస్తూ సరళమైన భాషలో రచన చేసింది

ఈ కవయిత్రి 'లెస్‌బాస్' - గ్రామంలో క్రీ. పూ. 7వ శతాబ్దం మధ్య భాగంలో జీవించినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. రాజకీయ గందరగోళాల వల్ల చివరకు 'సిసిలీ' స్థిరపడింది. చివరకక్కడే మరణించింది.

## శివరామశాస్త్రి వేలూరి

అనేక భాషలు తెలిసిన వారు. కథలు, నాటకాలు, నవలలు, ఖండ కావ్యాలు రాశారు. శతావధానులు. రష్యన్ సాహిత్యాన్ని తెలుగు చేసిన వారిలో వీరొకరు. శరత్ నవలలను అనువదించారు. గాంధీ ఆత్మకథను అనువదించారు. "[illegible]" లాంటి మంచి కథలు రాశారు. వీరిది సరళమైన వచనం. "[illegible]" కావ్యం. మంచి విమర్శకులుగా ప్రసిద్ధి పొందారు.

[illegible]లో [illegible]వాడ, కృష్ణా జిల్లాలో జన్మించి 1967లో చనిపోయారు.

## శ్రీనివాసరావు శ్రీరంగం

## శ్రీశ్రీ

ఉగ్ర కవిత్వ ధోరణిని ఆకళించుకొని నవ్య సాహిత్యానికి స్వాతంత్ర్యం ఇచ్చాడు. కవిత్వాన్ని జాతీయం చెయ్యాలన్న తపనతో రచనలు చేశాడు. పలికే పద్ధతి [illegible] విధానము [illegible] సూచిస్తాయి. భావకవిత్వం నుంచి అభ్యుదయ కవిత్వానికి వచ్చాడు. అభ్యుదయ రచయితల ఉద్యమంలో చాలా కాలం నాయకత్వ స్థానంలో ఉన్నాడు. విప్లవ రచయితల సంఘంలోనూ నాయకుడుగా ఉన్నాడు. బి. ఏ. వరకు చదివాడు. విశాఖపట్నం హార్బరులోనూ, ఆంధ్రప్రభలోనూ, ఆలిండియా రేడియో ఢిల్లీలోనూ, ఇండియన్ ఆర్మీ కోర్‌లోనూ పనిచేశాడు. అనేక దేశాలు పర్యటించారు. ఈయనకు సోవియట్‌లాండ్ నెహ్రూ బహుమతి, కేంద్ర సాహిత్య అకాడమి బహుమతి వచ్చాయి.

మహాప్రస్థానం, ఖడ్గసృష్టి, మరోప్రస్థానం, చరమరాత్రి, చైనాయానం, అనంతం (స్వీయచరిత్రాత్మకం) వంటి అనేక గ్రంథాలను వివిధ సాహిత్య ప్రక్రియల్లో రాశారు. సినిమాల్లో పాటలు రాశారు.

1910లో విశాఖలో జన్మించారు. 1983లో మద్రాసులో మరణించారు.

## సఖి

త్రైమాసిక పత్రికగా 1936లో గుంటూరు నుండి వెలువడింది. తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు సంపాదకులు. సాహితీసమితిని బలపర్చేది. నవ్య సాహిత్య రీతుల ప్రచారానికి ఉద్దేశించిన పత్రిక ఇది.

## సత్యనారాయణ, విశ్వనాథ

పాండిత్యం - కవిత్వం కలబోతగా వీరి రచనల్లో కనిపిస్తుంది. శతాధిక గ్రంథకర్త. అన్ని ప్రక్రియల్లోనూ చెయ్యిపెట్టారు. వేయి పడగలు నవలా,

రామాయణ కల్పవృక్షం-ఈ రెండూ వీరికి ఖ్యాతిని తెచ్చాయి. [illegible]ధర్మం పట్ల ఆసక్తిగల వ్యక్తి. వీరి నాటకాలలో అనార్కలి వేనరాజు, [illegible] ప్రశస్తాలనవచ్చు. జ్ఞానపీఠ్ బహుమతి గ్రహీత.

1895లో కృష్ణాజిల్లా నందమూరులో పుట్టారు. కొన్ని కళాశాలల్లో ఉపన్యాసకుడుగానూ, కరీంనగర్ కళాశాల ప్రధానాచార్యుడుగానూ పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవిగా ఉన్నారు. సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. కవిసమ్రాట్ విశ్వనాథ 1976లో విజయవాడలో మరణించారు

## సత్యనారాయణమూర్తి జొన్నలగడ్డ

సంస్కృతం, బెంగాలీ, మరాఠీ, హిందీ, పార్శీ, జర్మన్ భాషా సాహిత్యాలు తెలిసినవారు. కలకత్తాలో చదివారు. సర్వేపల్లి రాధాకృష్ణన్ శిష్యులు. అనర్గళంగా మాట్లాడగలరు. డి. యల్. రాయ్ నాటకాలను అనువదించారు. అపరాధ పరిశోధక నవలలు చాలా రాశారు. న్యాయవాదిగా పనిచేశారు. వేదాంతం, చరిత్రల్లో యం. ఏ. చదివారు. "నా మహారాష్ట్రయాత్ర" మంచి వ్యాస సంపుటి. అనేక రచనలు చేశారు.

1908లో పశ్చిమ గోదావరిజిల్లా సెట్టిపేటలో జన్మించారు. 19[illegible]లో చనిపోయారు.

## సత్యనారాయణశాస్త్రి వేదుల

చీకటిని సైతం ప్రియురాలిగా సంభావించిన కవి. భావకవి. బెంగాలీ, సంస్కృతాలలో ప్రవేశం ఉంది. శతావధానాలు చేశారు. దేశభక్తి పూరితమైన రచనలు చేశారు. రవీంద్రుని ప్రభావం కనిపిస్తుంది. వారి రచనలను కొన్ని తెలుగులోకి అనువాదం చేశారు. 'దీపావళి' వీరి ప్రసిద్ధ రచనలలో ఒకటి. కథలు - నాటకాలు - వ్యాసాలూ రాశారు. కావలి కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా పని చేశారు. వీరికి 'గౌతమీ కోకిల' అన్న బిరుదుంది. వీరు 1900లో ఖమ్మంజిల్లా గొల్లగూడెంలో జన్మించారు. 1976లో మరణించారు.

## సాహితి

నవ్య సాహిత్యానికీ, గిడుగు వ్యావహారిక భాషోద్యమానికి చాలా ప్రచారం చేసిన పత్రిక. సాహితీసమితి సభ్యులు కొల్లిపర సూరయ్యగారు తెనాలి నుండి నడిపారు. 1920లో ఆరంభమైంది. సాహిత్య విమర్శలు - చిన్న కథలు - నవల ఏకాంకికలకు ఈ పత్రిక స్థానం ఇచ్చేది.

## స్విన్ బర్న్ ఆల్గర్నన్ చార్ల్స్

స్విన్ బర్న్ పాత ఛందంలో కొత్త భావాలు చెప్పాడు. అనేక రకాల ఛందస్సులను తన కవితల్లో వాడాడు. పూర్వ - రేఫలైట్ ఉద్యమానికి చెందిన వాడు. అతడి మొదటి రచనలు ది క్వీన్ మదర్, రోజ మండ్ (1860). 1866లో 'పోయమ్స్ అండ్ బాలడ్స్' అన్న కవితా సంకలనం బయట కొచ్చింది. తరచు అనారోగ్యంతో బాధపడ్తూండేవాడు. అతిగా మద్యం తాగడం దీనికి ఓ కారణం. వాట్స్‌డంటన్ - ఇతణ్ణి బలవంతాన 'పుట్నీ' గ్రామంలో ఉంచి ఆరోగ్యం కుదుట పర్చాడు. అనేక సాహితీ ప్రక్రియల్లో రచనలు సాగించాడు అతడి ఉత్తరాలే ఆరు సంపుటాల్లో 1959-62 మధ్య వెలువడ్డాయి.

1837లో ఐల్ ఆఫ్ వెయిట్‌లో పుట్టాడు. 1909లో మరణించాడు.

## సీతారామయ్య కురుగంటి (సీతారామభట్టాచార్యులు)

విమర్శకులు. సంస్కరణవాది. పత్రికా సంపాదకులు. భారతస్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు కథ, నవల, వ్యాసం, కవి జీవితాలవంటి అనేక సాహిత్య ప్రక్రియలు చేపట్టారు. తెనాలిలో కొంత కాలం న్యాయవాదిగా పని జేశారు. కొవ్వూరు, విజయవాడ, తంజావూరు, హైదరాబాద్‌లో ఉద్యోగాలు చేశారు. నిజాం కాళాశాలలోనూ, సమాచార శాఖలోనూ, దక్కన్ రేడియోలోనూ కొంతకాలం నౌకరీచేశారు. 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' అని ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర రాశారు. రెండో ముద్రణలో పిల్లలమర్రి హనుమంతరావుగారి సాయం తీసుకున్నారు. వాడుక భాషను అభిమానించారు.

1889 లో వేమూరులో జన్మించారు. 1959 లో హైదరాబాదులో మరణించారు.

## సీతారామాంజనేయులు వడ్డాది

కవితాసమితి స్థాపక సభ్యుల్లో ఒకరు. జాతీయవాది. 'దండాలు దండాలు మా భరతమాత' గేయం రాసింది వీరే! సరళమైన శైలితో రచనలు చేశారు. పేరుకు పాకులాడే వ్యక్తికాదు. స్వరాజ్య సందేశం - రాట్నంవంటి రచనలెన్నో చేశారు. బాలకవి అన్న బిరుదం ఉంది. 1900లో జన్మించారు. ప్రస్తుతం విశాఖ జిల్లా సింహాచలంలో ఉంటున్నారు. కసింకోట వాస్తవ్యులు.

## సుబ్బరామయ్య గన్నవరపు

నిర్మోహమాటం - గుండెనిబ్బరం కల సంపాదకుడుగా భారతి పత్రికలో పేరు పొందారు. తమిళ, కన్నడ, మళయాళ, హిందీ, గుజరాతీ, బెంగాలీ భాషలు నేర్చారు. బుక్‌కీపింగ్, షార్ట్‌హాండ్, టైప్‌రైటింగ్ లాంటివీ అలవర్చుకున్నారు. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో పండితులుగా పనిచేశారు. కొంత కాలం విదేశీయులకు దేశభాషోపాధ్యాయులుగా ఉన్నారు. మద్రాసు ప్రభుత్వంలో యాంటీహూక్‌వర్మ్ కాంపైన్‌లో స్టెనోగ్రాఫర్‌గా పనిచేశారు. భారతిలో మీగడ తరకలు, గ్రంథసమీక్షలు - కలకూరగంపవంటివి నిర్వహించారు. కాశీనాథుని నాగేశ్వరరావ్‌గారు చనిపోయేవరకు భారతిలో సంపాదకులుగా ఉన్నారు. నెల్లూరు ఎ. బి. ఎం. బాలికల పాఠశాలలో తెలుగు పండితులుగా 12 సం॥ లు ఉన్నారు. 1956 నుండి తెలుగు భాషాసమితి విజ్ఞాన సర్వస్వం నిర్వహణలో ఉన్నారు.

మళయాళ నవలలు ఛెమీన్, రెండు ఇడంగళి నవలలు కేంద్రసాహిత్య అకాడమీవారికోసం అనువదించారు.

నెల్లూరు జిల్లా సూరప్పాగ్రహారం వారైనా 1890 మద్రాసులో జన్మించారు. 1963 లో చనిపోయారు.

## సుబ్బారావు జయంతి

మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారి అనుయాయి. 'కవిగారి మనుగడ' అంటూ వీరు శాస్త్రిగారి జీవితం రాశారు. కవితా సమితి సభ్యులు. విశాఖ వా సవ్యులు.

## సుబ్బారావు రాయప్రోలు
(సుభాషి)

నవ్యకవిత్వానికి లక్షణాలు నిర్వచించారు. కొంతకాలం అవధానాలు చేశారు. శాంతినికేతన్ విద్యార్థి. ఉస్మానియా, తిరుపతి విశ్వవిద్యాలయాల్లో తెలుగు శాఖాధిపతిగా పనిచేశారు. 'ఏ కేశ మేగినా ఎందుకాలిడినా' లాంటి గేయాలెన్నో రాశారు. లలిత, తృణకంకణం, రమ్యాలోకంలాంటి అనేక ఖండకావ్యాలు రాశారు. ఉమర్‌ఖయ్యాంను అనువదించారు. 1962 కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి పొందారు. 'అమలిన శృంగార' భావనను కవితలో ప్రచారం చేసింది వీరే, "కళాప్రపూర్ణులు."

1892 లో గుంటూరు జిల్లా గార్లపాడులో జన్మించి 1984 హైదరాబాదులో చనిపోయారు.

## సుబ్బారావు వావిలకొలను (సుబ్బదాసు) (వాసుదాసు)

వీరేశలింగం తర్వాత మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో తెలుగు పండితులుగా పనిచేశారు. రామాయణాన్ని చక్కగా అనువదించారు. దానికి 'మందరము' అంటూ వ్యాఖ్యానంకూడా రాశారు. 'భక్తి సంజీవని' పత్రిక నిర్వహించారు. కౌసల్యా పరిణయం ప్రబంధాన్నీ, సుభద్రా విజయం నాటకాన్నీ రాశారు. సులభ వ్యాకరణం రాశారు.

వీరు 1863 లో జన్మించి 1939 లో మరణించారు.

## సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీపాద

గోదావరీతీరం భాష సొగసులు, పలుకుబళ్ళు తెలియాలంటే వీరి రచనలనే చదవాలి. మధ్యతరగతి బ్రాహ్మణీకం జీవిత చిత్రణలను చూడాలంటే వీరి రచనలనే చూడాలి. రచనల్లోనూ-అచ్చులోనూ-జీవితంలోనూ 'ఎడ్జస్ట్‌మెంటాలిటీ' లేని వ్యక్తి వీరు. తాను 1930-40 మధ్య నడిపిన 'ప్రబుద్ధాంధ్ర' పత్రికకోసం రోజుకు 10 చందాలనన్నా చేర్చందే అన్నం తినని మనిషి. గాంధీ - హిందీ - కాంగ్రెసు అంటే తీవ్రవైముఖ్యం కనపరచేవారు. తన పత్రికలో పద్యం-కవిత్వం నిషేధించాడు. చక్కని వ్యావహారిక రచన వీరిది. 'వడ్లగింజలు' బాగా పేరు తెచ్చిన కథ. వీరి కథలు నవలికలనవచ్చు. వీరి 'రాజరాజు' నాటకం చాలా ప్రసిద్ధి పొందింది. 'అనుభవాలూ-జ్ఞాపకాలూనూ' అన్న వీరి స్వీయ చరిత్ర మూడు సంపుటాలూ నాటి తెలుగు సాహిత్య చరిత్ర అనే అనవచ్చు. తూర్పుగోదావరి జిల్లాలో 1891 లో జన్మించారు. 1961 లో చనిపోయారు.

## సేఠ్ గోవిందదాస్

స్వాతంత్ర్య సమర సేనాని. మధ్యప్రదేశ్ కాంగ్రెసుకు అధ్యక్షుడుగా చాలా కాలం ఉన్నారు. మధ్యప్రదేశ్ హిందీ సాహిత్యసమ్మేళనానికి 1920, 1934 లలో అధ్యక్షులుగా ఉన్నారు. శారద, లోకమత దినపత్రిక, జైహింద్ పత్రికలను స్థాపించారు. అనేక ఏకాంకిక నాటికలను రాశారు. ఇందుమతి నవల రాశారు. అనేక కవితా సంకలనాలను వెలువరించారు. భారత దేశంలో టాండన్‌తోపాటు హిందీ ప్రచారంలో ప్రముఖపాత్ర వహించారు. లోకసభ సభ్యులు. పలు పర్యాయాలు ఎన్నికైన సాహిత్యవేత్త.

## స్వామి శివశంకరస్వామి

జోడు స్వాముల ప్రసిద్ధి. 1919 లో తెనాలిలో సాహితీ సమితిని స్థాపించారు. సన్యాసాశ్రమం స్వీకరించకముందు పేరు తల్లావఝుల శివశంకరశాస్త్రిగా ప్రసిద్ధులు. నాడు పేరున్న రచయితలందర్నీ సాహితీసమితిలో కూడగట్టిన ఖ్యాతి వీరిది. 'సభాపతి'గా ఉంటూ పలువురు రచయితలను ప్రోత్సహించారు. సమితిలో అధికులు వ్యావహారిక భాషావాదులైనా శివశంకరులు సరళ గ్రాంథిక భాషావాది.

బెంగాలీ-హిందీ భాషలు నేర్చుకొని అనేక రచనలను తెలుగులోకి అనువదించారు. సుమారు 1910 నుంచీ సాహితీ వ్యాసంగం ఆరంభించి తుదిశ్వాస 1977 లో వదిలేవరకూ రచనలు చేశారు. కథాకావ్యాలూ — పద్యగేయ నాటికలూ చాలా రాశారు. 1946 లో 'మహోదయం' అన్న చక్కని కవితా సంకలనం కూర్చారు. వైతాళికులు సంకలనం వెనుక వీరిచెయ్యి ఉందంటారు చా. సో.

'సాహితి' పత్రికను నిర్వహించారు. సరళంగా రచన చేసినవారు. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలను అధ్యయనం చేశారు. హృదయేశ్వరి, పద్మావతీ చరణ చారణ చక్రవర్తి లాంటివెన్నో వీరికి ప్రఖ్యాతిని తెచ్చాయి.

కవిసార్వభౌమ, సాహిత్యాచార్య, సాహిత్య సామ్రాట్ లాంటివెన్నో బిరుదులున్నాయి. సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులుగా ఉన్నారు.

గుంటూరు జిల్లా కాజలో 1882 లో జన్మించారు. 1979 లో మరణించారు.

## సోమశేఖరశర్మ మల్లంపల్లి

చరిత్రకారుల్లో ప్రసిద్ధులు, సాహిత్యమూర్తి. తెలుగుదేశ చరిత్రను నిర్మించడంలో అనేక శాసనాలను వెలికితెచ్చారు. చారిత్రకఘట్టాల ఆధారంగా రచనలు చేశారు. సంస్కృతం — ప్రాకృతం—అంగ్లభాషల్లో పండితులు. ఆంధ్ర విశ్వవిద్యాలయం చరిత్ర శాఖలో కొంతకాలం పనిచేశారు. తెలుగు భాషాసమితి వారి విజ్ఞాన సర్వస్వ నిర్మాణంలో కొన్ని సంకలనాలకు సంపాదకులు. 'భారతి'లో ఉప సంపాదకులుగా ఉన్నారు. 'దేశమాత' పత్రికను నడిపారు. ది హిస్టరీ ఆఫ్ రెడ్డికింగ్‌డమ్స్, నాగశిల్పి, జాయపసేనాని, రోహిణీ, చంద్రగుప్తవంటి రచనలు చేశారు. కొమర్రాజు లక్ష్మణరావుగారితో కలిసి పనిచేశారు. 'ఉదయిని' ఆఫీసు మద్రాసులోని వీరిల్లే !

1891 లో పశ్చిమగోదావరి జిల్లా మినుమించిలిపాడులో జన్మించారు. 1963 లో చనిపోయారు.

# ఇందరూ మహానుభావులు
# అందరికీ వందనాలు

జనార్దనరావ్ రచనల సేకరణలో సహకరించిన
సంస్థలు – మిత్రులు – పత్రికలు – గ్రంథాలు

## సంస్థలు

తెలుగు విశ్వవిద్యాలయం 'అయ్యంకి వెంకటరమణయ్య గ్రంథాలయం', హైదరాబాద్.
శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, హైద్రాబాద్.
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయం, తిరుపతి.
సరస్వతీ గ్రంథాలయం, వేటపాలెం.
గౌతమీ గ్రంథాలయం, రాజమండ్రి.
ఆంధ్ర సారస్వత పరిషత్ గ్రంథాలయం, హైదరాబాద్.

## మిత్రులు

శ్రీ ఆవంత్స సోమసుందర్, పిఠాపురం.
శ్రీ తుమ్మల వెంకట్రామయ్య, విజయవాడ.
శ్రీ తుమ్మల రామకృష్ణ, తిరుపతి.
శ్రీ సన్నిధానం నరసింహశర్మ, రాజమండ్రి.
శ్రీ కె. వి. రమణారెడ్డి, కావలి.
శ్రీ ఆచంట జానకిరాం, మద్రాసు.
శ్రీ ద్వానాశాస్త్రి, అమలాపురం.
శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, వరంగల్.
శ్రీ బాబివర్ధన్, సబ్ఎడిటర్, ఆంధ్రభూమి, విశాఖ.
శ్రీ మధుసూదన్‌రావు, ఆకాశవాణి, విశాఖ.
శ్రీ మిరియాల రామకృష్ణ, తణుకు.
శ్రీ యం. కిశోర్, మద్రాసు.
శ్రీ మల్లిక్, మద్రాసు.

శ్రీ సంపత్, మధురై.
శ్రీ ఇవటూరి కామేశ్వరరావ్, హైదరాబాద్.
శ్రీ తిరుమల రామచంద్ర, హైదరాబాద్.
శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు, విజయనగరం.
శ్రీ జనమంచి రామకృష్ణ, హైదరాబాద్.
శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి, బొంబాయి.
శ్రీ వాడ్రేవు జగ్గరాజు, గంగలకుర్రు.
శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు, హైదరాబాద్.
శ్రీ చామర్తి కనకయ్య, తిరువూరు.
శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవి, సింహాచలం.
శ్రీ కాకూరి నరసింగరావు, విశాఖ.
శ్రీ ఆర్. వి. రామారావు, విశాఖ.
శ్రీ బొమ్మన చంద్రరావు, పెద్దాపురం.
శ్రీ చలసాని ప్రసాద్, విశాఖ.
శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య, హైదరాబాద్.
శ్రీ కొదమనగండ్ల కృష్ణ, హైదరాబాద్.
శ్రీ ఆక్కిరాజు రఘుపతిరావు, హైదరాబాద్.
శ్రీమతి శ్రీరంగం సరోజని, మద్రాసు.
శ్రీమతి శాంతి సుబ్బలక్ష్మి, మద్రాసు.
శ్రీమతి గౌరి (మల్లంపల్లివారి కోడలు), హైదరాబాద్.

## పత్రికలు

ఉదయిని
భారతి
ఆంధ్రపత్రిక - వారపత్రిక
ఆంధ్రపత్రిక - దినపత్రిక
ఆంధ్రపత్రిక - ఉగాదిసంచికలు.
కృష్ణాపత్రిక - రపత్రిక.
ఆంధ్రభూమి.
ప్రబుద్ధాంధ్ర.

వీణ.
వినోదిని.
త్రివేణి.
ప్రతిభ.
సుభాషి.
వైశాఖి.
ప్రసారిత
సృజన.

## గ్రంథాలు

శ్రీశ్రీ సాహిత్యం.
ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం, కొమర్రాజువారి సంపాదకత్వం.
కాంచనవిపంచి, చావలి బంగారమ్మ.
మల్లంపల్లివారి సంస్మరణసంచిక, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.
సాగుతున్న యాత్ర, ఆచంట జానకిరాం.
సాహిత్యం-సౌహిత్యం; ద్వానాశాస్త్రి.
నా వాఙ్మయమిత్రులు, వేదుమళ్ళ కామేశ్వరరావు.
తెలుగుసాహిత్యకోశం, రెండు భాగాలు, తెలుగు అకాడమీ.
మణిమకుటం, సం॥ పూ.భా.
కావ్యాలంకార సంగ్రహం, వివరణకర్త: సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి.
*The Oxford Companion to English Literature*
*Ed. by : Margret Drabble.*